# పాఠకుల ప్రశ్నలూ

# రంగనాయకమ్మ జవాబులూ

స్వీట్ హోమ్ పబ్లికేషన్స్
విజయవాడ - 520 002

స్వీట్ హోమ్ పబ్లికేషన్స్
ప్రచురణ నం. 39

# పాఠకుల ప్రశ్నలూ,
# రంగనాయకమ్మ జవాబులూ.

అట్టమీద అక్షరాలు : చిదంబరం

మొదటి ముద్రణ : 1991 మార్చి

దొరికేచోటు
అరుణా పబ్లిషింగ్ హౌస్
ఏలూరు రోడ్డు
విజయవాడ - 520 002

ముద్రణ :
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం
విజయవాడ-520 002

రంగనాయకమ్మ అడ్రసు
సి-44, ఫిల్మ్ నగర్,
జూబ్లీ హిల్స్,
హైదరాబాదు - 500 034

# ముందుమాట

ఈ 'ప్రశ్నలూ - జవాబులూ' 'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో 22-12-1989 నించీ 21-9-1990 వరకూ, 40 వారాల పాటు వచ్చాయి.

'ప్రశ్నలకు' జవాబులు ఇవ్వడం గురించి ఆలోచించినప్పుడు, 'మార్క్సిజం' మీదా, స్త్రీల సమస్యల మీదా ప్రశ్నలు రావచ్చునని వూహించాను. దాదాపుగా అలాంటి ప్రశ్నలే వచ్చాయి. ప్రశ్నలు అడిగిన వారిలో చాలా మంది, కాలక్షేపానికో, పత్రికలో పేరు చూసుకోవడానికో గాక, నిజంగా జవాబు తెలుసుకోవాలనే దృష్టితోనే అడిగారు. ప్రశ్నలు చూస్తే అది తెలుస్తుంది.

జవాబులు చెప్పడానికి సిద్ధమైన వాళ్ళ దగ్గిర కూడా ప్రతీ ప్రశ్నకీ 'రెడీమేడ్' జవాబులు వుండవు. వచ్చిన ప్రశ్నల్నిబట్టి జవాబులు ఆలోచించవలసిందే.

కొన్ని ప్రశ్నలకు జవాబులు సరిగానే తెలిసివున్నా, వాటిని రాసేటప్పుడే మరింత స్పష్టం అవుతాయి.

కొన్ని ప్రశ్నలకు జవాబులు తెలిసినట్టే వుండి, రాసేటప్పుడు చాలా ఇబ్బంది పెడతాయి. వాటిమీద ఎదురు ప్రశ్నలు పుట్టుకొస్తాయి. రాస్తోన్న దాంట్లో వున్న 'ఏదో' పొరపాటుని సవరించుకోవలసి వస్తూ వుంటుంది. తెలిసివున్న జవాబుని కూడా సరిగా వ్యక్తం చేసే ప్రయత్నంలోనే అది ఎక్కువ స్పష్టం అవుతుంది. ఈ రకంగా, ఈ ప్రశ్నల్లో చాలా ప్రశ్నలు నాకు చాలా మేలు చేశాయి. అలాగే, నిజంగా తెలుసుకోవాలనే దృష్టితో అడిగిన పాఠకులకూ, ఆ దృష్టితో చదివే పాఠకులకూ కూడా అవి మేలు చేస్తాయి.

సమాజానికి సంబంధించిన చాలా విషయాలు ఇందులోకి వచ్చాయి. 'మార్క్స్ కాపిటల్' చదివి వుండడం వల్లనే నేను ఈ ప్రశ్నలకు జవాబులు చెప్పగలిగాను. అలాగే, అది చదివి వున్న వాళ్ళకే ఈ జవాబులు ఎక్కువ తేలిగ్గా అర్థమవుతాయి. లేకపోతే కొన్ని విషయాలు అస్పష్టంగానే వుంటాయి.

11-3-1991. రంగనాయకమ్మ

# తప్పొప్పుల పట్టిక

[ఈ పుస్తకంలో వచ్చిన తప్పుల్లో ఎక్కువ తప్పులు — ఫుల్‌స్టాపు లకూ, దీర్ఘాలకూ సంబంధించినవే. ఈ తప్పుల్లో ఫుల్‌స్టాపులూ - దీర్ఘాలూ ఎక్కడ రావాలో అక్కడ రాలేదు; ఎక్కడ రాకూడదో అక్కడ వచ్చాయి. అలాంటి తప్పుల్లో చాలా అపార్థాలకు దారితీసే తప్పుల్ని మాత్రమే ఇక్కడ సవరిస్తున్నాము. మిగిలిన తప్పుల్ని పుస్తకం చదివే టప్పుడు పాఠకులు తేలిగ్గానే గ్రహించి దిద్దుకోవచ్చు.

ఇక్కడ సవరించిన తప్పులన్నిటినీ పుస్తకంలో మొదటే దిద్దుకుని, అప్పుడు చదవడం మొదలు పెట్టాలి.]

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | అడుగునించి 8 | మీదా | మీదా. |
| 1 | అడుగునించి 3 | రెండూ | రెండూ. |
| 8 | పైనించి 1 | పల్లె, | పల్లె. |
| 11 | అడుగునించి 4 | నిలబటమంటే | నిలబడడమంటే |
| 14 | అడుగునించి 6 | మార్గంలా | మార్గంలో |
| 34 | అడుగునించి 5 | సమ సమాజం, | సమ సమాజం. |
| 54 | పైనించి 2 | నించే | నించీ |
| 59 | అడుగునించి 6 | ప్రత్యేకత | ప్రత్యేకమైన |
| 63 | పైనించి 6 | తప్పు | తప్పూ |

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 64 | పైనించి 6 | పోతుంది. కాబట్టి, | పోతుంది కాబట్టి, |
| 68 | అడుగునించి 10 | మీద | మీదా |
| 77 | పైనించి 3 | ఉన్నప్పుడు | ....డు. |
| 98 | పైనించి 11 | చదువుకున్న వారవుతున్నారని | ............ వారవుతారని |
| 114 | అడుగునించి 3 | నీ జీవులైనా | ఏ జీవులైనా |
| 115 | పైనించి 7 | ఇది సామాజిక అంశం అంతా | ఇది సామాజిక అంశం. ఇతర ప్రాణులకూ మానవులకూ వున్నదే. ఇదే. సామాజిక అంశం అంతా |
| 122 | అడుగునించి 11 | చెయ్యక పోయిన | .... పోయినా |
| 123 | అడుగునించి 11 | సొమ్ము | సొమ్మూ |
| 131 | అడుగునించి 8 | చట్టాలకీ | .... కి |
| 133 | పైనించి 3 | వర్గం పార్టీలకు | వర్గ పార్టీలకు |
| 135 | పైనించి 5 | సినిమాల్లోను | .... ల్లోనూ |
| 138 | పైనించి 12 | మేధాశ్రమలోకి | .... ల్లోకి |
| 140 | పైనించి 11 | బూర్జువా రక్తపు | .... రకపు |
| 141 | పైనించి 9 | అడ్డ దారులతో | .... దారుల్లో |
| 143 | పైనించి 8 | సమాజం అని, | .... అని. |

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 156 | ఫుట్‌నోట్ పైన పేజీ అంతా అడ్డగీత రావాలి | | |
| 156 | అడుగునించి 9 | భగవంతుణ్ని | .... ణ్ణి |
| 177 | అడుగునించి 4 | వస్తాయా ? | నడుస్తాయా ? |
| 183 | పైనించి 10 | జనరల్ | "జనరల్ |
| 183 | అడుగునించి 6 | వ్యక్తిగత | వ్యక్తిని |
| 183 | అడుగునించి 5 | వ్యక్తిని | వ్యక్తిగత |
| 185 | పైనించి 1 | అర్థానికే | .... కి |
| 196 | అడుగునించి10 | 4 గదులు ఇల్లు | 4 గదుల ఇల్లు |
| 237 | అడుగునించి 8 | జూనియరిటీ | .... యూరిటీ |

# ప్రశ్నలూ
# జవాబులూ

[ఈ 'శీర్షిక' ప్రచురణ ప్రారంభమైన మొదటి వారం, పత్రికలో రాసిన చిన్న 'ముందు మాట' ఇది :

"ఇప్పటివరకూ వచ్చిన ప్రశ్నలు ప్రధానంగా 3 రకాలుగా వున్నాయి. 'నేటి సాహిత్యం ఎందుకిలా దిగజారుతోంది' అనే రకం ప్రశ్నలు కొన్నీ; 'రష్యా-చైనా-జర్మనీ-ఇండియాల్లో కమ్యూనిస్టు పార్టీలు ఎందుకు మారిపోతున్నాయి' అనేరకం కొన్నీ; మూడోరకం ప్రశ్నలు-ఒకరకపు స్త్రీ సమస్య మీదా "మానవపోరాటం సినిమాపై మీ అభిప్రాయం ఏమిటి?" రెండో భార్యగా మారిన సుశీల పోరాటంపై అభిప్రాయమేమిటి అనేరకంప్రశ్నలు ఇవి. ఇదేతరహా సమస్యకు చెందిన 'కరపత్రం' ఒకటి మూడు చోట్లనుంచీ అందింది. ఆ కరపత్రం రాసిన 'కమిటీ'వారి నించి ఒకటీ, నా అభిప్రాయం అడుగుతూ ఇతరులు పంపినవి రెండూ ఏ ప్రశ్నకైనా జవాబు క్లుప్తంగానూ చెప్పవచ్చు, వివరంగానూ చెప్పవచ్చు. మొదట ఈ స్త్రీ - సమస్యమీద కొంత

వివరమైన జవాబు చెప్పాలనుకుంటున్నాను. ఈ కరపత్రాన్ని పాఠకులు చూస్తేనే దాని మీద నా జవాబుని వారు అర్థం చేసుకోగలుగుతారు. ఈ 'కరపత్రం' రహస్య పత్రం కాదు. పత్రికలకు విడుదల చేసినదే. ఇందులో కేసు 'పోలీసు రిపోర్టు' దాకా కూడా వెళ్ళింది.

కరపత్రంలో ప్రధానమైన భాగాలన్నీ ఇక్కడ ఇస్తున్నాను.]

ఒక కరపత్రం :

## దగాపడిన కల్యాణి - మోసకారి శ్రీనివాస్

(ఒ. పి. డి. ఆర్. వాస్తవ సేకరణ కమిటీ రిపోర్టు)

కళ్యాణిని పెండ్లి చేసి కొంటానని నమ్మించి తన కామవాంఛని తీర్చుకున్నాడు శ్రీనివాసరావు. ఫలితంగా 19 సంవత్సరాల ఆ అమాయకు రాలు గర్భవతి అయింది.... వెంటనే పెళ్ళాడమని కోరింది. తన తల్లి దండ్రులకు చెప్పి ఒప్పించి పెళ్ళాడతానని నమ్మబలికాడు.... తను గర్భ వతిననే విషయాన్ని కళ్యాణి 4 నెలల వరకూ దాచింది. ఇంకా ఎక్కువ కాలం దాయటం సాధ్యం కాదని గుర్తించిన కల్యాణి పెళ్ళి విషయం గురించి శ్రీనివాసరావుని నిలదీసింది. "నా వల్లనే నీకు గర్భం వచ్చిందని నమ్మకమేముంది. నేను పెళ్ళి చేసుకోను. నీ చావేదో నువ్వు చావు" అని వెళ్ళిపోయాడు శ్రీనివాసరావు. ఈ విషయాలను మా కమిటీకి కల్యాణి చెప్పింది తనకు జరిగిన అన్యాయాన్ని రేపల్లె ఎస్.ఐ కి వ్రాత పూర్వ కంగా 23 సెప్టెంబరున కల్యాణి రిపోర్టు ఇచ్చింది. సామాజిక స్పృహ గల్గిన మరి కొందరిని కలుపుకుని ఒక వాస్తవ సేకరణ కమిటీగా ఏర్పడ్డాం.

సెప్టెంబర్ 24న కల్యాణినీ, కల్యాణి తండ్రిని, తల్లిని, అన్ననూ రేపల్లెలో కలిసింది మా కమిటీ. శ్రీనివాసరావుని, అతని తండ్రినీ కలిసేందుకు అదే రోజున బొర్రావారిపాలెంలో వారింటికి వెళ్ళాం. కమిటీని కలవకుండా మొగం చాటు చేసుకున్నారు.... ఆ గ్రామం మరియు ప్రక్క గ్రామాల లోని కొంత మంది పెద్దలతో మాట్లాడి వచ్చాం. కమిటీ సభ్యులలోని ఒకరగు ముత్తా రెడ్డి శ్రీరాములుగారు, కూచనపూడి ఎం. ఎల్. ఎ. సీతా రామమ్మగారిని తరువాత కలిశారు.

కల్యాణి తండ్రి శ్రీ బొర్రా సత్యన్నారాయణగారు నిజాయితీ పరుడు. ఎం. ఎల్. ఎ. శ్రీమతి ఈపూరి సీతారామమ్మగారి కుటుంబానికి సన్నిహితుడు. అమ్మాయి అన్న గోవర్ధనరావు 'నగరం'లో ఒక ప్రైవేటు పాఠశాలనడుపుతున్నారు. పాఠశాల ప్రారంభించిన నాలుగు సంవత్సరాలలో చుట్టు ప్రక్కల మంచి పేరు పొందారు.

సత్యన్నారాయణగారి స్వగ్రామం బొర్రావారిపాలెం. చాలా సంవ త్సరాల నుండి రేపల్లెలోనే వుంటున్నారు.... కళ్యాణి 10వ తరగతి వరకు చదువుకుంది.

శ్రీనివాసరావు వూరు బొర్రావారి పాలెం. వయస్సు 22 సంవత్స రాలు. అబ్బాయి తాత అగు చింతయ్య సత్యన్నారాయణగారికి స్వయాన మేనమామ. అంటే, శ్రీనివాసరావు కల్యాణికి వరసకు బావ అవుతాడు. చుట్టం చూపుగా అప్పుడప్పుడు శ్రీనివాసరావు సత్యన్నారాయణగారిఇంటికి వచ్చేవాడు. భోజనం కూడా చేస్తుండేవాడు. తిన్న ఇంటి వాసాలు లెక్క పెడతాడని, అయిన వారి పిల్లను వల్లో వేసుకొని కామవాహాన్ని తీర్చు కుంటాడని సత్యన్నారాయణ దంపతులు వూహించలేకపోయారు.

తప్పక పెళ్ళి చేసుకుంటానని చెప్పి ఆ తర్వాత కూడా సంబంధాలు కొనసాగించాడు. కల్యాణి గర్భవతి అయింది. పెళ్ళి విషయం గురించి

ఆగస్టులో కల్యాణి నిలదీసి అడిగింది. నీ శీలం మంచిది కాదు గనుక పెళ్ళి చేసుకోనని నిందవేసి తన దారిన తనెళ్ళాడు శ్రీనివాసరావు. సెప్టెంబరు 7న గత్యంతరం లేని పరిస్థితిలో కల్యాణి తన పరిస్థితినంతా తల్లి దండ్రు లకు అప్పుడు వివరించింది. సత్యన్నారాయణ (కల్యాణి తండ్రి), గోవర్ధన్ (కళ్యాణి అన్న) గారలు స్త్రీలను బలి తీసుకుంటున్న దుష్ట సంస్కృతికి వ్యతిరేకులు. అమ్మాయికి ధైర్యం చెప్పారు. ఎలాంటి అఘాయిత్యాలకు పాల్పడవద్దని ఓదార్చారు.

.... .... .... .... .... ....

కల్యాణిని స్వీకరించడానికి వాళ్ళు నిరాకరించారు.

విషయం తెలుసుకున్న అబ్బాయి కుటుంబ శ్రేయస్సు కోరే మరో ఇద్దరు పెద్దలు బొర్రావారి పాలెం వెళ్ళి శ్రీ కసన శ్రీనివాసరావు, అతని తండ్రి సోమయ్యలతో కల్యాణిని పెండ్లి చేసుకోవడమే సరైందని, చేసు కోకపోతే రాగల ప్రమాదాల గురించి చెప్పారు. కుర్రవాని తండ్రి మరునటి రోజు ఉదయం వాళ్ళను కలిసి, 'మా వాడిని మీ చేతుల్లో పెడతాను. మీ ఇష్టం వచ్చినట్టు చేయం'డని చెప్పి తెనాలి వెళ్లాడు. తెనాలిలో అతని తమ్ముడు 'తెలుగుదేశం' పార్టీలో స్థానిక నాయకుడగు శంకరరావు గారు న్నారు. అదే సాయంకాలం సోమయ్యగారు మరల రేపల్లె వచ్చి-'ఏమైతే అది కానివ్వండి, ఆ అమ్మాయిని మేము చేసుకునేది లేదు' - అని చెప్పి వెళ్లాడు.

ఆ తర్వాత ఎం. ఎల్. ఎ. సీతారామమ్మగారి ద్వారా అడిగించారు. ఫలితం శూన్యం.

ఈ స్థితిలో సహజంగానే ఒక అనుమానం రావచ్చు. కల్యాణికి శ్రీనివాసరావుకు గల సంబంధాన్ని నిరూపించే ఆధారాలేమన్నా వున్నాయా?

అనే ప్రశ్న మేము కూడా కళ్యాణి నడిగాం. శ్రీనివాసరావు వ్రాసిన ఉత్తరాలున్నాయని చెప్పింది. కాని వాటి కోసం, వాటిని వుంచిన పర్సు కోసం ఆ అమ్మాయి పెట్లో చూడగా, వాటికి కాళ్ళొచ్చినట్టు అర్థమయింది. మరి కల్యాణి మాటలు నమ్మటం ఎలా? ఆ అమ్మాయి శీలం ఎలాంటిదో? అప్పటికే శ్రీనివాసరావు కుటుంబీకులు ఆ అమ్మాయికి ఇతరులతో కూడా సంబంధాలున్నాయని ప్రచారం మొదలు పెట్టారు.

శాస్త్ర విషయాలను అనేక సంవత్సరాలుగా బోధిస్తున్న అధ్యాపకులు, లాయర్లు 'కమిటీ'లో వున్నారు. రక్త పరీక్ష ద్వారా కళ్యాణి గర్భస్థ శిశువుకి తండ్రి ఎవరో చెప్పవచ్చునని మాకు తెలుసు. దానిని డి. ఎన్. ఎ. పరీక్ష అంటారు. 'ఆ పరీక్షకు నిలబడతావా' అని కల్యాణిని మేం అడిగాం. ఏ పరీక్షకయినా సిద్ధమేనని ఆ దగాపడిన యువతి ఆత్మస్థయిర్యంతో చెప్పింది. పిల్లవాడి తండ్రికి మరల కబురు చేశాం.... అలాంటి పరీక్షేమీ లేదని ఎవరో లాయరు వారికి చెప్పారని, కనుక తమకేమీ భయం లేదని వారంటున్నట్లుగా మా కమిటీకి తెలిసింది.

పై విషయాన్ని పరిశీలించి మా కమిటీ ఈ క్రింది నిర్ధారణకొచ్చింది.

బొర్రావారి పాలెం వాస్తవ్యుడగు శ్రీ కనన సోమయ్య కుమారుడు శ్రీనివాసరావు, వారి దగ్గిర బంధువు రేపల్లె వాస్తవ్యుడగు శ్రీ బొర్రా సత్యన్నారాయణగారి కూతురగు కల్యాణిని వివాహమాడతానని నమ్మించి ఆమెతో శారీరక సంబంధాలు పెట్టుకున్నాడు. తత్ఫలితంగా ఆమె గర్భవతి అయింది. కనుక ఐ. పి. సి. 375 ప్రకారం కనన శ్రీనివాసరావు నేరస్థుడు. అతని నేరాన్ని డి. ఎన్. ఎ. పరీక్షద్వారా రుజువు చేయవచ్చు.

పోలీసు అధికారులు ఈనాటి వరకూ చర్య తీసుకోకపోవడాన్ని ఖేదం గర్హిస్తున్నాం.

పాటించకపోవడం వల్ల, ఏ సమస్య గురించి చూసేటప్పుడైనా, అది అసలు ఎందుకు తలెత్తిందో మొదట తెలుసుకోవలసి వున్నట్టే, కల్యాణి కూడా తన సమస్యకి కారణమేమిటో మొదట తెలుసుకోవాలి. తనకి 'హాని' జరగడానికి అవకాశమున్న తెలివి తక్కువ మార్గంలో అతనితో 'రహస్య సంబంధం' ప్రారంభించడం ఆమె చేసిన మొట్టమొదటి తప్పు.

సరే, తప్పులు జరుగుతూనే వుంటాయి. తెలిసో తెలీకో నమ్మింది. ఇబ్బందిలో పడిపోయింది. అతను మాట మార్చేశాడు. 'నీ గుణం మంచిది కాద'న్నాడు. 'ఎంత మందితో తిరిగావో' అన్నాడు. 'నీ చావు నువ్వు చావు' అన్నాడు. ఇంకా చాలా అన్నాడు.

అప్పటి నుంచీ ఆ విషయం అందరికీ తెలిసింది. ఇరుపక్షాల మధ్య మాటలు జరిగాయి. పోలీసు రిపోర్టువరకూ వెళ్ళింది పరిస్థితి. ఒక సంస్థ వారు ఒక విచారణ కమిటీని కూడా ఏర్పరచారు. ఆ కమిటీతో సహా పెద్దలందరి లక్ష్యమూ ఏమిటంటే- ఆ మోసగాడితోనే ఆమెకు పెళ్ళి చెయ్యాలని!

అతను మోసం చేశాడని నిర్ధారణ అయిన తర్వాత "ఇంత మోసగాడినా నేను నమ్మింది?" అని ఆమె అతన్ని అసహ్యించుకోవలసిందిపోయి తనతో కలిసి జీవించడానికి వ్యతిరేకిస్తూ తనని నానామర్భాషలాడే మనిషిని పట్టుకుని 'నన్ను పెళ్ళి చేసుకోవలసిందే' అని అతన్ని "నిలదీసి అడిగింద"ట!

దాన్ని "ఆత్మస్థయిర్యం"తో చేసే "పోరాటం"గా కమిటీవారు భావించారు.

కల్యాణి తండ్రి, అన్న "స్త్రీలను బలి తీసుకుంటున్న దుష్ట సంస్కృతికి వ్యతిరేకుల"ని కమిటీవారే అంటున్నారు. అలాంటి పెద్దలు కూడా తమ పిల్ల జీవితాన్ని ఆ మోసగాడితోనే ముడిపెట్టాలని ప్రయత్నించారు. "సామాజిక స్పృహ"తో స్త్రీల సమస్యలపై కృషి చేస్తున్నామని

చెప్పుతున్న కమిటీవారుకూడా, 'పోరాటం'గా ఆమె భావిస్తున్నదానిలో వున్న ఆత్మగౌరవం లేనితనమేమిటో ఆమెకు వివరించి చెప్పి మంద లించడంపోయి, ఆ పెళ్ళి చేయించడమే సరైన పోరాటం అయినట్టు భావిస్తూ ఆ పెళ్ళి కోసమే తామూ పోరాటం మొదలు పెట్టారు.

ఈ 'సమస్య'లో ప్రధానంగా 2 ప్రశ్నలు వున్నాయి.

1. అతనితో పెళ్ళి చెయ్యకపోతే కల్యాణి విషయం ఏమవ్వాలి? ఆమె గర్భవతి కూడా కదా?

2. 'మోసం' చేసిన మొగవాడికి 'శిక్ష' ఏమీ వుండవద్దా?

కల్యాణి విషయం ఏం చెయ్యాలి?—అనే ప్రశ్నకి సరైన జవాబు 'ఆత్మగౌరవం' అనే అంశాన్ని వదిలిపెట్టి వెతికితే ఎక్కడా దొరకదు. ఆడవాళ్ళని మొగవాళ్ళు నమ్మించి మోసం చేసే ఈ రకం సమస్య సమాజంలో వందల, వేల సంవత్సరాల నుంచీ వుంది. ఇలాంటి సమస్య వచ్చినప్పుడల్లా ఆ ఆడవాళ్ళు మొగవాళ్ళని యాచిస్తారు. ఏడుస్తారు. ఇరుపక్షాల కుటుంబాలవాళ్ళూ ఘర్షణలు పడతారు. కొన్ని సందర్భాలలో బల ప్రయోగాలతో పెళ్ళిళ్ళు చెయ్యగలుగుతారు. కొన్నిసార్లు చెయ్యలేరు. అలాంటి సందర్భాలలో ఆ స్త్రీలకు ఇతర మొగవాళ్ళతోనే పెళ్ళిళ్ళు జరుగు తాయి. కొన్ని సందర్భాలలో స్త్రీలు ఆత్మహత్యలు చేసుకుంటారు. ఇలా రకరకాల పద్ధతుల్లో ముగింపులు జరిగిపోతూ వుంటాయి.

కల్యాణి కేసులో ఆమె పెద్దలు ఆమెని 'ఏ అఘాయిత్యానికీ పాల్పడవద్ద'ని ధైర్యం చెప్పడం మంచి విషయం. కమిటీ సభ్యులు కూడా ఆమెకి సహాయం చేసే దృష్టితో రావడం....చాలా మంచి విషయం. కానీ, తర్వాత మార్గం సరిగాలేదు. మోసం చేసిన వ్యక్తితోనే పెళ్ళి చెయ్యడానికి చేసే ప్రయత్నాలేవీ ఆమెకి క్షేమం కావు. ఆత్మగౌరవం కావు.

ఆమె 'ఆత్మస్థయిర్యం'తో ధైర్యంగా వుందని కరపత్రంలో చెపు తున్నారు. అలాంటి వ్యక్తి మొదట ఆత్మ విమర్శతో తను చేసిన తప్పు అర్థం చేసుకోవాలి. "ఎంత మందితో తిరిగావో" అన్న వ్యక్తితో పెళ్ళి ప్రసక్తికి పూర్తిగా విముఖంగా వుండాలి. కావాలనుకుంటే బిడ్డని కనవచ్చు. లేదా ఎబార్షన్ చేయించుకోవచ్చు.

తన విషయమంతా తెలిసి అంగీకరించే ఇంకో పురుషుణ్ణి పెళ్ళి చేసుకోవాలి. "ఆమెను ఎవరు చేసుకుంటారు" అనే ప్రశ్న అర్థంలేనిది. విశంతువుల్ని పెళ్ళిళ్ళు చేసుకోవడం లేదూ? పిల్లలు వున్న తల్లుల్ని పెళ్ళిళ్ళు చేసుకోవడం లేదూ? అలాగే, ఆమె పొరపాటుని అర్థం చేసుకో గలిగిన వ్యక్తే ఆమెని చేసుకుంటాడు. ఎవరూ చేసుకోకపోతే ఒంటరిగానే జీవిస్తుంది. ఒకప్పుడు తను చేసిన పొరపాటు ఫలితాన్ని ఆ రకంగా అనుభవిస్తుంది. ఆ విషయంలోనే ఆమె 'ఆత్మస్థయిర్యం' వుపయోగపడాలి. "స్త్రీలను బలి తీసుకునే దుష్ట సంస్కృతికి వ్యతిరేకులైన" పెద్దలూ, "సామాజిక స్పృహ"తో సమస్యల్ని చూసే కమిటీ వారూ ఆమెకు ఈ సరైన మార్గాన్ని బోధించకుండా, 'పోరాటం' పేరుతో అంతా పాతరకపు యాచనే మొదలుపెట్టారు. పెద్దలతో అడిగించడం, మధ్యవర్తులతో అడిగించడం, ఎం.ఎల్.ఎ.లతో అడిగించటం, 'ఈ పెళ్ళి చేసుకోకపోతే చూడు, నీ పని ఏమవుతుందో' అని బెదిరించటం, ఒక వేపు యాచిస్తూ, ఒక వేపు బెదిరిస్తూ అంతా పాతరకంగానే చేశారు. ఇంత ఒత్తిడితో ఆ పెళ్ళి చేస్తే ఆ తర్వాత ఇద్దరి మధ్యా సామరస్యం సాధ్యమా—అనే దృష్టి ఎవరికీ లేదు.

అన్నిటికన్నా అవమానకరంగా కమిటీవారు 'ఆమె గర్భస్థ శిశువుకి తండ్రి అతనా, కాదా' అని తేల్చగల పరీక్షని కూడా సూచించారు. ఆమె శరీరం నించీ ఏదో తీసి, అతని శరీరం నించీ ఏదో తీసి, ఆ పదార్థాల్ని

పరీక్షలు చేసి ఆ ఫలితాల్ని కోర్టుల్లో పెట్టి, వాటిమీద ఇరుపక్షాల లాయర్లూ వాదనలు చేసి, 'అతనే తండ్రి' అని రుజువు చేస్తే, ఆ రుజువుల సహాయంతో ఆ పెళ్ళి చేయడమో, అతన్ని శిక్షించడమో చేస్తారట!

"పరీక్ష" చేయించడానికి అవకాశం వున్నంత మాత్రాన దాన్ని అన్ని సందర్భాలకూ వుపయోగించడమేనా? కొన్ని రకాల పరీక్షల్ని 'వైద్య అవసరాల కోసం మాత్రమే వుపయోగించాలి. స్త్రీల ప్రవర్తనల్ని రుజువు చేసే లక్ష్యంతో ఏ పరీక్షనీ నిర్వహించకూడదు. 'సైన్సు' అనే దాన్ని 'మానవ సంబంధాల్లో' ఎక్కడ వుపయోగించాలో, ఎక్కడ వుపయోగించ కూడదో పట్టించుకోని దృష్టి ఇది.

'పరీక్ష' అన్న తర్వాత, ఏదో ఒక సందర్భంలో తప్పు రిజల్టు రావడానికి కూడా అవకాశం ఉంటుంది. కంప్యూటర్ల వల్ల తప్పులు జరగటం లేదా? పరీక్షల్లో ఎన్నడూ తప్పుడు ఫలితాలు రావడం లేదా? కమిటీ వారు చెప్పే పరీక్షల్లో 'తండ్రి అతను కాడు' అని ఫలితం వస్తే, ఆమె పరిస్థితి ఏమవుతుంది? 'ఆమెకి ఇతర పురుషులతో కూడా సంబంధాలు వున్నట్టు పరీక్షలో రుజువై పోయింది' అనే ప్రచారానికి అవకాశం ఇచ్చి నట్టు కాదా?

ఫలితం సరిగానేవచ్చి తీరుతుందనుకున్నప్పటికీ,'శీల పరీక్ష'లోవున్న అవమానం కమిటీవారికి అర్థం కాలేదా? ఈ పరీక్ష 'మొగవాడికే పరీక్ష' అనుకుంటున్నారు కమిటీవారు. 'తండ్రి అతనా, కాదా' అని తేల్చడమంటే అది ఆమె ప్రవర్తనమీద సందేహం! శతృపక్షానికివున్న ఈ సందేహానికి విలువ ఇచ్చి, ఆ పరీక్షకి నిలబడటమంటే ఆ స్త్రీ, తనని తను నీచపరుచు కోవడమే. ఈ 'శీల పరీక్ష'కీ, 'సీత అగ్ని పరీక్ష'కి తేడా ఏమిటి? 'అగ్ని'కి బదులు సైన్సూ, డాక్టర్లూ, యంత్రాలూ రంగంలోకి దిగితే పరీక్ష స్వభావం మారుతుందా?

'అతని' తరఫు మనుషుల్లో ఏ తాతో, ముత్తాతో "పిల్ల దోసిట్లో నిప్పులు పోస్తాం. పిల్ల పట్టుకుందంటే మా సందేహం తీరుతుంది" అని వాగితే, కమిటీ పెద్దలు వుత్సాహంగా "మా పిల్ల ఏ పరీక్షకైనా ఆత్మ స్థైర్యంతో నిలబడుతుంది" అని కూడా అంగీకరిస్తారను కుంటాను.

'మోసగాడితోనే పెళ్ళి' అనే తప్పుడు ఆలోచనలో నుంచి పుట్టిన తప్పులే ఇవన్నీ. ఆ 'పెళ్ళి' అనే ప్రశ్నే లేకపోతే, ఈ మధ్య వర్తులతో రాయబారాలూ, ఈ శీల పరీక్షలూ ఏమీ వుండనక్కరలేదు.

'ఈ పెళ్ళి చేసుకు తీరాల'ని ఆ మోసగాణ్ణి ఒత్తిడి చెయ్యకపోతే ఆ వ్యక్తి చేసిన మోసానికి 'శిక్ష' ఏమిటి? —అనే అంశానికి వద్దాం. శిక్ష వుండవలసిందే. అది ఎలా వుండాలో దానికి తగిన పద్ధతిలో ఆలోచించాలి గానీ, ఈ అమ్మాయిని పెళ్ళి చేస్తే అది శిక్ష ఎలా అవుతుంది? ఈ అమ్మాయి, భార్యగా వుండడమేనా అతనికి శిక్ష? అందరి ఒత్తిళ్ళ మీదా బెదిరి అతను ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవడానికి అంగీకరిస్తే అతనికి ఇక వేరేశిక్ష ఏమీవుండదు కదా? "పెళ్ళిదారి పెళ్ళిదే, శిక్షదారి శిక్షదే. పెళ్ళి చేసుకున్నా శిక్ష వుండవలసిందే. మొదట ఈ పెళ్ళి చేద్దాం. తర్వాత అతన్ని జెయిల్లో పెట్టిద్దాం." అని ఎవరూ అనడం లేదు కదా? తను ఈమెని పెళ్ళి చేసుకోనని మొదట ఎంత మొరాయించినా తర్వాత పెళ్ళికి ఒప్పుకుంటే ఇక అతనికి వేరే శిక్ష ఏమీ వుండదు. అంటే ఈమెని పెళ్ళి చేసుకోవడమే అతనికి శిక్షగా కమిటీవారు భావిస్తున్నారన్నమాట!

ఆడపిల్లల్ని మోసం చేస్తే, చక్కగా పెద్దలందరూ కలిసి ఇంటి చుట్టూ తిరిగి తిరిగి అడిగి అడిగి పిల్లనిచ్చి పెళ్ళి చేస్తారు గానీ, శిక్ష ఏమీ వుండదనీ మోసాలకు దిగేవాళ్ళకి కూడా వెనకటి కాలం నించే తెలుసు. అందుకే వాళ్ళు నిర్భయంగా మోసాలకు తలపడుతూ వుంటారు. మొదటి మోసంతో మొదటి పెళ్ళి, రెండో మోసంతో రెండో పెళ్ళి, మూడో

మోసంతో మూడో పెళ్ళి, అలాగే వుత్సాహం వున్నంత వరకూ మోసాలూ, పెళ్ళిళ్ళూ చేసుకుంటూ పోతారు. మోసం చేసిన వాడికే పిల్లని పెళ్ళి చేసే 'పెళ్ళిశిక్ష'లో వున్న అపహాస్యం ఏమిటో 'సామాజిక స్పృహ'తో పని చేస్తున్నామని చెప్పుకున్న ఉద్యమకారులకేమీ అర్థం కాలేదు.

అతను ఏ స్త్రీనైతే తప్పించుకోవాలని చూస్తున్నాడో ఆ స్త్రీతోనే జీవించి తీరాలని శాసిస్తే అది అతనికి శిక్ష అవుతుందని పెద్దలు భావిస్తున్నారు. కానీ ఆ స్త్రీని అతనికి అప్పజెప్పినా, ఆ శిక్షని అతను భరించడు. ఆ స్త్రీకి తన ఇంటి దాసీ స్థానం మాత్రమే ఇచ్చి, తర్వాత తన పంతంతో తను ఇంకో స్త్రీని తెచ్చుకుంటాడు, అతనికి శిక్ష అనుకున్నది ఆమెకే శిక్షగా మారుతుంది. తనని తిరస్కరించే పురుషుడికే భార్య కావడం ఆ స్త్రీకి శిక్ష, అవమానమూ కూడా.

అయితే, ఆ మోసగాడికి శిక్ష ఎలా వుండాలి? — 'సాంఘిక బహిష్కరణ' రూపంలో వుండాలి. ఇక్కడ 'చట్టపరమైన' శిక్షలకు అవకాశం లేదు.

ఇది 'బలాత్కారం కేసు' కాదు. 'బలాత్కారం' కేసు అయితే, ఆ మొగవాడికి 'సాంఘిక బహిష్కరణ'తో పాటు 'చట్టపరమైన శిక్ష' కూడా వుంటుంది. బలాత్కారం కేసుల్లో చట్టపరమైన శిక్షలు కూడా లేకపోతే, స్త్రీలకు రక్షణే వుండదు. కానీ, స్త్రీల అంగీకారంతోనే సంబంధాలు ఏర్పడే కేసుల్లో స్త్రీల రక్షణ, చట్టపరమైన శిక్షలతో సాధ్యంకాదు. ఆ 'రక్షణ కల్పించుకునే పరిస్థితి' స్త్రీల చేతుల్లోనే వుంటుంది. తమని మోసం చెయ్యగల అవకాశాలు పురుషులకు స్త్రీలు ఇవ్వకుండా వుంటే సరిపోతుంది. స్త్రీలు ఈ ఆత్మరక్షణా సూత్రాల్ని పాటిస్తే, 'నమ్మి మోసపోయి గర్భం మోస్తూ పురుషుడి చుట్టూ యాచిస్తూ తిరిగే సిగ్గుమాలిన స్థితి' ఏర్పడదు. తనకి తానే చేసుకోగల రక్షణకోసం చట్టాల్ని ఆశ్రయించనక్కరలేదు. తన చేతిలో

చేసుకోవడానికి ఏ అమ్మాయీ అంగీకరించకూడదు"—అనే ప్రచారం సాగాలి. ఆ వూరులోనూ, చుట్టుప్రక్కల వూళ్లలోనూ ఆ విషయం మీద కరపత్రాలు పంచాలి. మీటింగులు పెట్టాలి. ఊరేగింపులు తియ్యాలి. పోరాటం అంతా ఈ 'సాంఘిక బహిష్కరణ' లక్ష్యంతోనే సాగాలి.

దీనివల్ల, ఆడపిల్లలు జాగ్రత్తపడడం నేర్చుకుంటారు. మొగపిల్లలు ఆడపిల్లలతో ఇష్టమొచ్చినట్టు ప్రవర్తించకుండా ఒళ్లు దగ్గిర పెట్టుకుంటారు. 'పోరాటం' ఎంత బలంగా సాగితే ఫలితాలు అంత సరిగా వుంటాయి.

"ఇదంతా సాధ్యమా" అంటారా? 'సాంఘిక బహిష్కరణ సరైనదే' అనే అంగీకారానికి వస్తే, సరైనదాన్ని సాధించడం సాధ్యమే. ఈ కేసులో కమిటీ సభ్యులు ఇప్పుడు బహిరంగంగా కరపత్రం వెయ్యలేదూ? అమ్మాయి పేరూ, పెద్దల పేర్లూ అందులో రాసెయ్యలేదూ? అలాగే ఈ కరపత్రానికి బదులు ఆ కరపత్రం వేస్తారు. ఆ కరపత్రాన్నే చుట్టుపట్ల వూళ్లలో పంచుతారు.

ఈ ప్రచారం అంతా జరిగినప్పటికీ ఇంకో అమ్మాయి ఎవరో ఆ మొగవాడినే పెళ్లి చేసుకుంటుందనుకుందాం. అంతే, చేసేదేమీ లేదు.

స్త్రీల చైతన్యం ఆ స్థాయిలో వుందని గ్రహించడమే. మార్పు అంతా ఒకే సందర్భములో రాదు. ఉద్యమకారులు చెయ్యవలసిందంతా, ఆడపిల్లలకు ఆత్మగౌరవం నేర్పే సరైన మార్గంలో ఎంత వీలైతే అంత చేస్తూ వుండడమే.

'అతన్ని ఏ ఆడపిల్లా పెళ్ళి చేసుకోరాదనేదే సరైన శిక్షగా అనుకున్నప్పుడు, అతనితో మన అమ్మాయి పెళ్ళిని తలపెట్టడానికే వీలులేదు కదా?

"ఆత్మగౌరవం అని పెట్టుక్కూర్చుంటే ఎలాగ? పిల్లకి ఎలాగో ఒకలాగ అతనితో పెళ్ళి చెయ్యడానికి ప్రయత్నించాలి కదా?" అంటారా?-

అదీ ఒక మార్గమే. అది వందల, వేల సంవత్సరాలనుంచీ నడుస్తూ వున్న మార్గం. చేస్తే అలాగే చెయ్యండి. కానీ, అప్పుడు ఈ 'పోరాటం', 'వుద్యమం', 'సామాజిక స్పృహ', 'ఆత్మస్థయిర్యం', 'స్త్రీలను బలి తీసుకునే దుష్ట సంస్కృతికి వ్యతిరేకం'లాంటి మాటలేవీ వాడకూడదు. కొత్త సారాంశమేమీ లేనప్పుడు కొత్త మాటలు పనికిరావు. కొత్త మాటలన్నీ కట్టిపెట్టి అంతా పాతరకంగానే చేసుకోవచ్చు. అమ్మాయి తరపువాళ్ళు అబ్బాయి తరపు వాళ్ళని నానా రకాలుగా యాచించి పెళ్ళి కుదుర్చుకోగలిగితే కుదుర్చుకుంటారు. ఎక్కువ కట్న కానుకలు అడిగితే ఇవ్వగలిగితే ఇచ్చుకుంటారు. "మొదట మా పిల్లని స్వీకరించి మా పరువు కాపాడండి. తర్వాత కావాలంటే మీ అబ్బాయికి ఇంకో పెళ్ళికూడా చేసుకోండి" అని కూడా కొందరు బతిమాలుకొంటారు. ఇలాంటి సమస్యలు వెనకటికాలం నించీ ఎలా ముగుస్తున్నాయో అలాగే ఇదీ ముగుస్తుంది. ఈ మార్గంలో కమిటీలూ, వుద్యమకారులూ చెయ్యవలసిందేమీ వుండదు. ఆ పెళ్ళే చెయ్యదల్చుకున్నప్పుడు దాన్ని 'పోరాటం'గా చెప్పుకోవడం తప్పు. అక్కడ 'పోరాటం' అనదగ్గ లక్షణం ఏమీ లేదు.

'మౌనపోరాటం' వంటి తప్పుడు సినిమాలు చూసి పుట్టుకొచ్చిన తప్పుడు పోరాటాలు ఇవి. ఆ కథలో, అనేకమంది గిరిజన యువతులు, ఆ ప్రాంతానికి వచ్చే 'నాగరీక' పురుషులవల్ల మోసపోతూ వుండడం - ఆ గిరిజన యువతి చూస్తూనేవుంది. అయినా జ్ఞానం లేకుండా ఒక 'పట్నం దొరబాబు'కి భార్యనవుతాననే ఆశతో తన శరీరం అతనికి అప్పజెప్పుతుంది. తనకు కూడా మోసం జరిగినప్పుడైనా చేసిన తప్పుకి కళ్ళు తెరవకుండా, 'పోరాటం' పేరుతో వాడి ఇంటిముందు ముకాం పెట్టి సిగ్గుమాలిన పనులన్నీ చేసి; చివరికి వాడితో పెళ్ళి కూడా మిడికి, సినిమావారు సిద్ధంగా వుంచిన

హానీమూన్ కొరెక్కకుండా "మా గూడేనికి వస్తేనే...." అంటూ సినిమా పౌరుషం ప్రదర్శించి, తిరుగుముఖం - పడుతుంది. ఈ వీరనారి పోరాటం అంతా తనని మోసంచేసి, నానా అవమానాలు చేసి, 'ఎంతమందితో తిరిగావో" అన్నవాణ్ణి పెళ్ళిచేసుకోవడానికే. ఇదా పోరాటం ?

'నాగరీక' పురుషుల ద్వారా కళ్ళముందు నిత్యం జరిగిపోతున్న మోసాల్ని చూడకుండా కళ్ళు మూసుకుని ప్రవర్తించిన ఈ పోరాటం 'మౌన' పోరాటం కాదు, 'గుడ్డి' 'పోరాటం'.

వాడి మోసాన్ని గ్రహించగానే ఆ యువతి మొదట తన తప్పు తను తెలుసుకుంటుందనుకుందాం. తనలాగే ఇంకా ఇతర గిరిజన యువతులు నాశనం కాకుండా తనకు జరిగిన మోసం వారికి బోధిస్తూ వుంటుందనుకుందాం.

ఆమెని మోసం చేసినవాడే ఇతర యువతుల్ని కూడా మోసం చెయ్యడానికి ప్రయత్నిస్తాడు కాబట్టి, అందరూ కలిసి వాణ్ని చితకదన్ని తమ గూడెం స్త్రీల ముందు పెట్టవచ్చు. అలాగే ఇతర నాగరీకుల్ని కూడా ఆడ పిల్లలతో మోసకారి మాటలు ప్రారంభించగానే స్త్రీ లందరి ముందుకి లాక్కురావచ్చు. అక్కడ మోసగాడనేవాడు, ఆడపిల్లని చూడగానే 'ఉండేలు చూసిన కాకి'లా ఎగిరిపోతాడు. ఆ పద్ధతిలో ఎన్ని సినిమా ట్రిక్కులైనా చొప్పించవచ్చు. అదీ, ఆ గిరిజన యువతులు, వాళ్ళ పరిధిలో వాళ్ళు చెయ్యగల పోరాటం. అంతేగానీ, దొరబాబుకి శరీరం అప్పజెప్పి, వాడు మోసం చేశాక వాడి ఇంటి ముందు కూర్చుని "నువ్వేనా గర్భానికి కారకుడవని ఒప్పుకో, ఒప్పుకో" అనీ, "నన్ను పెళ్ళిచేసుకో, పెళ్ళి చేసుకో" అనీ, 'అడుక్కోవడం' కాదు పోరాటం అంటే.

ఎవరో ఒక గిరిజన యువతి నిజంగానే అలా చేసిందనే సంఘటనని పట్టుకున్నారు. బాధలకూ, మోసాలకూ గురి అయ్యేవాళ్ళు ప్రతీకారా

నికి సరైన మార్గం తెలియకా, తెలిసినా ఒంటరిగా దాన్ని నిర్వహించడం సాధ్యం కాకా, అనేక పొరపాటు మార్గాలలో ప్రతీకారాల కోసం ప్రయత్నిస్తూ వుంటారు. అలాగే ఆ గిరిజన యువతి, తనని మోసం చేసిన వాడి ఇంటి ముందు కూర్చుని "నన్ను పెళ్ళి చేసుకోవలసిందే" అని ఆత్మ గౌరవం లేని తప్పుడు పోరాటం చేసింది. తప్పుల్నే ఒప్పులుగా చూసే, తిమ్మిని బమ్మిని చెయ్యగల పత్రికలన్నీ ఆమె చేసిన పనిని గొప్ప పోరాటంగా చిత్రించాయి. ఆ మోసగాడికి ఇంకా ఎంత మంది భార్యలున్నారో, ఈమెని పెళ్ళి చేసుకున్న తరువాత ఆ దాంపత్యం ఎంత సొగసుగా సాగిందో ఆ నిజాలు మాత్రం ఏ పత్రికా ఇవ్వలేదు.

సమస్య స్వభావమేమిటో, పోరాట మార్గమేమిటో, లక్ష్యమేమిటో పట్టకుండా, కేవలం లాభాల కోసం తుక్కు పరిష్కారాలతో తీసే సినిమాలేనా నిజ జీవితంలో స్త్రీలకు మార్గదర్శకాలు?

'సుశీల' అనే అమ్మాయి విషయంలో కూడా సి. పి. ఐ. ఉద్యమకారులు (ఎ. ఐ. ఎస్. ఎఫ్. వారు) ఈ తప్పుడు పోరాటమే చేశారు. అప్పటికే ఆమెని తప్పించుకుపోయి ఒక పెళ్ళి చేసేసుకున్నవాడికి ఈమె రెండో భార్యగా మారడంలో వారి వంతు పాత్ర వారు నిర్వహించారు. "రెండో భార్యగా వుండమని మేము చెప్పలేదు. అది ఆమె నిర్ణయమే" అని వారు తర్వాత చెప్పుకున్నప్పటికీ, అసలు ఆమె పక్షాన్న ఆ రకం పోరాటంలోకి దిగడమే మొదటి తప్పు. 'నిన్ను పెళ్ళి చేసుకోను' అని పోయిన వాడి వెంట ఆమె పడితే ఆమె వెంట వీరు పడ్డారు. 'మౌన పోరాటం'లో కాలేజీ విద్యార్థినులు 'కీర్తి' సంపాదించినట్టుగా వీరు సాంస్కృతిక పోరాటాలు నడిపిన కీర్తి' సంపాదించాలనుకున్నారు. అది 'సినిమా కీర్తి' అని వీరికి అర్థం కాలేదు. ఈమెని తప్పించుకుపోయి పదిరోజుల కిందట మొదటి పెళ్ళి చేసుకున్న వాడికి రెండో భార్యగా తయ్యా

రైన ఈమెని తీవ్రంగా విమర్శించకుండా 'ఆమె పద్ధతిని మేము వ్యతిరే కిస్తున్నాము' అని ప్రకటించకుండా, ఆమెని 'దీవించి' 'ముగ్గురివాంపత్యం' రకం పోరాటంతో 'నూతన సాంస్కృతికోద్యమానికి' వన్నె తెచ్చారు.

ఈ ఆడపిల్లలూ ఈ ఉద్యమకారులూ ఎన్నడూ "దేవదాసు" పుస్తకం మొహం చూసినట్టు లేదు.

"నిన్ను పెళ్ళి చేసుకుంటాన"ని దేవదాసు పార్వతికి వాగ్దానాలు చేసిందేమీ లేదు. కానీ వాగ్దానాలతో అవసరంలేని ప్రేమబంధం వుంది ఇద్దరి మనసులకి. అయితే, అతను పెద్దల్ని ధిక్కరించలేని పరిస్థితిలో వున్నాడు. ఆ సంగతి గ్రహించని పార్వతి అతన్ని అడిగింది — 'పెళ్ళి' గురించి. అతను తన నిస్సహాయతని ప్రకటించాడు. తన కోసం ధైర్యం చెయ్యలేని అతని ప్రవర్తనకి పార్వతి ఆత్మాభిమానం గాయపడింది. తన కోసం పెద్దలు కుదిర్చిన సంబంధానికే ఆమె అంగీకరించింది. దేవదాసు చాలా త్వరగానే తన తప్పు తెలుసుకున్నాడు. వెంటనే వచ్చి పెళ్ళి చేసుకుందామని పార్వతిని అడిగాడు. అప్పటికి ఆమెకి ఇంకా పెళ్ళి కాలేదు. దేవదాసుతో పెళ్ళికి అంగీకరించి వుంటే, తను ఇష్టపడే, తనను ఇష్టపడే వ్యక్తికే తను భార్య అయ్యేది, జమీందార్ల ఇంటి కోడలు అయ్యేది. పెద్దలు కుదిర్చిన వృద్ధ భర్త సంబంధాన్ని తప్పించుకోగలిగేది. కానీ, పార్వతి దేవదాసు మాటలకు ఒక్క క్షణం కూడా చలించలేదు.

"నీకేనా తల్లిదండ్రులు? నాకు లేరా తల్లిదండ్రులు?" అని అడిగి, అతని పశ్చాత్తాపాన్ని పూర్తిగా తిరస్కరించింది. తర్వాత కాలంలో, అతను ఏ స్త్రీనీ పెళ్ళి చేసుకోలేదనీ, ఏ స్త్రీనీ తాకలేదనీ, తనని పోగొట్టుకున్న వ్యధతోనే విరక్తుడై జీవిస్తున్నాడనీ తెలిశాకనే పార్వతి అతని ప్రేమని నమ్మి, అతని పట్ల సానుభూతితో ప్రవర్తించింది.

ఉన్నత విలువలు నేర్పగల సాహిత్యాన్ని చూసో, ఆత్మాభివృద్ధికి దోహదం చేసే సిద్ధాంతాన్ని చూసో నేర్చుకోవాలిగానీ, 'లాభాల' కోసం తీసే పెట్టుబడిదారీ సినిమాలు చూసి ఉద్యమాలు ప్రారంభిస్తే, మొగవాళ్ళకి తేలిగ్గా శరీరాలు అప్పజెప్పి, తర్వాత వాళ్ళ చుట్టూ తిరుగుతూ "నన్ను పెళ్ళి చేసుకో" అని వాళ్ళ గడపల ముందే కూర్చుని ముష్టి అడుక్కునే స్త్రీ ఉద్యమాలే తయారవుతాయి.

కరపత్రం వేసిన కమిటీ వారు 'శీల పరీక్ష'ని కూడా సూచించి చాలా పెద్ద తప్పు చేశారు. కమిటీవారు 'కరపత్రం' రాసే విషయంలో కూడా చాలా సాధారణమైన పాత తప్పు ధోరణులే ఉపయోగించారు. ముఖ్యంగా స్త్రీల సమస్యలమీద రాసేటప్పుడు ఎక్కువ జాగ్రత్తలు పాటించాలి.

పరిస్థితేమిటో కరపత్రం పాఠకులకు అర్థం కావాలి గనుక '.... ఇద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. ఉత్తరాలు కూడా రాసుకున్నారు. ఆమె గర్భవతి అయింది. తర్వాత అతను మాటమార్చాడు' అనే పద్ధతిలో మాటలు ఉపయోగిస్తే చాలు. కానీ "... కామవాంఛను తీర్చుకున్నాడు" "....కామదాహాన్ని తీర్చుకుంటాడని వారు ఊహించలేదు" "....శరీర సంబంధాలు పెట్టుకున్నాడు" "....ఫలితంగా గర్భవతి అయింది" ".... తత్ఫలితంగా గర్భవతి అయింది" అంటూ వారపత్రికల్లో వుండే మాటల్లాంటి మాటలే కరపత్రంలో పదే పదే రాశారు. ఆ మాటలు ఆ పద్ధతిలో అన్నిసార్లు రాయకపోతే, కరపత్రం చదివే పాఠకులు ఆమె ఎందుకు గర్భవతి అయిందో తెలీక కంగారుపడతారనుకున్నారా కమిటీ వారు? బూర్జువా కోర్టుల్లో మాట్లాడినట్టేనా ఉద్యమకారులు స్త్రీల సమస్యల గురించి కరపత్రాల్లో రాయడం?

'కల్యాణి తండ్రి నిజాయితీపరుడు. ఎం.ఎల్.ఎ. కుటుంబానికి సన్నిహితుడు. అన్న ఆ చుట్టుపట్ల మంచి పేరు పొందాడు' - అనే రకం

మాటలెందుకు ఈ సందర్భంలో?' తండ్రికీ, అన్నకీ కీర్తి ప్రతిష్టలు లేకపోతే ఏమోగానీ, ఇంత కీర్తి వున్నవారి అమ్మాయికి కూడా ఇలా జరగడమా' అని కరపత్రం చదివేవారు అనుకోవాలా?

'తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టాడ'నీ 'అయినవారి పిల్లని వళ్లో వేసుకున్నాడ'నీ అమ్మాయి తరుపువాళ్ళు తమ బాధ కొద్దీ అనుకుంటే అనుకుంటారు. కమిటీ వారు కూడా అవే భావాలతో ఏకీభవిస్తూ "....అయిన వారి పిల్లను వళ్లో వేసుకుని కామదాహాన్ని తీర్చుకుంటాడని సత్యన్నారాయణ దంపతులు వూహించ లేకపోయారు" అని బాధపడ్డారు. స్త్రీలని మోసాలూ, బలత్కారాలూ చేసే విషయంలో 'తిన్న' ఇంటి వాసాలేమిటి, 'తినని' ఇంటి వాసాలేమిటి? 'అయిన వారి' పిల్లేమిటి 'కాని వారి' పిల్లేమిటి? ఎవరి పిల్లకీ అది జరుగకూడదు కదా? ఆ తల్లిదండ్రులు అనుకున్న మాటలన్నీ కరపత్రంలోకి ఎక్కకూడదు.

'కామదాహం' అనే మాట అమ్మాయి తల్లిదండ్రులు ఉపయోగించి వుండరు. జరిగిన దాన్ని వివరించ గలుగుతున్నా మనుకుంటూ, అది కమిటీ వారి కవిత్వమే. పిల్ల అంగీకారంతోనే అదంతా జరిగిందనే ఆలోచన లేకుండా ఆ వివరాలన్నీ వర్ణించి ఏం లాభం?

"స్త్రీ సంఘాలూ, ఇతర సంఘాలూ అమ్మాయి కుటుంబానికి అండ దండలు ఇవ్వాలని కమిటీ వారు ఒక కార్యక్రమం ఇచ్చారు. అంటే, ఆ సంఘాలన్నీ 'అతని' కుటుంబం మీద ఒత్తిడి తెచ్చి ఈ పెళ్ళి జరిగేలాగానో, ఆ డి.ఎన్.ఎ పరీక్ష జరిగేలాగానో చెయ్యాలన్నదే కమిటీవారి అర్థం అయితే, అది మాత్రం అమ్మాయికి క్షేమమూ, ఆత్మగౌరవమూ కాదు. అమ్మాయికి పెళ్ళి జరగదని భయపడనక్కర లేదు. జరగక పోయినా ఆ మోసగాడితో జీవితంకన్నా, ఒంటరితనం వెయ్యిరెట్లు ఉన్నతం. ఆ విషయం అమ్మాయికి బోధించి ధైర్యం చెప్పడమే ఏ సంఘాలు చెయ్యవలసిందైనా.

"శ్రీ సోమయ్య కుమారుడు శ్రీనివాసరావు....శ్రీ సత్యన్నారాయణ కుమార్తె కళ్యాణి....అనడమూ; "సత్యన్నారాయణ దంపతులు...." అనడమూ చేశారు గానీ తల్లుల పేర్లు ఎందుకు రాయలేక పోయారు? 'పిల్లలకి' తండ్రులే గాక, తల్లులు కూడా వుంటారని కమిటీవారు తెలుసుకోలేక పోయారా? "శ్రీనివాసరావు తల్లిదండ్రులు ఫలానా ఫలానా వారు. కళ్యాణి తల్లిదండ్రులు ఫలానా ఫలానా వారు" అని రాయకూడదూ? "సత్యన్నారాయణ దంపతులు" అనకపోతే "అమ్మాయి తల్లిదండ్రులు" అనో, తల్లి పేరు కూడా చేర్చో వ్రాయకూడదూ?

"దుష్ట సంస్కృతికి వ్యతిరేకం" అనే మాటలు చెప్పుకుంటూ, ఆ "దుష్ట సంస్కృతి"లోనే పీకలదాకా కూరుకుని వుంటే లాభం లేదు. సాధారణ మనుషులికీ, ఉద్యమకారులకి తేడా వుండాలి. మాటల్లో తేడా కాదు. భావాల్లోనూ, ఆచరణలోనూ తేడా వుండాలి. నూతన భావాలు గల సాహిత్యం మీద దృష్టి పెట్టాలి. లేకపోతే మాటలు మాత్రమే కొత్తవి నేర్చుకుని కొత్త కొత్త మాటలతో పాత సారాంశానికే తిరిగి వస్తారు. అందుకే "ఆడపిల్లలు ఎన్నడూ ఇలాంటి సమస్య తెచ్చుకోకూడదు" అని ఒక హెచ్చరిక వాక్యం కరపత్రంలో రాయలేక పోయారు.

పొరపాట్లని నిర్విమర్శగా సమర్థించకూడదు. 'పెట్టుబడిదారీ విధానం'తో పుచ్చిపున్న దేశాలన్నిటిలోనూ స్త్రీలపోరాటాలనేవి పెర్రితలలు వేస్తున్నాయి. "స్వేచ్ఛ" పేరుతో 13, 14 సం.ల నించే బాయ్ ఫ్రెండ్స్‌తో తిరిగి, గర్భాలు తెచ్చుకుని శరణాలయాల్లో చేరి, 'అనాథ' స్థితిలో పిల్లల్ని కని, తమనీ పిల్లల్నీ పోషించుకోవడానికి మళ్ళీ బాయ్ ఫ్రెండ్ మీదే ఆధారపడుతూ సిగ్గుమాలిన జీవితాలు గడుపుతోన్న ఆడపిల్లలు తామర తంపరగా తయారవుతున్నారు.

మన ఆడపిల్లలకి ఆత్మగౌరవాలు నేర్పకుండా, వారి తెలివి తక్కువ పోరాటాలకే వంతపాడుతూ, పోతే, మనం కూడా చాలా త్వరలోనే వారి కోసం 'శరణాలయాలు' ప్రారంభించ వలసి వస్తుంది!

ఎస్. శ్రీలత, చేర్యాల.

ప్రశ్న: ఈ మధ్యకాలంలో మీరు నవలలు రాయడం మానివేశారు. కారణం ఏమిటో తెలియజేస్తారా ?

జవాబు: టైము లేకనే. నవలకన్నా ప్రధానమైనదాన్నీ, నవలల ద్వారా పూర్తిగా చెప్పలేనిదాన్నీ చెప్పడం కోసమే నవలల పని ఆపాను. సమాజంలో ధనిక-పేద తేడాల్నీ, అసమానత్వాల్నీ పూర్తిగా తీసివెయ్య గల సిద్ధాంతం వుంది. దాన్ని తెలుసుకోవడమూ, తెలిసినదాన్ని చెప్పడమూ మొట్టమొదట చెయ్యవలసిన పనిగా అనుకుంటున్నాను. ఆ సిద్ధాంతం అంతా మార్క్స్ రాసిన "పెట్టుబడి" అనే పుస్తకంలో వుంది. దాన్ని 'పరిచయం' చేసే పని కోసమే నవలల పని ఆపాను.

జి. వి. రాఘవేంద్రరావు, మచిలీపట్నం.

ప్రశ్న: నేటి సాహిత్యంలో సాహితీ విలువలు పూర్తిగా దిగజార డానికిగల కారణం ?

పచ్చిగోళ్ళ వరలక్ష్మి, వేంద్ర అగ్రహారం.

ప్రశ్న: నేడు పత్రికల్లో వస్తున్న దిగజారిన సీరియల్స్‌పై మీ అభి ప్రాయం ఏమిటి ?

వి. మాధవి, గద్దలగుంటలపాలెం.

ప్రశ్న: నేటి ఏ నవల చూసినా సినిమాకి ఉపయోగపడే విధంగా అంత చెత్తగా వ్రాస్తున్న నేటి రచయితలు అలా అంతగా దిగజారిపోవ డానికి కారణమేమిటో తెలియజేస్తారా?

కె. రాఘవులు, కాకినాడ.

ప్రశ్న: వెనకటి సాహిత్యంతో పోలిస్తే నేటి వార, మాస పత్రికల సాహిత్యం చాలా దిగజారి కన్పిస్తున్నది. ఎందుచేత నంటారు?

యు. యు. యు., ఎమ్మిగనూరు.

ప్రశ్న: నానాటికీ దిగజారుతున్న సాహితీ విలువలపై మీ అభి ప్రాయం?

జవాబు: ఈ రకం ప్రశ్నలన్నిటికీ ఒకటే జవాబు. పత్రికారంగంలో పెరిగిపోతోన్న 'పోటీ' వల్లనే యిలా జరుగుతోంది - అని. 'సరుకు'ని అమ్ముకోవడానికి పెట్టుబడిదారుల మధ్య ఎప్పుడూ 'పోటీ' నడుస్తూ వుంటుంది. పోటీ లక్ష్యం, ఎవరికి వారు తమ సరుకునే ఎక్కువగా అమ్ము కోవాలని చూడడమే. పత్రికలూ, పుస్తకాలూ, సినిమాలూ అన్నీ 'సరు కులే'. మీరు చెప్పిన 'సాహిత్య విలువలు' వున్న వెనకటి కాలంలో కూడా పోటీ వుంది. కానీ, ఆనాటి పోటీతో పోల్చితే, ఈనాటి పోటీ చాలా ఎక్కువ. రాబోయే కాలంలో పోటీ, ఇప్పటి పోటీకన్నా కూడా వృద్ధి తంగా వుంటుంది. పోటీ స్థాయి ఎందుకు పెరిగిపోతూ వుంటుందో క్లుప్తంగా చెప్పగలనుగానీ, ఈ 'సైన్స్'ని కొత్తగా తెలుసుకునేవాళ్ళు క్లుప్తంగా చెప్తే అర్థం చేసుకోలేరు. 'పెట్టుబడిదారీ విధానం'తో వుత్పత్తి శక్తుల పెరుగుదలా, 'అదనపు విలువ రేటు' పెరుగుదలా, పెట్టుబడి పెరుగుదలా 'సరుకురాసుల్ని' పెంచివేస్తూ, వాటిని అమ్ముకోవడం కోసం

పోటీని పెంచివేస్తూ వుంటాయి. పోటీలో ఎవరి సరుకుని వాళ్ళు అమ్ముకోవడం కోసం అసహజమైన మార్గాల్ని ప్రోత్సహిస్తూ వుంటారు. 'డబ్బు' సంపాదించడమే ప్రధాన లక్ష్యమైన రచయితలు, పాఠకుల్ని తప్పుడు మార్గాల్లో ఆకర్షించే రచనలు చేస్తూ వుంటారు. ఈ సమాజం 'లాభదృష్టి తోటీ', 'డబ్బు దృష్టి'తోటీ నడుస్తోన్న సమాజం కావడమే దీనికంతటికీ మూలం. ఇంకో ఇరవై ఏళ్ళలో, ఈలోగా దీన్ని అడ్డుకోగల నిజమైన మార్గాలేమీ రాకపోతే, సినిమాలూ, పత్రికలూ 'తలచడానికి'కూడా సాధ్యం కాని స్థాయిలో వుంటాయి.

* * *

ఎ. ఎ. రాధ, గిద్దలూరు.

ప్రశ్న: 'ఉత్తమ సాహిత్యం' అంటే మీ దృష్టిలో ఏమిటి?

రమేష్ కుమార్, గద్వాల.

ప్రశ్న: మన వాళ్ళంతా నేటి తెలుగు సాహిత్యం దిగజారిపోతోందని అంటుంటారు కదా? మంచి సాహిత్యానికి కొలబద్ద వుందా? మంచి సాహిత్యం ఎలా వుండాలి?

జవాబు: మంచీ, చెడ్డా అనే లక్షణాలు సాహిత్యంలో మాత్రం వుండవా? 'సత్యాన్ని' చెప్పడమే 'మంచి'కి కొలబద్ద. నిజ జీవితాన్ని చిత్రించేది మంచి సాహిత్యం. 'నిజ జీవితం' అన్నప్పుడు అందులో చాలా వివరాలు వున్నాయి. జీవిత సమస్యల్ని చూడలేనిదేదీ మంచి సాహిత్యం కాదు. వెనకటి సాహిత్యంలో కనీసం జీవిత పరిస్థితుల చిత్రణ వుండేది. ఇప్పుడు అదేమీ లేదు. అందుకే 'సాహిత్యం దిగజారిపోతోంది' అంటున్నారు.

* * *

గుమ్మళ్ళ జైవిరల్, మచిలీపట్నం.

ప్రశ్న: నేడు రచనా వ్యాసంగంలో రచయిత్రిలు వెనకబడటానికి గల కారణం?

జవాబు: 'వెనకబడటం' అంటే? ఈ సెక్సు కథలా, క్రైమ్‌కథలూ రచయిత్రులు రాయడం లేకనా? ఎందుకు రాయటంలేదూ? రచయిత్రిలు కూడా రాస్తూనే వున్నారు. రచయితల్లో కూడా అందరూ ఈ రకం కథలే రాయటంలేదు కదా? అలాగే రచయిత్రిల్లో కూడా అందరూ రాయక పోవచ్చు. చెప్పాలంటే రచయితలుగాని, రచయిత్రిలుగానీ "నేటి రచనా వ్యాసంగం"లో ఎంత వెనకబడితే అంత మంచిది. వెనకబడ్డవాళ్ళేముందు బడ్డవాళ్ళు.

* * *

ఎస్. శ్రీనివాస్ రెడ్డి, చేర్యాల.

ప్రశ్న: రచయితగా రాణించాలంటే వుండాల్సిన అర్హతలేమిటి?

జవాబు: 'రాణించడం' అనే దృష్టి వదిలేసి, రాయాలనిపించినపుడు రాయడమే.

బానోతు జవహర్, ఏటూరునాగారం.

ప్రశ్న: నేటి సినిమా డైలాగుల తీరు ద్వందార్థాలతో మారి పోయింది కదా? ఇది ఆదరించే ప్రేక్షకుల తప్పా, సినిమా నిర్మాతల తప్పా ?

జవాబు: తప్పు రెండువైపులా వుంది. నిర్మాత డబ్బు సంపాదించే కార్యక్రమం పెట్టుకుంటే, ప్రేక్షకులు బూతులు విని ఆనందించే కార్య క్రమం పెట్టుకున్నారు. ఆ రకంగా ఇరుపక్షాలూ తప్పే.

పోటీని పెంచివేస్తూ వుంటాయి. పోటీలో ఎవరి సరుకుని వాళ్ళు అమ్ము కోవడం కోసం అసహజమైన మార్గాల్ని ప్రోత్సహిస్తూ వుంటారు. 'డబ్బు' సంపాదించడమే ప్రధాన లక్ష్యమైన రచయితలు, పాఠకుల్ని తప్పుడు మార్గాల్లో ఆకర్షించే రచనలు చేస్తూ వుంటారు. ఈ సమాజం 'లాభదృష్టి తోటీ', 'డబ్బు దృష్టి'తోటీ నడుస్తోన్న సమాజం కావడమే దీనికంతటికీ మూలం. ఇంకో ఇరవై ఏళ్ళలో, ఈలోగా దీన్ని అడ్డుకోగల నిజమైన మార్గాలేమీ రాకపోతే, సినిమాలూ, పత్రికలూ 'తలచడానికి'కూడా సాధ్యం కాని స్థాయిలో వుంటాయి.

ఎ. ఎ. రాధ, గిద్దలూరు.

ప్రశ్న: 'ఉత్తమ సాహిత్యం' అంటే మీ దృష్టిలో ఏమిటి?

రమేష్ కుమార్, గద్వాల.

ప్రశ్న: మన వాళ్ళంతా నేటి తెలుగు సాహిత్యం దిగజారిపోతోం దని అంటుంటారు కదా? మంచి సాహిత్యానికి కొలబద్ద వుందా? మంచి సాహిత్యం ఎలా వుండాలి?

జవాబు: మంచీ, చెడ్డా అనే లక్షణాలు సాహిత్యంలో మాత్రం వుండవా? 'సత్యాన్ని' చెప్పడమే 'మంచి'కి కొలబద్ద. నిజ జీవితాన్ని చిత్రించేది మంచి సాహిత్యం. 'నిజ జీవితం' అన్నప్పుడు అందులో చాలా వివరాలు వున్నాయి. జీవిత సమస్యల్ని చూడలేనిదేదీ మంచి సాహిత్యం కాదు. వెనకటి సాహిత్యంలో కనీసం జీవిత పరిస్థితుల చిత్రణ వుండేది. ఇప్పుడు అదేమీ లేదు. అందుకే 'సాహిత్యం దిగజారిపోతోంది' అంటు న్నారు.

గుమ్మళ్ళ జైవిరల్, మచిలీపట్నం.

ప్రశ్న: నేడు రచనా వ్యాసంగంలో రచయిత్రిలు వెనకబడటానికి గల కారణం?

జవాబు: 'వెనకబడటం' అంటే? ఈ సెక్సు కథలూ, క్రైమ్‌కథలూ రచయిత్రులు రాయడం లేకనా? ఎందుకు రాయటంలేదూ? రచయిత్రిలు కూడా రాస్తూనే వున్నారు. రచయితల్లో కూడా అందరూ ఈ రకం కథలే రాయటంలేదు కదా? అలాగే రచయిత్రిల్లో కూడా అందరూ రాయక పోవచ్చు. చెప్పాలంటే రచయితలుగాని, రచయిత్రిలుగానీ "నేటి రచనా వ్యాసంగం"లో ఎంత వెనకబడితే అంత మంచిది. వెనకబడ్డవాళ్ళేముందు బడ్డవాళ్ళు.

*　　*　　*

ఎస్. శ్రీనివాస్‌రెడ్డి, చేర్యాల.

ప్రశ్న: రచయితగా రాణించాలంటే వుండాల్సిన అర్హతలేమిటి?

జవాబు: 'రాణించడం' అనే దృష్టి వదిలేసి, రాయాలనిపించినపుడు రాయడమే.

*　　*　　*

బానోతు జనహర్, ఏటూరునాగారం.

ప్రశ్న: నేటి సినిమా డైలాగుల తీరు ద్వంద్వార్థాలతో మారి పోయింది కదా? ఇది ఆదరించే ప్రేక్షకుల తప్పా, సినిమా నిర్మాతల తప్పా ?

జవాబు: తప్పు రెండువైపులా వుంది. నిర్మాత డబ్బు సంపాదించే కార్యక్రమం పెట్టుకుంటే, ప్రేక్షకులు బూతులు విని ఆనందించే కార్య క్రమం పెట్టుకున్నారు. ఆ రకంగా ఇరుపక్షాలూ తప్పే.

*　　*　　*

చొప్పదండి సుధాకర్, నిజామాబాద్.

ప్రశ్న: కొందరు ప్రముఖ కవులు పచ్చిబూతు మాటలని ఉపయోగిస్తూ కవితలు రాస్తున్నారు. ఇది వారిలో నిగూఢంగా దాగివున్న లైంగిక స్వేచ్ఛగా భావించవచ్చునా?

జవాబు: నిస్సందేహంగా భావించవచ్చును. ఆ రకం కవిత్వాన్ని చదివి మెచ్చుకునేవాళ్ళకి కూడా అదే జబ్బు పట్టిందని భావించవచ్చును. 'నిగూఢంగా దాగి వుండడం' కాదు. బహిరంగంగానే వాళ్ళు అదే జీవిత విధానంలో వుంటారు.

* * *

కె. వి. ఆర్, గుంటూరు.

ప్రశ్న : రచయితలు, రచయిత్రులు సాహిత్య ఉద్యమాలలో మమేకం కాలేకపోవడానికి కారణం ఏమిటి ?

జవాబు : రచయితలూ, రచయిత్రులూ 'ఉద్యమం'లో 'మమేకం' కాలేదని మీరే అంటున్నారు. మరి, వాళ్ళు లేకుండానే 'సాహిత్య ఉద్యమం' నడుస్తోందని మీరెలా అనుకుంటున్నారు ?

ప్రశ్న : మీరు ఏదైనా సామాజిక మార్పుకోసం కృషి చేస్తున్న సాహిత్య సంస్థల్లో, విప్లవ సాహిత్య, లేదా సామాజిక మార్పుకోసం పని చేసే సంస్థల్లో వున్నారా ?

జవాబు : "సామాజిక మార్పుకోసం కృషి చేసే" సంస్థలుగానీ, "విప్లవ సాహిత్య" సంస్థలుగానీ ఏమీ లేవుకదా ? 'లేని' సంస్థల్లో ఎలా వుంటాను చెప్పండి?

* * *

నాగపల్లి మహేష్, పాతమంచిర్యాల.

ప్రశ్న : నేటి నవలా సాహిత్యం తీరుతెన్నులపై మీ అభిప్రాయం?

జవాబు : నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు 'వ్యాపార' సాహిత్యం, 'డబ్బు' సాహిత్యం 'లాభ' సాహిత్యం.

*         *         *

బానోతు జవహార్, ఏటూరు నాగారం.

ప్రశ్న : ఒక రచయిత సమాజానికి ఏ విధమైన 'సేవ' చేయగలడు? చేయాలి?

జవాబు : 'సమాజం' అనే దానికంతటికీ ఒకే రకం 'సేవ' ఉపయోగపడదు. సమాజంలో ధనికులూ, పేదలూ వున్నారు కదా? ధనికులకు సేవ అయినది పేదలకు సేవకాదు, పేదలకు సేవ అయినది ధనికులకు సేవ కాదు. ఇరుపక్షాలకీ వుపయోగపడే సేవ ఏదీ వుండదు. రచయిత ఏ పక్షాన వుంటాడో ఆ పక్షం కోసం పనిచేస్తాడు. 'ఏ పక్షానికి చెయ్యాలి' అని ప్రశ్నిస్తే మాత్రం, 'న్యాయం' వున్న పక్షానికే చెయ్యాలి. అదే క్రమంగా సమాజం మారడానికి వుపయోగపడుతుంది.

చలపాక ప్రకాష్, విజయవాడ.

ప్రశ్న : ఈనాడు రచయితలు సంఘాలుగా ఏర్పడడం అందరికీ విదితమే. రచయితలు సంఘంగా ఏర్పడడంవలన చెత్త సాహిత్యాన్ని అరికట్టగలరా?

జవాబు : అది ఆ సంఘం పెట్టుకున్న లక్ష్యాన్నిబట్టి వుంటుంది. మీరు చెత్త సాహిత్యం అనుకుంటున్నదానినే ఒక రచయితల సంఘం కూడా చెత్త సాహిత్యం అనుకుంటే, ఆ సంఘంలో వున్న రచయితలు ఆ చెత్తని సృష్టించరు. ఇతర రచయితలు సృష్టించే చెత్తని వాళ్ళు డైరెక్టుగా ఆపలేరు గానీ, ఆ చెత్తమీద విమర్శలు చెయ్యడమూ, సంఘం ద్వారా ఇతర మార్గాల్లో కూడా ఆ చెత్తకి వ్యతిరేకంగా ప్రచారం

చెయ్యడమూ చెయ్యగలరు. సంఘం, ఎంత సరైన దృష్టితో, ఎంత నిజాయితీగా వుంటే అంత ఎక్కువగా ఈ పని చెయ్యగలుగుతుంది.

*　　*　　*

మహమ్మద్ రఫీ, మాచర్ల.

ప్రశ్న : 'శవపూజ' నవలపై మీ అభిప్రాయం నిర్మొహమాటంగా చెప్తారని ఆశిస్తాను (చెప్పటం మీకు ఇబ్బంది కలిగించని పక్షంలోనే).

జవాబు : చదివితే అభిప్రాయం చెప్పడానికేమీ ఇబ్బంది లేదు. చదవడమే ఇబ్బంది.

*　　*　　*

కె. వెంకటరామ అక్కయ్య, హైద్రాబాద్.

ప్రశ్న : ప్రస్తుతం దిగజారిన సాహిత్య విలువల గురించి ప్రశ్నిస్తే రచయితలేమో పాఠకులు చదివే రచనలు చేస్తున్నామంటారు. పాఠకులేమో రచయితలు ఏమి రాస్తే అది చదువుతున్నామంటారు. దీనిపై మీ వివరణ?

జవాబు : పాఠకులు తక్కువ స్థాయిలో వుండి తక్కువ స్థాయి రచనలనే ఇష్టపడినా, రచయిత తక్కువ స్థాయిలో రాయకూడదు. అలాగే, రచయిత తక్కువ స్థాయిలో వుండి, తక్కువ స్థాయి రచనలు చేసినా, పాఠకులు తక్కువ స్థాయి రచనల్ని తీవ్రమైన విమర్శ లేకుండా చదవ కూడదు. పాఠకులు, తమ అభిప్రాయాల్ని పత్రికలకు వెంట వెంటనే తెలియజేస్తూ వుండాలి. 'పాఠకులు ఏం చదివితే అదే రాస్తాం' అనడం రచయితల్లో వ్యాపార దృష్టి. 'రచయితలు ఏం రాస్తే అదే చదువుతాం' అనడం పాఠకుల్లో బానిస దృష్టి. ఇవి రెండూ ఒకదానితో ఒకటి. సామ రస్యంగా వున్నంతకాలమూ సాహిత్య వ్యాపారం ఘర్షణ లేకుండా ఇప్పటి లాగే నడుస్తూ వుంటుంది.

చొప్పరపు సత్యన్నారాయణ, మంటాడ.

ప్రశ్న : ఈ రోజుల్లో ఇన్వెష్టిగేషన్ పేరిట పత్రికల్లో సీరియల్స్ విపరీతంగా వస్తున్నాయి. ఇన్వెష్టిగేషన్ రచనలపై మీ అభిప్రాయం ఏమిటి? మీరు చదివిన వాటిలో మీకు నచ్చిన రచన ఏది ?

జవాబు : నచ్చిన రచన ఏదీ లేదు. ఇన్వెష్టిగేషన్ రచనలు చేయటం చాలా తేలిక. నిజజీవిత సమస్యలూ, సహజమైన పాత్ర చిత్రణా, జ్ఞానవంతమైన ముగింపూ వంటి వాటికోసం ప్రయత్నించడంకన్నా ఇది చాలా తేలిక. ఎంత తేలికంటే, ఈ రకం రచనలు చేసే ఒక రచయితని "మీరు తర్వాత రాయబోయే విషయం ఏమిటి?" అని అడిగితే, "సారీ! అది బిజినెస్ సీక్రెట్ కదండీ" అంటాడు. అంటే, ఆ 'విషయం' ఏమిటో చెప్పేస్తే దానిమీద ఇంకెవరన్నా రాసేస్తారని భయం. అంటే, ఒక రచయిత రాయాలనుకున్న విషయంమీద ఏ రచయిత అయినా రాసెయ్యగలడన్న మాట! ఇన్వెష్టిగేషన్ రచనలో చెప్పేదంతా "సమాచారమే" కాబట్టి, ఒక విషయం గురించి ఒక రచయిత చెప్పేసిన తర్వాత ఇంకో రచయిత చెప్పడానికేమీ వుండదు. 'విమానం' గురించో, 'షిప్పు' గురించో, 'హోటల్' గురించో, ఒక రచయిత చెప్పేసిన తర్వాత మళ్ళీ ఇంకో రచయిత చెప్పడానికేం వుంటుంది? అందుకే ఈ తరహా రచయితలు తర్వాత రాయబోయే విషయాల్ని చాలా సీక్రెట్‌గా దాచుకుంటారు. పైగా తమ రచనా వ్యాసంగం "బిజినెస్" అని వాళ్ళే చెప్పేసుకుంటారు. అదే సాంఘిక సమస్యల మీదో, నిజజీవితాలమీదో రాయడం అయితే ఒకే విషయంమీద వందమంది రచయితలైనా ఎవరి పద్ధతిలో వాళ్ళు రాయవచ్చు. ఆ సమస్య వున్నంత కాలమూ మళ్ళీ మళ్ళీ రాస్తూనే వుండవచ్చు. నిర్జీవ వస్తువులకి సంబంధించిన ఇన్వెష్టిగేషన్‌లుగాక, మానవ జీవితాల ఇన్వెష్టి

గేషన్ చెయ్యగలిగితే ఏ రచయితైనా తన శక్తిని మంచిగా ఉపయోగించ వచ్చు.

ఇన్వెస్టిగేషన్ రచనలు పాఠకులకు 'ఆసక్తికరంగా' ఎందుకు వుంటా యంటే, అంతవరకు తెలియని సమాచారం ఎంతో కొంత ఆ రచనల్లో తెలుస్తూ వుండడంవల్ల. 'విమానం' గురించి ఏమీ తెలీనప్పుడు దాన్ని గురించి తెలుసుకోవడం ఆసక్తిగానే వుంటుంది. అందుచే రచయితలు, ఈ రకం సాహిత్యం ప్రారంభించారు.

ఆ తీసుకున్న అంశంలో కూడా నిజజీవితాన్ని చిత్రించవచ్చు. 'విమానం' గురించి రాయాలంటే అది తయారయ్యే చోటగానీ, అది పనిచేసే చోటగానీ 'జీవితం' లేదా? 'మానవ సంబంధాలు' లేవా? అక్కడి సమస్యల్ని సీరియస్ విమర్శతో చూపించవచ్చు. అలా చూపించా లంటే యంత్రాల సైన్సు చాలదు. మనుష్యుల జీవితాల్నీ, సంబంధాల్నీ విమర్శించాలనే దృష్టి వుండాలి ఆదేమీ లేకుండా త్వరత్వరగా తేలిగ్గా రచనలు తయారైపోయే మార్గం, త్వరత్వరగా డబ్బు సంపాదించే మార్గం కదా?

* *

పి. సుదర్శన యాదవ్, షంషాబాద్,

ప్ర : నేను ఇప్పుడిప్పుడే మార్క్సిజం, లెనినిజం, మావో ఆలో చనా విధానాన్ని చదవాలనుకుంటున్నాను. ఏ పుస్తకాలను చదవాలో పేర్లు తెల్పగలరు. కమ్యూనిస్టులు 'శ్రీనో పాండే ప్రయోజన సూత్రం' ప్రకారం దేశ సంపదనంతా పేదలకు పంచాలంటారని, కేవలం జాతీయం చేయాలంటా రని ఇంటర్మీడియట్ ఎకనామిక్స్‌లో చదివాము అర్థం కాలేదు. వివరిస్తా రని ఆశిస్తున్నాను.

జ : అది ఇక్కడ వివరిస్తే అర్థమయ్యే విషయం కాదు. ఆ విషయం తెలుసుకోవడానికి మార్క్స్ 'కాపిటల్' మాత్రమే సరైన పుస్తకం. ఒరిజినల్ పుస్తకం చదవడం చాలా సమస్య. కాబట్టి "కాపిటల్ పరిచయం" అని తెలుగులో నేను రాసిన పుస్తకం వుంది చూడండి. మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం - అన్నీ ఒకటే. అన్నీ మార్క్సిజమే. మార్క్సిజాన్ని చదివే పని 'కాపిటల్'తోనే మొదలు పెట్టాలి. అది పూర్తయిన తరవాతే మిగిలిన పుస్తకాలు చదవాలి. కమ్యూనిస్టులు, 'దేశ సంపదనంతా పేదలకు పంచాలి'నరు. ఆ సంపదనంతా ఉత్పత్తి చేసేది పేదలే కాబట్టి, వాళ్ళు ఉత్పత్తి చేసే దాన్ని వాళ్ళే తీసుకోవాలి అంటారు. 'ఎవరికోసం వాళ్ళే శ్రమ చెయ్యాలంటారు. అప్పుడు ధనికులూ పేదలూ అనే తేడాలు వుండవంటారు' ఎవరో పంచడం కాదు. ఇదంతా ఇంత తేలిగ్గా అర్థమయ్యే విషయం కాదు. ఎంత వివరించినా ఇక్కడ వివరించేది చాలదు.

కొత్తా పెద వీరయ్య, కొవ్వూరు.

ప్ర : సోషలిజం, కమ్యూనిజం, మార్క్సిజం అంటారు. తేడా లేమిటో తెలుపగలరు.

జ : సారాంశంలో తేడా లేమీ లేవు. మార్క్స్ అనే వ్యక్తి చెప్పిన సిద్ధాంతం కాబట్టి అది మార్క్సిజం. మార్క్సిజం లేని కాలంలో కూడా 'సోషలిజం', 'కమ్యూనిజం' అనే మాటలు వున్నాయి. ఆ మాటల అర్థం 'సమానత్వం' అని. మానవులంతా ఎన్నో వేల సంవత్సరాలనాడే 'బానిస యజమానులు'గానూ, 'బానిసలు'గానూ అసమానులుగా అయిపోయారు. యజమానులంతా ధనికులూ, బానిసలంతా పేదలూ అయ్యారు. అప్పటి

నించీ తేడాలూ, ఆ వర్గాలూ అలా నడుస్తూనే వున్నాయి. మానవుల్లో ఈ తేడాల్ని ఖండించే ఒక ఆలోచనా విధానం వెనకటి కాలంనించీ కూడా వుంటూనే వుంది. కొందరు తత్వవేత్తలూ, ఆర్థిక వేత్తలూ 'మానవు లంతా సమానులు'గా జీవించాలనే దృష్టితో 'సోషలిజం', 'కమ్యూనిజం' అనే మాటలు వుపయోగిస్తూ, అలాంటి సమాజాల కోసం కలలు కంటూ, తమ వూహలకు అందిన మార్గాలన్నీ చెప్పారు. అయితే అసమా నత్వాలకు కారణం ఏమిటో వారు తెలుసుకోలేక పోవడంవల్ల వారు కలలు గన్న సోషలిజాలూ, కమ్యూనిజాలూ వూహల్లో పుట్టినవిగానే వుండి పోయాయి. తరవాత, ఆ పని మార్క్సుద్వారా జరిగింది. ఆ అసలు కారణం తెలుసుకోవడమే మార్క్సు చేసిన పని. 'శ్రమదోపిడి' అనే కారణం అది. అప్పటికే కొంత అభివృద్ధి చెంధివున్న 'విలువ సూత్రం' మీద ఆధారపడే, మార్క్సు ఆ అంశం కనిపెట్టాడు. 'శ్రమదోపిడీ'అనే కారణం బయటపడగానే వేల వేల సంవత్సరాలనుంచీ నడిచిన చరిత్ర అంతా తేటతెల్లం అయిపోయింది. శ్రమదోపిడీ వల్లనే ధనికులూ పేదలూ అనే తేడాలు ప్రారంభమయ్యాయనీ, వర్గ పోరాటమే సమాజాన్ని మారుస్తూ వస్తున్నదనీ, శ్రమదోపిడీని పూర్తిగా తీసివెయ్యగలిగినప్పుడే మనుష్యుల మధ్య అసమానత్వాన్ని తీసివెయ్యడం సాధ్యమవుతుందనీ తెలిసిపోయింది. 'కమ్యూనిజం' అన్నా, 'సోషలిజం' అన్నా 'సమసమాజం', కమ్యూనిజాన్ని సాధించే మార్గాన్ని హేతుబద్ధంగా చెప్పింది మార్క్సిజమే కాబట్టి, మార్క్సిజం అనేది 'శాస్త్రీయ కమ్యూనిజం', సారాంశంలో ఈ అన్ని మాటల అర్థమూ ఒకటే. అన్నిటినీ కలిపి 'మార్క్సిజం' అంటే చాలు. ఆ సిద్ధాంతం నేర్చుకోవాలంటే ఒక క్రమంలో ప్రారంభించాలి.

* * *

సి హెచ్. స్రవంతి, సి. ఎస్. పురం.

ప్ర : ఇటీవల కమ్యూనిస్టు రాజ్యాలైన సోవియట్, చైనా, హంగరీ, తూర్పు జర్మనీలలో జరుగుతున్న పరిణామాలనుబట్టి మార్క్సిజం ఫెయిల్యూరు అయినదని మేధావి వర్గం వాదన చేస్తున్నారు. సామాన్య జనులకు కూడా అలానే అనిపిస్తున్నది. దీనిపై మీ అభిప్రాయమేమిటి ?

లింగాల సత్యనారాయణ, తాళ్ళపూడి.

ప్ర: ఈ మధ్య ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిస్టు దేశాల్లో "కమ్యూనిజం మాకొద్దు"అని ఉద్యమాలు రావడానికి కారణం ఏమిటి ? (1) రష్యాలో గోర్బచెవ్ "పెరిస్త్రోయికా ప్రవేశపెట్టిన తరువాత జరిగిన ఎన్నికల్లో పార్టీ ఎక్కువ శాతం నష్టపోయింది. (2) చైనాలో కమ్యూనిజం మా కొద్దు ప్రజాస్వామ్యం కావాలని విద్యార్థుల ఆందోళన (బీజింగ్‌లో) (3) మొన్నటికి మొన్న జపాన్ ఎన్నికలలో కూడా వ్యతిరేక ఫలితాలు వచ్చాయి. ఇదంతా చూస్తే "కార్ల్‌మార్క్స్ సిద్ధాంతం"లో ఎక్కడైనా లోపంవుందా? దాన్ని "అమలుచేసే నాయకుల పోకడలో లోపమా ? ఏమిటి ?"

జ : జరుగుతున్నదంతా రెండోదే. నాయకుల దృక్పథంలో లోపమే. మార్క్స్ సిద్ధాంతంలో లోపం వుందా ?" అని మీరు ఎందుకు అడిగారంటే, మార్క్స్ సిద్ధాంతం గురించి మీకు సరిగా తెలియక. సరిగా తెలిసివుంటే "మార్క్స్ సిద్ధాంతంలో లోపం వుంది". అనో, "లోపం లేదు" అనో ఏదో ఒక అభిప్రాయం ఖచ్చితంగా ఏర్పరచుకొనేవారు. సరిగా తెలిసిన విషయాలమీద ఒకే అభిప్రాయం వుంటుంది. ఊగిసలాటలూ, సందేహాలూ వుండవు.

మార్క్సిజం అంటే దోపిడీని, దాని సమస్త లక్షణాల్నీ తీసివేసే, మానవుల్ని సమానుల్ని చేసే సిద్ధాంతం. ఇదంతా మార్క్స్ తన ఇష్టా ఇష్టాలతోటీ, స్వంత కల్పనలతోటీ చెప్పిందికాదు. తనకన్నా వెనుకటి

ఆర్థికవేత్తలు అందించిన 'విలువ సూత్రం' మీద ఆధారపడుతూ వివరించిందే. దోపిడీని వ్యతిరేకించే సిద్ధాంతంలోనే 'లోపం' వుందనుకుంటే, ఇక అప్పుడు "దోపిడీలోనే రైటు వుంది. ఒక వర్గం అంతా శ్రమ చెయ్యకుండా జీవించడంలోనే రైటు వుంది. అసమానత్వం లోనే రైటు వుంది" అనే అర్థానికి రావలసిందే. ఇక్కడ సూటిగా ఒకటే ప్రశ్న. 'దోపిడీ సాగడం రైటా, దాన్ని తీసివెయ్యడం రైటా ?' అనే ప్రశ్న. - ఈ ప్రశ్నకి ఇచ్చుకునే జవాబుని బట్టే మార్క్సిజంలో లోపం వుందా, లేదా అనేది వుంటుంది.

'దోపిడీ రైటు కాదు' అనుకునేవాళ్ళకి, ఆ మాటే చెప్పే మార్క్సిజంలో లోపం లేనట్టే. 'సిద్ధాంతం'లో లోపం లేదంటే, ఇక దాని అర్థం చేసుకోవడంలోనే, ఆచరించడంలోనే లోపం జరుగుతున్నదన్న మాట.

భూముల్నీ, ఫ్యాక్టరీల్నీ ప్రభుత్వం కిందకి తెచ్చేస్తే అదే సోషలిజం-అనే అభిప్రాయంతో నిన్న మొన్నటి వరకూ కమ్యూనిస్టులందరూ వుండేవారు. ఇప్పుడు కొంత మంది ఈ తప్పు నించి తేరుకున్నారు. "సోషలిజం అంటే ఇది కాదేమో" అనే సందేహం చైనాలో 1966లో, 'సాంస్కృతిక విప్లవ కాలం'లో గానీ ప్రారంభం కాలేదు. అప్పటికే రష్యాలోనూ, చైనాలోనూ కూడా "సోషలిస్టు పునాది ఏర్పడి పోయింది. ఇక పునరితలాన్ని మార్చడమే మిగిలి వుంది" అని కమ్యూనిస్టు పార్టీలు రాసేసుకున్నాయి. రష్యాలో అయితే స్టాలిన్ కాలంలో "వర్గాలే లేవు"అనే దాకా వెళ్ళారు. ఇదంతా కేవలం "తెలియకనే చేశారు" అనే అర్థానికి రావడానికికూడా వీలులేదు. మార్క్సిజాన్ని ఇంత అర్థం చేసుకోకపోవడం అంటే అది బూర్జువా భావజాలంలో పీకల దాకా కూరుకు పోవడమే.

మార్క్సు పుస్తకాలు అర్థం చేసుకోవడం ఎంతో తీవ్రమైనంత కష్టం అనే మాట నిజమే కావచ్చు. ఆ పుస్తకాలు ఇంకా తేలిగ్గా వుండి, ఆ సిద్ధాంతం ఇంకా వివరంగా అర్థమై వుంటే, సోషలిజం అంటే ఏమిటో

అర్థం చేసుకోవడంలో ఇన్ని సంవత్సరాల కాలం వృధా అయ్యేది కాదనే సంగతి కూడా నిజమే కావచ్చు. సిద్ధాంతం వివరంగా తెలియనంత మాత్రాన కమ్యూనిస్టులనే వాళ్ళు ఘోరమైన తప్పులు చేసెయ్యలేరు. అలా చేసేశారంటే, సిద్ధాంతం తెలియక పోవడం కాదు. సిద్ధాంతం తెలుసుకోవడం ఇష్టం లేకపోవడం. సమాజంలో ఇంకా వర్గాలు వున్నప్పుడు, వాటి ప్రతినిధులందరూ 'కమ్యూనిస్టు పార్టీ'లో వుంటారు. వాళ్ళల్లో కొందరికి మార్క్సిజం అవసరం లేదు. దాన్ని ఎక్కడ వీలైతే అక్కడ ఆపెయ్యడమే వాళ్ళకి కావాలి. ఆ పని ఒక దశ దగ్గర సాధ్యం కాకపోతే, ఇంకో దశ దాకా వాళ్ళు కిక్కురుమనకుండా కమ్యూనిస్టుల పోజుతోనే నడుస్తారు. మళ్ళీ ఏదో ఒక మార్పు దగ్గర దాన్ని ఆపడానికి ప్రయత్నిస్తారు. వాళ్ళు ఎక్కడ 'జయిస్తారో' అక్కడ నిలబడి, గతంలో జరిగిన మార్పులన్నిటినీ వెనక్కి తిప్పడానికి ప్రయత్నిస్తారు. వాళ్ళ ప్రయత్నాన్ని ఎదుర్కొనే గట్టి పోరాటం లేక పోతే వాళ్ళు సమాజాన్ని ఎంత వెనక్కి అయినా తీసుకు పోవడానికి ప్రయత్నిస్తారు. కార్మిక వర్గంలో మెజారిటీ ప్రజలకు మార్క్సిజం తెలిసినప్పుడే ఈ వెనకనడక ఆగుతుంది.

శారీరక శ్రమలు చేసే కార్మికుల కైతే సిద్ధాంతం గురించి అసలేమీ తెలీదు. వారికి పార్టీ కార్యకర్తలు ఎంత చేప్తే అంత. ఆ పార్టీ కార్యకర్తలకి కూడా ఏమీ తెలీదు. పై స్థాయి నాయకులు ఎంత చెప్తే అంత. మేధాశ్రమలు చేసే వాళ్ళు కూడా కార్మికులే అయినా, వాళ్ళకి మరీ బొత్తిగా తెలీదు. వాళ్ళు ఇరవై నాలుగ్గంటలూ బూర్జువా సూత్రాలు వల్లెవేస్తూ, 'బూర్జువా సైడ్' అయిపోయి వుంటారు. ఇక తెలిసింది ఎవరికి?

ఆర్థిక సమస్యల మీద రాసిన ఒక పుస్తకంలో స్టాలిన్ ఒక వుదాహరణ చెప్పాడు. వస్తువులకు ధరలు నిర్ణయించే పనిని కొంత మంది ఆర్థిక వేత్తలకు అప్పగించారట. వాళ్ళు 1 టన్ను ధాన్యానికి, 1 టన్ను

రొట్టెకీ దాదాపు ఒకే ధర నిర్ణయించారట. దాన్ని చూసి 'కేంద్ర కమిటీ సభ్యులు' ఆశ్చర్య చకితులయ్యారట. "ధాన్యాన్ని రొట్టెగా మార్చడానికి కొంత ఎక్కువ శ్రమ ఖర్చవుతుంది కదా, టన్నుధాన్యం ధరకన్నా టన్ను రొట్టె ధర ఎక్కువగా వుండాలి కదా?" అని కేంద్ర కమిటీ వారు ఆ ఆర్థిక వేత్తలకి వివరించారట. (ఈ పుస్తకంలోనే స్టాలిన్ తప్పులు కూడా చెప్పాడను కోండీ, అది వేరే సంగతి.) ఒకే బరువుగల ధాన్యం ధరకన్నా పిండి ధర ఎక్కువగా వుంటుందనీ, ఆ పిండి ధర కన్నా రొట్టె ధర ఇంకా ఎక్కువగా వుంటుందనీ, 'సోషలిజం' ప్రారంభమైన దేశంలో ఆర్థిక వేత్తలకే తెలియలేదంటే, వాళ్ళు బూర్జువా లెక్కల స్థాయిలోకూడా లేరన్న మాట. ఇక వాళ్ళకి, 'సరుకుకి విలువ' ఎలా ఏర్పడుతుందో, అందులో 'అదనపు విలువ' ఎందుకు వుంటుందో, 'విలువ'అంటే ఏమిటో, 'డబ్బు' అంటే ఏమిటో-వగైరా విషయాలలో 'అ, ఆ లు' కూడా తెలీవన్న మాట! ఆర్థిక వేత్తలే ఈ స్థితిలో వున్నారంటే, సాధారణ కార్మికుల సంగతేమిటి? ఆనాడు కేంద్ర కమిటీ పెద్దలకి 'ధర' గురించి ఆ మాత్రం అయినా ఎందుకు తెలిసిందంటే, రష్యాలో కమ్యూనిస్టుపార్టీ ఏర్పడక పూర్వం నించీ కూడా మార్క్సిజాన్ని సీరియస్‌గా చదవడమూ, చర్చించడమూ, అర్థం చేసుకోవడానికి, ప్రయత్నించడమూ వుండేవి. అందుకే ఆనాటి వాళ్ళకి 'ఆర్థికశాస్త్రం' గురించీ, 'తత్వశాస్త్రం' గురించీ ఆ మాత్రమైనా తెలుసు. ఆనాడు పార్టీలో కూడా ప్రజాస్వామ్య పద్ధతులా, క్రమశిక్షణా సూత్రాల్ని పాటించడమూ వుండేవి. స్టాలిన్‌కాలం నుంచీ "సోషలిస్టు సమాజం ఏర్పడిపోయింది. వర్గాలు పోయాయి" అనే తప్పుడు అవగాహనతో, 'మార్క్సిజాన్ని' ఆచరించే ప్రయత్నాలన్నీ ఆగిపోయాయి. 'సోషలిజం' కాస్తా 'ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం'గా మారిపోయింది. పార్టీ నాయకులకీ, పెద్ద పెద్ద జీతాలు తినే మేధావులకీ, అంతకన్నా మంచి

సోషలిజం అక్కర్లేదు. వాళ్ళకి కావలసింది అంతవరకే. నిజంగా సోషలిజం కావలిసిన వాళ్ళకి దాన్ని గురించి అఆలు కూడా తెలీవు. పార్టీ నాయకులు చెప్తున్నది సోషలిజమో కాదో ప్రశ్నించే స్థితిలో వాళ్ళు లేరు. మావోనాటి చైనా కమ్యూనిస్టు పార్టీ స్టాలిన్ ధోరణి నించి బయటపడి కొంత సరైన పద్ధతులను పాటించినా, దాని వికారాలన్నీ దానికీ వున్నాయి. ఏ పుస్తకం నించైతే మార్క్సిజం నేర్చుకోవాలో అలాంటి "కాపిటల్"ని అసలు చదవనే అక్కర లేదని చైనాలో ప్రకటించారు. "ఆ పుస్తకం పెట్టుబడిదారీ ఆర్థిక శాస్త్రాన్ని చెప్పింది. మనం సోషలిజంలోకి వచ్చేశాం. మనకి కాపిటల్ అవసరమే లేదు" అని పిచ్చి పిచ్చి మాటలన్నీ మాట్లాడారు. చైనానీ, రష్యానీ యథాతథంగా వల్లెవేస్తూ, భారత కమ్యూనిస్టులు కూడా మార్క్సిజాన్ని ఏ పుస్తకాల నించీ నేర్చుకోవాలో అర్థం చేసుకోకుండా, సిద్ధాంతజ్ఞానం లేని పైపై బడాయి మాటలతో 'రక్తాలూ, పిడికిళ్ళూ' అంటూ తమ లక్ష్యమేమిటో, మార్గమేమిటో తెలీని అర్థం పర్థం లేని పోరాటాలతో కాలక్షేపాలు మొదలుపెట్టారు. ఈనాడు రష్యాలోనూ, చైనాలోనూ కూడా ఉత్పత్తికీ, పంపకాలకీ సంబంధించిన విషయాలన్నీ బూర్జువా పద్ధతుల్లోనే జరిగిపోతున్నాయి. 'అదనపు విలువ'ని లాగడమూ, దాన్ని కొన్ని సెక్షన్లు మితిమీరిన జీతాల రూపంలో తినడమూ; వర్గాలూ, లాభాలూ అన్నీ ఎప్పటిలాగే వుండడమూ; కొన్ని సెక్షన్లకి ప్రత్యేక సౌకర్యాలూ; కొందరు ఎప్పుడూ మేధాశ్రమలూ, కొందరు ఎప్పుడూ శారీరక శ్రమలూ; పార్టీలో అంతా బూర్జువా పద్ధతులూ; సమాజ నిర్వహణలో పార్టీ నాయకుల పాత్ర తప్ప కార్మికుల పాత్ర అన్నమాటే లేకపోవడమూ—అంతా పూర్తిగా బూర్జువా దేశాల్లోలాగే జరిగిపోతోంది.

'నైట్ షిఫ్ట్' విషయం తీసుకోండి. మార్క్సిజం ప్రకారం, నైట్ షిఫ్ట్ వుండకూడదు. రాత్రిళ్ళు చేసే పనికూడా పగలే చెయ్యవచ్చు.

పెట్టుబడిదారీ విధానం రాకముందు వుత్పత్తిసంస్థల్లో రాత్రిళ్ళుకూడా పనిచేసే పద్ధతి లేదు. స్థలం కలిసివస్తుందనీ, పోటీలో యంత్రాల మోడల్స్‌ని త్వరలో మార్చగలగాలంటే వాటిని వీలైనంత తొందరగా, అరగ గొట్టెయ్యాలనీ, కేవలం 'లాభ దృష్టి'తోనే నైట్ షిఫ్టులు ప్రారంభించారు. ఈ షిఫ్టుల పద్ధతి వల్ల శ్రామికుల దినచర్యలూ, కుటుంబ జీవితాలూ ఛిన్నాభిన్నం అయిపోతాయి. క్రమ శిక్షణకి అవకాశం లేని పద్ధతిలో సాగుతూ వుంటాయి. 'రాత్రి పని', శ్రామికులకు ఎంత హానికరమైనదో మార్క్స్ 'కాపిటల్'లో ఎంతో వివరంగా చెప్పాడు. అన్ని షిఫ్టుల జనమూ పగలే పనిచేసి, రాత్రుళ్ళు పనులన్నీ ఆపి వేయవచ్చు. (ఆస్పత్రుల్లాంటి అత్యవసర సంస్థలైతే తప్ప). 24 గంటల్లో 3 షిఫ్టుల ద్వారా చేసేపని అంతా, అందరూ కలిసి పగలే చెయ్యవచ్చు. దానివల్ల పనిలోనూ తేడారాదు. యంత్రాల ఖర్చులోనూ తేడారాదు. స్థలం దగ్గరే తేడా వస్తుంది. ఉపయోగించే దృష్టి వుంటే ఏ దేశంలోనైనా కావలసినంత భూమి వుంది. 'షిఫ్టుల పద్ధతి'లో వున్న తప్పుని అర్థం చేసుకుని దాన్ని తీసెయ్యవలసి వుండగా, రష్యాలోగానీ, చైనాలో గానీ ఈనాటికీ నైట్ షిఫ్టుని తీసెయ్యలేదు. పైగా రష్యాలో 4 షిఫ్టుల పద్ధతి పెట్టారు. అంటే, శ్రామికుల దినచర్యని పెట్టుబడిదారీ విధానంలో కన్నా అల్లకల్లోలం చేశారు. 1871లో పారిస్ కార్మికులు, 'పారిస్ కమ్యూన్' తిరుగుబాటులో అధికారంలోకి వచ్చిన ఒక నెల లోపలే నైట్ షిఫ్టులు తీసేశారు. (ఆ తిరుగుబాటు ఓడిపోవడంతో, పారిస్ కమ్యూను 70 రోజుల కాలంలో చేసిన అద్భుతమైన మార్పులన్నీ కూడా ఓడిపోయాయనుకోండి) నైట్ షిఫ్టుని తీసేసే పని 70 సంవత్సరాల కాలంలో కూడా రష్యా కమ్యూనిస్టులు చెయ్యలేక పోయారంటే దానికి కారణం వాళ్ళాపని చెయ్యదల్చుకోలేదు. నైట్ షిఫ్టుల్లో పనిచేసేది పార్టీ నాయకులు కారు కదా? వాళ్ళు చక్కగా తెల్లవార్లూ పక్కలెక్కి స్వప

శించగలరు కదా? రాత్రుళ్ళు పనికి పోవలసింది కార్మికులే కదా? మరి కార్మికులైనా, నాయకుల్ని ప్రశ్నించ వచ్చుకదా నైట్ షిఫ్ట్ తీసెయ్యాలని? వాళ్ళకి ఈ సంగతులన్నీ తెలిస్తే కదా? నాయకులు తప్పుడు జవాబులు చెప్పినప్పుడు, వాళ్ళతో వాదించే సిద్ధాంత జ్ఞానం వీళ్ళకి వుండాలి కదా? "కాపిటల్ పరిచయం" చదివిన కొందరు కార్మికులు నైట్ షిఫ్ట్‌ని తీసెయ్య వచ్చుననే సంగతి తెలిసి ఎంత ఆశ్చర్యపోయారో! "ఈ పుస్తకం చదివే దాకా మాకీ సంగతి తెలియనే తెలీదు. నైట్ షిఫ్టు వున్నప్పుడల్లా డ్యూటీకి వెళ్ళాలంటే ఎంత అయిష్టంగా వుంటుందో!" అన్నారు. అంటే, ఎంతో చిన్న చిన్న విషయాలు కూడా కార్మికులకు తెలీవు. అప్పటిదాకా వాళ్ళు "మరి నైట్ షిఫ్టు వుండవలసిందే కదా" అనుకుంటున్నారు. రష్యా కార్మికులు కిక్కురుమనకుండా 4 షిఫ్టుల పద్ధతిలో వున్నారంటే వాళ్ళు ఎంత దాస్యంలో వున్నారో వాళ్ళకి ఏమీ తెలీదు. దాని మీద ఏ చర్చలూ లేవు. ఆలోచనే లేదు. నైట్ షిఫ్టు కూడా తీసెయ్యకుండానే 'సోషలిజం' వచ్చేసిందంటే నమ్మే పరిస్థితుల్లో వున్నారు ప్రపంచ కార్మికులు.

సోషలిజం సాధించేశామని గొప్పలు చెప్పుకుంటూ, ఇక ఉత్పత్తి శక్తుల్ని పెంచే గొప్ప కార్యక్రమం ఒక్కటే మిగిలి వున్నట్టు 'సరకులు' అమ్ముకోడానికి మార్కెట్లు వెతుక్కుంటూ, లాభాలన్నీ కొన్ని సెక్షన్లు తింటూ, గతంలో ఎంతో కొంత చేసుకున్న మార్పులన్నిటినీ వెనక్కి తిప్పుకుంటూ, 'మార్క్సిజం' బెడద రోజు రోజుకీ ఇంకా ఇంకా వదిలించుకుంటూ, పార్టీ నాయకులూ, మేధావి సెక్షన్లూ, 'సుఖంగా' కాలం గడుపుతున్నారు. ఇదంతా 'సోషలిజం', కమ్యూనిజం' పేర్లతోనే. దీని కంతటికీ మూలం 'మార్క్సిజం' గురించి సాధారణ కార్మికులకు బోధించే పని సంపూర్ణంగా ఆగిపోవడం.

తరాలు మారిపోతున్నాయి. వెనకటి వాళ్ళకి తెలిసిన ముక్కలు కూడా ఇప్పటివాళ్ళకి తెలియవు. దొంగ కమ్యూనిస్టులకు కావలిసింది అదే. మార్క్సిజం ఈ కాలానికి పనికిరాదనీ, లాభం లేదనీ, దాన్ని సంస్కరించాలనీ కమ్యూనిస్టులు కూడా మాట్లాడ గలుగుతున్నారు. వాళ్ళని ప్రశ్నించే సిద్ధాంత జ్ఞానం జనాల దగ్గిర లేదు గనుక, కమ్యూనిస్టుపార్టీల్ని ఏనాడో ఆక్రమించేసిన బూర్జువాలు, వాళ్ళ కిష్టమైన మార్పులన్నీ చేసేసు కుంటున్నారు. ఏ సిద్ధాంతాలూ తెలీని జనం ఎప్పటి లాగే శ్రమ చేసు కుంటూ, ప్రపంచంలో అన్ని చోట్లా పట్టినట్టుగా వున్నారు. మహా అయితే వాళ్ళకి గురివున్న నాయకులు చెప్పినట్టు కొన్నిసార్లు వీధుల్లోకివచ్చి కాసిన్ని కేకలువేసి మళ్ళీ పనుల్లోకి పోతూవుంటారు.

మార్క్సిజంలో లోపం వుందో, కమ్యూనిస్టులమని చెప్పుకుంటున్న వాళ్ళలో లోపం వుందో ఇక మీరే ఆలోచించుకోండి.

* * *

కె. హేమలత, హన్మకొండ.

ప్ర : వరకట్నాల సమస్యలు ఉత్పత్తి కావడానికి కారకులు యువ కులా, లేక సాంప్రదాయమా, లేక తల్లి దండ్రుల ఆశా? చెప్పండి.

జ : అన్నీనూ. ఏదో ఒకటే అని చెప్పడానికి వీలులేదు. 'కట్నం' అనేది వేల సంవత్సరాల నుంచీ సాంప్రదాయంగా వుంది. దాని వెనుక వున్న అసలు కారణం 'ఆస్తి'. ఆ పైన స్త్రీ, పురుషుల మధ్య 'అస మానత్వం'. తల్లి దండ్రులకు ఆస్తిపంచే పిల్లలే వారసులు కదా! ఆస్తి వున్న తల్లి దండ్రులు వెనుకటి కాలం నుంచి కూడా, తమ ఆస్తిలో కొంత భాగం ఆడపిల్లలకు కూడా ఇస్తున్నారు. కాకపోతే దాన్ని 'కట్నం' రూప ములో ఇస్తున్నారు. అంటే, కట్నం అనేది ఆస్తి పంపకమే అని అర్థం. అయితే, దాన్ని ఆడపిల్లలకి పెళ్ళి సమయంలోనే ఇవ్వడమూ, అందులో

కొంత భాగం వరుడికి ఇవ్వడమూ, ఆడపిల్లలకు ఇచ్చే ఆ ఆస్తిభాగం తల్లితండ్రుల ఆస్తిలో సమాన భాగంగా లేకపోవడమూ వంటివన్నీ కూడా స్త్రీ, పురుషుల మధ్య వున్న 'అసమానత్వం' నించీ పుట్టుకొచ్చిన లక్షణాలు. ఆస్తి వున్నవాళ్ళ ద్వారా తలెత్తే సాంప్రదాయాలు ఆస్తి లేనివాళ్ళని కూడా చుట్టుకుంటాయి. మొత్తం మీద అందరికీ 'కట్నం' ' ఒక సాంప్రదాయం అయిపోయింది. ఇప్పుడు ప్రస్తుతానికి జరగవలసిన మార్పు లేమిటంటే— ఆడపిల్లలకు ఇచ్చే ఆస్తి 'కట్నం' రూపంలోగాక ఆడపిల్లలకి ఇచ్చే ఆస్థి రూపంలోనే వుండాలి. తల్లిదండ్రుల ఆస్తిలో అది సమాన వాటాగా వుండాలి. దాన్ని పెళ్ళిలోనే ఇవ్వాలనే నిబంధన వుండకూడదు. తల్లిదండ్రులు, ఆస్తిని ఎప్పుడు పంచుతారో అప్పుడే ఇస్తారు. ఈ రకం సంస్కరణలు ప్రవేశపెట్ట కలిగితే, 'కట్నం' సమస్య ప్రస్తుత తీవ్రత నించీ, ప్రస్తుత రూపం నించీ మారుతుంది. ఆస్తి వున్నంత కాలమూ ఆస్తి పంపకాల సమస్య ఎలాగూ వుంటుంది. ('స్వంత ఆస్తి" పద్ధతే పోయినప్పుడు ఆస్తి పంపకాల సమస్య కూడా వుండదు కదా?)

స్త్రీల ఆత్మగౌరవమూ, స్త్రీ పురుషుల సమానత్వమూ — అనే అంశాలు గల మార్గంలో తప్ప, ఈ రకం సమస్యల్ని ఇతర మార్గాల్లో పూర్తిగా పరిష్కరించడం సాధ్యం కాదు. ఆ ఇతర మార్గాలన్నీ అరకొర సంస్కరణలే. 'ఆత్మగౌరవం'తో నిలబడలేని స్త్రీల విషయంలో ఈ సంస్కరణల మార్గం తప్పదు. ఈ సంస్కరణలకు కూడా పట్టుదలలేని స్త్రీల విషయంలో 'కట్నం' మార్గం తప్పదు.

ఆర్. తపస్వి. ఒంగోలు,

ప్ర : కట్నాలకు తమని అమ్ముకునే నేటి యువకులలో మార్పు ఎలా వస్తుందో అర్థం కావడం లేదు. తల్లిదండ్రులకు బానిసలుగా పడి

వుండి, మాంస విక్రయం నీచమన్న భావం ఏ కోశానా లేక, షోకులు చేసుకుని తిరిగే ఈ యువకులలో మార్పు ఎలా వస్తుంది? ఒక మామూలు మనిషిగా కూడా చెయ్యగల్గే దేమీలేదా?

జ: ఇది 'ఆస్తి'తో లంకె పడివున్న సమస్య. దీన్ని ఎదుర్కొవడానికి రెండు మార్గాలు వున్నాయి. మొట్టమొదటి మార్గం స్త్రీల 'ఆత్మగౌరవం' కట్నం అడిగేవాళ్ళని పెళ్ళి చేసుకోవడానికి ఆడపిల్లలు ఒప్పుకోకూడదు. అయితే ఈ మార్గం ఎక్కువ మంది ఆడపిల్లలకు సాధ్యంకాదు. సాధ్యమైన వాళ్ళయినా దీన్ని పాటిస్తే దాని ప్రభావం మిగిలిన ఆడపిల్లల మీద వుంటుంది. రెండో మార్గం-ఆడపిల్లల తల్లిదండ్రులు, 'మా అమ్మాయికి మా ఆస్తిలో భాగం ఇస్తాం. అది కూడా మా అమ్మాయి పేరనే ఇస్తాం. కట్నంగా ఇవ్వం అనడం. ఆడపిల్లలకు చిన్నతనం నించే ఆత్మగౌరవంతో ఆలోచించడం తల్లిదండ్రులు బోధిస్తూ వుండాలి. ఆడపిల్లలూ, తల్లిదండ్రులూ కూడా 'ఒకదృష్టితో వుంటే ఎక్కువ ఫలితం వుంటుంది. 'కట్నం' సమస్యని ఎదుర్కొనే మార్గం కట్నం ఇవ్వకపోవడమే కదా? 'ఇవ్వనివాన్ని' ఎవ్వడూ తీసుకోలేదు కదా? పెళ్ళికావలసింది ఆడపిల్లలకే కాదు, మొగవాళ్ళకు మాత్రం అక్కరలేదా? ఆడపిల్లలు ఆత్మగౌరవంతో వుంటే అద్భుతంగా పరిష్కారమవుతుంది. సమస్య. ఇలాంటి సమస్యల్లో చట్టాలూ, దండనలూ పని చెయ్యవు.

* * *

ఆర్. ఉమామహేశ్వరి, పాలకొల్లు.

ప్ర: కట్నాలమీద ఆధారపడి పెళ్ళిళ్ళు జరగడం తప్పు సాంప్రదాయమని ఏకీభవిస్తాను. కాని, ఒక సందేహము వుంటున్నది. మా బంధువుల్లో జరిగిన సంఘటన. బిజినెస్ చేస్తారు. ఆస్తి వున్నవారు. కట్నం అడిగితే కనీసం 50 వేలైనా ఇచ్చేవారే. కట్నానికి ఒత్తిడి లేకుండా

అమ్మాయిని కోరి మొగపెళ్లివారు చేసుకున్నారు. తల్లిదండ్రులు అమ్మాయికి చాలా తక్కువగా ఇచ్చి సరిపెట్టారు. ఇది అన్యాయమే కదా? కట్నం ఒద్దంటే తల్లిదండ్రులు ఏమీ ఇవ్వరు. కట్నం అడిగితేనే తల్లిదండ్రులు తప్పనిసరిగా ఇస్తారనిపిస్తున్నది.

జ : అలా 'అనిపించడం' సహజమేగానీ, మనకి అనిపించేదంతా సరైందో కాదో చూసుకోవాలి. 'కట్నం అడిగితే వచ్చినట్టు ఇస్తారు. కట్నం ఒద్దంటే ఆస్తి వుండికూడా సరిగా ఇవ్వరు' అనేదే కదా సమస్య? దానికి మార్గం, ఆస్తి పంపకాలే. కట్నాల సాంప్రదాయాన్ని వ్యతిరేకించడం అంటే ఆస్తి వుండి కూడా ఆడపిల్లలకు ఆస్తి ఇవ్వనక్కరలేదని అర్థం కాదు. ఈ మార్గంలో 'సమస్య' గురించి ఆలోచించవచ్చు. 'కట్నాలు తీసుకుంటేనే మంచిదేమో' అనే అభిప్రాయానికి రానక్కరలేదు.

......విజయవాడ.

ప్ర : రాబోయే వేసవికాలంలో మా అన్న పెండ్లి జరుగుతుంది. కట్నాలు కానుకలు అన్నీ సెటిలైపోయినట్టే. ఆడబడుచు లాంఛనాల్లో నా భాగం వెయ్యిన్నూట పదహార్లు రావచ్చు. నాకు ఈ కట్నాల పద్ధతులపై చాలా అసహ్యం. నాకు, మా అక్కలకు కట్నాలు కానుకలు ఇచ్చే పెళ్ళిళ్ళు చేశారనుకోండి, నాకు రాబోయే ఆడబడుచు కట్నం నేను తీసుకోరాదను కుంటున్నాను. తీసుకోనని వదిలేస్తే, అదికూడా మా అక్కలే తీసేసు కుంటారు. అందర్నీ మార్పించే పని నావల్ల కాదనుకోండి. నాకు బడాయి అంటారు. సంఘ సంస్కర్తవయ్యావంటారు. నాకు వచ్చే భాగం నేను తీసుకుని దాన్ని పెళ్ళికుమార్తెకి (మా వదినగారికి) ఇచ్చివేద్దామనుకుంటు న్నాను. మనం మాత్రం కట్న కానుకలు ఇవ్వలేదా అంటారు, మావాళ్ళు. ఇవ్వడం మన చేతుల్లో లేదు గనుక తప్పకపోయి ఇచ్చుకున్నాము, తీసు

కోశపోవడం మన చేతుల్లోనే వుంటుంది. కదా - అంటాను నేను. నన్నేం చెయ్యమంటారో మీ సలహా కోరుతున్నాను.

జ : మీకు వచ్చేభాగం తీసుకుని దాన్ని మీ వదినగారికి ఇచ్చెయ్యా లను కున్నారు కదా ? కానీ అలా చేసినా మీరు ఆడబడుచు కట్నం తీసు కున్నట్టే అవుతుంది. మీ భాగం మీరు తీసుకున్న తర్వాత దాంతో ఏం చేశారో, దాన్ని ఎవరికి ఇచ్చారో అనవసరం. తర్వాత దాంతో ఏం చేస్తే ఏమిటి ? మీరుకూడా కట్నం తీసుకున్నట్టే లెక్క. మీ భాగాన్ని పెళ్ళికూతు రికి ఇచ్చేస్తే ఆమెకి కొంత డబ్బు వెనక్కి వస్తుంది. అది మీ దయా ధర్మాలమీద వచ్చే డబ్బు. అది ఆమెకి మంచిదే కదా అనుకోవద్దు. అది అడ్డదారి. మీ వని ఆమెకిగానీ, ఇతరులకు గానీ కట్నాలు ఇవ్వరాదనే దృష్టి కలిగించడానికేమీ వుపయోగపడదు. డబ్బు మిగలడమే గొప్ప ప్రయోజనం కాదు. ఆడబడుచు కట్నం తీసుకోరాదనే అభిప్రాయం మీకు గట్టిగావుంటే మీ భాగం మీరు వదిలెయ్యాలి, దాన్ని ఎవరు తీసుకున్నాసరే మీరుమాత్రం తీసుకోకూడదు.

* * *

జలగం శ్రీనివాసులు నాయుడు, పలమనేరు.

ప్ర : భర్తను హీనంగా చూస్తూ, కనపడ్డ స్వాముల వాళ్ళందరకు పాద నమస్కారాలు చేసే భార్యనేమనాలి ?

జ : ఏమీ అనొద్దులెండి. స్వాముల వార్లందరికీ పాదనమస్కారాలు చేస్తూవుంటే ఆమె చేతులే మురికి మురికి అవుతాయి. అది ఆమెకే నష్టం. వాదించినా వినని మనిషి అయితే ఆమె మురికికి ఆమెని వదలడమే. ఇక భర్తని హీనంగా చూడ్డం అంటారా ? దాని మీద నిక్కచ్చిగా ఉండగవల సిందే ఎవరు ఎవర్ని హీనంగా చూసినా భరించకూడదు కదా ?

* * *

డి. అబ్రహాం లింకన్, ఖమ్మం.

ప్ర : జీవితంలో సాహిత్యం ఎంత వరకు ఉపయోగపడుతుంది ?

జ : ఆ సాహిత్యంలో ఏం వుందో ఆ దృష్టిని ఇచ్చేవరకూ. ఆ సాహిత్యంలో మంచి వుంటే కొందరికీ, చెడ్డ వుంటే మరికొందరికీ, దేన్ని తీసుకునే వాళ్ళకి అది ఉపయోగపడుతుంది.

టి. నిరంజన్, సీలేరు.

ప్ర : పాఠకులు మిమ్మల్ని ఇబ్బంది పెట్టే ప్రశ్నలు అడిగితే ఎలా ఫీలవుతారు ?

జ : ఇబ్బంది పెట్టే ప్రశ్న లేమీ వుండవు. తెలియని ప్రశ్నలైతే తెలుసుకోవడానికి ప్రయత్నిస్తాను. ఇంకా తెలియనివైతే తెలియదని చెపుతాను. ఏదైనా ప్రశ్నకి పొరపాటుగా జవాబు చెప్పివుంటే, దాన్ని గ్రహించుకున్నతర్వాత 'ఫలానా ప్రశ్నకి కొంత పొరపాటుగా జవాబు చెప్పాను. దాన్ని ఫలానా రకంగా దిద్దుకోండి' అని చెపుతాను. ఇక ఇబ్బంది ఏం వుంటుంది ?

కె. సుపర్ణ, కె. శ్రీనివాస్, అనంతపురం.

ప్ర : వివాహ సమయంలో వధువు మెడలో మూడు ముళ్ళు ఎందుకు వేస్తారంట ? తెల్పగలరా ?

జ : ఒక్కముడైతే వూడిపోతుందికదండీ. రెండైతే కూడా ఏమో చెప్పలేం, దొంకె. మూడైతే గ్యారంటీ అన్నీ !

కె. రవీందర్, ములుగ్ ఘన్‌పూర్.

ప్ర : మీరు ప్రతి విషయాన్నీ ప్రతి వారినీ ప్రతి మతాన్నీ, గ్రంథాన్నీ విమర్శించడం సమంజసమా ? లోటుతో పాటు అందులో వున్న ఉన్నత విలువలను గమనించకపోవడం భావ్యమా ?

జ : మీ విమర్శ ఇంత అస్పష్టంగా వుండడంలో న్యాయంలేదు. ఏదైనా ఒకటి రెండు సంఘటనలు చెప్పండి. కేవలం లోపాలనే చెప్ప డమూ, ఉన్నత విలువల్ని గమనించకపోవడమూ నేను ఏ విషయంలో చేశానని మీకు అనిపించిందో చెప్పండి. కనీసం ఒక్క సంఘటనైనా రాయకుండా విమర్శించారు.

* * *

పి. రాము, గుంటూరు.

ప్ర : మీపై ఇన్ని విమర్శలు రావడానికి కారణం ఏమిటంటారు.

జ : ఏం విమర్శలు ? మీరు దేన్ని దృష్టిలో పెట్టుకుని అడుగు తున్నారో తెలియలేదు. 'ఫలానా విమర్శ' అని ఏదైనా వివరంగా రాసి వుంటే, చెప్పడానికి వీలయ్యేది.

* * *

జి. శ్రీనివాసులు, కల్వారాల.

ప్ర : నేటి రాజకీయ నాయకులు పూర్వపు నాయకులవలె పూజనీయు లెందుకు కాలేకపోతున్నారు ?

జ : పూర్వపు నాయకులు కూడా ప్రజలకు పూజనీయులేమీ కారు. కాకపోతే, ఇప్పటికన్నా అప్పుడు ప్రజలు ఎక్కువ భ్రమల్లో వుండేవారు. అప్పటి పరిస్థితులు కొంచెం వేరు. 'బ్రిటిష్' శత్రువు ప్రత్యక్షంగా కనబడే వాడు. అప్పటి రాజకీయ నాయకులు టోపీలూ అవీ పెట్టుకుని, అప్పుడప్పుడూ జైళ్ళల్లోకి పోయివస్తూ వుండడంవల్ల వాళ్ళు నిజంగానే స్వాతంత్ర్యం

కోసం పోరాడుతున్నట్టూ, దేశంకోసం చాలా కష్టాలు పడుతున్నట్టూ కనబడేవారు. నిజానికి వాళ్ళు పడ్డ కష్టాలన్నీ బ్రిటిష్ ధనిక వర్గాలచేతుల్లోని అధికారాన్ని భారత ధనికవర్గాల చేతుల్లోకి మార్చడానికే. అదంతా దేశం కోసమే చేస్తున్నారని ప్రజలు ఆనాడు బాగానే నమ్మారు. అప్పుడు కాంగ్రెస్ పార్టీ ఒక్కటే వుండేది కాబట్టి రాజకీయ నాయకుల కుంభకోణాలు ఇప్పుడు బయట పడ్డట్టుగా అప్పుడు బయట పడేవి కావు. కమ్యూనిస్టులు కూడా నెహ్రూని 'గొప్ప సోషలిస్టు'గానూ, గాంధీని 'గాంధీజీ'గానూ కొలిచేవారు. అప్పటి నించీ ఇప్పటికి చాలా చరిత్ర గడిచింది. చాలా పార్టీలు వెలిశాయి. ఇప్పుడు ప్రజలు చాలా చైతన్యవంతులై పోయారని చెప్పడానికి అస్సలు వీల్లేదుగానీ (చైతన్య వంతులై పోతే ఇంకా ఓట్లెందుకు వేస్తూ వుంటారు?) ఈ రాజకీయ నాయకులంటే కొంత నిర్లక్ష్యం మాత్రం వచ్చేసింది. ఈ నాయకులు ఓట్లు అడగడం తప్ప ప్రజలకేమీ చెయ్యరు అనే అభిప్రాయం ఎంతో కొంత ఏర్పడింది. ఇప్పుడు అనేక పార్టీలు వుండడం వల్ల ఒకరి కుంభకోణాలు ఒకరు బయట పెట్టేసుకుంటున్నారు. వెనుకటి నాయకుల చేష్టల్లో కొన్నయినా బయటపడి, ఆ నాయకుల మీద కూడా ఒకప్పుడు వున్న భక్తి ఇప్పుడు లేదు. ప్రజలకి ఇప్పటికి సరైన చైతన్యం లేకపోయినా, వెనుకటి స్థాయిలో మాత్రం లేరనుకోవచ్చు. ప్రజలు ఇంకా సరిగా కళ్ళు తెరిస్తే, చరిత్రలో పూజలందుకున్న వారిలో అనేకమంది ఎగిరి పోతారు.

* * *

పులిపాటి దుర్గారావు, విజయవాడ.

ప్రశ్న : వ్యక్తుల పేర్లు వ్రాసేటప్పుడు 'శ్రీ' 'గారు' రెండు వ్రాయాలా, ఒకటి చాలా? తెలుపగలరు.

జవాబు : అసలు చాలా మందికి పేర్ల చివరి 'గాడు' రాయాలి. కానీ, ఇది మరీ పనికిమాలిన మర్యాదల ప్రపంచం కదా? కాబట్టి, అలా రాయడం సాధ్యంకాదు. మర్యాదని సూచించడానికి 'గారు' చేర్చడం మాత్రమే మాట్లాడే భాషలో వుంది. 'శ్రీ' లేదు. పేరు ముందు 'శ్రీ' చదివినప్పుడల్లా 'రాజు'ల పేర్ల ముందు 'శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ'లు చేర్చినట్టుగా అనిపిస్తుంది. కాకపోతే రాజుగారైతే మూడో, ఐదో, ఏడో శ్రీలూ. ఇప్పటి పత్రికల్లో నవీన రాజులకైతే పాపం ఒక్కటే ఒక్క 'శ్రీ' ఎంత కష్టం!

* * *

ఆర్. కె. వెంకట్, బెటాగిర్.

ప్ర : పెద్దమనుషుల నెవరినైనా పేర్కొనాలంటే పేరు ముందు 'శ్రీ' పేరు చివర 'గారు' చేర్చి గౌరవిస్తాం. కాని, కమ్యూనిస్టు సిద్ధాంత కర్తలకు ఇవి చేర్చరు శ్రీ మార్క్సుగారు, శ్రీ ఎంగెల్సుగారు అని రాయరు ఎంచేత ?

జ : 'శ్రీ' అనేది ఫ్యూడల్ సాంప్రదాయం. అది చేర్చకపోవడమే మంచిది. ఇక 'గారు' సంగతి. సాధారణంగా, చాలా కాలం కిందట మరణించినవారి గురించి మాట్లాడేటప్పుడు బహువచనం వాడరు. ఏక వచనంలోనే ప్రస్తావిస్తారు. అంతేగాక చాలా ఆత్మీయత వున్న చోట సాధారణ మర్యాదలు వర్తించవు. మర్యాద సూత్రాలన్నీ నిత్యజీవితంలో వుండే కొన్ని సంబంధాల మధ్యనే వుంటాయి.

* * *

ఎం. వి. ఆర్. నటరాజన్, బాపట్ల.

ప్ర : రష్యాలో గోర్బచేవ్ ప్రవేశపెట్టిన పెరిస్త్రోయికా, గ్లాస్‌నోస్త్‌లు కమ్యూనిస్టు వ్యవస్థను స్థాపించడానికి ఏ మేరకు ఉపయోగ

పడతాయి? ఈ సంస్కరణలు అభివృద్ధికరమైనవేనా; లేక తిరోగమనాన్ని సూచిస్తాయా? వీటిని ప్రవేశపెట్టవలసిన అవసరం ఎందుకు వచ్చింది? అక్కడి పరిస్థితులేమిటి?

జ : 'పెరిస్త్రోయికా' అంటే పునర్నిర్మాణం. 'గ్లాస్‌నోస్త్' అంటే బహిరంగ చర్చ. వీటిద్వారా చెప్పేదంతా ఉత్పత్తి స్థాయిని పెంచమనే. (గోర్బచేవ్ రాసిన 'పెరిస్త్రోయికా' పుస్తకం చదవండి. తెలుగులో వుంది.) పెరిస్త్రోయికా ద్వారా జరిగే ప్రధానమైన మార్పు, 'ఉత్పత్తి సంస్థల' మీద అధికారాల్ని మేనేజర్లకి ఇచ్చెయ్యడం. అప్పటివరకూ ప్రభుత్వ అధికారం కింద వున్న సంస్థలు, ఇప్పుడు మేనేజర్ల వ్యక్తిగత సంస్థల్లాగ అవుతాయి. సంస్థ మీద పెత్తనం అంతా మేనేజరు చూసుకుంటాడు. ప్రభుత్వానికి డబ్బు కడతాడు. సంస్థ నిర్వహణలో కార్మికుల పాత్ర ఏమీ వుండదు. ఈ మార్పు జరగక ముందు కూడా సంస్థల నిర్వహణలో కార్మికుల పాత్ర ఏమీ లేదు.

'సోషలిజం' ప్రారంభమైన వెంటనే అన్ని మార్పులూ సాధ్యం కావు కాబట్టి, కొంతకాలం తర్వాతైనా, సంస్థల్ని కార్మికులే నిర్వహించే విధానం ప్రారంభం కావాలి. లేకపోతే, కార్మికులకూ ఉత్పత్తి సాధనాలకూ మధ్య 'పరాయితనం' (ఎలియనేషన్) రద్దవడం అనే పద్ధతే వుండదు. (ఇది చైనాలో 'సాంస్కృతిక విప్లవ కాలం'లో కొంచెంగా ప్రారంభమై తర్వాత రివిజనిస్టుల వల్ల ఆగిపోయింది). 'శ్రమ' చేసేది కార్మికులూ, ఆ సంస్థల్ని నిర్వహించేదేమో యజమానులో, ప్రభుత్వ అధికారులో అయితే, అలాంటి ఏ విధానమూ కార్మికులు స్వంత కోరవతోటీ, బాధ్యత తోటీ పని చెయ్యడానికి తగిన నిర్మాణ రూపంగా వుండదు. 'నిర్వహణ' కూడా, శ్రమచేసే వారి అధీనంలోనే వుండడం కాకుండా, 'ప్రభుత్వాధికారుల' అధీనంలో వుంటే, ఆ విధానంలో 'ప్రభుత్వాధికారుల రూపంలో వున్న యజమానులకు' సంతృప్తి కలిగించేటంత వుత్పత్తి ఎన్నడూ వుండదు,

వుత్పత్తి సంస్థల నిర్వహణని మేనేజర్లకి అప్పగించేస్తే, ఆ మేనేజర్లే సంస్థలకు ప్రైవేటు యజమానులుగా తయారై, కార్మికుల్ని దండించి వారిపై ప్రత్యేక షరతులు విధించి పని చేయిస్తారు కాబట్టి, ఉత్పత్తి తప్పని సరిగా పెరుగుతుంది. వుత్పత్తి స్థాయినీ, నాణ్యతనీ పెంచడం కోసమే 'పెరిస్త్రోయికా'లో ఈ మార్పు చేశారు. సంస్థలపై ప్రభుత్వాధికారులే కేంద్రీకృతంగా నిర్వహణ నెరపడం పెట్టుబడిదారీ విధానానికి ఒక రూప మైతే, సంస్థల్ని వికేంద్రీకరణలో మేనేజర్ల నిర్వహణకి అప్పజెప్పడం పెట్టుబడిదారీ విధానానికి ఇంకో రూపం మాత్రమే. మొదటి రూపంలో వున్న 'కనీసపు' సోషలిస్టు అంశ కూడా రెండో రూపంలో లేదు. సంస్థలు ప్రభుత్వాధికారం కింద వున్నప్పుడు కార్మికులకు 'ఉద్యోగ భద్రత' అయినా వుంటుంది. అప్పుడు, ఆస్తులమీద ఏ అధికారికీ వ్యక్తిగత హక్కు వుండదు. (ఆ అధికారులు, 'ప్రత్యేక సౌకర్యాల' పేరుతో లాభాలు తిన్నప్పటికీ) కానీ, సంస్థల్ని మేనేజర్లకి అప్పజెప్పే మార్పులో కొన్ని సెక్షన్లకు 'మేలు' జరుగుతుంది గానీ కార్మికులకు కనీసపు భద్రత కూడా వుండదు. కానీ, ఈ మార్పు వల్ల వుత్పత్తిలోనూ, లాభాలలోనూ తప్పని సరిగా కొంత పెరుగుదల కనపడుతుంది. వుత్పత్తి పెంచితే కార్మికులకు కూడా జీతాలూ, బోనస్‌లూ లాంటివి పెరుగుతాయి. ఈ పెరుగుదలల్ని చూస్తే, పెరిస్త్రోయికా వల్ల చాలా 'అభివృద్ధి' జరిగినట్టే లెక్కకి వస్తుంది. ఈ అభివృద్ధి ఏం అభివృద్ధి? మేనేజర్లకీ, ప్రభుత్వాధికార్లకీ లాభాలు పెంచే అభివృద్ధి. 'సోషలిస్టు సంబంధాలు' ఏర్పరచుకోవడానికి సంబంధించిన అభివృద్ధి కాదు. దీనినే 'నూతన విప్లవం'గా పెరిస్త్రోయికాలో చెబుతున్నారు. (సంస్థల్ని ప్రైవేటు వ్యక్తులకు అప్పజెప్పే ఈ రకం 'విధానం' చైనా రివిజనిస్టు పార్టీ 12 ఏళ్ళనాడే ప్రారంభించింది. దానివల్ల కొన్ని వర్గాలు లాభాలు గడిస్తూనే వున్నాయి.)

రష్యాలో లెనిన్ కాలంలో మొదటి అడుగులు ప్రారంభించిన సోషలిజం క్రమంగా స్టాలిన్ కాలం నించీ "ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం"గా మాత్రమే రూపం దాల్చింది. ఆనాటినించీ 'సోషలిస్టు సంబంధాల' ప్రశ్నని పూర్తిగా వదిలేశారు. సంస్థ నించీ ఎక్కువ లాభాలు సంపాదించే మార్గం ఏమిటీ; సంస్థల్ని, ప్రభుత్వాధికారుల ఆధీనంలో వుంచాలా, ప్రైవేటు మేనేజరు ఆధీనంలో వుంచాలా అనే విషయాల్లో మాత్రమే ఆనాటి నించీ పార్టీ నాయకులు ఘర్షణలు పడుతున్నారు. ఆ విషయంలోనే గ్రూపులు కడుతున్నారు. ఆ విషయంలోనే ఒకళ్ళని ఒకళ్ళు నిందించుకుంటున్నారు. స్టాలిన్ తర్వాత కృశ్చేవ్, బ్రెజ్నేవ్, ఆ తర్వాత చెర్నెంకోవ్, ఆండ్రపోవ్, ఇప్పుడు గోర్బచేవ్—అందరూ ఇందులో ఏదో ఒక రకానికి చెందినవాళ్ళే. ఇందులో ఎవ్వరూ మార్క్సిస్టు దృక్పథంతో నాయకత్వం వహించిన వాళ్ళు కారు. మార్క్సిజం ప్రకారం అయితే, ప్రతీ మార్పూ దోపిడీ స్వభావం గల వుత్పత్తి సంబంధాల్ని సోషలిస్టు స్వభావం గల వుత్పత్తి సంబంధాలుగా మార్చే లక్ష్యంతోనే సాగాలి. వుత్పత్తి సాధనాల మీద స్వంత ఆస్తి హక్కుని చట్టపరంగా తీసివేస్తూ, దేశ జనాభా అంతా 'శ్రమ'లోకి రావడమూ, శ్రమ చేసే అందరూ కలిసి సంస్థల్ని నిర్వహించుకోవడమూ, 'దోపిడీ శ్రమ విభజన'లో మార్పులు ప్రారంభించడమూ, క్రమంగా డబ్బు రద్దూ, వేతన శ్రమ రద్దూ, మారకాల రద్దూ, విలువ రద్దూ, ఇలా రద్దుల మార్గంలో వెనకటి అసమానత్వాలన్నిటినీ రద్దు చెయ్యగల మార్పులు చేసుకుంటూ పోయి, చివరికి 'సమానత్వాన్ని' సాధించడమూ జరగాలి. అప్పుడు, మేనేజర్లూ, కార్మికులూ వుండరు. అందరూ ఒకటే.

ఇప్పుడు వున్న 'సోషలిస్టు' దేశాల్లో, సమానత్వాన్ని సాధించడం అనే మార్క్సిస్టు ధోరణేమీ లేదు. ఏ మార్పులూ ఆ లక్ష్యంతో లేవు.

రష్యా, చైనాల్లో సోషలిజం మొక్కలు మొదట్లో మాత్రమే ఒకటీ, రెండు పువ్వులు పూశాయి. తర్వాత నించే వాటికి చీడపట్టి పూర్తిగా నాశన మయ్యాయి. ఆ తర్వాత పెరిగిందంతా ముళ్ళమొదలు మాత్రమే.

పెట్టుబడిదారీ విధానం వల్ల తలెత్తే సమస్త అవలక్షణాలూ ఈ సోషలిస్టు దేశాల్లోనూ వున్నాయి. అవినీతీ, లంచగొండితనం, అధికారుల పెత్తనం, నిరుద్యోగం, వ్యసనాలూ, నేరాలూ - లాంటి పైపై లక్షణాల కన్నా తీవ్రమైన అసమానత్వాలూ, దుర్మార్గాలూ వున్నాయి. ఇవన్నీ పెట్టుబడిదారీ విధానంవల్ల పుట్టుకొస్తున్నాయని పార్టీ పెద్దలకు తెలుసు. కానీ, ఏమీ ఎరగనట్టుగా, పెట్టుబడిదారీ దేశాల నాయకులు మాట్లాడినట్టే గప్పాలు కొట్టుకుంటూ మాట్లాడతారు. ప్రస్తుతం గోర్బచేవ్‌గారు పెరిస్త్రోయికా పుస్తకంలో "మా దేశం విస్తారమైంది. అనేక సమస్యలు పేరుకు పోయాయి" అంటూ 'లంచగొండితనం' లాంటి సమస్యని కూడా చెప్పుకొచ్చాడు. "నీ దేశం సోషలిస్టు దేశం అయితే లంచగొండితనం లాంటి సమస్య ఎలా నిలబడగలుగుతోంది?" అని కార్మికులు అడగడం లేదుకదా? ఆ 'పేరుకుపోయిన' సమస్యల్ని తగ్గించడానికేనట పెరిస్త్రోయికా సంస్కరణలు. పెట్టుబడిదారీ సంబంధాల్ని అలాగే వుంచి, దానివల్ల పుట్టుకొచ్చే సమస్యల్ని సంస్కరణలద్వారా తగ్గిస్తారట. వాళ్ళకి అసలు కావలసింది ప్రపంచ మార్కెట్‌లో పోటీపడగల స్థాయి మాత్రమే. "1990 ల నాటికి ఇంజనీరింగ్ వుత్పత్తుల విషయంలో ప్రపంచ స్థాయిని చేరుకోవడం" వారి ముఖ్య కర్తవ్యాల్లో ఒకటి. 10 సంవత్సరాల్లో అన్నిరంగాల్లోనూ ప్రపంచ స్థాయికి చేరుకోవడం వారి పూర్తి లక్ష్యం. సోషలిస్టు సంబంధాలూ, సమానత్వాన్ని సాధించడాలూ కావు - వారి లక్ష్యాలు. 'పోటీ'లో ఇతర దేశాల స్థాయికి ఎదగడమే వారి శాశ్వత ఏకైక లక్ష్యం.

రష్యా పార్టీ వారిని బాధిస్తున్న ప్రధానమైన సమస్య ఏమిటంటే, వారి జాతీయ సంపద స్థాయి పెరుగుతూ వున్నప్పటికీ ఆ 'పెరుగుదల రేటు' మందగిస్తున్నదట. ఒకనాడు అమెరికాలాంటి "పురోగామి" జాతులతో పోటీపడగలిగిన తమ దేశం ఇప్పుడు వెనకబడుతున్నదట.

"మేము పరిస్థితిని విశ్లేషించాక మొదటగా మందగిస్తున్న ఆర్థిక పెరుగుదల వున్నట్టు కనుగొన్నాం. గత పదిహేను సంవత్సరాలలో జాతీయ ఆదాయం పెరుగుదల రేట్లు సగానికి పైగా పడిపోయాయి. 80 ల ప్రారంభంనాటికి అవి ఆర్థిక ప్రతిష్టంభన స్థాయికి దగ్గరగా పడిపోయాయి. ప్రపంచంలోకెల్లా పురోగామి జాతులకు ఒకనాడు త్వరగా దగ్గర కాబోతున్న దేశం, ఒక స్థానం తర్వాత మరో స్థానాన్ని కోల్పోసాగింది. ఉత్పత్తి సామర్థ్యంలోనూ, సరకుల నాణ్యతలోనూ, శాస్త్రీయ, సాంకేతిక అభివృద్ధి లోనూ, పురోగామి సాంకేతిక పరిజ్ఞాన సృష్టిలోనూ, పురోగామి పద్ధతుల వినియోగంలోనూ వెల్తి విస్తరించసాగింది. ఇది మాకు లాభదాయకం కాదు. (పెరిస్త్రోయికా పే. 11).

ఇతర పెట్టుబడిదారీ దేశాలతో 'పోటీ'లో వెనకబడిపోతున్నామనే ధోరణే ఇదంతా. 'పోటీ'లో నిలబడ్డానికి గోర్బచేవు, లెనిన్ అనుసరించిన 'నూతన ఆర్థిక విధానాన్ని' అడ్డం పెట్టుకుంటున్నాడు. 1917 లో రష్యాలో విప్లవం వచ్చిన వెంటనే రష్యా 14 దేశాలతో యుద్ధం చెయ్యవలసి వచ్చింది. యుద్ధం 4 సంవత్సరాలు నడిచింది. పరిశ్రమలన్నీ సర్వనాశనమై పోయాయి. అలాంటి కాలంలో సోషలిస్టు రాజ్యం అనేది నిలబడాలంటే, ఉత్పత్తిని పెంచే చర్యలు తీసుకోవలసి వచ్చింది. సోషలిస్టు మార్పుల్ని ఆపి, సంస్థలపై మేనేజర్లకే ఎక్కువ అధికారాలు యివ్వడమూ, స్పెషలిస్టులకు ఎక్కువ జీతాలు ఇవ్వడమూ లాంటి మార్పులు కొన్ని చేశారు. ఆనాటి పరిస్థితుల్లో తప్పనిసరై అనుసరించిన ఈ నూతన ఆర్థిక విధానాన్ని

'పెట్టుబడి'తో పోరాటంగా కాక ఒకక్క "వెనకడుగు"గానే లెనిన్ ఎంతో స్పష్టంగా చెప్పాడు. దాన్ని వీలైనంత త్వరగా వదిలెయ్యాలని కూడా చెప్పాడు. సోషలిష్టు అధికారం ప్రారంభమైన కొత్తలో భయంకరమైన యుద్ధం తర్వాత, ఉత్పత్తి పెంచడానికి అనుసరించిన మార్గాన్ని, రష్యా పార్టీ 70 ఏళ్ళ తర్వాత ఈనాడు కూడా అనుసరిస్తూ లెనిన్ అడుగు జాడల్లో నడుస్తున్నట్టు చెప్పుకుంటోంది. "వెనకడుగు" అని లెనిన్ అన్న దాన్ని వీరు "నూతన విప్లవం" అని చెప్పుకుంటున్నారు.

"బహుశా 1921 లో లెనిన్ ప్రతిపాదించిన నూతన ఆర్థిక విధానం అనంతరం ఇంత ముఖ్యమైన, ఇంత తీవ్రమైన ఆర్థిక సంస్కరణా కార్యక్రమం ఎప్పుడూ ప్రవేశ పెట్టబడలేదు.... ... ఈ సంస్కరణ పునాదులు ఇవి : సంస్థలు, సంఘాలకు తాలూకు పెరిగిన స్వాతంత్ర్యం. అవి, స్వయం ఆర్థిక సహాయం కలవిగా, స్వయం బాధ్యత కలవిగా పరివర్తన చెందడం. అవి ఇప్పుడు సమర్థవంతమైన మేనేజిమెంటుకు, అంతిమ ఫలితాలకు పూర్తి బాధ్యత వహిస్తాయి. ఒక సమిష్టి సంస్థ యొక్క లాభాలు, దాని సమర్థతకు నేరుగా దామాషాలో వుంటాయి" (పే.29).

సంస్థకి లాభాలు దాని "సమర్థత"ని బట్టి వుంటాయట. కార్మికుల నించే ఎక్కువ శ్రమని లాగితే ఎక్కువ లాభాలూ, తక్కువ శ్రమని లాగితే తక్కువ లాభాలు! ఆ 'శ్రమ'ని లాగడంలో మేనేజరే 'స్వయం బాధ్యత' వహిస్తాడు. సంస్థలకు "పెరిగిన స్వాతంత్ర్యం" అంటే, ఆ స్వాతంత్ర్యం కార్మికులకు కాదు, మేనేజర్లకి! ఇదంతా దేనికి? "పురోగామి జాతులతో" పోటీకి! లెనిన్ కాలంలో "నూతన ఆర్థిక విధానాన్ని ప్రవేశ పెట్టుకున్నది, ఇతర దేశాలతో పోటీ కోసమా? మందగించిన పెరుగుదల రేటుని పెంచడం కోసమా?

లెనిన్ అడుగుజాడల్లోనే నడుస్తోన్నట్టు లెనిన్‌నే వల్లెవేస్తూ లెనిన్‌కి వ్యతిరేకమైన దాన్ని చేపట్టాడు గోర్బచేవ్.

సోషలిజాన్ని వదిలేసిన వాళ్ళకి ఇతర దేశాలతో పోటీపడే కార్యక్రమాలు తప్ప ఏం వుంటాయి? పైకి మాత్రం "నూతన రాజకీయ ఆలోచనా ధోరణి" అవసరమని చెపుతున్నాడు. ఆ "నూతన రాజకీయం" ఏమిటంటే, ప్రపంచమంతా 'శాంతియుతంగా' పయనించడమట. అణ్వస్త్ర రహిత, అహింసాయుత మార్గంలో ప్రజలు సంక్షేమాన్ని, సౌభాగ్యాన్నీ పొందాలట. "మేము ఈ మార్గంలో పయనిస్తున్నాం. దేశాలూ, జాతులు ఈ మార్గంలోనే పయనించ వలసిందిగా పిలుపునిస్తున్నాం" అంటున్నాడు గోర్బచేవ్. గుట్టల గుట్టల అణ్వస్త్రాయుధాలు వీపు వెనకాల పెట్టుకుని, ఇప్పటికీ ఇంకా అన్నిరకాల ఆయుధాలూ తయారుచేస్తూ చెప్తోన్న మాటలు ఇవి!

"అమెరికా వాడు ఆయుధాలు చేసేస్తోవుంటే మనం కూడా ఆ రకం ఆయుధాలు చెయ్యకపోతే వాడి నెలా ఎదుర్కోగలం?" అంటారు ఒక వేపు. "శాంతి, శాంతి, శాంతి... " అంటున్నారు ఇంకోవేపు. అణ్వాయుధాల్ని ఉపయోగిస్తే ప్రపంచం సర్వనాశన మవుతుందని మొదటి నించే తెలిసిన వాళ్ళు ఆ ఆయుధాల్ని ఎందుకు తయారుచేసి పెట్టుకున్నట్టు?

అమెరికా వాళ్ళు ఆ పని చేస్తోంటే, అది ఎంత భయంకరమైన పనో ప్రపంచ ప్రజలందరికీ ప్రచారం చేసి, అన్నిదేశాల ప్రజలూ, ముఖ్యంగా అమెరికా కార్మికులు అమెరికా చర్యని తీవ్రంగా తిరస్కరించే లాగ చెయ్యడం సరైన పద్ధతి. రష్యాలాంటి దేశం, సరైన సోషలిస్టు దృక్పథంతో ఈ ప్రచారం ప్రారంభిస్తే ఈ పనిని ఆ దేశం ఎంతో తేలిగ్గా సాధించగలిగేది. కాని, అమెరికా అణ్వాయుధాలు చేస్తోంది కాబట్టి, తను

కావా అదే రకం పనిచేస్తూ, మళ్ళీ ఇంకో వేపు శాంతియుతమైన, నూతన రాజకీయ ఆలోచనా ధోరణి కావాలట! అమెరికా గనుక తమ షరతుల ప్రకారం నిరాయుధీకరణకు అంగీకరించకపోతే,రష్యాపార్టీ వారు అమెరికాని సుఖంగా వుండనిచ్చేది మాత్రం లేదట! అంటే 'ఉపయోగించకూడని' అణ్వాయుధాల తోనే యుద్ధం చేస్తారన్నమాట!

రష్యా ఇప్పుడు అనేక కారణాల వల్ల ఆయుధాల మీద ఎక్కువ కేటాయించగలిగే పరిస్థితి లేకపోయి వుండాలి. అందుకే "ఆయుధాల ఉత్పత్తిని అందరమూ కొంత కొంత తగ్గించుకుందాం" అంటూ, గోర్బ చేవ ఇతర పెట్టుబడిదారీ దేశాలతో సంప్రతింపులు జరుపుతున్నాడు. తన హృదయం గొప్ప శాంతి కాంక్షతో పొంగి పొర్లుతున్నట్టు ఈ మిశ్రమ బూర్జువా అసలు సిసలు బూర్జువాల ముందు పోజు పెడుతున్నాడు. బ్రిటిష్ ప్రధాని థాచర్ అయితే, "యుద్ధాల్లో మాకు భద్రత కలిగించేవి మా అణ్వాయుధాలే కదా! అన్నదట! అణ్వాయుధాల్ని ఆత్మరక్షణ మార్గంగా చెప్తోన్న థాచర్ మాటలకు గోర్బచేవ ఆశ్చర్యపోతున్నాడు! రష్యా నిండా నిలవబెట్టుకున్న అణ్వాయుధాల్ని 'ఆత్మరక్షణ' కోసమేనని ఈ నాటికీ చెప్పుకుంటూనే థాచర్ మాటలకి ఆశ్చర్యం ప్రకటిస్తున్న గోర్బచేవుని చూసి, థా చ ర మ్మ ఇంకెంత ఆశ్చర్యపోవాలి! అణ్వాయుధాల మార్గంలో నిజమైన ఆత్మరక్షణ లేదని రష్యాపార్టీ నిజంగా భావిస్తూ వుంటే, ఏ నిరాయుధీకరణ సంఘాలూ లేకుండా, గతంలో బుద్ధిలేక తయారు చేసిన తమ అణ్వాయుధాలన్నిటినీ తక్షణం నాశనం చెయ్యవచ్చు. అలా చెయ్యలేక పోవడమంటే, ఆత్మరక్షణకి వాటిపై ఆధారపడుతున్నారనే కదా అర్థం? ఆ మాటే థాచరమ్మ చెప్తే "ఇది నాశనం కోరే తత్వశాస్త్రం" అని గొప్ప వ్యాఖ్యానం చేస్తున్నాడు గోర్బచేవ. నిరాయుధీకరణ సమస్యలోనే ఇంకోచోట "ఇది విచిత్ర

తర్కం. తిరోగమన తర్కం" అని విస్తుపోతున్నాడు. పెట్టుబడిదారీ తర్కం తిరోగమన తర్కంగా వున్నందుకు ఈ 'సోషలిస్టు'కి ఆశ్చర్యం! పెట్టుబడిదారీ తత్వశాస్త్రం పెట్టుబడిదారీ తత్వశాస్త్రంగా వున్నందుకు ఈయన అడుగడుగునా ఆశ్చర్య చకితుడవుతున్నాడు.

గోర్బచేవుగారి పెరిస్త్రోయికా సోషలిజం అన్ని రంగాలలోలాగే స్త్రీల విషయాల్లో కూడా పునర్నిర్మాణాలు ప్రవేశపెడుతోంది. రష్యాలో స్త్రీలు, శాస్త్ర పరిశోధనల్లోనూ, ఉత్పత్తి రంగంలోనూ, సేవల రంగం లోనూ పనులు చెయ్యడం వల్ల, గృహ నిర్వహణకు ఎక్కువ కాలం కేటాయించలేక పోతున్నారట. ఇంటి పనీ, పిల్లల పనీ నిర్వర్తిస్తూ "మంచి గృహ వాతావరణాన్ని సృష్టించే పని" వెనకటి కాలంలో లాగ చెయ్యలేకపోతున్నారట. దానివల్ల పిల్లల విషయంలోనూ, యువజనుల విషయంలోనూ చాలా సమస్యలు తలెత్తుతున్నాయనీ, కుటుంబ సంబంధాలు బలహీనపడుతున్నాయనీ పార్టీ వారు గమనించారట. "ప్రతీ విషయంలోనూ స్త్రీలను పురుషులతో సమానులుగా చెయ్యాలని పార్టీ వారు చాలా చిత్త శుద్ధితోనూ, రాజకీయంగా సరైన దృక్పథంతోనూ" ప్రయత్నించడం వల్లనే ఇలాంటి "విచిత్ర పరిస్థితి" ఏర్పడిందట. కాబట్టి, "ఇప్పుడు పెరిస్త్రోయికా క్రమంలో ఈ లోపాన్ని అధిగమించడానికి" ప్రయత్నిస్తు న్నారట. మహిళలు, చక్కగా గృహ విధులు నిర్వర్తించుకోవడం అనే, మహిళలకు మాత్రమే ప్రత్యేకత "మహిళా కర్తవ్యానికి తిరిగి వెళ్ళడానికి" ఎలాంటి మార్పులు అవసరమో వారంతా తీవ్రంగా చర్చలు జరుపుతున్నా రట. రష్యా సమాజంలో యువతీ యువకులు నైతిక విలువలు లేకుండా వ్యసనపరులై పోవడానికీ, కుటుంబ సంబంధాలు నెగిటివ్‌గా తయారవడా నికీ కారణం వెనకటి పునాది స్వభావం మారకపోవడంలోగాక, స్త్రీలు ఇళ్ళల్లోంచి బయటికి వచ్చి పురుషులు చేసే రకపు పనులన్నీ చెయ్యడం

లోనే వున్నట్టు 'నూతన ఆలోచన' ప్రారంభించారు. వీరేమో పెట్టుబడిదారీ సమాజాలలో లాగానే సిగరెట్లూ, మద్యాలూ, ఆయుధాలూ, ఇంకా నానా రకాల చెత్తా ఉత్పత్తిచేసి లాభాలుసంపాదిస్తూ వుంటారు. బెత్తెడు బెత్తెడు గోచీలతో శరీర పోటీలూ, అందాల పోటీలూ నిర్వహిస్తూ వుంటారు. సమాజంలో ప్రతీ అంగుళాన్నీ దోపిడీ దుర్గంధంతో కుళ్ళబెడుతూవుంటారు. యువజనులు మాత్రం ఆరోగ్యకరంగా, నీతిపరులుగా, సచ్ఛీలురుగా, ఉత్తమోత్తములుగా తయారవుతూ వుండాలి. కుటుంబాలన్నీ సుఖశాంతులతో విరాజిల్లుతూ వుండాలి! స్త్రీలు ఇంటి బయట ఎక్కువ కాలం వుండక్కరలేని పనులు మాత్రమే చేసి, ఇళ్ళల్లోనే ఎక్కువ కాలం గడుపుతూ, "మంచి గృహ వాతావరణాన్ని సృష్టిస్తూ" వుంటే, పురుషులు మాత్రం లేబరేటరీలలోనూ, లైబ్రరీలలోనూ గడుపుతూ శాస్త్ర పరిశోధనలూ, సృజనాత్మక పరిశ్రమలూ చూస్తూ వుంటారు. పిల్లల పెంపకాలూ, ఇంటి పనులూ తల్లులే కాక తండ్రులు కూడా సమాన బాధ్యతతో చేసుకోవడమూ తల్లిదండ్రులకు ఆందోళన లేకుండా, పిల్లలు బయట వున్నప్పుడు బాధ్యతతో చూసుకునే సామాజిక సంస్థల్ని అభివృద్ధి పరచుకోవడమూ జరిగితే, స్త్రీల శాస్త్ర పరిశోధనలు సమాజానికి సమస్యలవుతాయా? తల్లి లేబరేటరీలో కొంత ఎక్కువసేపు వుండిపోతే, తండ్రి ఇంటికి వచ్చి పిల్లల పనులూ, ఇంటి పనులూ చేసుకోకూడదా? ఆ పిల్లలూ, ఆ ఇల్లూ పురుషుడివి కూడా కావా? 'మార్క్సిజం'లో చెప్పే 'వెనకటి శ్రమ విభజన'లో మార్పులు చేసుకోవడానికి రష్యా పార్టీ పెద్దలు కంగారెత్తుతున్నారు. స్త్రీ పురుషుల్ని "సమానుల్ని చెయ్యాలనే" ప్రయత్నంలోనించే విచిత్రమైన సమస్యలు పుట్టుకొచ్చాయట! కాబట్టి, స్త్రీ పురుషులు సమానులయ్యే ప్రమాదాన్ని తప్పించడానికి పెరిస్త్రోయికాద్వారా నూతన విప్లవ మార్గంలో ప్రయత్నాలు చేస్తున్నారు.

గోర్బచేవుగారి ధర్మపత్ని బూర్జువా నాయకుల ధర్మపత్నులలాగే రకరకాల ముస్తాబులతో, చెవులకు లోలాకులా, మెళ్ళో హారాలూ ధరించి భర్త వెనకబడి దేశాలన్నీ తిరుగుతూ భర్తగారు బూర్జువా నాయకులతో 'రాజకీయ చర్చల్లో తలమునకలౌతూ' వుంటే, తను మాత్రం ఆ రాజకీయాల్లో తలదూర్చకుండా, బూర్జువా నాయకుల భార్యలతో కలిసి విహారాలు చేస్తూ, "డిస్కో డాన్సర్" లాంటి సినిమాలు చూస్తూ కాలక్షేపం చేస్తూ వుంటుంది కదా? రష్యన్ స్త్రీలందరూ అలాగే రాజకీయాల జోలికీ, ఎట్టి పరిశోధనల జోలికీ పోకుండా గృహ విధులు నిర్వర్తించుకుంటూ అలంకరణల్లోనూ, విహారాల్లోనూ గోర్బచేవు భార్యగార్ని ఆదర్శంగా తీసుకుంటే, స్త్రీలకు అదే సోషలిజమనీ, అప్పుడే కుటుంబ సంబంధాలు గట్టిపడతాయనీ గోర్బచేవు భావిస్తున్నట్టున్నాడు.

పెరిస్త్రోయికాలో వున్న పునర్నిర్మాణం అంతా ఈ రకమైందే. ఈ పుస్తకాన్ని గోర్బచేవ్ అమెరికా ప్రచురణ కర్తలు రాయమంటే రాశాడట! "....ఈ పుస్తకం రచించాలన్న అమెరికన్ ప్రచురణకర్తల కోరికను నేను ఆమోదించాను" అని మొదట్లో చెప్పుకున్నాడు. 'పెరిస్త్రోయికా' మీద పుస్తకం రాయమని అమెరికా ప్రచురణకర్తలు కోరారంటే, ఇక పెరిస్త్రోయికాలో వున్న నూతన విప్లవం ఏమిటో తేలిగ్గానే గ్రహించవచ్చు.

ఇక 'గ్లాస్‌నోస్త్' అంటారా? వెనకటివాళ్ళు చాలా తప్పులు చేసినప్పుడు తర్వాత కాలంవాళ్ళు వాటిని మంచిగాగానీ, చెడ్డగాగానీ తప్పకుండా

స్టాలిన్ చేయించుకున్న 'వ్యక్తిపూజ'ని తర్వాత వాళ్ళు విమర్శించారంటే విమర్శించరా? నిజమైన మార్క్సిస్టులూ 'వ్యక్తిపూజ'ని విమర్శిస్తారు. స్టాలిన్‌ని ఆ పంకతో తప్పుపట్టి దబ్బుకున్నవాళ్ళు దాన్ని విమర్శి

స్తారు. ఏ తప్పు సంగతైనా అంతే. "కార్మిక నియంతృత్వం" అనేదాన్ని సరిగా అర్థం చేసుకోకుండా స్టాలిన్ నాటినించే దాన్ని "పార్టీ నిరంకుశత్వం"గా మార్చివేశారు. స్టాలిన్ పద్ధతులనే మార్క్సిజంగా భావించిన వాళ్ళెందరో మార్క్సిజంమీద వ్యతిరేకత పెంచుకున్నారు. నోరెత్తకుండా పడివుండడమే మార్క్సిజం అయితే, అలాంటి మార్క్సిజం నిరంకుశ ప్రభువులకు తప్ప మిగతావాళ్ళకి అక్కరలేదు. కార్మికవర్గ పరిపాలన ప్రారంభమైన తర్వాత కొన్ని విషయాలకు 'స్వేచ్ఛని తీసి వెయ్యడం' తప్పనిసరిగా జరగవలసిందే. ప్రైవేటు కంపెనీలు పెట్టి దోపిడీలు చెయ్యడానికీ, శ్రమలోకి రాకుండా బూర్జువా విలాస జీవితాలు గడపడానికీ, దోపిడీ పద్ధతుల్ని కొనసాగించడానికీ స్వేచ్ఛని తీసివెయ్యవలసిందే. లేకపోతే అది "కార్మికవర్గ పరిపాలన" కానేకాదు. దోపిడి కొనసాగింపుమీద స్వేచ్ఛని తీసివెయ్యాలిగానీ, నిత్య జీవితంలో జరగవలసిన చర్చలకీ; ప్రజాస్వామ్య హక్కులకీ, పార్టీనీ, నాయకుల్నీ, అధికారుల్నీ ప్రశ్నించి విమర్శించడానికీ స్వేచ్ఛని తీసివేస్తే, అది సమాజాన్ని విప్లవకరంగా మార్చుకోవలసిన వారి నోళ్ళనీ, మెదళ్ళనీ కట్టివెయ్యడమే. స్టాలిన్ కాలం నించే 'కార్మికవర్గ నియంతృత్వం' పేరుతో ఈ అధికార నిరంకుశత్వమే ప్రారంభమైంది. సోషలిజం పేరుతో సోషలిజం కానిదాన్ని రుద్దితే దాని ఫలితాలు అనుభవించేవాళ్ళు రకరకాల సమస్యల్లో పడిపోతారు. సాహసించి ప్రశ్నించేవాళ్ళు జైళ్ళ పాలవుతారు "సోషలిజం అంటే ఇదా?" అని నిర్ఘాంతపోవడమూ, క్రమంగా దానిపై విముఖత్వమూ ప్రారంభిస్తారు.

అలాంటి జనాభా అంతా తప్పనిసరిగా తెలిసిగాని, తెలియకగానీ: స్వంత చొరవతోగానీ, ఆ మాత్రపు సోషలిజాన్ని కూడా సహించలేని శత్రువర్గాల ప్రోత్సాహాలతోగానీ 'ఈ సోషలిజం మా కొద్దు' అనే తిరస్కారానికే వస్తారు. వాళ్ళు, 'వొద్దు' అంటున్నది అప్పటివరకూ వాళ్ళు చూసిన

సోషలిజాన్నేగాని, వాళ్ళకి ఇంకా తెలియని నిజమైన సోషలిజాన్ని కాదు. మంచి సోషలిజం సంగతి వాళ్ళకేమీ తెలీదు. మంచి సోషలిజంలో "దోపిడీకి తప్ప" అన్నిటికీ స్వేచ్ఛ వుంటుంది. దోపిడిమీదగాక, శ్రమ మీద జీవించ దల్చుకున్న మనుషులకి దోపిడీమీద కత్తికట్టే సోషలిజంతో శత్రుత్వం వుండదు. 'రెండూ సరైన విషయాలైనప్పుడు వాటి మధ్య ఘర్షణ వుండదు. రెండూ తప్పులైనప్పుడు గానీ, ఒకటి రైటూ, ఒకటి తప్పు అయినప్పుడు గానీ ఘర్షణలు వుంటాయి. ఇప్పుడు, 'సోషలిస్టు' దేశాల్లో ఆ సోష లిజానికి వ్యతిరేకంగా జరుగుతోన్న సంఘటనలన్నీ మంచి సంఘటనలే. ఆ వ్యతిరేకించే వాళ్ళందరూ శ్రామికవర్గ ప్రజలూ, మంచి సోషలిజం కావాలని కోరుతున్నవారూ కాకపోయినా, తప్పుడు సోషలిజంమీద ఏ రకమైన వ్యతిరేకత అయినా మంచిదే. ఆ సోషలిజాల నిజస్వరూపాలు ఎంత త్వరగా బయటపడితే అంత మంచిది. కానీ, ఆ పని ఇంకా కావలసినంత తొందరగా జరగడం లేదు.

ఏనాటినించో పార్టీ నిరంకుశత్వాన్నే మార్క్సిజంగా చలామణీ చేస్తూ వచ్చారు కాబట్టి, ఇప్పుడు "బహిరంగ చర్చ" (గ్లాస్‌నోస్త్) అనే విషయం తప్పనిసరిగా మంచి విషయంగానే వుంటుంది. దానివల్ల కొన్ని మంచి ఫలితాలు కూడా కనబడతాయి. అయితే, ఈ 'బహిరంగ చర్చల్ని' ప్రవేశ పెట్టడంలో నాయకుల దృష్టి అంతా వేరు. ప్రభుత్వ పెట్టుబడిదారీ విధా నాన్ని ప్రైవేటు పెట్టుబడిదారీగా మార్చడం కోసం బహిరంగ చర్చలు జరగాలనీ, చర్చల ధోరణి ఆ పద్ధతిలో వుండాలనీ మాత్రమే ఈ సంస్కర్తల ఆశ, అంతేగానీ 'చర్చ' అనగానే దేన్నయినా చర్చించవచ్చు నని కాదు. వీరి పార్టీలోగానీ, వీరి సిద్ధాంతాల్లోగానీ సోషలిజం అనేదేమీ లేదనీ, పార్టీ పెద్దలతోసహా దేశంలో ఇంకా అనేక వర్గాలు, శ్రామిక వర్గాల 'అదనపు విలువ' మీదే సుఖభోగాలనుభవిస్తున్నారనీ, సమసమాజ

లక్ష్యానికి వీరంతా ఎప్పుడో నీళ్ళు తిప్పేశారని—ఎవరైనా వీరిని విమర్శిస్తూ, మార్క్సిజాన్ని ప్రతిపాదిస్తే, ఆ విమర్శలన్నిటి మీదా బహిరంగ చర్చలకు వీరు సిద్ధమేనా ? గ్లాస్‌నోస్తుల్లో అలాంటిదేమీ జరగదు. వారి ధోరణికి అనుకూలమైనంత వరకే చర్చలైనా, స్వేచ్ఛలైనా.

ఈ సంస్కరణల్లో వర్గాలూ, వర్గ పోరాటాలు అనే మాటలేమీ లేవు. అణ్వస్త్రాలు పేలితే ప్రపంచమే నాశనమైపోతుంది. కాబట్టి, ఇక వర్గ పోరాటం అనే మాట ఎత్తడానికి వీలులేదు.

కానీ, మాటల్లో మాత్రం వీరుకూడా తమ సోషలిజం కమ్యూనిజంగా మారుతుందనే చెపుతారు. చేతల్లో దాన్ని వెనక్కి తిప్పుతూ !

* * *

ఎం. పద్మావతి, వైరా.

ప్ర : ఇదివరకటికన్నా స్త్రీలు అన్ని రంగాలలో ఎంతో అభివృద్ధి సాధించారు. మగవారికి ఏ మాత్రం తీసిపోరని నిరూపించారు. అయినా నేడు కూడా విద్యార్థినులు, ఉద్యోగినులు మగవాళ్ళ అల్లరికు, సాటి ఆడవారి విమర్శలకు గురి అవుతూనే వున్నారు. తిరగబడలేక తలవంచుకుని వెళ్ళిపోతున్నారు. ఉద్యోగంచేసే స్త్రీలలో కూడా ఆర్థిక స్వాతంత్ర్యం లేని కొంత మందిని నేను చూశాను. ఏ పని చెయ్యాలన్నా తల్లిదండ్రుల అనుమతికో, భర్తల ఆజ్ఞలకో ఎదురు చూసే ఎంతోమంది స్త్రీలున్నారు నేటి సమాజంలో. వనితాభ్యుదయం పుస్తకాలకీ, సినిమాలకీ మాత్రమే పరిమితమా ? మగవాడి దురహంకారానికి బలవుతూ కూడా ఎదిరించలేని స్త్రీలు బలహీనులా, లేక నిర్లిప్త స్వభావానికి అలవాటుపడిపోయారా ?

జ : అలవాటే అది. 'బానిసతనం' అలవాటైపోయింది. చరిత్రలో బానిసలు తిరగబడ్డారు కదా ? ఈ బానిసలుకూడా ఎప్పటికో తిరగబడతారు. నిజానికి, ఉద్యోగాలు చేసేవాళ్ళయినా, చెయ్యనివాళ్ళయినా తల్లిదండ్రు

లకూ, భర్తలకూ అంత లొంగి పడి వుండనక్కరలేదు. అవసరం వచ్చి నప్పుడల్లా సుబ్బరంగా ఎదురు ప్రశ్నిస్తూనే వుండవచ్చు. అలా చెయ్యలేక పోతున్నారంటే ఈ చదువుల వల్లా, ఉద్యోగాలవల్లా కొంత 'డబ్బు' రావడం తప్ప ఆత్మకి ఏమీ శక్తి రావడం లేదు. "స్త్రీలు అన్నిరంగాల్లో ఎంతో అభివృద్ధి సాధించారు. మగవారికి తీసిపోమని నిరూపించారు" లాంటి మాటలు పత్రికల్లోనూ, రేడియోల్లోనూ, పదే పదే ప్రచారమయ్యే మాటలు. వాటిలో ఏమీ నిజం లేదు. మొగవాళ్ళు మాత్రం 'అభివృద్ధి' చెంది వున్నారా ? 'స్వేచ్ఛ'ని ఎరిగిన పురుషుడు స్త్రీ స్వేచ్ఛని హరిస్తాడా ? 'అభివృద్ధి' అనే దానికి ఈ సమాజం ఇచ్చుకునే నిర్వచనమే తప్పు. వనితా భ్యుదయం, సినిమాలకీ, పుస్తకాలకీ మాత్రమే పరిమితమా అన్నారు కదా ? వాటిల్లో మాత్రం 'అభ్యుదయం' ఎక్కడ వుంది ?

* * *

టి. ఉమ, రాజపురం.

ప్ర : హిందూమతంలో దేవుడు దుష్టులను శిక్షిస్తానంటాడు. ముస్లిమ్ మతంలో దేవుడు దుష్టులను ఖతం చెయ్యాలంటాడు. క్రిష్టియన్ మతంలో దేవుడు పాపులను క్షమిస్తానంటాడు. అలాంటప్పుడు అన్ని మతాల సారం ఒక్కటే ఎలా అవుతుంది?

జ : దుష్టుల్నీ, పాపుల్నీ శిక్షిస్తారా, క్షమిస్తారా అనేది తర్వాత సంగతి. మొదట ఏ మతం ప్రకారమైనా దుష్టులూ, పాపులూ వుంటా రన్న మాట! మనుషుల్లో కొందరు దుష్టులూ, పాపులూ ఎందుకు అవుతారు అనే ప్రశ్నకి మతాలన్నీ ఒకే జవాబు ఇస్తాయి. 'మనుషుల్లో కొందరు పుట్టుకతోనే చెడ్డవాళ్ళుగా పుడతారు' అని! మనుషుల్ని చెడ్డవాళ్ళుగా చేసే పరిస్థితుల్ని మతాలు అర్థం చేసుకోవు. ఈ విషయంలో మతాలన్నీ ఒకటే.

మనుషుల్ని చెడ్డవాళ్ళుగా తయారు చేసే పరిస్థితుల్ని సమర్థిస్తూ, వాళ్ళని తర్వాత శిక్షిస్తే ఏమిటి, క్షమిస్తే ఏమిటి? ఆ తేడా లెక్కలోకి రాదు.

* * *

సి. బాబూరావు, రాయగడ.

ప్ర : నా స్నేహితులు ముగ్గురు. ఒకరు ఎం. ఎ; ఇద్దరు బి.కాం. చేశారు. ఎవరికీ ఇప్పటి వరకు ఉద్యోగాలు రాలేదు. ఈ చదువులు చదివి ఏం ప్రయోజనం అని వాళ్ళు బాధ పడని రోజు లేదు. దానిపై నాకుతోచిన సలహా నేను ఇచ్చాను. సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ స్కీముపై లోను అప్లయ్ చేసి వ్యాపారం చేయాలని. కాని వాళ్ళు వ్యాపారం చెయ్యడానికి అనుభవం అసలు లేదు. ఒకవేళ ఏదైనా చేసినా 25 వేలు ఏ మాత్రం అని అంటున్నారు. దీనిపై మీ అభిప్రాయం చెప్పగలరు.

జ : ఎవరి 'పని' వారు వెతుక్కోవలసిన అవసరం లేకుండా ప్రతి మనిషికీ 'పని' కేటాయించే విధానం సమాజంలో వుండడం కరక్టయిన పద్ధతి. కానీ, అది ఇప్పుడు సాధ్యం కాదు. కాబట్టి, ఉన్న పరిస్థితుల్లోనే ఎవరి ప్రయత్నాలు వాళ్ళు చేసుకోవాలి. 'వ్యాపారానికి అనుభవం లేదు' అంటే, 'వుద్యోగానికి మాత్రం అనుభవం వుందా' అనే ప్రశ్న వస్తుంది. ఇప్పుడు వ్యాపారాలు చేస్తున్న వాళ్ళందరూ మొదట్లోనే అనుభవాలు వున్నవాళ్ళా? "25 వేలు ఏ మాత్రం" అంటే "అసలే అనుభవం లేని మనుషులు అంతకన్నా ఎక్కువ డబ్బుతో దిగడ మెందుకు" అనే ప్రశ్న వస్తుంది. ముగ్గురూ స్నేహితులే కాబట్టి, ముగ్గురూ లోన్లు తీసుకొని, ముగ్గురూ కలిసి స్వయంగా పనులు చేసే పద్ధతిమీద ఏదన్నా పని ప్రారంభించగలరేమో ఆలోచించడం మంచిది. వీలైనంత వరకూ ఉద్యోగాల కోసం వెతుక్కుని వీలుకాని పక్షంలో టైమంతా వృధాగా పాడుచేసుకోకుండా సమిష్టిగా ఏదో ఒక పని ఏర్పరచుకోవడం మంచిది. పెట్టుబడిదారీ

సమాజాల్లో తప్పని సరిగా పుట్టుకువచ్చే సమస్యలో 'నిరుద్యోగం' ఒక ప్రధాన సమస్య. దాన్ని తక్కువగా అంచనా వేయకూడదు. ఇతరుల మీద ఆధారపడ కుండా జీవించడం ముఖ్యం.

* * *

సి. వీరభద్రయ్య, అనకాపల్లి.

ప్రశ్న : దంతాల కోసం ఏనుగులను క్రూరంగా చంపుతున్నారని ఈ మధ్య కొన్ని పేపర్లలో చదివాను. నిన్న మొన్నటివరకు నాకు రెండు దంతపు గుండీలు వుండేవి. ఆ గుండీలిక వాడడానికి మనస్కరించక భూమిలో పాతి పెట్టేశాను. పొరపాటు చేశానంటారా ?

జ : లేదు, చాలా మంచిపని చేశారు. మంచి మనసుతో అప్పటి వరకూ చేసిన పొరపాటు తెలుసుకున్నారు. 'డబ్బు' సంపాదించడంకోసం మనుషుల్ని ఎత్తుకుపోయి క్రూరంగా వుపయోగించే ప్రపంచంలో జంతువుల బాధ ఒక లెక్కా?

జూపల్లి సత్యప్రభ, తాడేపల్లిగూడెం.

ప్ర : కొన్ని నవలలు చదువుతుంటే ఎంత కోపంవస్తుందో. చాలా విమర్శిస్తూ రాయాలని వుంటుంది. ఏం లాభమని ఊరుకుంటాను. విమర్శించే ఉత్తరాలు ఎందుకు వెయ్యరు?

జవాబు : ఎందుకు వెయ్యరో నేను చెప్పలేను గానీ ఉత్తరం వేస్తారా, వెయ్యరా అని చూడకుండా మీ అభిప్రాయాలు మీరు చెప్పాలి. 'విమర్శించే ఉత్తరాలు వెయ్యరు కదా' అని విమర్శించదల్చుకున్న వాళ్ళందరూ తమ అభిప్రాయాలు రాయకపోతే, పొగిడేవాళ్ళ వుత్తరాలే పత్రిక్కి అందుతాయి. అన్నీ అలాంటి ఉత్తరాలే అందితే, వాళ్ళే మను కుంటారు? 'ఈ నవలలన్నీ పాఠకులందరికీ బాగా నచ్చుతున్నాయి' అన్న

కుంటారు. నచ్చని వాళ్ళు, నచ్చలేదని రాయకపోతే రచయితలకీ, పత్రిక లకీ నిజా నిజాలు అందవు. మీ ఉత్తరాలు అచ్చు కాకపోతే ఏం, మీ అభి ప్రాయాలు ఎవరికి తెలియాలో వాళ్ళకు తెలిస్తే చాలదా?

*     *     *

వెంగళదాసు, పురుషోత్తం, ఎలగేడ్.

ప్ర : హిందువులలో చిన్న కులాల్ని (ఎస్. సి., ఎస్. టి., లను) ఎందుకు దగ్గరకు తీసుకోరు?

జ : 'చిన్న' కులాలు కాబట్టి. జవాబు మీ ప్రశ్నలోనే వుంది. అసలు 'కులం' అనేదాన్ని ఒప్పుకున్న తర్వాత, అందులో కొన్ని 'పెద్ద వనీ', కొన్ని 'చిన్నవనీ' ఒప్పుకోవలసిందే కదా? కాబట్టి 'చిన్న కులాల్ని పెద్ద కులాలు ఎందుకు దగ్గరికి తీసుకోవు' అని కాదు ఆలోచించవలసింది. మనుషుల్లో కులాలేమిటి? ఈ తేడాలేమిటి' అని ఆలోచించండి. 'చిన్న' కులాలలో మెజారిటీ సంఖ్య, 'శారీరక శ్రమలు' చేసే పరిస్థితుల్లోనే వుంటారు. 'పెద్ద' కులాలలో ఏ శ్రమా చెయ్యకుండా లాభాల మీదా, వడ్డీల మీదా, కౌళ్ళ మీద జీవించే సెక్షన్లని అలా వుంచగా, శ్రమ చేసే వారిలో మెజారిటీ సంఖ్య 'మేధాశ్రమలు' చేసే పరిస్థితుల్లో వుంటారు. 'శ్రమ చెయ్యని వాళ్ళు', శ్రమ చేసే వాళ్ళని 'దగ్గిరికి' తీసుకోరు. మేధాశ్రమలు చేసే వాళ్ళు శారీరక శ్రమలు చేసేవాళ్ళని 'దగ్గరికి' తీసుకోరు. ఈ పరి స్థితులన్నీ ఇలాగే వుండగా చిన్న కులాలూ, పెద్ద కులాలూ 'దగ్గిరికి చేరడం' అనే సమస్యేలేదు.

1) అందరూ శ్రమ చెయ్యడమూ, 2) ప్రతి మనిషీ కొన్ని మేధా శ్రమలూ, కొన్ని శారీరక శ్రమలూ చెయ్యడమూ—అనే మార్పుల వల్ల మాత్రమే కులాల సమస్యగానీ, ఇతర తేడాల సమస్యలుగానీ అంతమయ్యే మార్గం ఏర్పడుతుంది. 'చిన్న కులాల పోరాటం' అంటూ 'మూలాన్ని'

గ్రహించుకొని, దేవాలయ ప్రవేశ పోరాటాల రకపు పైపై పోరాటాలు ఎన్ని వందల సార్లు చేసినా అవన్నీ కాలక్షేపానికి తప్ప ఎందుకూ పనికి రావు. 'శ్రమ' అనే అంశాన్ని వదిలేసి చూస్తే, ఏ సమస్యలూ అర్థం కావు. అలాగే కులాల సమస్య కూడా. తమని పెద్ద కులాలు దగ్గరికి తీసుకోవాలని చిన్న కులాలు యాచించడం ఎందుకు, పోరాట మార్గం వుండగా?

కె. వి. కుమార్, కడప.

ప్ర : ఏ ప్రేమ కథ తీసుకున్నా కొన్ని కారణాల వల్ల విడిపోవడము, అందులో ప్రతీసారి (ప్రతీ కథలో) మగాడు మజ్నూ కావడం, ఆ ప్రియురాలు లక్షణంగా మరొకరి భార్య కావడం జరుగుతుంది. ఆడవారు ఆ ప్రేమ అంత త్వరగా ఎలా మరచిపోగలరు? ఆ మంత్రం నాకు ఉపదేశిస్తారని ఆశిస్తున్నాను.

జ : ఆ మంత్రం నాకు తెలుసని మీ అభిప్రాయం లాగుంది. సినిమాలు బాగా చూస్తారనుకుంటాను. సినిమా కథలు అలాగే వుంటాయి తల్లకిందులుగా. అసలు వాస్తవంలో అయితే మొగవాళ్ళే చాలా తొందరగా ప్రేమని మరిచిపోతారు. పెళ్ళికి ముందు కాకపోతే, పెళ్ళయిన తర్వాతైనా ప్రేమని మరిచిపోతారు. కొన్నాళ్ళకి వారి హృదయంలో కొత్త కొత్త ప్రేమలు పుట్టుకొస్తాయి. గతంలో తన ఇష్టంతోనే, ప్రేమతోనే, పెళ్ళిచేసుకున్న భార్యలే భర్తల ఎమోషనల్ ప్రేమల్ని అందుకోలేని వాళ్ళవుతారు. ఇప్పుడు రెండో భార్యల్ని చేసుకోవడం పురుషుల్లో ఎంత ఎక్కువైపోయిందో చూడడం లేదా? స్త్రీలే ప్రేమల్ని మరిచిపోయిన సంఘటనలే మీరు ఎక్కువగా చూసి వుండవచ్చు. కానీ, ఎక్కువ సందర్భాల్లో నిజం అది కాదు.

ఎం. వినోద్ కుమార్, వడమలపేట.

ప్ర : ప్రస్తుతం మనిషి ఏ విధంగా తన స్థితిగతుల్ని పెంచుకోవాలో సూచించండి. నా గమ్యం ఏమిటి? నా వయస్సు 20 సంవత్సరాలు.

జ : స్థితిగతుల్ని పెంచుకోవడం అంటే, ఆస్తి సంపాదించడం అనా? పెద్ద ఉద్యోగం సంపాదించడం అనా? కీర్తి సంపాదించడం అనా? ఈ అన్నిటికీ మూలం 'డబ్బు' సంపాదించడమే. సాధారణ ఉద్యోగాలు చేస్తూ ఎక్కువ డబ్బు సంపాదించడం సాధ్యం కాదు. కాబట్టి 'స్థితి గతులు పెంచుకోవడం' అనే మాట వదిలేసి, సాధారణంగా జీవించే దానికు మెరుగు మార్గం చూసుకోండి.

* * *

గాదె లక్ష్మమ్మ, బరంపురం.

ప్ర : స్త్రీలకు ఉద్యోగావకాశాలలో 30 శాతం ప్రభుత్వం ప్రత్యేకించింది. అయితే ప్రభుత్వం 44 సంవత్సరాల తర్వాత, సగం జనాభాగా వున్న స్త్రీల విషయం ఇప్పుడు పట్టించుకోవడం వింతగా వుంది. ఇది మన ప్రగతి వేగమా?

జ : తర్వాత జరిగిన సంగతి మీకు తెలిదన్నమాట. స్త్రీలకు ఆ 30 శాతం రిజర్వేషన్ల ప్రతిపాదన చెల్లరాదని ఎవరో హైకోర్టులో రిట్ వేస్తే "అవును నిజమే, చెల్లరాదు, ఇది రాజ్యాంగానికి విరుద్ధం" అని ఆ ప్రతిపాదనని హైకోర్టు కొట్టివేసింది. అసలు ఈ రిజర్వేషన్లని 'ప్రగతి' అని నిర్ధారించ కూడదు. తాత్కాలికంగా మహా తక్కువ మందికి కొంత ఉపయోగం ఇవి. నిరుపేద వర్గాల కోసం రిజర్వేషన్లు వుండవచ్చు. అలాగే, నిరుపేద వర్గాల స్త్రీలకు ప్రత్యేక రిజర్వేషన్లు వుండవచ్చు. ఒక 'చిన్న' కులం వ్యక్తి రిజర్వేషన్ల ద్వారా కలక్టరో, ప్రొఫెసరో అయిన తర్వాత,

ఆ వ్యక్తి పిల్లలకు ఇంకా కులం పేరుతో రిజర్వేషన్లు ఎందుకు? అలాగే, ధనిక కుటుంబాల స్త్రీలకి రిజర్వేషన్లు ఎందుకు?

'చిన్న కులాల' వారిలో నూటికి 99 మంది ఆర్థికంగా వెనకబడి వుంటారు కాబట్టి, 'చిన్న కులాలకు రిజర్వేషన్లు అనే దాన్నే జనరల్ సూత్రంగా వుంచి, ఆ చిన్న కులాల్లో ఆర్థిక పరిస్థితి బాగా వున్న వారికి రిజర్వేషన్లు వర్తించకుండా చెయ్యడం బాగుంటుంది.

* * *

జడ్. హెచ్. ములుగు.

ప్ర : మీరంటున్న 'భాషా జ్ఞానం' బాగా చదువుకున్న వారిలోనే కనిపించదు. ఇక, తక్కువగా చదువుకున్న వారికి ఎలా సాధ్యం?

జ : 'భాషా జ్ఞానం' అనే మాట కొంచెం పెద్ద మాటగా అనిపించి మీకా సందేహం వచ్చింది. ఎక్కువ చదువుకున్నారా, తక్కువ చదువు కున్నారా అనే దానితో సంబంధం లేకుండా అందరికి భాషాజ్ఞానం వుంటుంది. మాట్లాడేటప్పుడు సూత్రాలన్నీ చాలా సహజంగా, సరిగానే ఉపయోగిస్తారు. చదువు నేర్పే టీచరు ఒకటో క్లాసు నుంచీ కూడా కొన్ని జాగ్రత్తలు పాటిస్తూ నేర్పితే 2వ క్లాసు పూర్తి అయ్యేటప్పటికి రాయడంలో సూత్రాలన్నీ తెలిసిపోతాయి. తర్వాత సూత్రాల విషయంలో తప్పులు జరగవు. టీచరు విద్యార్థులకు నేర్పాలంటే మొదట టీచరు వాటిని తెలుసుకొని వుండాలి. 'ఈ సూచనలు కరెక్టుగానే వున్నాయి' అని, వాటితో టీచరు ఏకీభవించి వుండాలి. టీచరు ఏకీభవిస్తే తర్వాత ఆ విషయాలు నేర్పడం చాలా తేలికే. "సీత, రాధని వాళ్ళమ్మ పిలిచింది" అని రాయ కూడదని తెలుసుకోవడానికి పెద్ద చదువులు వుండాలా? ఇది ఎక్కువ తక్కువ చదువుల సమస్య కాదు.

గంగాధర రెడ్డి, సికింద్రాబాద్.

ప్ర : "వాడుక భాషే రాస్తున్నామా?" హెడ్డింగులో 'రాస్తున్నామా' గాక 'వ్రాస్తున్నామా' అని వుండాలి కదా?

జ : 'వ్రాయడం' అనే మాటని, మాట్లాడేటప్పుడు 'రాయడం' అనే అంటాము. 'క్రొత్త' అనే మాటవాడుకలో 'కొత్త' అవుతుంది. 'ప్రక్క' పక్క అవుతుంది. 'ప్రొద్దుట' పొద్దుట అవుతుంది. అలాగే 'వ్రాయడం' రాయడం అవుతుంది. కాబట్టి, అలా రాయడంలో తప్పేమీ లేదు.

* * *

పల్లా రామారావు, చీరాల.

ప్ర : నేడు వస్తున్న సాహిత్యం స్త్రీల స్వేచ్ఛకు ఎంత వరకు సహాయకారిగా వుంటుంది?

జ : హాని కలిగించే పనికిమాలిన స్వేచ్ఛకైతే చాలా సహాయకారిగా వుంటుంది. సరైన స్వేచ్ఛకైతే చాలా అపకారిగా వుంటుంది.

* * *

టి. బలరాం, మచిలీపట్నం.

ప్ర : మనిషిలో అతి ఉన్నతమయిన గుణమేది? అతి హీనమయిన గుణమేది?

జ : ఎక్కడో బాల సాహిత్యంలో ఒక కథ చదివాను. 'తనని తాను పొగుడుకోవడం' అన్నిటికన్నా హీనమైన గుణం—అని. అది చాలా నిజమేననిపించింది. ఇతరులు పొగుడుతూ వుంటే ముసి ముసి నవ్వులతో వింటూ సన్మానాలు చేయించుకోవడం కూడా తనని తాను పొగుడుకోవడముతో సమానమే. 'వ్యక్తిపూజ' అంతా ఇందులోకే వస్తుంది. ఉన్నతమైన గుణమైతే 'ఆత్మ గౌరవంతో ప్రవర్తించడం' అని నా అభిప్రాయం.

* * *

కె. వెంకటరామ అక్కయ్య, హైదరాబాద్.

ప్ర : 'విద్యలేనివాడు వింత పశువు' అని ఒకవేపు అంటూ, 'చదువుకున్నవాడికన్న చాకలి వాడు నయం' అని కూడా అంటూ మన సమాజము ద్వంద్వ వైఖరి అవలంబిస్తుంది. ఎందువల్లనంటారు?

జ : అది ద్వంద్వ వైఖరి కాదు. రెండు సామెతలూ వేరు వేరు సందర్భాలకు వర్తిస్తాయి. రెండూ కరెక్టే. విద్య లేకపోతే జ్ఞానం పొందే మార్గం వుండదు. కాబట్టి విద్యలేని మనిషి జీవితం పశువు జీవితంతో సమానమే. ఇది పశువుకీ, మనిషికీ పోలిక. రెండో సామెతలో 'చదువుకున్న మనిషికన్న చదువుకోని మనిషే మెరుగు' అనడంలో అర్థం, ఆ విద్యవల్ల కనీసజ్ఞానమైనా పొందటంలేదనీ, అది బతుకుతెరువుకి ఉపయోగపడటం లేదనీ చెప్పడం. విద్య ఉండాలి. కానీ జ్ఞానంఇవ్వని విద్య వుంటే లాభం లేదనే సంగతి వ్యంగ్యంగా చెప్పడం అది. వేరు వేరు అర్థాల్ని కలిపేసి చూడకూడదు.

* * *

కన్నాల సమ్మయ్య, కుంటముక్కల.

ప్ర : దేశంలో యువత చైతన్యవంతంగా తయారయితే దేశం పురోభివృద్ధిలోకి వస్తుంది. కాని ఈ యువతలో చాలావరకు అనేక వ్యసనాలకు తోడు దేశ సమస్యలపట్ల సరైన అవగాహన ఉండటంలేదని నా అభిప్రాయం. కారణం ?

జ : 'యువత' సరైన అవగాహనతో లేరంటే ఆ యువతని పెంచే పెద్దలు కూడా సరైన అవగాహనతో లేరన్నమాటేకదా? తల్లిదండ్రులు నేర్పే విషయాలూ, పాఠశాలల్లో చదివే పుస్తకాలూ, బయట సాహిత్యమూ, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలూ, ఏవీ కూడా యువత

తకు సరైన అవగాహన ఇవ్వడంలేదన్నమాటేకదా? యువత వ్యసనాలకు లోనవుతున్నారు అన్నారు. వ్యసనాల్లోకి దించే పరిస్థితులు సమాజంలో ఎందుకు ఉండాలి అని ఆలోచించి చూడండి. సిగరెట్ల వ్యసనాన్ని తీసుకుంటే అసలు సిగరెట్ల ఉత్పత్తి ఎందుకు ఉండాలి? సిగరెట్లు తయారవుతున్నాయంటే వాటిని కొంతమంది కాల్చవలసిందేకదా? సిగరెట్లే లేకపోతే సిగరెట్ల వ్యసనమే ఉండదుకదా! సారా ఉత్పత్తే లేకపోతే సారా వ్యసనమే ఉండదుకదా! అలాగే గుర్రప్పందాలు, అలాగే జూదాల క్లబ్బులూ, అలాగే లాటరీలూ, అలాగే ఇతర వ్యసనాలన్నీ. ఇవన్నీ ఎందుకు ఉన్నాయి? 'లాభాలు' త్వరత్వరగా సంపాదించే ప్రత్యేక వ్యాపారాలు ఇవన్నీ. ఈ వ్యాపారులు ఇవన్నీ నడిచి తీరాలంటారు. సమాజంలో ఇలాంటి తప్పుడు ఉత్పత్తులు ఎందుకు ఉండాలనే ప్రశ్న లేకుండా 'యువత వ్యసనాల పాలవుతున్నారు' అని బాధపడితే ప్రయోజనం వుండదు. ఈ ఉత్పత్తుల్ని ఆపాలనే సరైన అవగాహన యువతకేకాదు, పెద్దలకుమాత్రం వుందా? పెద్దల్లో కూడా అనేక రకాల వ్యసనాలు లేవా?

* * *

పోతన శివాజి, శ్రీకాకుళం (కృష్ణా).

ప్ర : ప్రస్తుతం సామాజిక వ్యవస్థలో మార్పు రావాలంటే స్త్రీకి ఎటువంటి విషయాలలో స్వేచ్ఛ ఉండాలి?

జ : పురుషుడికి ఎటువంటి విషయాల్లో స్వేచ్ఛ ఉండాలని మీరు అనుకుంటున్నారో అటువంటి విషయాల్లోనే.

* * *

ఆర్. వి. రాఘునరావు, అద్దంకి.

ప్ర : నిగూఢ భావాలతో తరిచి తరిచి లోతుగా చూస్తేతప్ప అంతు పట్టని కవిత్వం ఒకవైపు, వాక్యాలను విడగొట్టి పొడి పొడి చేసే ప్రజా

కవిత్వం మరొకవైపు- చివరికి కవిత్వం అంటే కార్టూన్లకు ముడి సరుకుగా మారుస్తున్నారు. 'అగ్ని జల్లినా, అమృతం కురిసినా అందం, ఆనందం దాని పరమావధి' అనే తిలక్ మాటలతో మీరు ఏకీభవిస్తారా?

జ : ఏకీభవిస్తాను. 'అందం' అంటే 'కళాత్మకంగా ఉండడం' అనీ, 'ఆనందం' అంటే సమస్యలతోటీ, దుఃఖంతోటీ జీవించేవారు ఆనందంగా జీవించడానికి కావలసినదాన్ని చెప్పడం అనీ కనక అర్థాలు చెప్పకుంటే ఆ నిర్వచనంతో ఏకీభవిస్తాను.

చలపాక ప్రకాష్, విజయవాడ.

ప్ర : నేటి రచయితల 'స్పీడ్' రచనలపై మీ అభిప్రాయం?

జ : బిజినెస్ పోటీ స్పీడ్ అది!

మహమ్మద్ రఫీ, మాచర్ల.

ప్ర : సమీప భవిష్యత్తులో మీ నించి ఓ మంచి నవలని ఆశించవచ్చునా?

జ : 'నవల'ని ఆశించవచ్చు. 'మంచి' అని దానికి గొప్ప విశేషణం పెట్టవద్దు. 'మంచి' కాకపోతే 'చెడ్డ' అవుతుందా? అనకండి. 'చెడ్డ' అనకపోయినా 'మంచి'అనే విశేషణం అనవసరం. 'సమీప భవిష్యత్తులో' కూడా కాదు. నేను నవలలు రాయాలనే అభిప్రాయం వదిలెయ్యలేదు కాబట్టి తర్వాత కాలంలో రాస్తే రాయవచ్చు కదా? ఆ రకంగా నానించి 'నవల'ని ఆశించవచ్చు.

ఆడ్డూరి సాంబమూర్తి, గణపర్తి.

ప్ర : విప్లవ పార్టీలు (రష్యా, చైనా) రాజకీయాధికారం సంపాదించిన దేశాలలో, విప్లవాలకు నాయకత్వం వహించిన నాయకులు ఉన్నప్పుడు మౌలికమైన మార్పులు జరిగాయి. ఆ నాయకులు పోయిన తర్వాత, ఆ పార్టీలు కమ్యూనిజం దిశగా కాకుండా మరో దిశగా వెళ్ళుతున్నాయి. అటువంటప్పుడు విప్లవ పార్టీ పరిస్థితి కూడా అంతేనంటారా?

జ : విప్లవ లక్ష్యాన్ని వదిలివేసిన తర్వాత ఇంకా విప్లవ పార్టీ ఎక్కడ వుంది? విప్లవాలు నడిపిన నాయకుల కాలంలో కూడా "మౌలికమైన మార్పులు" జరిగిపోయినట్లుగా అర్థం చేసుకోకూడదు. ఆ మార్పుల్లో "కొన్ని" మాత్రమే, అవి కూడా "ప్రారంభం" మాత్రమే - అయ్యాయి. ఇంకా పార్టీ ముందూ, 'కార్మిక వర్గం' ముందూ ఎంతో కార్యక్రమం ఉంది. ('కాపిటల్' చదివితేగాని ఇది అర్థంకాదు) పార్టీ విప్లవ దిశలోనే సాగుతూ వుంటే ఇప్పటికి చాలా మార్పులు జరిగేవి. కానీ, కమ్యూనిస్టు పార్టీలో కూడా అందరూ విప్లవకరమైన మార్పుల్ని కోరేవారిగా ఉండరు. 'కమ్యూనిస్టు' నని చెప్పుకునే ప్రతి వ్యక్తీ విప్లవకారుడు కాడు. విప్లవ కాలంలో కూడా 'సమాజం'లో ఇంకా అసమానత్వాన్ని కలిగిస్తూ వున్న వర్గాలు వుంటాయి కాబట్టి, ఆ వర్గాలకు సంబంధించిన వేరు వేరు ప్రయోజనాలూ, వేరు వేరు భావాలూ గల ప్రతినిధులందరూ పార్టీలోకి చేరతారు. అంటే, కమ్యూనిస్టు పార్టీ చాలా విప్లవపార్టీగా ఉందని అనుకున్నప్పుడు కూడా ఆ పార్టీలో 'విప్లవ పంథా' ఒకటీ, దాని వ్యతిరేక పంథాలు కొన్నీ వుండి తీరతాయి. సమాజంలో ఏ మార్పుని ప్రవేశపెట్టాలన్నా ఆ వేరు వేరు వర్గ భావాలమధ్య పోరాటం ఉంటుంది. ఆ పోరాటంలో విప్లవపంథా సభ్యులు మెజారిటీని సాధిస్తూ వుంటేనే, సమాజంలో విప్లవకరమైన మార్పుల్ని ప్రవేశపెట్టగలుగుతారు. విప్లవపంథా, తన మెజారిటీని ఎప్పుడు

నిలబెట్టుకోగలుగుతూ వుంటుందంటే, శ్రామిక వర్గంలో మెజారిటీ సభ్యులకు విప్లవకరమైన మార్పుల్ని గురించి స్పష్టంగా తెలుస్తూ, వాటికి వారు అనుకూలంగా వుంటూ ఉన్నప్పుడు పార్టీలో విప్లవ పంథాకి చెందిన ఒక నాయకుడు మరణించినా విప్లవ భావాలు తగ్గని పరిస్థితి ఉండాలి. కానీ, కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి ఇదే ప్రారంభ దశ కాబట్టి, విప్లవ కారులకు కూడా ఇంకా అనేక విషయాలు తెలియకపోవడమూ, ఆ భావాలు ఇంకా శ్రామిక ప్రజలకు అందకపోవడమూ ఈలోగా విప్లవ వ్యతిరేక సెక్షన్లు పార్టీలో పట్టు సంపాదించడమూ అన్నీ జరిగిపోయాయి. చాలా కాలంనించీ రష్యా, చైనా కమ్యూనిస్టుపార్టీల్లో 'విప్లవపంథా' అనే ధోరణి ఏమీ లేదు. అంటే, సమాజంలో వున్న 'విప్లవ ధోరణి'కి ఒక రాజకీయ పార్టీ అనేది లేదు. ఇలాంటి పరిస్థితి ఏర్పడినప్పుడు విప్లవకారులు ఏం చెయ్యాలి? ఏ వేదికనుంచీ పని చెయ్యాలి? విప్లవకారులు పని చెయ్యాలంటే 'విప్లవ పార్టీ' ఉండి తీరాలి కదా?

'విప్లవం' ద్వారా రాజకీయాధికారాన్ని సాధించిన కమ్యూనిస్టు పార్టీలో 'విప్లవ పంథాయే' ఎప్పుడూ మెజారిటీలో వుంటూ, సమాజంలో ఇంకా జరగవలసిన మార్పులన్నిటినీ కూడా సాధించగలుగుతూ వుంటే చాలా మంచిదే, సమస్యే లేదు. కానీ, అలా జరగకపోతే 2 రకాల ప్రశ్నలు వస్తాయి. శ్రామిక వర్గం, విప్లవ పంథాకే మెజారిటీని ఎందుకు ఇవ్వడం లేదు-అనేది ఒక రకం ప్రశ్న అయితే, ఒకప్పుడు విప్లవ పార్టీగా వుండేది రివిజనిస్టు పార్టీగా, తయారైపోతే విప్లవకారులు ఏ వేదిక నించీ పని చెయ్యాలి-అనేది ఇంకో రకం ప్రశ్న.

చైనా పార్టీ రివిజనిస్టు పార్టీగా తయారైపోతూ వున్నప్పుడు, మావో తనచివరి కాలంలో ఆ పార్టీ నించీ విడిపోయి, విప్లవ కమ్యూనిస్టు పార్టీ పెట్టాలనుకునేవాడట. మావో అలా అనుకున్నా అనుకోకపోయినా,

అలా చేసినా చెయ్యకపోయినా, "సోషలిజం ప్రారంభమైన దేశంలో ఒక్క-కమ్యూనిస్టు పార్టీ మాత్రమే వుండాలా?" అనే ప్రశ్న తప్పనిసరిగా చర్చించవలసిన ప్రశ్న. విప్లవకారులు ఒక 'విప్లవ పార్టీ' ద్వారా పని చెయ్యడానికి ఎప్పుడూ అవకాశం వుండాలంటే, ఒక కమ్యూనిస్టు పార్టీ నించి విడిపోయి ఇంకో కమ్యూనిస్టు పార్టీ పెట్టుకోవడానికి హక్కు వుండాలనే విషయం కమ్యూనిస్టులు మొదటి నించీ గుర్తిస్తూ వుండాలి. ఈ హక్కు ఎందుకు వుండాలో అర్థం చేసుకోకపోతే, కమ్యూనిస్టులే విప్లవ మార్గాన్ని మూసేసుకున్నట్టు అవుతుంది.

ఈ విషయంలో మార్క్స్ ఏం చెప్పాడు—అనే ప్రశ్న వస్తుంది, మార్క్స్ చాలా విషయాల్లో "వివరాలు" చెప్పలేదు. మార్క్స్ ఎంగెల్స్‌లు విప్లవకరమైన కమ్యూనిస్టు పార్టీని మాత్రమే వూహించారు. అది పూర్తిగా బూర్జువా పార్టీగా మారిపోవచ్చనీ, అలాంటప్పుడు దాని నించీ బయటికి వచ్చేవాళ్ళు ఇంకో పార్టీ పెట్టుకునే అవకాశం వుండాలనీ, ఆ "వివరాలన్నీ" వాళ్ళు చెప్పలేదు. విప్లవకారులకు అనుభవాలు పెరుగుతోన్నకొద్దీ "మౌలిక సిద్ధాంతాన్ని" ఆధారం చేసుకుంటూ 'శ్రామిక వర్గ దృక్పథం' కలవానినీ, వర్గ పోరాటాన్ని ఎప్పుడూ సాధ్యం చేస్తూ వుండే దానినీ గ్రహిస్తూ వుండాలి. రివిజనిస్టు పార్టీ నించీ విడిపోయిన విప్లవకారులు, 'చట్టాల' పరిధిలోనూ రహస్యంగానూ కూడా (లీగల్‌గానూ. ఇల్లీగల్‌గానూ కూడా) పని చెయ్యాలి. రివిజనిస్టు పార్టీ నించి విడిపోయి విప్లవపార్టీని స్థాపించిన తర్వాత, ఆ విప్లవ పార్టీ కూడా మళ్ళీ రివిజనిస్టు పార్టీగా మారిపోవడమూ, దానినించీ మళ్ళీ ఇంకో విప్లవ పార్టీని ప్రారంభించడమూ-ఇలా, పార్టీల సంఖ్యని పెంచుకుంటూ పోతే లాభం లేదు. ఏ 'తప్పు' నైనా దిద్దుకోవడానికి ఒకటి రెండు అవకాశాలకన్నా ఎక్కువ అవకాశాలు తీసుకోకూడదు. విప్లవ పార్టీ, రివిజనిస్టు పార్టీగా ఎందుకు మారిపోతున్నదో విప్లవకారులు

గ్రహించుకుంటూ, పార్టీలో వెనకటి కాలంలో జరిగిన తప్పులు మళ్ళీ జరగకుండా వుండేలా నిబంధనలు రూపొందించుకుని వాటిని పాటిస్తూ వుండాలి. శ్రామిక ప్రజలంతా 'ఏది సోషలిజం, ఏది కాదు' అనే విషయాలు ఎంత త్వరగా, ఎంత సరిగా గ్రహించగలిగితే అంత త్వరగా రివిజనిస్టు పార్టీలకు నిలవ నీడ లేకుండా పోతుంది. రివిజనిజాన్ని తలెత్తనివ్వకుండా చెయ్యగలిగేలాగా విప్లవ పార్టీని అభివృద్ధిపరుచుకునే పోరాట మార్గంలోనే విప్లవకరమైన మార్పుల్ని స్థిరపరచడం సాధ్యమవుతుంది. విప్లవకరమైన మార్పులు చేసుకుంటూ పోవడం అనేది ఎప్పుడు జరిగినా 'విప్లవ పార్టీ' ద్వారా జరగవలసిందే. అందుకే మార్క్స్, ఎంగెల్స్‌లు విప్లవ పార్టీనే ప్రస్తావించారు.

* * *

శ్రామిక్, ఒంగోలు.

ప్ర : సి.పి.ఎం. పార్టీ తెలుగుదేశం గొడుగు కింద. సి.పి.ఐ. పార్టీ కొంతకాలం కాంగీ ఇప్పుడు తెలుగుదేశం కింద, దూరినాయి కదా? నక్సలైట్లు కిడ్నాప్‌లు, హత్యలు! ప్రజల్లో కమ్యూనిస్టులంటే విరక్తి కలిగిస్తున్నారు. భారతదేశానికి "మోక్షం" ఎప్పుడు?

జ : మీరు చెప్పిన కమ్యూనిస్టులంటే ప్రజలు నిజంగా విరక్తిగా వుండడం నిజమైతే అది చాలా మంచి లక్షణం. అయితే, విరక్తి కలగవలసింది-మీరు చెప్పే రకం కమ్యూనిస్టుల మీదేగానీ, 'కమ్యూనిస్టు సిద్ధాంతం' మీద కాదు. సిద్ధాంతాన్నీ, దాన్ని ఆచరించని పార్టీలనీ ఒకే గాటన కట్టి రెంటి మీదా సమానంగా విరక్తి చెందితే, ఆ ప్రజలకి మీరు కోరే "మోక్షం" ఎప్పటికీ సిద్ధించదు. తమకు 'విరక్తి కలిగించే' దేనినైనా సరే తిరస్కరించి, 'రక్తి' కలదానిని నిర్మించుకునే మార్గంలోనే ఆ "మోక్షానికి" చేరగలుగుతారు.

* * *

మోరా నాగేశ్వరాచారి, రాజవ్వగూడెం.

ప్ర : కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రకారం కమ్యూనిస్టులు పెట్టుబడిదారీ సమాజాన్ని అంతం చేయడానికి పోరాడాలి కదా. మరి మన రాష్ట్రంలో కమ్యూనిస్టులు తెలుగుదేశం పార్టీతో పొత్తు పెట్టుకోవడం కమ్యూనిస్టు సిద్ధాంతానికి వ్యతిరేకం కదా? ఒక పెట్టుబడిదారీ పార్టీ (కాంగ్రెస్)ని అంతం చేయడానికి మరో పెట్టుబడిదారీ పార్టీతో పొత్తు పెట్టుకుంటున్నాం అనే నేటి కమ్యూనిస్టుల వాదన 'ఆత్మ వంచన' కాదా?"

జ : 'ఆత్మవంచన' మాత్రమే అయితే పర్వాలేదు. వాళ్ళ చేష్టల ఫలితం వాళ్ళే అనుభవిస్తారు. అది 'పరవంచన' కూడా. ఇక్కడ 'పరులు' ప్రజలే. ఆ ప్రజల్నికూడా వంచించగలుగుతున్నారు, ప్రజలకు ఏది వంచనో, ఏది కాదో తెలియదుగనకే బూర్జువా పార్టీల్నీ, శ్రామిక దృష్టిలేని శ్రామిక పార్టీల్నీ నమ్ముకోవడం చేస్తున్నారు. వారి చేతిలో వున్న 'అద్భుతశక్తి' వారికి తెలియడం లేదు ఇంకా. 'తప్పుగా' తోచిన పార్టీల్ని వదిలివెయ్యగలిగే కనీసపు చైతన్యంతో ప్రవర్తించగలిగినా చాలు.

* * *

బి. రాంనారాయణ, బి. శ్రీవాణి, గోదావరిఖని.

ప్ర : సమాజం ఎప్పుడూ అభివృద్ధివైపే పయనిస్తుందంటారు కదా? ఈ 'రివిజనిజం' ఏమిటి?

జ : 'సత్యం జయిస్తుంది' అనే సూత్రంతీసుకోండి. ఈ సూత్రంలో పొరపాటేమీ లేదు. కానీ, ఒక విషయంలో సత్యం చివరికి పూర్తిగా జయించేలోగా మధ్యలో కొన్నిసార్లు ఓడిపోతూ కూడా వుండవచ్చు. ఎందుకంటే, దానితో 'అసత్యం' పోరాడుతూ వుంటుంది గనక. అసత్యాన్ని పూర్తిగా బట్టబయలు చెయ్యగలిగినప్పుడే సత్యం పూర్తిగా జయిస్తుంది. ఈలోగా సత్యం ఓడిపోయినప్పుడల్లా "సత్యం జయిస్తుందంటారే, మరి

ఈ అసత్యం ఏమిటి?" అంటారా? అలాగే 'సమాజాభివృద్ధి' విషయం కూడా. 'సమాజం ఎప్పుడూ అభివృద్ధి వేపే' అనే సూత్రంలో పొరపాటేమీ లేదు. అయితే 'అభివృద్ధి చెందడం' అనేదాన్ని 'దీర్ఘకాల పరిణామం'గా చూడాలి. అంతేకాదు, దాన్ని ఎప్పుడూ "పోరాట ఫలితం'గా కూడా చూడాలి. పోరాటం ఆగిపోయినప్పుడు అభివృద్ధి కూడా ఆగిపోతుంది. 'అభివృద్ధి' అనేది ఏకపరసన, నిరాటంకంగా సాగిపోతూ వుండదు. 'అభివృద్ధి'కి ప్రతీ అడుగులోనూ, 'అభివృద్ధి నిరోధకత్వం' అడ్డుపడుతూ వుంటుంది. అభివృద్ధి క్రమంలో అనేక అపజయాలు ఎదురౌతూ వుంటాయి. ఆ అపజయాలకు వ్యతిరేకంగా చేసే పోరాటాలే అభివృద్ధి నిరోధకత్వాన్ని ఓడించగలుగుతూ వుంటాయి. వర్గ సమాజాన్ని వర్గాలు లేని సమాజంగా మార్చే క్రమంలో వర్గ పోరాటాలూ, జయాపజయాలూ వుండవూ? 'విప్లవ పంథా'కి తీవ్రమైన అపజయమే రివిజనిజం. శ్రామిక వర్గం రివిజనిజం మీద ఎంత చైతన్యంతో పోరాడగలిగితే అంత తొందరగా దాన్ని ఓడించగలదు. పోరాటంలో ఎంత జాప్యం జరిగితే, పోరాటం ఎంత బలహీనంగా వుంటే రివిజనిజం అంత బలంగా, అంత స్థిరంగా వుంటుంది. ఒక దశలో రివిజనిజాన్ని ఓడించి, విప్లవపంథా మళ్ళీ ముందుకుసాగినా, ఆ ప్రయాణం కూడా నిరాటంకంగా సాగిపోతూ వుండదు. రివిజనిజం ఎప్పుడూ విప్లవపంథా పరసనే నడుస్తూ, ఎప్పుడూ దాన్ని వదలకుండా సమయం కోసం ఎదురు చూస్తూ వుంటుంది. ఎక్కడ వీలైతే అక్కడ మళ్ళీ జయించడానికి ప్రయత్నిస్తూ వుంటుంది. శ్రామిక వర్గం ఎప్పటికప్పుడు సిద్ధాంతంలోనూ ఆచరణలోనూ మహా స్పష్టతతో లేకపోతే, ఎక్కడో అక్కడ రివిజనిజం మళ్ళీ జయిస్తుంది. దాన్ని కూడా ఓడించినా మళ్ళీ అది ఇంకో చోట కాచుకుని కూర్చుంటుంది. శ్రామిక

వర్గం అజ్ఞానంలో పడివున్న ప్రతీ అంశంలోనూ, ప్రతీ దశలోనూ రివిజ నిజం రాజ్యం చేస్తుంది. శ్రామిక వర్గం మార్క్సిజం అనే ఆయుధాన్ని ఎన్నడూ విడిచిపెట్టకుండా సాయుధంగా వుంటేనే అది చివరికి సంపూర్ణ మైన అభివృద్ధిని సాధించగలుగుతుంది. అప్పటికీ కూడా సమాజంలో "మిత్ర వైరుధ్యాలు" వుంటూనే వుంటాయి. అయితే, వాటివల్ల మంచేగానీ చెడ్డ లేదు.

రివిజనిజంలోనే పడివుండి, ఇదే అభివృద్ధి అనుకోకుండా "ఈ రివిజ నిజం ఏమిటి?" అని ప్రశ్నించడంలో కూడా అభివృద్ధి వుంది.

* * *

కె. శ్యామల, ఉలవపాడు.

ప్ర: "కాలం 21వ శతాబ్దంలోకి పరుగిడుతుంటే టీవీలో ఇంకా 5వ శతాబ్దంలోకి నెట్టేస్తున్నారే! విశ్వామిత్ర, రామాయణం, భారతం— సీరి యల్స్‌తో ప్రజల్లో ఇంకా మూఢాచారాలు, కులం, మతం, రాజరిక వ్యవస్థ, ఫ్యూడలిజం భావాలు ఇంకా ఇంకా ప్రజల్లోకి ఎక్కిస్తున్నారు! ఇది పురో గమనమా, తిరోగమనమా?

జ: పురోగమనమే. ఎవరికి? దోపిడీ వర్గాలకి! వాళ్ళకి కావలసింది వాళ్ళు ప్రచారం చేసుకుంటున్నారు. మీ లిస్టులోకి ఇంకా క్రికెట్టు ప్రోగ్రా ములూ, అర్ధరాత్రి సినిమాలూవంటి సరుకంతాచేర్చండి. దేశ ప్రజలుఅవన్నీ చూస్తూ మత్తుగా పడివుంటే అంతకన్నా దోపిడీ వర్గాలకేం కావాలి?ఇప్పుడు ఎవరన్నా 'మీటింగులు' పెట్టాలనుకుంటే, టీ.వీ.లో సినిమాలూ, క్రికెట్లూ, రామాయణ- భారతాలూ లేని రోజుల్నీ, లేని సమయాన్నీ చూసుకోవల సిందే. అది ఎంత గొప్ప మీటింగు అయినాసరే టీ.వీ.ని వదిలి బయటకు రావడంలేదు జనం. జనాల్ని అంత బానిసల్ని చేసేలాగా టీ.వీ.ని ఉపయో గిస్తున్నారంటే, దోపిడీవర్గాల వర్గచైతన్యంచూస్తే ముచ్చటేస్తోంది.

* * *

ఎం. ఏసుపాదం, మూళవరపాలెం.

ప్ర: బాబ్రీ మసీదు పరిసరాలలో రామాలయ నిర్మాణార్థం శంకు స్థాపన చేయ నిర్ణయించారట. భవిష్యత్తులో మతపరమైన పోరాటాలకు శంకుస్థాపనగా దాన్ని భావించవచ్చునంటాను. నిజమేనంటారా?

జ: మతపరమైన పోరాటాలకు శంకుస్థాపన వేల సంవత్సరాల కిందటే జరిగిపోయింది. నిజానికి మత పోరాటాలుగా కనబడేవి మత పోరాటాలు కావు 'ఆర్థిక' సంబంధమైన పోరాటాలే. 'మతం' అనేది దోపిడీ వర్గ సృష్టే. కులాలూ, మతాలూ మానవులమధ్య సహజమైన విభజనలు కావు. అవి ఎందుకు తలెత్తాయో ఆ కారణాలు నశించేవరకూ భవిష్యత్తులో కూడా అన్నిరకాల పోరాటాలూ ఉంటూనే ఉంటాయి.

ఆర్.కె. వెంకట్, టిటాగర్.

ప్ర: వృత్తి విప్లవకారులంటే ఎవరు? మామూలు విప్లవకారులకూ, వృత్తి విప్లవకారులకూ తేడా ఏమైనా వుందా?

జ: 'వృత్తి' లోనే తేడా. మామూలు విప్లవకారులైతే వేరే ఉద్యోగాలు చేస్తూ 'విప్లవం'కోసం పనిచేస్తారు. వృత్తి విప్లవకారులైతే, ఇతర ఉద్యోగాలేమీ చెయ్యకుండా పూర్తిగా విప్లవం కోసమే పనిచేస్తారు. విప్లవం కోసం పనిచెయ్యడాన్ని 'వృత్తి'గా అనడం సరైన మాటకాదు. ఇంకేదైనా మాట వాడితే బాగుంటుంది.

* * *

ఆర్. ఎస్. చౌహాన్, కర్నూలు.

ప్ర: విజ్ఞానం సాధించిన విజయం ఈనాటి కంప్యూటర్ శక్తి. ఇది కార్మిక శక్తికి సమాంతరం. ఒక వైరుధ్యం. ఈ పరిస్థితుల్లో కార్మిక శక్తిని త్రోసిరాజని యజమానులు వారి యంత్రాలను రీమోట్ కంట్రోల్స్‌తో వారే

నడిపించుకునే పరిస్థితి ఏర్పడింది. ఈ పరిస్థితుల్లో మార్క్సిజాన్ని ఎంత మేరకు కార్మిక ప్రగతికి మరియు కార్మికశక్తి పరిరక్షణకు ఉపయోగించుకొనవచ్చును?

జ: ఈ పరిస్థితుల్లోనే కాదు, ఏ పరిస్థితుల్లో అయినా మార్క్సిజాన్ని నూటికి నూరుపాళ్ళూ కార్మిక ప్రగతికీ, కార్మిక పరిరక్షణకీ ఉపయోగించుకోవచ్చు. మార్క్సిజం వేరూ, కార్మిక పరిరక్షణ వేరూ కాదు. కార్మిక పరిరక్షణే మార్క్సిజం. కార్మికులు చెయ్యవలసిందంతా దాన్ని అర్థం చేసుకుని ఆచరించడమే. "కంప్యూటర్ శక్తి కార్మిక శక్తికి సమాంతరం" అన్నారు మీరు. కంప్యూటర్ శక్తీ కార్మికశక్తీ వేరు వేరు కావు. వున్నదంతా కార్మిక శక్తే. కంప్యూటర్ అనేది కార్మికుడి చేతిలో 'శ్రమ పరికరం' మాత్రమే. కంప్యూటర్ని ఎవరు నడుపుతారో వారు కంప్యూటర్ కార్మికులు. కత్తెరతో బట్టలు కత్తిరించేటప్పుడు, కార్మికుడి చేతిలో కత్తెర ఒక శ్రమ పరికరం అయినట్టే, ఎంత భారీ యంత్రమైనా కార్మికుడి చేతిలో శ్రమ పరికరమే. యంత్రాల సూత్రాల్ని కనిపెట్టడమూ, యంత్రాల్ని రూపొందించడమూ, వాటిని నడపడమూ అంతా శ్రమల ద్వారానే జరుగుతుంది. ఆ శ్రమల్లో కొన్ని మేధాశ్రమలూ, కొన్ని శారీరక శ్రమలూ వుంటాయి. మొత్తంమీద అంతా శ్రమే. కంప్యూటర్ కూడా ఒక యంత్రమే కాబట్టి, దాన్ని కనిపెట్టడమూ, ప్రోగ్రాములు రాయడమూ, నడపడమూ అంతా శ్రమలద్వారానే జరుగుతుంది. శ్రమ పరికరం శక్తీ. ఆ పరికరంతో పనిచేసే శ్రామికుల శక్తీ వేరు వేరు కావు. కంప్యూటర్ని ఇంజనీర్ నడిపితే ఆ ఇంజనీరే కార్మికుడు. యజమాని నడిపితే ఆ యజమానే కార్మికుడు ఆ సందర్భంలో. కానీ, యజమానులే కంప్యూటర్ల ప్రోగ్రాములు రాసి కంప్యూటర్లు నడిపేటంత శ్రమ ఎందుకు పడతారు? ఇంజనీర్లని పెట్టుకుంటారు.

నిజానికి కంప్యూటర్ కీ కార్మికుడికీ వైరుధ్యం లేదు. కంప్యూటర్ వల్ల ఎంతో శ్రమ కాలం తగ్గుతుంది. శ్రామికులంతా 'యజమాని లేని' స్వేచ్ఛా సంబంధాలలో వున్నట్టయితే, కంప్యూటర్ ని ఉపయోగించుకుంటూ అందరూ చాలా తక్కువ, తక్కువ గంటలే పనిచెయ్యవచ్చు. కానీ 'యజమానీ కార్మికుల సంబంధాలలో' అలా జరగదు. ఒక కంప్యూటర్ వల్ల ఎంతమంది కార్మికుల ఉద్యోగాలు పోతాయో వాళ్ళందర్నీ ఉద్యోగాల్లో వుంచి, అందరి పనిగంటల్నీ తగ్గిస్తాడా యజమాని? అలా జరగదు. కార్మికుల్లో కొందర్ని తగ్గించేసి కంప్యూటర్ ని తెస్తారు. అంటే వైరుధ్యం అంతా "యజమానీ కార్మికుల సంబంధాలలో కంప్యూటర్ ని వాడడం" లోనే. అలాంటి సంబంధంలో ఏ భారీ యంత్రాన్ని ప్రవేశపెట్టినా అది కార్మికులకు సమస్యల్ని తెస్తుంది. కాబట్టి దాన్ని కార్మికులు వ్యతిరేకించవలసిందే. అయితే, 'పెట్టుబడిదారీ విధానం'లో ఈ ఉత్పత్తి శక్తుల పెరుగుదలని ఆపడం తప్పనిసరిగా సాధ్యమవుతుందనే భ్రమల్లో వుండకూడదు. అందుకే కార్మికులు ఈ "ఉత్పత్తి సంబంధాన్ని" మార్చుకోవడం మీదే ప్రధానంగా దృష్టి పెట్టుకోవాలి. లేకపోతే, వైరుధ్యాల పరిధిలోనే తిరుగుతూ సమస్యలమీద ఎంత పోరాడినా అదంతా వృథా కాలయాపన తప్ప ఏమీకాదు.

తియ్యగూర బసివిరెడ్డి, తేలప్రోలు.

ప్ర: తాము నాయకత్వం వహించే పార్టీ సిద్ధాంతాన్ని తాము నిజ జీవితంలో ఆచరించవలసి వుంటుందంటారా? స్త్రీల సమస్యలకూ, వాటి నుంచి విముక్తికీ, శాస్త్రీయ మార్గాలను బోధించేది కమ్యూనిస్టు సిద్ధాంతం. అటువంటి సిద్ధాంతమును తమ సిద్ధాంతంగా చెప్పే "కమ్యూనిస్టు పార్టీ"ల నాయకత్వంలోని వారు (నిజానికి అగ్రశ్రేణి వారు కూడా) భార్యాబిడ్డల్ని

వదిలివేసి, వేరే స్త్రీలతో సంబంధాలు పెట్టుకుని బిడ్డల్ని కనడంచేస్తున్నారు. మొదటి భార్యాపిల్లలకు దయతలచి కొంత ఇస్తే వారు మహానుభావులే. అదీ కూడా చెయ్యరు. తమ తిరుగుబోతుతనానికి వీరు చేసే సమర్థన ఏంటంటే పార్టీ కార్యక్రమాలకు ఎక్కువ సమయం కేటాయించడం. వేరే ప్రాంతాల్లో ఎక్కువకాలం వుండడం వలన అటువంటి సంబంధాలు ఏర్పడటానికి దారితీస్తుందంటారు. తమ మధ్య స్నేహం, సోదరభావం, పార్టీ ఎడల మరింత గీక్షణ ఏర్పడకుండా అటువంటి సంబంధాలే ఎందుకు ఏర్పడతాయో చెప్పరు. తాము చేసే తప్పుడు పనులకు మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌లను కూడా ఉదహరిస్తుంటారు. భూ సంస్కరణలను డిమాండ్ చేసే కమ్యూనిస్టుపార్టీ నాయకులు తమ స్వంత పొలాలనూ, తమ బంధుమిత్రుల పొలాలనూ చట్టంనుంచి వక్రమార్గాల ద్వారా మినహాయింపు పొందుతారు. వీరిని ప్రజలు ఎలా నమ్ముతారు. ఎలా అనుసరిస్తారు?

జ : నమ్మరు. అనుసరించరు. అందుకే కదా పరిస్థితి అంతా ఇలా వుంది.

* * *

కె. వెంకట్రావు, విజయవాడ.

ప్ర : కమ్యూనిస్టు వ్యవస్థవైపు ప్రజల్ని ఆకర్షించడానికి ఏం చెయ్యాలంటారు ?

జ : 'ఆకర్షించడం' అనే మాట బాగోలేదు. ఓటు అడిగే వాళ్ళయితే ప్రజల్ని 'ఆకర్షించడం' దృష్టితో ఆలోచిస్తారు. ప్రజలకి 'సమస్యలు' వున్నాయి. సమస్యల మీదే పని ప్రారంభించాలని వెనకటినించీ తెలిసిందే. ప్రజల బాధల్ని అర్థం చేసుకుని, వారిపట్ల ప్రేమతోటీ, చిత్తశుద్ధితోటీ వుంటూ. మార్క్సిజాన్ని మార్గదర్శకంగా పెట్టుకుంటే చాలు, తర్వాత మార్గం అంతా అదే సవ్యంగా జరిగిపోతుంది. నాయకులనేవాళ్ళు ఏం

చెయ్యాలో అది చెయ్యకపోవడం వల్లనే ప్రజల్ని విముక్తిచేసే సిద్ధాంతం ఇంకా ప్రజలకు అందకుండా వుంది.

*　　*　　*

ఎన్. సూర్య, మంచిర్యాల.

ప్ర : కులతత్వ, మతతత్వ, మరియు రాజకీయ నాయకులు రేపుతున్న అల్లర్లను జనం ఏ విధంగా ఎదుర్కోవాలి ?

జ : కులతత్వ మతతత్వ అల్లర్లు కూడా రాజకీయ నాయకులు రేపేవే. 'బిజినెస్' విషయాల్లో వచ్చేవే ఈ అల్లర్లన్నీ, పైకి, వేరేవేరే కారణాలు చూపిస్తారు. బిజినెస్ అనగానే మళ్ళీ సరుకుల ఉత్పత్తులూ, అమ్మకాలూ, లాభాలూ, ప్రభుత్వ కాంట్రాక్టులూ, పదవులూ, ఓట్లూ అంతా మళ్ళీ బూర్జువా రాజకీయాల దగ్గరికే వస్తాం. వాటిని ఎదుర్కోగలిగేవి మార్క్సిస్టు రాజకీయాలు మాత్రమే.

ప్రజలంతా ఎక్కడెక్కడైతే శ్రమలు చేస్తారో ఆ పని స్థలాల్లో సంఘాలు పెట్టుకోవాలి. సమాజంలో వుండే ఏ సమస్య మీద పోరాడడానికైనా మార్గం 'ఉత్పత్తి స్థలం' లోనించే. అక్కడ పనిచేసే కార్మికుల లోనించే నాయకులు వుండాలి. బయట వాళ్ళని నాయకులుగా పెట్టుకో కూడదు. బూర్జువా సంఘాలకు విరుద్ధమైన. సరియైన క్రమశిక్షణా సూత్రాలూ, నిబంధనావళీ ఈ సంఘాలకు వుండాలి. నాయకుల పెత్తందారీ తనాలకు దారితీసే బూర్జువారకపు విధానాలేవీ వుండకూడదు. ఉత్పత్తి స్థలంలో సమస్యలతో పాటు, తప్పనిసరిగా మార్క్స్ 'కాపిటల్'ని సమిష్టిగా చర్చించే అధ్యయన తరగతులు నిర్వహించుకోవాలి. కులాల మీదా, మతాల మీదా, ఇతర సమస్యల మీదా కూడా ఎప్పుడూ చర్చలు జరుపుతూ వుండాలి. ఆ రకమైన, సరియైన ఆలోచనా విధానాన్ని అభివృద్ధిపరచుకోవడంద్వారా తప్పుడు రాజకీయాల్నీ, అల్లర్లనీ ఎదుర్కొనే మార్గం

ఏర్పరచుకోవలసిందే గానీ, దానికి తేలికైన అడ్డదారి ఏమీ వుండదు. అలాంటి సరైన మార్గం ఎప్పటి వరకూ అయితే ప్రారంభం కాదో అప్పటి వరకూ ఈ అల్లర్లన్నీ ఇలా వుంటూనే వుంటాయి.

*

కె. హరనాథ్ బాబు, ఒంగోలు.

ప్ర : మార్క్సిజం సమాజంలోని అన్ని సమస్యలకు పరిష్కారాలు చూపించలేదు. అన్ని జబ్బులకు మందు వెయ్యలేదు. అన్ని సమస్యలను పరిష్కరించగలదు అనడం మూఢత్వమవుతుంది. ఈ మాటలు కమ్యూనిస్టుగా చలామణీ అయ్యే ఒక వ్యక్తి అన్నవి. దీనికి మీ సమాధానం కావాలి.

జ : 'అన్ని సమస్యల' సంగతి అలా వుంచి, పోనీ మార్క్సిజం ఏయే సమస్యల్ని పరిష్కరించగలదో, ఏ ఏ జబ్బులకు మందు వెయ్య గలదో అడగండి ఆయన్ని ఈసారి. దాన్నిబట్టి మిగతా సమస్యల సంగతి తర్వాత చూడొచ్చు.

* * *

చామర్తి శ్రీరామచంద్రమూర్తి, చెల్లూరు.

ప్ర : స్త్రీ పురుషులు సృష్టిలో సమానులేననీ, ఏ ఒక్కరూ అహం భావంతో మేము గొప్ప అని భావించడం భావ్యం కాదనీ నా అభిప్రాయం. ఇటీవల నేను ఎగ్జిబిషన్ ఒకటి చూశాను. వరకట్నం కారణంగా తమ ప్రాణాలను కోల్పోయిన అనేక మంది స్త్రీల ఫోటోలు, పేపర్ కటింగ్స్, వార్తలు, వర్ణ చిత్రాలు ప్రదర్శించారు. ఒక ఫోటో నన్ను చాలా ఆలో చింపజేసింది. భర్తకు భార్య అన్నం పెడ్తున్న ఫోటో క్రింద "బానిసత్వా నికి ప్రతీక" అని వ్యాఖ్య వ్రాసి వున్నది. భర్తకు భార్య భోజనం పెట్టడం బానిసత్వమా ? పురుషునికి గానీ, స్త్రీకిగాని సంతృప్తినిచ్చేది వారిద్దరి మధ్యా

వున్న ప్రేమాభిమానాలే! కుటుంబంకోసం డబ్బు సంపాదించే వ్యక్తికి భోజనం పెట్టడం బానిసత్వమా? (నేను అడిగేది ఆర్థిక స్వాతంత్ర్యం లేని, లేదా ఉద్యోగం లేని భార్యల గురించి), అది వారి బాధ్యత కాదా? భార్యను వంటింటికి పడకటింటికి మాత్రమే పరిమితం చేయనంతవరకూ ఇది బాధ్యతేనేమో అనిపిస్తున్నది.

జ: భార్య భర్తకు చేసే సేవల్లో 'అన్నం వడ్డించడం' కూడా ఒకటి కదా? సేవలన్నీ బానిసత్వమే కాబట్టి, అన్నం వడ్డించడం కూడా బానిసత్వం కిందకే వస్తుంది. సాంప్రదాయంలో, సాధారణంగా, భర్తకి అన్నం వడ్డించే సమయానికి భార్య అన్నం తినివుండదు. భర్త భోజనం అయిన తర్వాతే భార్య తింటుంది. ఇందులో బానిసత్వం కాకపోతే సమానత్వం ఏముంది? "ఆర్థిక స్వాతంత్ర్యం లేని, లేదా ఉద్యోగంలో లేని భార్య గురించి" మాట్లాడుతున్నానన్నారు. ఆర్థిక స్వాతంత్ర్యం వున్న భార్యలైతే భర్తకి అన్నం వడ్డించవలసిన అవసరం లేదనీ, అలా వడ్డిస్తే అది 'సమానత్వం' అవదనీ మీరు ఒప్పుకుంటున్నట్టేనా? అలాంటప్పుడు ఆర్థిక స్వాతంత్ర్యం లేని స్త్రీ భర్త పోషణ మీద ఆధారపడుతూ జీవించడం కూడా 'సమానత్వం' అవదుకదా? స్త్రీ పురుషులు సమానులేనని మీరు మొట్ట మొదటి వాక్యంలోనే అన్నారు. కుటుంబంకోసం డబ్బు సంపాదించ గలిగే శక్తి పురుషుడి చేతిలో వుండి, ఆ పురుషుడి మీదే పోషణకు ఆధార పడుతూ గృహ సేవలు చెయ్యడం స్త్రీ బాధ్యత అయితే అది ఆ వ్యక్తుల మధ్య సమానత్వం ఎలా అవుతుంది? "భార్యని వంటింటికీ, పడకటింటికీ మాత్రమే పరిమితం చేయనంతవరకూ...." అంటున్నారు. బయట వుద్యోగ బాధ్యతలు లేకుండా గృహ సేవలు మాత్రమే చేసుకునే స్త్రీ వంటిం టికీ, పడకటింటికీ, మాత్రమే పరిమితమైనట్టు కాదా? ఈ 'పరిమితులు'

తప్ప ఆమెకు ఇంకేదైనా ప్రపంచం వుంజా? వుద్యోగం చెయ్యని స్త్రీకి గృహ సేవలే బాధ్యత కాబట్టి, భర్తకి అన్నం వడ్డించడం కూడా ఆ బాధ్యతల్లో ఒక బాధ్యత అనుకుందాం.

మరి, వుద్యోగాలు చేస్తోన్న స్త్రీల విషయంలో అయినా భర్తలు ఇంటి పనుల్లో ఎందుకు భాగం తీసుకోడం లేదు? మీరు 'ప్రేమానురాగా'ల గురించి మాట్లాడు తున్నారు. "స్త్రీకి గానీ, పురుషునికి గానీ సంతృప్తి నిచ్చేవి వారిద్దరి మధ్యా వున్న ప్రేమానురాగాలే కదా? అంటున్నారు. ఈ ప్రేమానురాగాలతో పురుషుడు స్త్రీకి ఎంత సేవ చేస్తున్నాడు? భార్యలు కూడా వుద్యోగాలు చేస్తోన్న కుటుంబాల్లో భర్తలు భార్యలకు అన్నాలు వడ్డించి, వారి ఎంగిలి పళ్ళాలు తీసిన సంఘటనలెప్పుడైనా మీరు చూశారా? పిల్లల మలమూత్రాలు కడిగిన సంఘటనలు చూశారా? అంట్లు తోమే, గదులు వూడ్చే సంఘటనలు చూశారా? ఎక్కడో ఒకటో రెండో సంఘట నలు కాదు. సహజ బాధ్యతగా పురుషుడు ఇంటిపనులు చెయ్యడం ఎందుకు జరగడం లేదు? ఎందుకంటే, ప్రేమానురాగాలు అబద్ధమూ, అసమా నత్వమే నిజమూ గనక. భర్త ఆలోచన ఎలా వుంటుందంటే, తనమీద ప్రేమతోనే భార్య తనకు సేవలు చేస్తోందనుకుంటాడు. 'దాస్యం' అనే సాంప్రదాయంతో మాత్రమే ఆమె ఆ పనులు చేస్తోందని అర్థంచేసుకోడు. తను మాత్రం భార్య మీద ప్రేమని ప్రకటించడానికి ఏ పనీ చెయ్యడు. ఆమెకి కొంత శ్రమ తగ్గించడానికి ప్రయత్నించడు. భార్య మీద తనకు ప్రేమ వుండడం వల్లనే తనకు సేవచేసే అవకాశం భార్యకి కలిగిస్తున్నా ననుకుంటాడు. ఈ భర్తల వ్యవహారం ఎలా వుంటుందంటే "మా ఇంటి కొస్తే మాకేం తెస్తావ్? మీ ఇంటికొస్తే మాకేం ఇస్తావ్?" అన్నట్టు వుంటుంది భార్యకి భర్త మీద ప్రేమ వున్నా భర్తకే సేవ చెయ్యాలి. భర్తకి భార్య మీద ప్రేమ వున్నా భర్తకే సేవ చెయ్యాలి. సేవలన్నీ

భర్తకే! నాకు తెలిసిన ఒక విషయం చెపుతాను, చూడండి. భర్త డాక్టరు. భార్య లెక్చరర్. (ఇప్పుడు వాళ్ళు విడిపోయారు) ఆ భర్త భార్య మీద పెట్టిన కంప్లయింట్లలో ఒకటి ఏమిటంటే— తన భార్య తనకి అన్నం వడ్డించేటప్పుడు తగినంత గౌరవం చూపదని! టేబుల్ దగ్గర కూర్చుని అతను ఒంటరిగా తింటున్నప్పుడుగానీ, ఇద్దరూ తింటున్నప్పుడుగానీ ఆమే అతనికి వడ్డిస్తూ వుండాలి. ఆ వడ్డించడం గురించి అతని ఫిర్యాదు ఏమిటంటే— అలా వడ్డించేటప్పుడు ఆమె కూర్చునే వడ్డిస్తుందట! నిలబడి వడ్డించదట! 'యజమాని'తోపాటు 'బానిస' కూడా సమానంగా కూర్చోవడం యజమాని అగౌరవానికీ, బానిస నించోవడం యజమాని గౌరవానికీ గుర్తు కదా? ఫిర్యాదులు అప్పుడే అయిపోలేదు. అతను తింటూ వున్నప్పుడు గ్లాసులో మంచినీళ్ళు అయిపోతే ఆమె వెంటనే నింపదట! (నీళ్ళ చెంబు అక్కడే వుంటుంది). "గ్లాసులో నీళ్ళు అయిపోగానే వెంటనే నీళ్ళెందుకు పొయ్యదబ్బా?" అని ఆ భర్తకి ఆశ్చర్యం! కోపం! భార్యనించే ఆ రకం సేవ రాబట్టాలనీ, అందులో లోపం జరగకూడదనీ ఆ భర్త ఆశిస్తున్నాడన్నమాట! (భార్య, ఆ ఖాళీ గ్లాసుతో భర్త నెత్తిమీద ఒక్కటి పెడితే అద్భుతంగా వుండదూ? చెంబుతో పెడితే మరింత అద్భుతం! గ్లాసు ఖాళీ అయితే గ్లాసుతోటీ, చెంబు ఖాళీ అయితే చెంబుతోటీ! కార్టూన్లు వేసే వాళ్ళకి అద్భుతమైన సమాచారం! వడ్డనల దగ్గర భార్యలు గరిటెలు తీసినా, గ్లాసులు తీసినా "ఎందుకూ అది తీస్తున్నావూ?" అని కంగారెత్తే భర్తల్ని గీసుకోవచ్చు).

మేము కూకట్‌పల్లిలో వుండేటప్పుడు ఆ ఇంటి పక్క చాలా పేద కుటుంబాలు వుండేవి. ఇక్కడ పేద కుటుంబాలు లేవని కాదు అక్కడ భార్యాభర్తల పోట్లాటలు అందరికీ తెలిసిపోతూ వుండేవి. ఒక కుటుంబంలో ఎప్పుడూ ఒక తగువేమిటంటే— భర్త ఇంటికి రాగానే భార్య శ్రద్ధగా

అన్నం పెట్టదని! "నువ్వసలు ఆడదానివేనా? మొగోడికి ఏడీ పెట్టాచూసే దేమైనా వుందా?" అని బూతులు తిడుతూ వుండేవాడు. ఆ ఆడమనిషి. పగలంతా బోలెడు పనులు చేసుకునేది. బయటికిపోయి వీధులన్నీ తిరిగి గొంతలు కుట్టేపని చేసి వచ్చేది. లేకపోతే కూలి పనిచేసి వచ్చేది. ఇంటికి వచ్చాక పొయ్యిలోకి కంపలు ఏరుకు వచ్చేది. గుడిసెలో పనులన్నీ చేసు కునేది. అలా పనులతో సతమతమవుతూ వుంటే ఆ భర్తవచ్చి తిండిపెట్టే దగ్గర తగువు పెట్టేవాడు. గ్రామాల్లో నిరుపేద కుటుంబాల దగ్గర్నించీ, నగరాల్లో ప్రొఫెసర్ల కుటుంబాలవరకూ భార్యలు చెయ్యవలసిన సేవల గురించి ఎన్ని రకాల తగువులో! (ఈ భర్తల మణిహారంలోకి "కమ్యూ నిస్టు" భర్తల్ని కూడా కలుపుకోవాలి. వీళ్ళకి ఏ కోణంలోనూ కమ్యూనిస్టు జీవిత విధానం వుండదు కాబట్టి, భార్యలతో చాకిరీలు చేయించుకునే విష యంలో వీళ్ళు ఫ్యూడల్, బూర్జువా భర్తలకేమీ తీసిపోరు).

ఈ సేవల దాస్యం భార్యాభర్తలమధ్యేకాదు. కన్నకొడుకులు కూడా తల్లుల్ని ఈ సేవలకోసం కాల్చుకుతింటారు. "అమ్మా! మంచినీళ్ళివ్వవే! అన్నం పెట్టవే" అని కేకలతోనే కొడుకులు తల్లుల్ని పలకరిస్తారు. కొడుకు ఇంటికి వచ్చేసరికి, అతను ఇరవై ఏళ్ళవాడైనా, ముప్పై ఏళ్ళవాడైనా తల్లి ఎంత పెద్దదైనా, ఎన్ని పనుల్లోవున్నా, నిద్రలోవున్నా లేచి అన్నం పెట్టవలసిందే. "నేను పెట్టుకుంటాను కదా, నువ్వలా కూర్చో అమ్మా" అని ఏ కొడుకూ అనడు. తల్లి అయితే ఇంకానయమే. ఇంట్లోఅమ్మమ్మో, నాయనమ్మో వుంటే, ఆ ముసలమ్మయినా లేచి అన్నం పెట్టవలసిందే. పదీ సార్లు కూర్చునీ లేచీ వడ్డన చెయ్యాలి. వంశోద్ధారకుడు పళ్ళెంలో చెయ్యి కడిగి లేచిపోతాడు. ముసలమ్మే ఆ ఎంగిలిపళ్ళెం తియ్యాలి. ఈకొడుకులూ, మనవళ్ళూ, తల్లులికీ, అమ్మమ్మలకీ, నాయనమ్మలకీ ఎన్నడయినా అన్నాలు వడ్డించి వుంటారా? పోనీ వడ్డించబోతారా? వారి ఎంగిలి పళ్ళాలు తీస్తారా?

ఎప్పుడైనా వాళ్ళకి గ్లాసెడు మంచినీళ్ళయినా అందిస్తారా? అలాంటిదృశ్యాలు ఇప్పటికి ఎవ్వరూ చూసి వుండరు? ఎంత సేపూ పురుషులకి స్త్రీలు సేవలు చెయ్యడమేగదా? ఆ స్త్రీ కన్నతల్లి అవనీ, భార్య అవనీ, బిడ్డ అవనీ!

ఇద్దరు 'స్నేహితులు' కూర్చుని అన్నాలు తింటున్నారనుకుందాం. వడ్డన బాధ్యత ఎవరిదనే ప్రశ్న వస్తుందా? ఒక్కొక్కరూ ఒక్కో పని చేస్తారు. భార్యాభర్తలూ, పిల్లలూ అలాగే చేసుకోకూడదూ? 'అన్నాలు వడ్డించడం' అంటే దానికి నాలుగైదు రకాల పనులు వుంటాయి. ఒకరు అన్నాలు పెడుతూ వుంటే, ఒకరు కూరలు వెయ్యవచ్చు. ఒకరు మంచి నీళ్ళు సిద్ధం చేస్తూవుంటే, ఒకరు ఇంకేదో పని చెయ్యవచ్చు. తినేటప్పుడు ఎవరికి కావలసింది వాళ్ళు వడ్డించుకుంటూ వుండవచ్చు. లేదా ఆ సందర్భాన్నిబట్టి ఒకరు ఇంకొకరికి వడ్డిస్తే వడ్డిస్తారు. ఒకసారి భర్తే భార్యకు వడ్డించవచ్చు. ఇంకోసారి కొడుకే తల్లికి వడ్డించవచ్చు. ఎప్పుడూ స్త్రీలే పురుషులకు వడ్డించాలనే రూలేమీ వుండనక్కరలేదు. అన్నాలు ముగిశాక కూడా ఎవరి పళ్ళాలు వాళ్ళు తీసెయ్యడం, సర్దవలసినవన్నీ కలిసి సర్దెయ్యడం చెయ్యవచ్చు. ఇలా జరిగితే ప్రేమానురాగాలు నశిస్తాయా, ఎక్కువవుతాయా?

గృహ సేవలన్నీ దాస్యమేనని స్త్రీలు అర్థం చేసుకుంటున్నట్టే పురుషులు కూడా అర్థంచేసుకోవాలి. తమనుతాము త్వరత్వరగాసంస్కరించుకోవాలి. ఎప్పుడూ "యజమాని" దృష్టితోనే సేవల్ని ఆశిస్తూ వుంటే ఇప్పటికీ భార్యలు సేవలు చేస్తోనే వున్నా, వాళ్ళ మనసుల్లో వున్న విసుగూ, నిష్ఠూరమూ, అవమానమూ వాళ్ళ సేవల్లో ప్రతిఫలిస్తాయి. అందుకే 'ఖాళీ అయిన గ్లాసులో నీళ్ళు నింపకపోవడం'.

స్త్రీ పురుషుల మధ్య ఇప్పుడు వున్న 'శ్రమ విభజన' అంతా స్త్రీ పురుషుల్ని అసమానులుగా వుంచేదే. కాబట్టి, అయ్యా 'ప్రేమానురాగాల'

సంగతి ఎత్తకండి! స్త్రీ పురుషుల మధ్య అవి ఇంకా ప్రారంభం కాలేదు. స్త్రీలు పురుషులకోసం చేస్తోన్న సేవలన్నీ బానిస సేవలే. అందులో సాంప్రదాయ దాస్యం తప్ప ప్రేమ అనేదేమీలేదు. 'సమానత్వం' లేని చోట స్నేహం వుండదు. 'స్నేహం' లేనిచోట ప్రేమ వుండదు.

*　　　*　　　*

కె. రమేష్‌చంద్ర, కావలి.

ప్ర: చలంగారికి మార్క్సిస్టు దృక్పథముందా?

జ: లేదు. ఆయన మార్క్సిస్టు పుస్తకాలేమీ చదవలేదు. కానీ మార్క్సిస్టు దృక్పథం తెలియకుండా కూడా సమాజంలోవున్న దుర్మార్గాల్ని చూసి కొందరు కొన్ని అభివృద్ధికరమైన విమర్శలు చేయగలుగుతారు. అలాగే ఆయన కొన్ని మంచి విషయాలు రాశారు. (కొన్ని తప్పు విషయాలతో పాటు).

ప్ర: ఒక కుటుంబంలో భర్త పనిమనిషితో సంబంధం పెట్టుకున్నాడు. ఆ 'కసి'తో భార్య మరొకరితో సంబంధం పెట్టుకుంది భర్త 'తను చేసింది తప్పు' అని పశ్చాత్తాపపడుతున్నాడు. భార్య తనది తప్పని గుర్తించకపోగా సమర్థించుకుంటూ తన అక్రమ సంబంధాన్ని కొనసాగిస్తోంది. ఇద్దరూ పరస్పరం ఆరోపించుకుంటూ తాము ఆత్మీయంగా భావించిన మూడో మనిషికి చెప్పుకున్నారు. ఆ మూడోమనిషి స్థానంలోమీరుంటే ఎవర్ని ఎలా చివాట్లు పెట్టి, సరిదిద్దే ప్రయత్నం చేస్తారు?

జ : ఆ మూడో మనిషి స్థానంలో నేను వుండను. ఎందుకంటే, అలాంటి వ్యక్తులని తెలిశాక వాళ్ళతో నేను స్నేహం చెయ్యను. వాళ్ళతో ఏం చెపుతాననే ప్రశ్నే లేదు.

ప్ర : మీరు నిర్వహిస్తున్న ఈ శీర్షిక కూడా 'సరుకు' అమ్మకం పెంచుకునేందుకే అంటాను. మీరేమంటారు ?

జ : కార్మికులు ఫ్యాక్టరీలో దారమో, బట్టో, కుర్చీలో, ఏదో ఒకటి తయారుచేసేటప్పుడు పెట్టుబడిదారుడితో "ఈ సరుకుని నువ్వు అమ్ము కుంటావు, కాబట్టి మేము తయారు చెయ్యం" అంటారా? అనరు. అన వలసింది అది కాదు. ఈ పత్రిక కూడా సరుకే. అందులో ఈ శీర్షి కకూడా ఒక భాగమే. అయితే, ఫలానా రకంగానే రాయమని పత్రికలవాళ్ళు నాకు నిబంధన పెట్టలేదు. అలాంటి నిబంధన పెడితే నేను రాయడానికి ఒప్పు కోను. ఏ ప్రశ్నకి ఏది సరైన జవాబని నేను అనుకుంటున్నానో అదే చెప్తున్నాను. నా అభిప్రాయాలు చెప్పడంలో నేను రాజీ పడడంలేదు. కాబట్టి సరుకు అమ్మకాల ప్రసక్తి నాకు అనవసరం. నా అభిప్రాయాలు పాఠకులకు అందడమే నాకు అవసరం.

ప్ర : "కమ్యూనిస్టుల్ని దుమ్మెత్తిపొయ్యడమే పనిగా పెట్టుకుంది రంగనాయకమ్మ" అంటున్నవారికి మీ సమాధానం ఏమిటి?

జ : మొదట నా సమాధానం కాదు- మీ సమాధానం కావాలి. అలా అనేవాళ్ళతో మీరేమంటారు? కమ్యూనిస్టులైతే వాళ్ళని 'దుమ్మెత్తి' పొయ్య వలసిన అవసరం ఏముంటుంది? కమ్యూనిస్టులు చెయ్యకూడని పనులు చేసేవాళ్ళనే కదా 'దుమ్మెత్తి' పోసేది?

* * *

వి. నిర్మలా ప్రియదర్శిని, పోరుమామిళ్ళ.

ప్ర : మా ప్రశ్నలకు మీరు 'ఉత్తమ ప్రశ్నల' పోటీని పెట్టలే దెందుకని?

జ : ప్రశ్నల్లో 'ఉత్తమత్వం', 'అధమత్వం' అనే తేడాలు వుండవు. ప్రశ్న అంటే సందేహం. ఏ సందేహమైనా ఆలోచిస్తున్నారనడానికే గుర్తు. ప్రకృతినీ, సమాజాన్ని అర్థం చేసుకోవడంలో అనేక సందేహాలు వస్తాయి. ప్రతీ సందేహమూ తీరవలసిందే. దేని అవసరం దానిది. ప్రశ్నల్లో కూడా

తెలివైన ప్రశ్నలూ, తెలివితక్కువ ప్రశ్నలూ అనే తేడాలు వున్నా, తెలివైన ప్రశ్నచే ఉత్తమమైన ప్రశ్నలని నిర్ణయించడానికి వీలులేదు. 'పోటీ' అనేది పెట్టుబడిదారీ దృష్టి. 'లాభం' కోసం పోటీపడే విధానంలో నించే అన్నిట్లోకి పోటీ ప్రవేశించింది. చదువుల్లో పోటీ, ఆటల్లో పోటీ, రచనల్లో పోటీ, అందాల్లో పోటీ, పువ్వుల్లో పోటీ, శిశువుల్లో పోటీ, అలాగే ప్రశ్నల్లో పోటీ! పోటీ అనేది అసహజమైనది, ప్రశ్నల్లో దేని ప్రయోజనం దానిదే కదా ?

* * *

భానుప్రసాద్, ఏలేశ్వరం.

ప్ర : కథ- కథానిక. నవల-నవలిక, నాటకం-నాటిక — వీటి లక్షణాలను, వీటి మధ్యగల పోలికలను, తేడాలను తెలుపవలసిందిగా కోరుచున్నాను.

జ : కథకీ, కథానికకీ (అలాగే, మిగతా జంటల్లో కూడా) 'సైజు'లోనే తేడా అనుకుంటాను నేను. కథకన్నా కథానిక చిన్నదిగా వుంటుంది. నవల కన్నా నవలిక చిన్నది. నాటకం కన్నా నాటిక చిన్నదిగా వుండడం స్పష్టంగా తెలుస్తూనే వుంటుంది. సైజులో తేడా అనేదే ప్రధాన లక్షణం అయినా, దాన్నిబట్టి కథా వస్తువూ, పాత్రలూ, సంఘటనలూ, వర్ణనలూ అన్నీ ఆనిడివికి తగిన పద్ధతిలోనే ఏర్పడతాయి కదా! ఆ రకంగా కూడా కొన్ని తేడాలు వుండవచ్చు. ఇంతకన్నా వివరాలు ఉదాహరణలతో నేను పరిశీలించలేను.

* * *

పి. వెంకట్రామయ్య, మాదికేరి (కూర్గు జిల్లా).

ప్ర : చిన్నయసూరి, వన్నెమాగార్ల గద్యము మాకు చాలా ఇష్టము. అలాంటి గద్యాలను మళ్ళీ చదివే అవకాశం కలుగుతుందంటారా? అలాంటి గద్యాలకు మన పత్రికల్లో ప్రోత్సాహం దొరుకుతుందంటారా ?

జ : అలాంటి గద్యాలు ప్రచురిస్తే 'లాభాలకు' ప్రోత్సాహందొరుకు తుందంటారా ? అది చెప్పండి ముందు. దాన్నిబట్టి ఉంటాయి పత్రికలు. మీరు ఒకరకపు గద్యంమీద ఇష్టంతో ఉన్నారు. అలాంటి ఇష్టమే ఎక్కువ మందికి ఉంటే అలాంటివారికోసం ఒక శీర్షిక పెట్టవచ్చు. అలాంటి గద్యం రాయగలిగినవారు ఆ శీర్షికలో రాస్తారు. అలాంటి గద్యం చదవాలనుకునే వారు ఆ శీర్షిక చదువుకుంటారు. 'పనికిరాని భావాల్ని' నిలిపి ఉంచకూడదు గానీ, భాషని రాయడంలో ఒక శైలిని కోరేవారికోసం ఒక శీర్షికని ఉంచ డంతో తప్పేమీ ఉండదు.

ఏ. కమలమ్మ, ఆలూరు.

ప్ర : 22 సంవత్సరాలుగా ఉపాధ్యాయినిగా (ప్రాథమిక పాఠశాల) పనిచేస్తూ వున్న నేను కూడా వాడుక భాషని పాఠ్యాంశాల్లో ప్రవేశపెట్టి నప్పుడు ధ్వజమెత్తినదాన్నే. మిగతా అంశాలలో, అంటే సైన్సు, సోషి యల్, గణితం వంటి వాటిలో వాడుక భాష రాసినా ఫరవాలేదుగానీ, "తెలుగు వాచకం"లో మాత్రం అట్లా వ్రాయటం సమంజసం కాదని ఇప్ప టికీ నా అభిప్రాయం. ఎందుకంటే వాడుక భాషకు ప్రమాణం ఏమిటి? సర్కారువారు మాట్లాడే తెలుగా ? రాయలసీమవాళ్ళు మాట్లాడే తెలుగా ? తెలంగాణాలో మాట్లాడే తెలుగా ? మరి ఇంకాక రాష్ట్ర సరిహద్దుల్లో మాట్లాడే తెలుగా ?

జ : సైన్సు, సోషల్, గణితం వంటి వాటిలో వాడుక భాషని వాడినా ఫర్వాలేదు గాని, తెలుగు వాచకంలో వాడుక భాషని వాడాల్నంటే ఏ ప్రాంతం భాషని వాడగలం- అని మీరంటున్నారు. ఆ సైన్సు, సోషల్,

గణితం పుస్తకాల్లో ఏ వాడుక భాషని వాడతామో దాన్నే తెలుగు వాచకంలో కూడా వాడకూడదా?

"ఒక్కో ప్రాంతానికి ఒక్కో మాండలీకం ఉన్నప్పుడు, వాటిలో వాడుక భాషగా దేన్ని నిర్ణయించగలం, కాబట్టి తెలుగు వాచకంలో మాత్రం గ్రాంథిక భాషనే ఉంచాలి" అని మీ అభిప్రాయం. ఒక్కో ప్రాంతానికి ఒక్కో మాండలీకం ఉందనే కారణంతో గ్రాంథిక భాషనే నిలిపి ఉంచుకోనక్కరలేదు. ఈ సందేహాలన్నిటినీ తీర్చగలిగేలాగ 'ప్రామాణిక భాషావాదం' ఉంది. వేరు వేరు ప్రాంతాల మాండలీకాలమధ్య ఇప్పుడు ఉన్నన్ని తేడాలు క్రమక్రమంగా తగ్గిపోయి, అన్నిటినించీ కొన్ని అంశాల్ని తీసుకుంటూ 'ప్రామాణిక భాష' అభివృద్ధి చెందుతుంది. ఇంకా కొంత కాలం పోయేప్పటికి, అన్ని ప్రాంతాలవారూ చక్కగా చదువుకున్నవారవుతున్నారని ఊహిద్దాం. అప్పుడు కూడా 'కూకున్నారు', 'లెగిశారు', 'తొంగున్నారు' లాంటి మాటలన్నీ ఉంటాయా? ఉండవు. అందరూ చదువుకున్నవాళ్ళయితే అందరూ ఆ రకం మాటల్ని వదిలేస్తారుకదా? ఇప్పుడు ఉన్న మాండలీకాల్లోంచి, అలా పోయినవన్నీ పోగా ఉండదగ్గవన్నీ ప్రామాణిక భాషలోకి చేరిపోతాయి.

అందరూ చదువుకున్నవాళ్ళయ్యే క్రమంలో మాండలీకాలన్నీ చాలా వరకూ పోతాయనీ, అన్ని ప్రాంతాలకి మధ్య ఒక 'ప్రామాణిక భాష' అభివృద్ధి చెందుతుందనీ, అదే సరైన పద్ధతి అనీ చాలామంది భావిస్తారు. నా అభిప్రాయం కూడా అదే. అన్ని ప్రాంతాలమధ్యా 'ప్రామాణిక భాష' అనేది ఉండడం సరైనదని అనుకున్నప్పుడు, ఇప్పటినుంచీ మన ఆలోచనలు ఆ దృష్టితోనే ఉండాలి. ఇప్పటికే ఒక ప్రామాణిక భాష ఏర్పడి ఉంది. దానితోనే తెలుగు వాచకాలు కూడా ఉండవచ్చు. అంతేగానీ, మీరు తెలుగు వాచకాలకోసమైనా గ్రాంథికం ఉండాలి - అనడం హేతుబద్ధంగా లేదు.

విద్యార్థులు తెలుగు వాచకాల్లో గ్రాంధికం చదివి, రాసీ ఏం ప్రయోజనం? దాన్ని నిత్యజీవితంలో వాడలేం కదా? కాకపోతే, వెనకటి భాషని కూడా విద్యార్థులకు చూపించాలంటే, గ్రాంధిక భాషలో కూడా ఒకటి రెండు పాఠాలు ఉంచాలి. పద్యాలన్నీ గ్రాంధిక భాషే కదా? అవి ఎలాగూ ఉండాలి.

ప్ర : ఈ ప్రశ్న విద్యాశాఖాధికారుల నడగవలసినదే అయినా మీకు తెలియజేస్తూ వున్నాను. ఒకటవ తరగతిలో పిల్లలకు అక్షరాలను గుర్తించటం ముఖ్యం. మరి ఆ అక్షరాలను గుర్తింపజేయడానికి అతి క్లిష్టమైన పదాలు ఇస్తూ వున్నారు. వాటి అర్థాల కోసం మేం కూడా డిక్షనరీ తిరగ వేయాల్సి వస్తూ వున్నది. పైగా "అర్థం ముఖ్యంగాదు, మాట వ్రాస్తే చాల"ని సూచించినారు. కాని అర్థం తెలిసిన పదాలను పిల్లలు చాలా సంతోషంగా వ్రాయటం గమనించాను. "శబర" అని వ్రాయటానికి ఇష్టపడరు. "శనగ" అంటే ఎగురుకుంటూ వ్రాస్తారు. అలాగే "సమత" అని వ్రాయమంటే తెలిసిన అక్షరాలే అయినా వ్రాయటం ఆలస్యం చేస్తారు. "సంత" అంటే నవ్వుకుంటూ వ్రాస్తారు. ఒకటవ తరగతి పిల్లలకు అక్షరాలు గుర్తించటమే ముఖ్యం కాబట్టి ప్రాంతీయ పదాలే వాడితే తప్పా? కాబట్టి, "ఇన్ని పదాలు వ్రాయగలగాలి" అనే నిబంధన పెడ్తూ ఈ టెక్స్ట్ బుక్ మెథడ్ ఒకటవ తరగతి పిల్లలకు తీసివేయాలి అని నా అభిప్రాయం. దీని మీద మీ అభిప్రాయం తెల్పగలరు.

జ : ఈ విషయంలో మీరు పూర్తిగా కరెక్టు. చదివేది అర్థంగాకపోతే 'చదువు' అనేదానికి అర్థమేముంది? చిన్న పిల్లలకు మొదట్లో అన్నీ తెలిసిన మాటలే వుండాలని మీరన్నది ఎంతో బాగుంది. క్రమంగా కొత్త మాటలు నేర్పవచ్చు. అధికారులకేం తెలుస్తుంది? రోజూ పిల్లల్ని చూస్తూ చదువులు చెప్పేది మీరు. మీ అనుభవాలే వాళ్ళు తీసుకోవాలి. పిల్లలకి చదువులు

చెప్పేవాళ్ళే పిల్లల పుస్తకాలు తయారుచేస్తే ఈ రకం సమస్యలు వుండవు. మొదట టీచర్లందరూ డిస్కస్ చేసి ఒక 'రాతప్రతి' తయారుచేసి, దాని మీద కూడా మళ్ళీ డిస్కస్ చేసి, ఫైనలైజ్ చేసి, అప్పుడు ప్రింటు చెయ్యాలి. తర్వాత కూడా టీచర్లకి వచ్చే అనుభవాల్ని బట్టి ఆ పుస్తకంలో అవసరమైన మార్పులుచేస్తూ వుండాలి. ఈ రకంగా చేస్తే, వాస్తవ పరిస్థితులకు దూరంగా వుండే టెక్స్టుబుక్ మెథడ్స్ వుండనే వుండవు. మీ అనుభవాలూ, విమర్శలూ అధికార్లకి రాయండి. ఏ క్లాసు టీచర్లయినా తమ అనుభవాలు పత్రికలకు రాయాలి.

* * *

సి. ఎస్. ప్రమీలా ప్రభాకర్, కల్పాక్కం.

ప్ర : చిన్నప్పుడు వారపత్రికలు మొదట మేము చదివి తర్వాత అమ్మ చదవడానికి ఇచ్చేవాళ్ళం. కానీ ఇప్పటి వారపత్రికలు పిల్లలు ఎక్కడ చదువుతారోనని భయంగా వుంటుంది, కారణమేమింటారు?

జ : కారణం మీకూ తెలుసు కదా? చిన్నపిల్లలేమిటి, పెద్దవాళ్ళు చూడడానికి మాత్రం బాగున్నాయా ఈ పత్రికలు? బాకపోతే, పెద్దవాళ్ళయితే ఇష్టంలేని విషయాలు చదవడం మానేస్తారు. చిన్నపిల్లలకి అదేమీ తెలియదు. ఏదీ ఎదురైతే అది చదువుతారు. ఇప్పటి పత్రికల్లో పిల్లల మనసులకు చాలా హాని కలిగించే విషయాలే వుంటున్నాయి. "ఇప్పటి పత్రికలు బాగుండడం లేదు. చిన్న పిల్లలకు పనికొచ్చేవేవీ వుండడం లేదు. మీరు చదవొద్దులెండి" అని పిల్లలకు చెప్పడం తప్ప ఇంకో మార్గం లేదు. విన్నవాళ్ళు వింటారు, లేనివాళ్ళు లేదు. ఈ వ్యాపార ప్రపంచాన్ని ఎదుర్కొనే శక్తి లేనప్పుడు పెద్దలూ, పిల్లలూ అందరూ క్షోభ పడవల సిందే.

నాగపల్లి మహేష్, మంచిర్యాల.

ప్ర : పత్రికలవారు ప్రచురిస్తున్న రచనలపై వెంటవెంటనే పాఠకులు తమ అభిప్రాయాలు రాయాలి అని మీరన్నారు. అది నిజమే. కానీ, సీరియల్స్ బాగున్నవని పొగుడుతూ రాసిన ఉత్తరాలనే ప్రచురిస్తారు. ఈ సీరియల్ బాగోలేదని, ఈ కథ బాగోలేదని విమర్శగా వ్రాసిన ఉత్తరాలు ప్రచురింపుతారేమో చూడండి. అటువంటప్పుడు ఉత్తరాలు వ్రాసి ఏం ప్రయోజన మంటారు?

జ : ప్రచురిస్తారా లేదా అనేది చూడకూడదు. ప్రచురిస్తే మంచిదే. ప్రచురించకపోయినా ఉత్తరాలు రాస్తే పాఠకుల అభిప్రాయాలు ఎడిటర్లకి తెలుస్తాయి. 'ప్రచురిస్తేనే రాయాలి గాని, ప్రచురించకపోతే ఎందుకూ?' అనుకోవడం అంటే, ఆ పాఠకుడికి తన ఉత్తరం పత్రికలో రావడమే ముఖ్యంగానీ, తన విమర్శ ఎడిటర్‌కి తెలియడం ముఖ్యం కాదన్న మాట! ఈ కథ బాగోలేదనీ, ఈ నవల బాగోలేదనీ, ఇలాంటివి వెయ్యొద్దనీ ఎవరికి చెప్పాలి పాఠకుడు? ఎడిటర్‌కే కదా? ఉత్తరాలు రాయడం వల్ల ఆ పని నెరవేరుతుంది కదా?

* * *

గెడా రంగారావు, హైదరాబాద్.

ప్ర : ఇంగ్లీషు మీడియంలో చదువులు వుండరాదని కొందరు అంటూ వుంటారు. చిన్నతనం నుంచీ ఏ భాషలో చదువు నేర్పితే ఆ భాష లోనే వస్తుంది కదా? మీడియమ్ ఏదైతే ఏమిటి? ప్రపంచ లింక్ భాషగా ఇంగ్లీషు వుండకూడదా?

జ : పిల్లలు పసితనం నించీ ఏ భాషని వింటూ పెరుగుతారో, ఏ భాషని మాట్లాడడం ప్రారంభిస్తారో - అది ఆ పిల్లలకు మాతృభాష (ఫస్ట్ లాంగ్వేజ్). తెలుగు కుటుంబాల్లో పిల్లలు పసితనం నించీ తెలుగునే వింటూ,

తెలుగులోనే మాట్లాడడం ప్రారంభిస్తారు. చిన్నతనం నించే వింటూ, మాట్లాడుతూ వుండే భాషలో నియమాలన్నీ పిల్లలకు తెలిసిపోతూ వుంటాయి. చిన్న పిల్లలు కూడా "అక్క వచ్చింది. అన్న వచ్చాడు" అంటారు గానీ, "అక్క వచ్చాడు, అన్న వచ్చింది" అనరు. (మరీ చిన్న పిల్లలైతే కొన్ని తప్పులు మాట్లాడతారు). 'చదువు' అనేది ఏమిటంటే- చిన్నతనం నించీ తెలిసిన భాషకే 'రాత' నేర్చుకోవడం. ఇంకా చదువు ప్రారంభించని పిల్లలకు భాషని 'మాట్లాడడం' మాత్రమే వస్తే, ఆ భాష లోనే చదువు ప్రారంభించడం వల్ల, ఆ భాషని 'రాయడమూ, చదవడమూ' కూడా వస్తాయి. ఆ రకంగా ఒకే భాషలో మాట్లాడడమూ, రాయడమూ కలిసి ఆ భాషాజ్ఞానం సంపూర్ణం అవుతుంది. 'తల' అని నోటితో మాట్లాడే మాటనే, 'తల' అని పలక మీద రాస్తే, ఆ 'మాట్లాడే' మాటని 'ఇలా రాయాలన్న మాట' అని ఆ భాషకి వుండే 'రాత' రూపం గ్రహిస్తారు పిల్లలు. తెలిసిన భాషని రాయడం ప్రారంభిస్తేనే భాషని రాయడం అంటే ఏమిటో, 'లిపి' అంటే ఏమిటో, రోజూ తాము మాట్లాడే మాటల్లో ఎన్నెన్ని సూత్రాలు వున్నాయో అవన్నీ తెలుస్తూ వుంటాయి. 'చదువు' అనే కార్య క్రమం ఒక స్పష్టమైన గ్రహింపుతోటీ, భాషకి సంబంధించిన తార్కికమైన జ్ఞానంతోటీ నడుస్తూ వుంటుంది. మాతృభాషలోనే చదువు ప్రారంభించడం వల్ల భాషని మాట్లాడడానికీ, రాయడానికీ సహజ సంబంధం ఏర్పడుతుంది. మాట్లాడేది ఒక భాషా, రాయడం ప్రారంభించింది అప్పటి వరకూ ఏమీ తెలియని ఇంకో భాషా అయితే మాట్లాడేదానికీ, రాసేదానికీ పొంతన వుండదు. అలాంటప్పుడు మాట్లాడే భాషని రాయడం రాదు, రాసే భాషని మాట్లాడడం రాదు. అలాంటి వైరుధ్యంతో వుంటుంది చదువు. మాతృ భాషలోనే చదువు ప్రారంభించి, భాషని రాయడం అంటే ఏమిటో కొన్ని సంవత్సరాల వరకూ తెలిసిన తర్వాత, రెండో భాషని నేర్చుకోవడం

ప్రారంభిస్తే ఏ సమస్యా వుండదు. మాతృభాషని రాయడం తెలియకుండానే, తెలియని భాషలో చదువు మొదలుపెడితే, దాని నియమాలేమీ తెలియక అంతా అయోమయంగా వుంటుంది. "కుక్క మొరుగుతుంది" అని రాయిస్తే తెలుగు పిల్లలకు అందులో తెలియని సూత్రాలేమీ వుండవు. అదే "డాగ్ బార్క్స్" అని ఇంగ్లీషులో రాయిస్తే, దాని అర్థం చెప్పినా కూడా, "బార్క్స్"లో నియమం ఏమిటో అర్థం కాదు. 'డాగ్' అనే మాట కూడా చిన్న వయసు పిల్లలకు 'పరాయి'గా వుంటుంది. 'డాగ్ బార్క్స్'ని అర్థం చేసుకోకుండా బట్టీ పట్టవలసిందే తప్ప, మధ్యలో మరచిపోతే సహజమైన భాషాజ్ఞానంతో దాన్ని పూరించే శక్తి విద్యార్థులకు వుండదు.

మాతృభాషలో అయితే, తనకి తెలిసిన రకరకాల మాటల్నీ, రకరకాల క్రియల్నీ వాడుతూ ఎంతో సునాయాసంగా అనేక వాక్యాలు రాయగలిగే విద్యార్థులు పరభాషలో ఒక్క వాక్యం కూడా సునాయాసంగా రాయలేరు. తెలియని భాషద్వారా విషయాలు నేర్చుకోవడానికి చాలాకాలం వ్యర్థం అవుతుంది. అందుకే తెలియని భాషలో చదువు - గుడ్డి చదువు.

కళ్ళు చక్కగా వున్న మనిషి కళ్ళకి గంతలు కట్టి, కర్ర ఇచ్చి నడిపిస్తే, ఆ మనిషి కూడా నడుస్తాడు గానీ, తన కళ్ళతో తను స్వయంగా చూడలేడు కాబట్టి కిందా మీదా పడుతూ అస్తవ్యస్తంగా నడుస్తాడు. ఆ నడక రూపం మారిపోయి, నడక వేగం తగ్గిపోతుంది. తెలియని భాషతో చదువు సరిగ్గా అలాంటిదే. మాతృభాషలో చదివేటప్పుడు విద్యార్థులు టీచర్లని ఎక్కడికక్కడ అనేక ప్రశ్నలు అడుగుతూ టీచర్లతో సమానంగా మాట్లాడుతూ వుత్సాహంగా వుంటారు. అదే తెలియని భాష అయితే, నోరు తెరచి మాట్లాడే శక్తి వుండదు. ఇంగ్లీషు మీడియంతో చదివే తెలుగు పిల్లలు, ఏదైనా సందేహం వచ్చి తెలుగులో మాట్లాడబోతే "స్పీక్ ఇన్ ఇంగ్లీష్" (ఇంగ్లీషులో మాట్లాడు)

అని టీచర్లు కళ్ళెర్ర చెయ్యగానే పిల్లలు మాట్లాడడం ఆపేస్తారు. ఇంగ్లీషు మాట్లాడడం రానివాళ్ళకి ఇంగ్లీషులోనే మాట్లాడాలని ఒత్తిడి! ఇంగ్లీషులో మాట్లాడకపోతే, నోరు తెరిచి ప్రశ్నలడిగే హక్కు లేదు! ఎన్ని సందేహాలు వచ్చినా, నోరెత్తలేక, సందేహాలు తీరక పిల్లల్లో తర్కించే శక్తి నేర్చుకునే వుత్సాహమూ నశించిపోతాయి. ఈ పరిస్థితి అనేక సంవత్సరాల వరకూ వుండిపోతుంది. పరాయి భాష పట్టుబడడం అనేక సంవత్సరాల దాకా జరగదు కాబట్టి, విద్యార్థి దశలో అనేక సంవత్సరాల కాలం ఎందుకూ పనికిరాని కాలంగా వ్యర్థమైపోతుంది. అంతేగాక, పిల్లలు చాలా అవమాన పడిపోతూ, తెలియని క్షోభ పడిపోతూ వుంటారు. సహజంగా తెలిసిన భాషలో స్వయంగా ఆలోచిస్తూ, ప్రశ్నిస్తూ, నేర్చుకునే అవకాశం లేనప్పుడు ఇక అర్థం కాకుండా గుడ్డిగా పరాయి భాషని బట్టీ పట్టే పద్ధతే మిగులుతుంది. అలా చాలా సంవత్సరాలు జరిగిన తర్వాతే, పరాయి భాష కొంత 'అలవాటు' అవుతుంది. అదికూడా మాతృభాషతో సమానంగా వుండదు. మాతృభాషలో చదువు వల్ల ఈ నష్టాలేమీ వుండవు. విద్యార్థి శక్తులన్నీ వికసిస్తాయి. చిన్నతనం నించే ఏ భాషలో చదివిస్తే ఆ భాషే వస్తుందికదా అని మీ ప్రశ్న! వస్తుంది గాని ఆ రావడంలో చాలా తేడా వుంది. కళ్ళు తెరిచి నడవడానికీ, కళ్ళు మూసుకుని నడవడానికీ వున్నంత తేడా అది! అంగవైకల్యం ఏర్పడినంత తేడా అది!

ఇప్పుడు ఇంగ్లీషు తేలిగ్గా మాట్లాడేవాళ్ళందరూ చిన్నతనంనించీ ఇంగ్లీషు మీడియంలోనే చదివినవాళ్ళు కాదు. ఇంగ్లీషు మీడియం లేకుండా కూడా ఇంగ్లీషుని చక్కగానే నేర్పవచ్చు. ఏ భాషనైనా నేర్పవచ్చు. మాతృభాష మాత్రమే తెలిసిన పిల్లలకి పరాయి భాషతో చదువు మొదలు పెట్టడం. అంటే, ఆ తల్లిదండ్రులు, [illegible] [illegible] ఆ పిల్ల

లకు చేసే ద్రోహం ఇంతా అంతా కాదు. విద్యకు సంబంధించిన తృప్తిని, ఆనందాన్ని ధ్వంసం చెయ్యడమే అది!

పిల్లలు రోజూ హోంవర్కులు పూర్తిచేస్తూ, మార్కులూ, ర్యాంకులూ తెచ్చుకుంటే చాలని సంతోషించే తల్లిదండ్రులకు ఈ సహజ విషయాలేవీ పట్టవు. పిల్లలతో 'మమ్మీ', 'డాడీ' అని పిలిపించుకుని ఆనందించేటంత ఇంగ్లీషు వ్యామోహంలో కూరుకుపోయినవాళ్ళు మాతృభాషలో చదువుల విలువని కనీసంగా కూడా అర్థం చేసుకోలేరు.

ఇక, లింకు భాష విషయం. ప్రపంచానికంతటికీ ఏదో ఒక లింకు భాష వుండడం అనే ఊహ సక్రమంగానే వుంటుంది. 'ఇంగ్లీషు లింకు భాషగా వుండాలి' అనుకున్నప్పుడు కూడా ఇతర భాషల పిల్లలు ఇంగ్లీషు మీడియమ్‌తో చదవక్కరలేదు. చదువు ఎప్పుడూ మాతృభాషలోనే సాగాలి. లింకు భాష అనేదాన్ని రెండో భాషగా నేర్చుకోవచ్చు.

జ. పి. రామచంద్రుడు, కర్నూలు.

ప్ర : మారే పాఠకుల అభిరుచిని బట్టే నవలలూ వుంటున్నాయి. మరి అలాంటప్పుడు సాహిత్యం దిగజారిపోయిందనడం ఎంత వరకూ సమంజసం ?

జ : 'మారే పాఠకుల అభిరుచినిబట్టే' అనడం అంటే మొదట పాఠకుల అభిరుచులే మారుతున్నాయనీ, అవి దిగజారుతున్నాయనీ, కాబట్టి పాఠకుల 'దిగజారుడి'కి కావలసిన విధంగా రచయితలు రాస్తున్నారనీ మీ అభిప్రాయం. ఇందులో అనేక కోణాలు వున్నాయి. 1) పాఠకుల అభిరుచులు ఎందుకు మారుతున్నాయి ? ఎందుకు దిగజారుతున్నాయి ? 2) పాఠకులు దిగజారినా, రచయితలూ, పత్రికలూ కూడా పాఠకుల్నిబట్టి దిగజారవల

సించేనా ? పాఠకులకు మంచి విషయాలు ఇచ్చి, వారి దిగజారుడుతనాన్ని ఆపకూడదా ? 3) పాఠకులు కొనకపోతే ఈ దిగజారుడు సాహిత్యం వుత్పత్తి కాదు. కానీ, ఎందుకు కొంటున్నారు ? 'కొనకపోతే' అనే చోటే వుంది సమస్యంతా. 'ఈ పత్రికలు బాగోలేదు, వీటిని కొనవద్దు. ఈ సినిమాలు బాగోలేదు. వీటిని చూడవద్దు' అని, కొనే సరుకుల' మంచి చెడ్డల్ని గట్టిగా పట్టించుకునే దృష్టి ప్రజలకు ఇప్పటి వరకూ సమాజం నేర్పలేదు. సరుకులన్నీ కల్తీగానే వుంటున్నాయని తెలిసి కూడా ఆ సరుకులే ఎందుకు కొంటున్నారు ? రాళ్ళ బియ్యం కొని వీలైనంతవరకూ రాళ్ళు ఏరుకోడానికి ప్రయత్నిస్తారు. కొన్ని రాళ్ళు ఏరలేకపోతే వాటివల్ల అసౌకర్యాలూ, నష్టాలూ భరిస్తారు. కల్తీని తీసివెయ్యడం సాధ్యంకాని వస్తువుల్ని అలాగే వాడేసుకుంటారు. వాటివల్ల నష్టాలు అనుభవిస్తారు. అలాగే సినిమాలూ, పత్రికలూ కూడా. కొంతమంది ఆ కల్తీలో కూడా ఏమన్నా మంచి వుంటే దాన్ని ఏరుకోవడానికి ప్రయత్నిస్తారు. అంత గ్రహింపు లేనివాళ్ళు నాశనమౌతారు. ప్రజల జీవితాల్లోకి అనేక రకాల కల్తీ సరుకులు ప్రవేశిస్తున్నాయంటే "ఈ కల్తీ సరుకులే మాకు కావాలి" అని వాళ్ళు కోరుకోవడం వల్ల కాదు. వున్నవన్నీ కల్తీసరుకులే అవడంవల్ల. అలాంటప్పుడు వాటితోనే రాజీపడక తప్పదు. 'వుత్పత్తులు' ఎలా వుండాలో నిర్ణయించే అధికారం పెట్టుబడివారి వర్గం చేతుల్లో వుంది. ఆ వర్గం తయారు చేయించే సరుకుల్ని ఆ వర్గం ఎలాగూ విమర్శ లేకుండానే వుపయోగిస్తుంది. విమర్శ వుండవలసిందంతా రెండో వర్గానికే. ఆ రెండో వర్గం, గ్రహింపులేనితనంలో వుంది. కాబట్టి సరుకుల ప్రపంచం పోటీలో నిరాటంకంగా కొట్టుకుపోతోంది.

సాదు ప్రసాద్, భీమవరం.

ప్ర : ఈమధ్యనే "జమిల్యా", "తల్లీ భూదేవి", "కోసక్కులు" అనే పుస్తకాలు చదివాను. ఎంత అద్భుతం ! రచయితలకి ఎంతటి ప్రతిభ! నా ఆనందాన్ని వర్ణించటానికి నేను చదివిన సాహిత్యంలోని పదాలు నచ్చట్లేదు. "కోసక్కులు" టాల్‌స్టాయ్ పదేళ్ళు వ్రాసాడట. మేం జీవితాంతం తపస్సు చేసినా అంత నిజాయితీగా వ్రాయగలమా ? 'జమిల్యా', 'తల్లీ భూదేవి' చదివాక 'చెమటతో నిండిన తియ్యని మన్ను వాసన చూసిన' భావన కలిగింది. ఈ వార పత్రికల నిండా ఎందుకీ కుప్పి గంతులు? ఎందుకీ సాముగారడీలు? నేటి దినపత్రికలు వారానికి ఒక పేజీ సాహిత్యానికి కేటాయించి, రోజూ 10 పేజీలు 'ఖరాబు' చేస్తున్నాయి. వెనకటి రచయితల లాగా మేం నిజాయితీగా రచనలు చేయాలంటే ఏం చేయాలి?

జ : 'మీరు చెప్పిన వెనుకటి రచయితలు 'డబ్బు' కోసమో, 'పాప్యులారిటీ' కోసమో రాయలేదు. బహుమతుల కోసం రాయలేదు. ఎడిటరు, ఎక్కడేది చేర్చమంటే అది చేర్చుకుంటూ రాయలేదు. చెప్పా లనుకున్న 'వస్తువు'ని అర్థం చేసుకుని, వున్నత విలువలను దృష్టిలో పెట్టు కుని నిదానంగా రాశారు. వారి కళాత్మక శక్తులు కూడా కలిసి మంచి రచ నలు తయారయ్యాయి. మంచి రచన తయారవ్వాలంటే ఎప్పుడైనా ఎవరికైనా అదే మార్గం.

* * *

...హైదరాబాద్.

ప్ర : మా నాన్న విషయంలో మీ సలహాని అభ్యర్థిస్తున్నాను. మా నాన్న మొదటి నుండీ వ్యసనపరుడు. చిన్నతనంలో మాకు తెలిసేది కాదు. ఇంటి బాధ్యతలు పట్టించుకునేవాడు కాదు. మా చిన్నతనంలో

మా అమ్మ పొలం పనులకు కూడా వెళ్ళేది. ఇప్పుడు మేమందరం పెద్ద వాళ్ళమైనాము. డబ్బుకి ఫర్వాలేదు. మా అమ్మకి 53 సం.ల వయస్సు. నాన్నకి 62. ప్రస్తుత సమస్య చెపుతాను. మా అన్నకి స్నేహితుడైన బంధువు ఒకాయన వున్నాడు. అతను చాలా మంచివాడు. మా ఇంటికి అప్పుడప్పుడు వస్తూ వుంటాడు. మా నాన్న దుర్మార్గం ఎంతకి దారి తీసిందంటే, అతడితో మా అమ్మని అనుమానిస్తున్నాడు. మాకు తెలియకుండా మా అమ్మని తిట్లతో బాధపెడుతున్నాడు. ఈ విషయం కొంత కాలంపరకూ మాకు తెలియదు. మొదటే మా నాన్నంటే మాకందరికీ కోపం. ఇప్పుడైతే అందరికీ చెప్పలేనంత బాధగా వుంది. ఇంట్లో ఈ వాతావరణం దుర్భరంగా వుంది. మా అమ్మ ఎప్పుడూ ఏడుస్తూ వుంటుంది. ఆమె ఏడుపూ, భయమూ చూస్తే మా నాన్న మీద విపరీతమైన కసి పుడుతోంది. మా అమ్మ ఏమంటుందంటే — 'మీరు నన్ను గౌరవంగా చూస్తారని మీ మనసులు పాడు జేస్తానికి ఇలాంటి నిందవేశాడు. మీ నాన్నని కూడా నిర్లక్ష్యం చెయ్యకుండా మంచిగా చూడండి' అంటుంది. ఆమె భయంతో అంటుంది గానీ ఆ వ్యక్తిమీద మొదటే గౌరవం లేదు. ఆ దుర్మార్గుడిమీద ఇప్పుడు గౌరవం ఎలా కలుగుతుంది? మా అమ్మకి ఇంత అవమానం, బాధ మాకు దుర్భరంగా వుంటున్నది. మేము చాలా దురదృష్టవంతులం. వాడు (వాడిని నాన్న అని మొదట మీకు అర్థం కావాలని రాశాను) మా అమ్మను మెంటల్‌గా టార్చర్ చేసి విపరీతమైన భయం పెట్టి వుంచాడు. అందరికన్నా నేనెక్కువ కోపం తెచ్చుకుంటానని నాతో చెప్పకుండా చాలా విషయాలు దాస్తుంది. ఎప్పుడో మాటల మధ్య తెలుస్తాయి. వాడు అంటూ వుంటాడట అప్పుడప్పుడూ 'చూడు నువ్వుగనక ఆత్మహత్య చేసుకుంటే పెద్దమ్మాయి ఇల్లు తగల బెడతాను, ఇంకా చాలా చేస్తాను' అంటాడట. ఆత్మహత్య చేసుకోవాలనిపించేటంత బాధపెడుతున్నానని వాడికి తెలుసు.

ఇలాంటివాళ్ళ్ని ఏం చెయ్యాలి? పోలీసు కంప్లయింట్ ఇవ్వాలంటుంది మా అక్క. పోలీసులకు రుజువులేం చూపించగలం? ఇదంతా మా అమ్మకి ఇష్టం లేదు. 'తల్లుల్లారా, ఏమీ చెయ్యకండే, వూరుకోండే, వూరుకోండే' అంటూ వుంటుంది. ఈ సమస్యలోంచి ఎలా బయట పడాలో అర్థం కావడం లేదు. మా అన్న కూడా చాలా బాధపడుతున్నాడు. పెద్ద వాళ్ళకి పిల్లలేం చెప్పగలరన్నట్టు వూరుకుంటాడు. మా నాన్నలాంటి దుర్మార్గులకు గట్టిగా బుద్ధి చెప్పే సంఘాలేమైనా వుంటాయా? మీ సలహా మీద కొండంత ఆశతో రాస్తున్నాను.

జ : సంఘాలు ఎక్కడో వుంటే ప్రయోజనం లేదు. మీ ప్రాంతం లోనే, అందరి ఇళ్ళతోటి పరిచయంతో వున్న సంఘమేదైనా వుంటేనే ప్రయోజనం వుంటుంది. సంఘాలైతే చాలాడు వున్నాయిగానీ, ఆ పెద్దలు మీ సమస్యని అర్థం చేసుకుంటారని నేననుకోను. ఈ సమస్యలో పోలీసు కంప్లయింట్ కూడా అర్థరహితం. అసలు సంఘాలా, పోలీసులా ఎందుకు? సమస్యని పరిష్కరించుకునే శక్తి మీ చేతుల్లోనే వుంది. పిల్ల లందరూ 'తల్లి' మీద గౌరవంతో వున్నట్టు చెపుతున్నారు. వుత్తుత్తి గౌర వాలూ, వుత్తుత్తి సానుభూతులూ వుంటే లాభం లేదు. సందర్భం వచ్చి నప్పుడు అవి ఆచరణలోకి రావాలి. మీరందరూ కలిసి మీ నాన్నని అడ గడం ఒక్కటే సరైన పద్ధతి. అందుకు మీ అమ్మ ఒప్పుకోకపోయినా సరే. ఆమె భయం వల్ల ఒప్పుకోదు. ఆమెకు ధైర్యం చెప్పి అండగా నిలబడవలసిన బాధ్యత మీదే. మీరందరూ కలిసి మీనాన్నకి ఒక వార్నింగ్ ఇవ్వాలి. "అమ్మని నువ్వేలాంటి మాటలంటున్నావో మాకు తెలిసింది. మళ్ళీ ఇంకొక్కసారి ఆ రకంగా వాగావంటే నిన్ను ఇంట్లో వుండనిచ్చేది లేదు. ఈ సారి నువ్వు ఏంమాట్లాడినా అమ్మ మాకుచెపుతుంది. ఇన్నాళ్లూ నువ్వే తప్పు తెలుసుకుంటావని సహిస్తూ వూరుకున్నాం. నీకు బుద్ధి రాదని

అర్థమైపోయింది. ఇక నించీ ఒళ్ళు దగ్గిర పెట్టుకుంటావో, బైటికి నడుస్తావో ఆలోచించుకో. లేకపోతే, ఆత్మహత్య చేసుకునే పరిస్థితి అమ్మకి కాదు, నీకే పడుతుంది. ఇంకొక్కసారి నువ్వా పిచ్చివాగుడు వాగావంటే అందరం కలిసి మొదట నిన్ను చితకదన్ని ఆ తర్వాత ఇంట్లోంచి బైటికి గెంటుతాం. పరువు మర్యాదలకి భయపడతామనుకోకు. మా తల్లి గౌరవం కాపాడడమే మాకు గొప్ప పరువు. ఎంతటెంతట మా ప్రేమని మాఅమ్మకి చూపించాలా అని పువ్విళ్ళూరుతున్నాం. నిన్ను వీధిలోకి గెంటి 'వీడు పిచ్చి వాగుడు వాగుతున్నాడని ఇంట్లోంచి గెంటేశాం' అని అందరికీ చెప్తాం. 'తండ్రిని తన్నిన పిల్లలు' అని పేపర్లకి రాసి పంపుతాం. మమ్మల్ని నలుగురూ మెచ్చుకుంటారు గానీ నిందించరు. కాబట్టి, తెలుసా, ఒళ్ళూ నోరూ దగ్గిరపెట్టుకో" అని గట్టిగా హెచ్చరించండి. మీ చేతిలో వున్న పనికి సంఘాలూ, పోలీసులూ ఎందుకు? హెచ్చరించడం అంటే ఏదో బెదిరించడం అని కాదు. అతనిలో మార్పు రాకపోతే నిజంగా ఇంట్లోంచి గెంటి వెయ్యాలనే నిర్ణయం మీకు ఖచ్చితంగా వుండాలి. ('తండ్రి'ని పోషించడం కూడా పిల్లల బాధ్యత కాబట్టి, అతనికి ఆస్తి ఏమీ లేకపోతే నెలనెలా కొంత డబ్బు పడేస్తూ వుండాలి). 'వీళ్ళు వూరికే బెదిరిస్తున్నారు గానీ, అంతకన్నా ఏమీ చెయ్యరు' అని అతనికి అనిపిస్తే' అతను ఏ మాత్రమూ జంకడు. పరిస్థితి మారదు. కాబట్టి, ఖచ్చితంగా ఆ నిర్ణయాన్ని అమలుచేసే దృష్టి మీకు వుంటేనే అతను ఒళ్ళు దగ్గర పెట్టుకుంటాడు. మీరు మీ అమ్మ మీద వుత్తుత్తి సానుభూతులు మాత్రమే చూపినంతకాలం మీ అమ్మకి ధైర్యం రాదు. పైపై 'నోటి మాటలతో' ఎవరికీ ధైర్యం రాదు. మీ నాన్నని ఎదుర్కొంటేనే మీ అమ్మకి ధైర్యం వస్తుంది. అంతంత బిడ్డలు వుండి, తల్లి అంత అవమానంతో ఆత్మహత్య

దాకా ఆలోచిస్తోంటే, తండ్రికి బుద్ధి చెప్పకుండా మీన మేషాలు లెక్క-పెడుతూ ఇంతకాలం కూర్చున్నారంటే, మీ లాంటి బిడ్డలు ఎందుకు?

*　　*　　*

టి. ప్రభాకరరావు, లింగపాలెం.

ప్ర : స్వాతంత్ర్యం సిద్ధించిన నాటి నుండీ నిర్బంధ, ఉచిత, ప్రాథమిక విద్యను అమలుపరుస్తూ వున్నప్పటికీ జనాభాలో సగం మందైనా నేటికీ అక్షరాస్యులు కాలేకపోవడానికి కారణాలు ఏమిటి?

జ : "అమలుపరుస్తూ వున్నప్పటికీ" అన్నారు కానీ, అది అమలు జరగడం లేదు. మొదట 'పేదతనాన్ని' పరిష్కరించకుండా అందర్నీ చదువుకునేలాగ చెయ్యడం ఎవ్వరికీ సాధ్యం కాదు. పేదతనం లేకపోతే, ఏ నిర్బంధాలూ లేకుండానే అందరూ తమ పిల్లల్ని చదివించుకుంటారు. ధనవంతులు, తమ పిల్లల్ని ఎవరూ చెప్పకుండానే చదివించుకోవడంలేదూ? పేదతనాన్ని పరిష్కరించకుండా ఏ సమస్యనీ పరిష్కరించలేరు.

*　　*　　*

టి. ప్రభాకరరావు, లింగపాలెం.

ప్ర : ఈ సంవత్సరాన్ని (1990) అంతర్జాతీయ అక్షరాస్యతా సంవత్సరంగా ప్రకటించారు గదా! ఇలా ఒక్కో సంవత్సరాన్ని ఒక్కో రంగానికి కేటాయించడం వల్ల ప్రత్యేకమైన అభివృద్ధి ఏమైనా జరుగుతుందంటారా?

జ : ఏమీ జరగదు. అది ఒక 'నాటకం' మాత్రమే. ఒక కొత్త కార్యక్రమం పెట్టినప్పుడల్లా దానికి సంబంధించి ప్రభుత్వాలు కొన్ని 'ఫండ్స్' కేటాయిస్తాయి కదా? వాటిని కొన్ని సెక్షన్లు తినడానికి మాత్రమే ఈ రకం కార్యక్రమాలు ఉపయోగపడతాయి.

*　　*　　*

మరువాడ రుక్మిణి, హైదరాబాద్.

ప్ర : గ్రామీణ యువతులు, సామాన్య గృహిణులు అయితే ఎటు వంటి నగలు పెట్టుకున్నా అంత ఆశ్చర్యం కలగదు. ఎం. ఏ.లు, ఎం. ఎస్సీ.ల వంటి చదువులు చదువుతూ, రీసెర్చిలుచేస్తూ వున్న స్త్రీలు కాళ్ళకు గజ్జెల పట్టాలు, ముక్కు పుడకలు (వాటితో పాటు మేకప్పులు) పెట్టు కోవడం విచిత్ర మనిపిస్తుంది. ఈ యువతులు చదువుల వల్ల నేర్చు కుంటున్నదేమీ లేదా?

జ : ఈ చదువుల్లో 'పనికొచ్చేదేమీ' లేని మాట నిజమే గానీ, ఎంత పనికిమాలిన చదువులనైనా స్వతంత్రాలోచనకి ఒక మార్గంగా చేసు కోవచ్చు. కానీ, మీరన్నట్టు చదువుకోని స్త్రీలకీ, చదువుకున్న స్త్రీలకీ ముస్తా బుల్లో ఏమీ తేడా వుండడం లేదు. పురుషులకు ఆకర్షణీయంగా కనిపించ డమే స్త్రీల లక్ష్యం అని పురుషులూ, స్త్రీలూకూడా అనుకుంటారు. చదువు తున్న పురుషులకు ఆకర్షణీయంగా కనపడాలంటే, ఆ స్త్రీ, పురుషుల అభిప్రాయాల ప్రకారం నగలే, షోకులే మార్గం.

ఒకప్పుడు, చైనాలో సోషలిస్టు వాతావరణం వున్న కాలంలో, యువతులు నగలు పెట్టుకోవడం మానేశారు. విదేశీజర్నలిస్టులు ఆ యువ తుల్ని "మీరిలాసాదాగా వుంటున్నారు కదా? మిమ్మల్ని ఎవరు ప్రేమిస్తారు? మీకు పెళ్ళిళ్ళెలా అవుతాయి?" అని అడిగితే, ఆ యువతులు "మా ప్రేమలూ, పెళ్ళిళ్ళూ నగల మీదా, ముస్తాబుల మీదా ఆధారపడి వుండవు" అని చెప్పారు. అలాంటి 'నూతన' భావాలు ఆ స్త్రీలకు ఎలా ప్రారంభ మయ్యాయి? "ఉత్పత్తి సంబంధాల్లో" ('పునాది'లో) సోషలిస్టు మార్పులు ప్రారంభమయ్యాయి గనక, దాన్నిబట్టి ఉపరితల రంగాల్లో కూడా కొంత కొంతనూతన భావాలు ప్రారంభమయ్యాయి. అనాదుకూగా అక్కడ 'స్త్రీలం దరూ' నగలు మానేశారని అర్థం కాదు. ఉత్పత్తి సంబంధాల్లో ప్రారంభ

మైన ఆ సోషలిస్టు మార్పు, సరైన మార్గంలో అభివృద్ధి చెందుతూ వుండి వుంటే, క్రమంగా అన్ని రంగాల్లోనూ నూతన భావాలు ఇంకా ఇంకా అభివృద్ధి చెందుతూ నూతన జీవిత విధానమే స్థిరపడగలిగేది. కానీ, వుత్పత్తి సంబంధాల్లో సోషలిస్టు మార్పు ఆగిపోయింది. పైగా అంత వరకూ జరిగిన మార్పుల్ని కూడా వెనక్కి తిప్పడం ప్రారంభమైంది. ఆ ప్రభావంతో ఉపరితల రంగాలన్నీ వెనక నడక ప్రారంభించాయి. ఒక నాడు "మా ప్రేమలూ, పెళ్ళిళ్ళూ మా ముస్తాబుల మీద ఆధారపడి వుండవు" అని చెప్పిన యువతులు కూడా నగలు పెట్టుకోవడం ప్రారంభించి వుంటే, వాళ్ళు తమ అభిప్రాయాలమీద గట్టిగా నిలబడలేక పోయారనీ, వెనకడుగులు వేశారనీ అర్థం. ఏ సమాజంలోనైనా 'నగలు పెట్టుకోవడం' అనేది సాంస్కృతిక లక్షణాలలోకి వస్తుంది. దోపిడీ వుత్పత్తి సంబంధాలే వుండే సమాజంలో, దానికి అనుగుణమైన సాంస్కృతిక లక్షణాలే వుంటాయి. అన్ని వర్గాల స్త్రీ, పురుషులూ తప్పుడు భావాల్లోనే మునిగి వుంటారు. నూతన భావాలూ, సరైన ప్రవర్తనా, పరిశుభ్రతావంటి లక్షణాలతో ఏర్పడే వ్యక్తిత్వాన్ని ప్రేమించడం కాకుండా, అలంకరణల్నీ ముస్తాబుల్నీ, ఆడంబరాల్నీ, దుస్తుల తళతళల్నీచూసి ప్రేమలూ, పెళ్ళిళ్ళూ నడిచిపోతూ వుంటాయి. అవి నీటి బుడగల్లాగ పేలిపోతూ కూడా వుంటాయి. ఇప్పుడు మన సమాజం అంతా పాత సాంప్రదాయాల సమాజమే కాబట్టి, చదువుకున్నవాళ్ళూ, చదువుకోని వాళ్ళూ అంతా ఒకటే. డాక్టర్లూ, లాయర్లూ కూడా ఎంతెంత ముస్తాబులు! ఎన్నెన్ని నగలు! ఎంతెంత పట్టుచీరలు! డబ్బంతా కొన్ని సెక్షన్ల చేతుల్లో కూడి పోతున్నప్పుడు వాళ్ళు దాన్ని ఏదో ఒక మార్గంలో వుపయోగించక ఏం చేస్తారు?

ఎ. జ్వాల, ఒంగోలు

ప్ర : మానవుని పుట్టుకకు లక్ష్యం ఏమిటి? కృషి వుంటే మను షులు ఋషులవుతా రంటారు, గొప్ప ఆలోచనా పరులవుతారని. అందులో మానవునికి కావలసిన లక్షణాలేమిటి? ఆచరణ ఏమిటి?

జ : మీ ప్రశ్నలో మొదటి భాగం 'ప్రకృతి' అంశంలోకీ, రెండో భాగం 'సామాజిక' అంశంలోకీవస్తాయి. 'మానవుని పుట్టుక' అవడం అంటే, మనిషిని ప్రకృతిలోవున్న ఇతర ప్రాణులతో పోల్చి, క్రిమికీటకాలూ జంతు వులూ వంటి ప్రాణుల పుట్టుకలకులేని ప్రత్యేక లక్ష్యం మానవుని పుట్టుకకు వుందా-అని చూడడమే కదా? అలాంటి లక్ష్యం ఏదీ మానవుల పుట్టుకకు వుండదు. ప్రకృతిలో ఇతర జీవులలాగే మనుషులు కూడా 'పరిణామ క్రమం'లో నుంచి తయారైన జీవులే. ప్రకృతి ధర్మాల ప్రకారం, 'చీమ' పుట్టుకకన్నా మనిషి పుట్టుక విలువైనది కాదు. క్రిమికీటకాలు మరణించిన తర్వాత ఆ దేహాలకు ఏం జరుగుతుందో (ప్రకృతిలో కలిసిపోతాయి), మనుషులు మరణించిన తర్వాత ఆ దేహాలకు కూడా అదే జరుగుతుంది. చీమలకూ, దోమలకూ లేని ప్రత్యేక లోకాలూ, ఎక్కడో శాశ్వితంగా నిలిచిపోయే మోక్ష స్థానాలూ మానవులకు కూడా వుండవు. మారు పుట్టు కలు లేని 'మోక్షాన్ని' సాధించడం అనే ప్రత్యేక లక్ష్యం మానవుని పుట్టు కకు వున్నట్టుగా మతాలు చెపుతాయి. ('పుట్టడం' అనేది, పుట్టడం లేకుండా చేసుకోడానికే అయితే, అసలు మొదట పుట్టడం ఎందుకు? మొదటే పుట్ట కుండా వుంటే మోక్షాన్ని మొదటే అందుకోవచ్చు కదా?) ఇవన్నీ, ప్రకృతి ధర్మాలు తెలియని ఆటవిక కాలం నాటి మూఢనమ్మకాలు. చీమలైనా, మనుషులైనా, ఏ జీవులైనా పుట్టిన తర్వాత కొంత కాలం పెరకూ జీవిం చడమూ, సంతానోత్పత్తి చెయ్యడమూ, వృద్ధాప్యంలో మరణించడమూ, ఆ దేహం ప్రకృతిలో కలిసిపోవడమూ - జరుగుతూ వుంటుంది. ఆ సంతా

నానికి కూడా మళ్ళీ అదే జరుగుతుంది. ఈ క్రమం అనంతంగా సాగిపోతూ వుంటుంది. ఎందుకు ఇదంతా అంటే - అది ప్రకృతి ధర్మం. అంతే. చీమ పుట్టుకకు ప్రత్యేక లక్షణం ఏమిటి-అని మనం ప్రశ్నించుకోవడం లేదు. అలాగే మనిషి విషయంలో కూడా ఆ ప్రశ్న అనవసరం. ప్రశ్నించు కుంటే జవాబు అదే - చీమా, మనిషి ఒకటే అని!

ఇక మీ ప్రశ్నలో రెండో విషయం- మానవునికి కావలసిన లక్షణా లేమిటి, ఆచరణ ఏమిటి అనేది. ఇది 'సామాజిక' అంశం అంతా 'శ్రమ చెయ్యడం' అనే దానికి సంబంధించి వుంటుంది.

ఇతర ప్రాణులు కూడా ఆహారం కోసం వేటాడడమూ, గూళ్ళు కట్టుకోవడమూ చేస్తాయి. కానీ, ఆ ప్రాణులన్నీ ఆ పనులు ప్రకృతి సహ జంగా కలిగే ప్రేరణలతో (ఇన్‌స్టింక్ట్సుతో) చేస్తాయి. వాటి గూళ్ళు ఎన్ని వేల సంవత్సరాలైనా ఒకే పద్ధతిలో వుంటాయి. ఆ ప్రాణులన్నీ ప్రకృతి ఇచ్చే పదార్థాల్ని, ప్రకృతి ఏ రూపంలో ఇస్తే ఆ రూపంలోనే తింటాయి.

మనుషుల జీవితం అలాంటిది కాదు. మనుషులకు 'శ్రమ చెయ్యడం' అనే ప్రత్యేక లక్షణం వుంది. మనుషులు ప్రకృతి ఇచ్చే పదార్థాల్ని ముడిపదార్థాలుగా వుపయోగిస్తూ, వాటితో తమకి కావలసిన 'వస్తువులు' తయారు చేసుకుంటారు.

వస్తువులు తయారు చెయ్యడానికి కావలసిన శ్రమ పరికరాల్నికూడా తయారు చేసుకుంటారు. ఈ సమస్యలన్నీ మనుషులు 'మెదడు'తో ఆలో చిస్తూ, వస్తువుల్ని రకరకాల రూపాలతో తయారుచేస్తారు. ఎప్పటికప్పుడు పాత అనుభవాలతో తమ జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకుంటూ వుంటారు. ఇదంతా జంతువుల నించి భిన్నమైన, మానవులకు మాత్రమే ప్రత్యేకమైన సామాజిక లక్షణం.

మనుషులు జంతు దశనించి క్రమక్రమంగా బయటపడుతూ వున్న కాలంలో మనుషులందరూ శ్రమ చేసేవారు. క్రమంగా మనుషుల్లో ఒక

భాగం, శ్రమ చెయ్యడం మానేసి, మిలిగినవాళ్ళు వుత్పత్తి చేసేవాటిలో నించీ కొంత భాగాన్ని దోచుకుని జీవించడం ప్రారంభించారు. ఆ రకంగా మనుషుల మధ్య దోపిడీ ద్వారా "అసమానత్వం" ప్రారంభమై పోయింది. బానిస యజమానులు (ఆ కుటుంబాల సభ్యులు) 'శ్రమ' చెయ్యరు. బానిసల శ్రమతో (ఆ కుటుంబాల సభ్యులు తయారుచేసే వుత్పత్తులే వాడుతూ) జీవిస్తారు. అలాగే తర్వాత కాలంలో భూస్వాములు, కౌలు రైతుల శ్రమనీ; పెట్టుబడిదారులు కార్మికుల శ్రమనీ దోచుకొని జీవిస్తారు. ఇదీ "మానవ సమాజం"! వేల వేల సంవత్సరాల నించీ, 'శ్రమచేసే వర్గం' తన శ్రమతో రెండు వర్గాలకూ కావలసిన వుత్పత్తులు తయారుచేస్తూవుంటే, 'శ్రమ చెయ్యని వర్గం' రెండు వర్గాలూ తీసుకోవలసిన విశ్రాంతులు తీసుకుంటూ వుంది. ఇలాంటి సమాజంలో మీరు 'మానవుడికి వుండవలసిన లక్షణాలేమిటీ, ఆచరణ ఏమిటీ' అని అడుగు తున్నారు. 'మానవుడికి' అంటే ఏ మానవుడికి? శ్రమ చేసే మానవుడికా, శ్రమ దోచే మానవుడికా? 'బానిస'గా వున్న మానవుడికా, 'యజమాని'గా వున్న మానవుడికా? ఇద్దరికీ ఒకే లక్షణాలూ, ఒకే ఆచరణా వుంటాయా? అలాగే, కార్మికుడిగా వున్న మానవుడికీ; పెట్టుబడిదారుడిగా వున్న మానవుడికీ ఒకే లక్షణాలూ, ఒకే ఆచరణా వుంటాయా? ప్రకృతి ధర్మాల ప్రకారం చూస్తే యజమానీ, బానిసా కూడా మానవులే. జంతువులతో పోల్చినప్పుడు వాళ్ళిద్దరూ ఒకే రకంగా మానవులే. కానీ, వాళ్ళ సామాజిక స్థితుల్ని పోలిస్తే, వాళ్ళిద్దరూ ఒకే రకమైన మానవులు కారు. వేరు వేరు వర్గాల మానవులు! అంటే, సమాజంలో 'మానవుడ'నే వాడెవ్వడూ లేడు — 'వర్గ మానవుడు' తప్ప! ప్రతీ మానవుడూ ఏదో ఒక వర్గానికి చెందేవాడే. శ్రమచేసే వాడో, చెయ్యని వాడో, కొంత చేసి కొంత చెయ్యని వాడో! (ఈ మూడో రకం వాణ్ణి కూడా మొదటి 2 రకాల్లోనే ఏదో ఒక రకంలో పెట్టెయ్యవచ్చు).

ఈ రకంగా, ప్రతీ మనిషీ ఏదో ఒక వర్గానికి చెంది వుంటాడు. ఆ వర్గ స్థితిని బట్టే ఆ వ్యక్తి లక్షణాలూ, ఆచరణా వుంటాయి. పరస్పర విరుద్ధంగా వున్న వర్గాల మానవులందరికీ కలిసి ఒకే రకం లక్షణాలూ, ఒకే రకం ఆచరణా వుండవు. అన్ని వర్గాల మానవుల్నీ కలిపేసి, "మానవులు ఎలాంటి ఆచరణ కలిగి వుండడం మంచిది?" అని అడిగితే, "అందరూ శ్రమచేసే ఆచరణ కలిగి వుండడం మంచిది. ఆ రకంగా మానవులందరూ సమానులవడం మంచిది" అనేదే జవాబు. మానవ సమాజానికి ఆదర్శమూ మోక్షమూ 'సమానత్వమే' కానీ 'శ్రమ' చెయ్యని మానవుల్ని శ్రమలోకి రమ్మంటే అంగీకరిస్తారా? 'సమానత్వం' అనే 'మోక్షం' వాళ్ళకి అక్కర లేదు. శ్రమలోకి రాకుండా వుండడమే వాళ్ళకి ఆచరణగా వుంటుంది. కాబట్టి, వాళ్ళ శ్రమని వాళ్ళే చేసుకునేటట్టుగా చేసి, వాళ్ళ చేసే దోపిడీ నించి విముక్తి చెందడమే శ్రామిక వర్గానికి ఆచరణగా వుండాలి. అదే వర్గపోరాటం. అదే సమాజాన్ని 'సమానత్వం' వేపు నడపగల వున్నతాచరణ!

'కృషి' వుంటే మనుషులు ఋషులయ్యే మాట నిజమే. కానీ, 'కృషి' చెయ్యడానికి అవకాశాలు ఏ వర్గానికి వున్నాయి? 'బడి' మొహం తెలియకుండా గొడ్లని కాసే పిల్లలు ఋషులవుతారా? నూటికి ఎనభై మంది నిరక్షరాస్యులు ఋషులవుతారా?

* * *

సి. హెచ్. శ్రీనివాస్ గాంధి, కరీమ్‌నగర్.

ప్ర : మీరు ఆడపిల్లలకు ఇచ్చే ఆస్తి 'కట్నం' రూపంలో ఇవ్వకుండా ఆస్తి రూపంలోనే వుండాలి అన్నారు. బాగానే వుంది. కాని అప్పుడూ, ఇప్పుడు ఒకే రకమైన సమస్యలు వుంటాయి ఎందుకంటే, ఇప్పుడేమో ఎవరు ఎక్కువ కట్నం ఇస్తారో వారిని మరీ మరీ చూసి

వెదికి పట్టుకొని చేసుకొంటున్నారు. మరి అప్పుడు ఎవరికి ఎక్కువ ఆస్తి వుందో చూసి ఎక్కువ ఆస్తి వున్నవాళ్ళనే చేసుకుంటారు కదా? ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం లేదా? బహుశా ఈ సమస్యకు పరిష్కారం [illegible]ల వద్దే వుంది. ఎందుకంటే, ప్రతి స్త్రీ తన బిడ్డకు కట్నం ఇవ్వకుండా, తన కుమారునికి కట్నం లేకుండా చేసుకోవాలనే నిబంధన వలన మరియు ప్రతి స్త్రీ కట్నం కోరిన వరుని తిరస్కరించడం వల్లనే కొంతవరకు ఉపశమనం కలిగి, శాశ్వతంగా వరకట్నం మాపుమాపుకోగలరు.

జ: శాశ్వత పరిష్కారం లేదా—అనే ప్రశ్న వేసుకుని మీరే జవాబు పట్టుకున్నారు. ఆ జవాబులో చాలా ముఖ్యంగా ఒక అంశం కలుపుకోవాలి. 'కట్నం కోరేవాణ్ణి పెళ్ళి చేసుకోను' అనడం ఒక్కటే చాలదు. ఆ 'స్వతంత్ర' భావాలూ, వ్యక్తిత్వమూ, ఆత్మ గౌరవమూ పెళ్ళి తర్వాత జీవితంలో కూడా వుండాలి. అలాంటి దృష్టి ఏర్పడాలంటే 'సమాజం' లోనే 'సమానత్వానికి' అనుగుణమైన మార్పులు జరగడం ప్రారంభం కావాలి. సమాజ పరిస్థితులూ, స్త్రీ పురుషుల భావాలూ కూడా సరైన దిక్కులో మారుతూ వుంటేనే ఇదంతా సాధ్యం. శాశ్వత పరిష్కారం అనేది ఇన్ని విషయాలు మీద ఆధారపడి వున్న విషయం. 'పోరాటం' అనేది అలాంటి దృష్టితో లేకపోతే, ఆడపిల్లలూ, వాళ్ళ ఆస్తి వాటాలూ అన్నీ ఎప్పటిలాగే భర్తల పాద సేవలకు అంకితం కావలసిందే.

* * *

భావన, కర్నూలు.

ప్ర : మీరు వరకట్న సమస్య పరిష్కారానికి స్త్రీలకు 'ఆస్తి హక్కు' పద్ధతి సూచించారు. మరి కేవలం ఆస్తే కాకుండా అప్పులే వున్నాయనుకోండి. అప్పుడు ఆడపిల్లలు అందులో కూడా సమాన బాధ్యతలు తీసుకోగలరా? తమని తాము పోషించుకోలేని తల్లిదండ్రులు, ఇంకా

రెక్కలు రాని పిల్లల మాటేమిటి? కనీసం లోకం కోసమైనా మొగపిల్లలు వారిని చూస్తున్నారుకదా? ఇప్పుడు వారు కూడా బాధ్యతల నుంచి తప్పించు కోనడానికి ప్రయత్నించరా? మీరు చెప్పినట్టు చేస్తే కేవలం సోదరులకు పరిమితమైన పోట్లాటలు, సోదరీమణుల మధ్య కూడా వ్యాప్తి చెందవా? విడాకులుకోరేవారు, తమ జీవన భృతికోసం భర్తను అడిగే హక్కు కోల్పోరా? మీరు చెప్పే స్త్రీల సమాన ఆస్తి హక్కు పద్ధతి వరకట్న సమస్యకు పరోక్షరూపంగా మారుతుందే తప్ప పరిష్కారం ఎలా అవుతుంది? ఎందుకంటే, ఇప్పటి మగపిల్లలు తమకు ఎక్కువ కట్నంతో వచ్చే అమ్మాయిని కోరుకున్నట్టే ఎక్కువ ఆస్తితో వచ్చే అమ్మాయిని కోరుకుంటారు కదా?

జ : ఆస్తిలో భాగం ఇవ్వడమే కట్నం సమస్యని పూర్తిగా పరిష్కరించగలుగుతుందని నేను అన్నానేమో ఆ జవాబు మళ్ళీ ఒకసారి చూడండి. స్త్రీల ఆత్మగౌరవం అనేది తప్ప ఇంకే విషయమూ స్త్రీల సమస్యకి పరిష్కారంగా వుండదని నేను స్పష్టంగానే చెప్పాను.

కట్నాలకు బదులు ఆస్తుల్లో వాటాలు ఇవ్వటం మొదలుపెడితే, అప్పుడు ఎక్కువ ఆస్తి తెచ్చే అమ్మాయిల కోసమే వెతుక్కుంటారనే సంగతి పదేళ్ళ కిందట 'స్త్రీ స్వేచ్ఛ' పుస్తకంలో కూడా చెప్పాను. ఎక్కువ కట్నాల కోసం వెతికినట్టే ఎక్కువ ఆస్తుల కోసం వెతుకుతారు కదా అంటే, అవును, వెతుకుతారు. పెళ్ళి సంబంధాలు కుదుర్చుకునేటప్పుడు, 'మొగపిల్లవాడికి ఎంత ఆస్తి వుంది' అని మొగపిల్లల ఆస్తుల వివరాలు ఆడపిల్లల వాళ్ళు చూడడం లేదా? ఎక్కువ ఆస్తి వున్న సంబంధమే చెయ్యాలని ఆడపిల్లవాళ్ళు ప్రయత్నించడం లేదా? అలాగే మొగపిల్లల వాళ్ళూ చేస్తారు. ఆడపిల్ల వేపు వాళ్ళు మొగపిల్లవాడి ఆస్తి వివరాలు చూడ వచ్చుగానీ, ఆ పనే మొగపిల్లవాడి వేపువాళ్ళు చెయ్యకూడదా? 'ఆస్తులు'

అనేవి వున్నప్పుడు 'ఎక్కువ ఆస్తి' కోసం ఆరాటం ఇరుపక్షాలకూ వుంటుంది. ఆ సమస్య 'ఆస్తుల పద్ధతి' పోయినప్పుడే పోతుంది. స్త్రీ పురుషుల సహజీవనం అనేది కట్నం మీద ఆధారపడి ఏర్పడినా, ఆస్తుల్లో వాటాల మీద ఆధారపడి ఏర్పడినా అది తప్పుడు పునాదే. అలా ఏర్పడే సంబంధాలలో దాని సమస్యలన్నీ దానికి వుంటాయి. అయినప్పటికీ స్త్రీల ఆస్తి స్త్రీలపేరనే, స్త్రీల చేతుల్లోనే వుండే పద్ధతి కట్నాలపద్ధతి కన్నా చాలా నయం. ఆ తేడాని గమనించండి.

ఇక ఆడపిల్లలు అప్పులు కూడా పంచుకుంటారా లాంటి ప్రశ్నలు ప్రత్యేకంగా అడగక్కరలేదు. 'ఆస్తి పంపకాలు' అన్నప్పుడు అవన్నీ కలిసే వుంటాయి. తల్లిదండ్రులకు ఆస్తే లేకపోతే కట్నాలూ ఇవ్వలేరు, ఆస్తులూ ఇవ్వలేరు. కట్నం ఇవ్వాలా, ఆస్తి ఇవ్వాలా అనే చర్చ ఆస్తి వున్న వాళ్ళ సంగతే. తల్లిదండ్రుల్ని వృద్ధాప్యంలో చూసుకోవడంలో మొగపిల్లలకి బాధ్యత వున్నట్టే, ఆడపిల్లలకీ బాధ్యత వుంటుంది ఆడా, మగా తేడా లేకుండా పిల్లలందరూ తల్లిదండ్రుల్ని చూసుకోవాలి. ఇక, 'మనోవర్తి' సమస్య. 'స్త్రీలకు సమాన ఆస్తి హక్కు వుంటే' విడాకులు పొందే స్త్రీకి భర్తనించి మనోవర్తి తీసుకునే హక్కు పోతుంది. కదా, అంటున్నారు కదా? అసలు, స్త్రీలు తమని తాము పోషించుకోలేని పరిస్థితుల్లో వుండడం వల్లనే 'మనోవర్తి'ని తీసుకునే సంప్రదాయం పుట్టింది. స్త్రీ తనని తాను పోషించుకోగలిగే పరిస్థితిలో వుంటే 'మనోవర్తి' అడగడం ఎందుకు? 'స్త్రీని పురుషుడే పోషించాలి' అనే భావాలు స్త్రీకి అవమానం. స్త్రీయే ఆ పోషణని అడగకూడదు. బిడ్డలు వుంటే వారి కోసం తండ్రి కూడా కొంత మెయిన్‌టెనెన్స్ ఇవ్వవలసిందే. తన పోషణ తను చేసుకోలేని స్థితిలో వున్న స్త్రీకైతే 'భర్త' నించి పోషణ తీసుకోవడం అవమానమే అయినా ఆ పరిస్థితిలో అది తప్పదు. 'కట్నం' అనేది

'ఆస్తిలో వాటా'గా మారటం వల్ల, కొత్త సమస్యలేవీ పుట్టుకురావు. వున్న సమస్యలే వుంటాయి, అవి ఎలాగూ తప్పవు.

*　　*　　*

ఎస్. కృష్ణారావు, హైదరాబాద్,

ప్ర : పని హక్కు, సమాచార హక్కు అంటే ఏమిటి? సమాచార హక్కు అంటే కొద్దిగా అర్థమవుతున్నదిగానీ, పని హక్కు అంటే అర్థం గావడం లేదు. ప్రతి మనిషి పని చేస్తాడు. పని చెయ్యకుండా బ్రతకలేడు. ఇంక ఈ పని హక్కు అవసరమేమున్నది? 'ఉద్యోగాలు' వుంటే ప్రభుత్వం ప్రజలకు ఇస్తుంది కదా? మనిషికి బ్రతకడానికి గాలి ఎంత అవసరమో, పని అంత అవసరం; ఈ హక్కు కలిగించడం వల్ల ప్రయోజనం ఏమిటి? పుట్టిన ప్రతివాడికీ ప్రభుత్వం పని కల్పించలేదు కదా?

జ : మీ ప్రశ్నల్లో చాలా పొరపాటు అభిప్రాయాలు వున్నాయి. 'సమాచార హక్కు' అంటే, ప్రభుత్వంలో ఏం జరుగుతున్నదో ప్రజలు తెలుసుకునే హక్కు. ఇందిరా గాంధీని హత్యచేసినప్పుడు దాని మీద ఒక కమిటీని వేశారు కదా? ఆ కమిటీ రిపోర్టుని రహస్యంగా వుంచారు. అలాగే ప్రభుత్వం అనేక విషయాలు ప్రజలకు తెలియనివ్వకుండా వుంచుతుంది. కాబట్టి ఇప్పుడు 'సమాచార హక్కు' ఇస్తున్నామని ఈ ప్రభుత్వం చెప్తోంది. కానీ ఇది కూడా ఏమీ జరగదు. ఇవన్నీ కాయితాల మీద ప్రకటించే వుత్తుత్తి హక్కులే. ప్రభుత్వంలోకి కొత్త పార్టీ వచ్చినప్పుడల్లా పాత పార్టీ కన్నా గొప్పగా కనపడాలని ఇలాంటి మాటలేవో చెపుతూ వుంటాయి.

ఇక పని హక్కు: పని హక్కు, అంటే, నిరుద్యోగిగా లేకుండా పని చేసే అవకాశం వుండటం. 'పని హక్కు' అనేది వుందంటే ఏ

నిరుద్యోగి అయినా "ఈ ప్రభుత్వం నాకు ఏ పనీ ఇవ్వడం లేదు" అని కోర్టుకి వెళ్ళవచ్చన్న మాట. కానీ, ఇదంతా కూడా ఆచరణలో ఏమీ జరగదు. ప్రతీ ఉద్యోగానికీ లక్ష క్వాలిఫికేషన్లు పెడతారు. అవన్నీ వుంటేనే ఆ ఉద్యోగం చెయ్యొచ్చు అంటారు. చివరికి, 'మీకు క్వాలిఫికేషన్లు లేవు. కాబట్టి నిరుద్యోగులుగా వుండండి. ఎంతో కొంత నిరుద్యోగ భృతి ఇస్తాం' అంటారు. ఈ 'భృతి' ఎక్కడ్డించి తెచ్చి ఇస్తారు? ఉద్యోగాల్లో వున్న కార్మికుల నించీ లాగిన డాంట్లోంచి తీసి ఇస్తారు. ఇది కూడా నిరుద్యోగులందరికీ రాదు. సరిపోయేలాగ రాదు, పని చేసే శక్తి సామర్థ్యాలు వున్నా వాళ్ళకి పని చేసే అవకాశం ఇవ్వకుండా నెల నెలా 'కొంత డబ్బు పడేసి దానితో బతకమంటే అది ఆ నిరుద్యోగికి అవమానం కాదా?

పుట్టిన ప్రతివాడికీ ప్రభుత్వం పని కల్పించలేదు కదా అంటున్నారు మీరు! అంటే, కల్పించడం సాధ్యం కాదనా? ఎందుకు కాదు? పూర్తిగా సాధ్యమే. ఒక నిరుద్యోగి వున్నాడనుకోండి. అతను ఎక్కడా పని చెయ్యకపోయినా కొన్ని వుత్పత్తుల్ని వాడుతూనే వుంటాడు. అలా వాడకపోతే అతను జీవించి వుండలేడు. అతను వాడే వుత్పత్తుల్ని అతనే వుత్పత్తి చేసుకునేలాగ ఏర్పాట్లు వుంటే సరిపోతుంది కదా?

వెయ్యి పేజీల పుస్తకం ఒకటివుంటుందనుకోండి. అందులో 617వ పేజీతీసి రెండు ముక్కలూ, 403వ పేజీ తీసి 4 ముక్కలూ చదివి వినిపిస్తే ఏమైనా అర్థమౌతుందా? అలా వుంటుంది నా జవాబు మీకు. ఒక వరసలో నేర్చుకోవలసిన సైన్సు ఇది. అలా నేర్చుకుంటేనే ఈ సమస్యలన్నీ అర్థమవుతాయి. 'ఉద్యోగాలు వుంటే ప్రభుత్వం ప్రజలకు ఇస్తుంది కదా?' అన్నారు. ఉద్యోగాలు అంటే ఏమిటి? 'మనుషులు' వున్నప్పుడు 'ఉద్యోగాలు' ఎందుకు వుండవు? మనుషుల్నిబట్టి ఉద్యోగాలా? ఉద్యోగాలనిబట్టి మనుషులా? "మనిషి బ్రతకడానికి గాలి ఎంత అవసరమో పని అంత

అవసరం" అని మీరే అంటున్నారు కదా? పనిచేసే అవకాశం లేకపోతే, ఒక నిరుద్యోగి ఇతరుల శ్రమ మీద ఆధారపడకుండా, తన కోసం తనే శ్రమచేస్తూ తన పోషణ తను ఎలా చేసుకోగలడు? 'సమాజం'లో మొత్తం 1 కోటిమంది జనాభా వున్నారనుకోండి. ఆ జనాభా అంతటికీ, సంవత్సరానికి ఎంత ధాన్యం కావాలి? ఎంత పంచదార కావాలి? ఎన్ని పాలు కావాలి? ఎన్ని బట్టలు కావాలి?— ఇలా ప్లాన్ చేసుకుని కొంతమంది జనం పొలాల్లో, కొంతమంది జనం గనుల్లో, కొంతమంది జనం ఫ్యాక్టరీల్లో, కొంతమంది జనం రవాణాలో, కొంతమంది జనం ఆస్పత్రుల్లో— ఇలా ఆడా మొగా తేడా లేకుండా (పిల్లలూ, రోగులూ, వృద్ధులూ తప్ప) రోజూ కొన్ని గంటల లెక్కన పనులుచేస్తూవుంటే, సంవత్సరం పూర్తయ్యేసరికి ఒక 'ఉత్పత్తిరాసి' తయారవుతుంది. దాన్ని వాడుకుంటూ మళ్ళీ కొత్త సంవత్సరంలో మళ్ళీ కొత్త పనులు! మొత్తం భూములూ, ఫ్యాక్టరీలూ నీవీ, నావీ అనిలేదు. భూమి అంతా 'ప్రకృతి'లోది. అది ఎవడి 'తాత సొమ్ము' కాదు. శ్రమ పరికరాలన్నీ ఆ జనాభా తయారు చేసుకునేవే. మొత్తం జనాభాకి ఎన్నిరకాల వుత్పత్తులూ, ఎంతెంత ఉత్పత్తులూ కావాలో దానికోసం మొత్తం ఎన్నికోట్ల శ్రమగంటల పనికావాలో ప్లాన్‌చేస్తే ప్రతి మనిషికీ అందులో 'ఒక భాగం పని' వుంటుంది. ఉద్యోగాలు వుండడం ఏమిటి, లేకపోవడం ఏమిటి? ఉద్యోగం అంటే ఏమిటి? ప్రతి మనిషీ తన పోషణకు కావలసిన పని తను చేసుకోవడమే.

మరి ప్రభుత్వాలు ఈ ఏర్పాట్లు ఎందుకు చెయ్యలేకపోతున్నాయి? ఎందుకంటే- శ్రమ చెయ్యకుండా జీవించే వర్గాన్ని రక్షించడమే వాటి లక్ష్యం గనుక. "ప్రతి మనిషీ పని చేస్తాడు. పని చెయ్యకుండా బ్రతకలేడు" అన్నారు. "గాలి ఎంత అవసరమో పని అంత అవసరం" అన్నారు మరి. సమాజంలో వేల వేల సంవత్సరాలనించీ 'పని' చెయ్యకుండా జీవి

స్తోన్న వర్గం ఒకటి వుందని మీరెప్పుడూ వినలేదా? కౌళ్ళూ, వడ్డీలూ, లాభాలూ తింటున్న వాళ్ళు ఏ పనులకు బదులుగా వాటిని పొందుతున్నారు? వాళ్ళ పోషణకోసం వాళ్ళు ఏ శ్రమా చెయ్యకుండానే ఎలా జీవించగలుగుతున్నారు? 'ప్రకృతి'లో వున్న భూమినంతటినీ ఆ వర్గం 'స్వంత ఆస్తుల' రూపంలో ఆక్రమించేసింది. శ్రమతో తయారైన ఫ్యాక్టరీలన్నీ దాని ఆస్తులుగానే వున్నాయి. ఎవరు ఏ పని చెయ్యాలన్నా భూముల్లోనో, ఫ్యాక్టరీల్లోనో పని చెయ్యవలసిందే కదా? అంటే, భూములూ,ఫ్యాక్టరీలూ లేని వర్గం, అవి వున్న వర్గం దగ్గిరికిపోయి, ఉద్యోగాలు అడిగి, వాళ్ళ షరతులన్నిటికీ తలలువంచి, రకరకాల వుత్పత్తులు తయారుచెయ్యాలి. శ్రమచెయ్యని వర్గం, ఆ వుత్పత్తుల్లోనించే కొంత భాగం తీసి అందరికీ జీతాలుగా ఇచ్చి, మిగిలినవాన్ని కౌళ్ళూ, వడ్డీలూ, లాభాలూ, కమిషన్లూ వంటి రకరకాల పేర్లతో పంచుకుంటుంది. ప్రతీ సంవత్సరమూ ఇదే జరుగుతూ వుంటుంది. ఖర్చయిపోతోన్న వుత్పత్తులన్నిటినీ శ్రమచేసే వర్గం మళ్ళీ మళ్ళీ తయారుచేస్తూ వుంటుంది. ఇలాంటి సమాజంలో, ఒక వర్గం. జనాభా అంతా పని చెయ్యకుండా సోమరులుగా వుంటారు. ఇంకో వర్గంలో కూడా చాలా జనాభా పనులు చెయ్యడానికి సిద్ధంగా వున్నా పనులుదొరక్క నిరుద్యోగులుగా వుంటారు. ఈ మొత్తం జనాభా అంతా శ్రమచేసే శ్రామికుల శ్రమలతోనే జీవిస్తూ వుంటారు.

ఇలాంటి సమాజంలో ఒక కొత్త పార్టీ సింహాసనం ఎక్కి 'పని హక్కు కల్పిస్తాం' అని మాట్లాడితే, దాని అర్థం ఏమిటి? ఆస్తులు వున్న వర్గాన్ని అది పనిలోకి తీసుకురాదు. వాళ్ళకి పని చెయ్యవలసిన బాధ్యత లేదు. ఎటొచ్చీ శ్రమచేసే వర్గంలో వున్న నిరుద్యోగ జనాభాని మభ్యపెట్టడానికే ఆ మాటలు. నిరుద్యోగులందరికీ ఉద్యోగాలు కల్పిస్తారనే అనుకున్నా (ఈ ప్రభుత్వాల ద్వారా అది ఎప్పటికీ జరగదు) అసలు జరగవల

సిన మార్పు అదికాదు. శ్రమ చెయ్యని వర్గాన్ని శ్రమలోకి తీసుకువచ్చే పని అయితే అది చెయ్యదు.

* * *

ఎస్.ఎస్. రసూల్, గడివేముల.

ప్ర: సామాజిక స్పృహ అంటే ఏమిటి?

ఎం. కనకవల్లి, గద్వాల.

ప్ర : రచయితలు ఎటువంటి 'సామాజిక స్పృహ'తో వుండాలో వివరిస్తారా?

జ: సామాజిక స్పృహ అంటే సమాజం గురించి వున్న జ్ఞానం. 'సమాజం' గురించి ఒక మనిషికి ఏం అభిప్రాయాలు వుంటాయో, అవన్నీ కలిసింది, ఆ మనిషికివున్న సామాజిక స్పృహ. ప్రతీ మనిషికీ సమాజంలో వున్న ప్రతీ విషయం గురించి ఏదో ఒక అభిప్రాయం వుంటుంది· తప్పు గానీ ఒప్పుగానీ. 'సమాజం' గురించి ఏ అభిప్రాయమూ లేని మనిషి ఎవడూ వుండడు. ఒక ఉదాహరణ చూడండి. "సమాజంలో కొందరు మనుషులు ధనికులుగానూ, కొందరు మనుషులు పేదలుగానూ ఎందుకు వున్నారు? కొందరు 'యజమానులు'గానూ, కొందరు 'సేవకులు'గానూ (కార్మికులందరూ సేవకులే) ఎందుకు వున్నారు?" అనే విషయం తీసుకుంటే, దానిమీద ప్రతీ మనిషికీ ఏదో ఒక అభిప్రాయం వుంటుంది. 'అదృష్ట దురదృష్టాల వల్లనే అలా వుంటారు'. అని కొందరు అనుకుంటే; ధనవంతుల తండ్రులూ తాతలూ కష్టించి ఆస్తులు సంపాదించి బిడ్డలకు ఇచ్చుకున్నారనీ, పేదల తండ్రులూ తాతలూ సోమరితనాలవల్ల బిడ్డలకు ఏమీ ఇవ్వలేకపోయారనీ, అందుకే ఈ తేడాలు వున్నాయనీ కొందరు అనుకుంటారు. 'ఆదాయాన్ని' పొదుపుగా ఖర్చుపెట్టుకునేవాళ్ళు ధనికులుగా వుంటే, దుబారాగా ఖర్చుపెట్టుకునేవాళ్ళు పేదలుగా వుంటారని

మరికొందరు అనుకుంటారు. అంటే, ఆ విషయం గురించి ఆ వ్యక్తుల స్పృహలు అలా వుంటాయన్నమాట! కానీ, అసలు నిజం ఏమిటి? శ్రమ దోపిడీ; దానివల్లనే ధనిక పేద తేడాలు ఏర్పడతాయి. ధనికులు యజమానులుగా వుంటే, పేదలు సేవకులుగా వుంటారు. ఇలా అర్థం చేసుకుంటేనే ఆ విషయాన్ని సరిగా అర్థం చేసుకున్నట్టు, ఇదే సరైన సామాజిక స్పృహ. ఒకప్పుడు పొరపాటు అభిప్రాయాలతో వున్న మనిషి సరైన అభిప్రాయాలు ఏర్పర్చుకుంటే, ఆ వ్యక్తి సామాజిక స్పృహ మారిందన్నమాట. 'స్పృహ' అన్నా 'చైతన్యం' అన్నా ఒకటే. భూమినంతా ఆక్రమించి కూర్చున్న శ్రమ చెయ్యని వర్గానికి "ఇదంతా మా పెద్దలు మాకు ఇచ్చిన ఆస్తి" అనే స్పృహే వుంటుంది. నిజం తెలియని శ్రామికవర్గానికి కూడా "ఈ భూమి అంతా వాళ్ళకి వాళ్ళ పెద్దవాళ్ళు ఇచ్చారు. మన పెద్దలు మనకేమీ ఇవ్వలేదు. ఇచ్చినా చాలా తక్కువ ఇచ్చారు" అనే స్పృహే వుంటుంది. అంటే, రెండు వర్గాల మనుషులూ తప్పుడు సామాజిక స్పృహతోనే వున్నారన్నమాట! అయితే, ఇందులో శ్రమచేసే వర్గం స్పృహని మార్చడం సాధ్యమే. ఆ వర్గానికి 'నిజం' వివరించగలిగితే సరిపోతుంది. "ఇదా నిజం? ఇన్నాళ్ళూ ఇది మాకు తెలీదే. ఓహో! ఇదన్నమాట నిజం!" అని ఆ వర్గం ఆ నిజాన్ని చూసి కనువిప్పు కలిగినంత సంతోషిస్తుంది. కానీ, ఆస్తుల్ని ఆక్రమించి కూర్చున్న వర్గం స్పృహని మార్చే పని నిజాలు వివరించడాలతో సాధ్యంకాదు. "మీరు చెప్పేది నిజమేకాదు పొమ్మ"ంటారు వాళ్ళు. కానీ, 'ఆస్తి అంటే ఏమిటో' సిద్ధాంతపరంగా శ్రామికవర్గం మాట్లాడగలుగుతున్నప్పుడు, 'ఆస్తులవర్గం' స్పృహ తప్పనిసరిగా నిస్పృహలో పడితీరుతుంది. శ్రమచేసేవర్గం అజ్ఞానంలోపడి వున్నంతవరకే, ఆస్తులవర్గం తన పాత స్పృహని గట్టిగా నిలబెట్టుకోగలుగుతుంది.

రెండో ప్రశ్న అడిగిన వ్యక్తి రచయితల విషయం అడిగారు. ఏ వర్గ రచయిత ఆ వర్గ స్పృహతో వుంటాడు. శ్రామికవర్గ రచయిత కూడా నిజానిజాలు తెలియకపోతే పొరపాటు స్పృహతోనే వుంటాడు. ఎటువంటి సామాజిక స్పృహతోవుండాలి? అని అడిగితే, 'సరైన సామాజిక స్పృహతో వుండాలి' అనేదేకదా జవాబు?

* * *

సూరం సురేష్, మద్రాస్.

ప్ర : నేను ప్రేమించిన అమ్మాయి తల్లిదండ్రులు బాగా ధనవంతులు. కట్నం తీసుకోవడానికి నేను వ్యతిరేకిని. అయితే ఆస్తి పంపకాలప్పుడు తన వాటా కోసం తమ్ముళ్ళతోపాటు తనూ వాటా అడగబోతే నేను వారించాలా ? ఆమె ఇష్టానికి వదిలివేయాలా ?

జ. కట్నంగా మీ చేతికి కొంత ఆస్తిని ఇమ్మనడం తప్పుగానీ, తల్లిదండ్రుల ఆస్తిలో ఆమె భాగం ఆమె తీసుకోవడం తప్పుకాదు. ఆడపిల్లలు కట్నాలు ఇవ్వకూడదు అంటే, తల్లిదండ్రులకు ఆస్తి వుంటే కూడా అందులోనించి ఏమీ తీసుకోరాదని అర్థం కాదు. తల్లిదండ్రులు ఇస్తారు. ఆమె తీసుకుంటుంది. అది ఆమె హక్కు.

ప్ర : ప్రేమించిన అమ్మాయితో ఎలాంటి మాటలూ లేక నేరుగా ఆమె తల్లిదండ్రులతోనే నా మనోభిప్రాయాన్ని తెలిపితే వారెందుకని 'ఆదోలా' పిలవుతున్నారు ? రక్తంలో జీర్ణించిన సంప్రదాయమా ? చివరకు మా తల్లిదండ్రులు కూడా ప్రేమించడం అంటే ఏదో హత్యచేసినంత నేరంలా భావిస్తున్నారు. ఎందుకిలా ? వీళ్ళని మార్చేదెలా ?

జ : 'ప్రేమించిన' అమ్మాయితో ఎలాంటి మాటలూ లేకపోతే, ఆమె కూడా మిమ్మల్ని ఇష్టపడుతున్నదని మీరెలా నిర్ణయానికి రాగలరు ? కేవలం మనిషిని చూసి, మాట్లాడకుండానే పెళ్ళిదాకా ఆలోచిస్తే అది

సరైన ప్రేమ రాదు. పిల్లల ప్రేమల్ని పెద్దవాళ్ళు తప్పుపట్టడానికి చాలా కారణాలున్నాయి. కుల మతాలూ, ఆస్తులూ, సంప్రదాయాలూ అనే వాటిని మంచి విషయాలుగా భావించేవాళ్ళకి వాటిని లక్ష్యపెట్టని ఏ పనులైనా నేరాలుగా కనబడతాయి. పెద్దవాళ్ళ గురించి అంత ఆందోళన పడవలసిం దేమీ లేదు. వారికి నచ్చజెప్పడం, వారితో సామరస్యంగా మాట్లాడడం. తమ అభిప్రాయాల ఖచ్చితత్వాన్ని వారికి అర్థమయ్యేటట్టు చెప్పడం చేస్తే నూటికి 90 మంది పెద్దవాళ్ళు ఒప్పుకుంటారు. అంత ప్రయత్నించినా అర్థంచేసుకోని వాళ్ళగురించి బాధపడవలసిందేమీ వుండదు.

* * *

ఉదయ, సూర్యాపేట.

ప్ర : స్త్రీ ప్రేమకు ప్రతిరూపం అంటారు. బిడ్డల్ని కని, వాళ్ళి అనాథలుగా నర్సింగ్‌హోంలో వదిలిపోయే తల్లుల్ని చూస్తున్నాను. దగ్గరగా చూస్తున్న నేను సహించలేకపోతున్నాను. పరిష్కారం ఏమిటి? ఈ అనాథ పిల్లల భవిష్యత్తు ఏమిటి? ఆఖరికి జంతువులు కూడా తమ కూనలను ప్రేమగా చూస్తాయే! ఈ ఆడవాళ్ళకు ఏమైందనుకోవాలి?

జ : జంతువులకు సంఘభయాలు వుండవు. మనుష్యులు అనేక భయాల్లో చిక్కుకుంటారు. ఆ భయాలముందు మానవ విలువలన్నీ నశించి పోతాయి. మీరు చెప్పే సంఘటనలు జరిగిపోతున్నాయంటే దాని అర్థం ఏమిటంటే ఈ సమాజం ఎంతో తప్పుగా వుందనీ, ఇందులో మానవ సంబంధాలూ, స్త్రీ పురుష సంబంధాలూ ఎంతో అసహజంగా వున్నాయనీ అర్థం. ఈ సమాజంలో అనేక వికృతమైన సమస్యల్లాగే మీరు చూస్తోన్న సమస్య కూడా వుంది. అనాథ శిశువులు జంతువులకన్నా హీనంగా అలా పెరుగుతూ వుండవలసిందే. మీరు చేస్తోన్న సంఘటనల్లో ఎంతో కొంత సాంఘిక భయం అనేది వుంటుంది. కానీ, చాలాకాలంనించీ బ్రిటన్‌లో

(బహుశా ఇతర దేశాల్లో కూడా) కేవలం డబ్బుకోసం 'పిల్లల్ని కని ఇచ్చే' పని జరుగుతోంది. దానికోసం ప్రత్యేకంగా 'సంస్థలు' పనిచేస్తున్నాయి. పిల్లలు లేని ధనవంతుడు ఒక సంస్థ దగ్గరికి పోయి కొన్ని లక్షలకు బేరం కుదుర్చుకుంటాడు. ఈ ధనికుడు ఆ సంస్థ చూపించే స్త్రీలలో నించి ఒక స్త్రీని ఎంచుకుంటాడు. ఈ ధనికుడి శరీరం నించే తీసిన పదార్థాన్ని ఆ స్త్రీ గర్భంలోకి ప్రవేశపెడతారు. ఆమె గర్భవతి అయ్యి, బిడ్డని కంటుంది. బిడ్డ పుట్టిన తర్వాత 24 గంటల్లో దాన్ని ధనికుడు తీసుకుపోతాడు. వాడు ఇచ్చే లక్షల్ని ఆ సంస్థవాళ్ళూ, ఆ స్త్రీ పంచుకుంటారు. మళ్ళీ కొన్ని నెలల తర్వాత ఆ స్త్రీ ఇంకో బేరం రాగానే ఇంకో బిడ్డని కని ఇస్తుంది. ప్రతి బిడ్డవల్లా లక్షో, లక్షన్నరో సంపాదిస్తూ వుంటుంది. సంస్థ యజమానులకు కూడా ప్రతీ బిడ్డవల్లా కొన్ని లక్షలు! ఈ రకంగా బిడ్డల్ని కని అమ్మడం బ్రిటన్‌లో 'చట్టబద్ధమైనదే' అయితే ఒక కేసులో ఏమైందంటే, ఒక బిడ్డ అనారోగ్యంగా పుట్టిందని ఒక ధనికుడు దాన్ని తీసుకోవడానికి నిరాకరించాడు. 'ఈ పిల్ల బాగోలేదు. నాకొద్దు' అన్నాడు. 'నీకొద్దంటే ఈ పిల్లని నేనేం చేసుకోను. నీకోసమే కన్నాను. తీసుకుంటావో, మానుకుంటావో' అన్నది బిడ్డని కన్న స్త్రీ. అందరూ కలిసి కోర్టుకెక్కారు. ఈ వార్త ఒకప్పుడు 'ఈనాడు' పత్రికలో సంపాదకీయంగా వచ్చింది. (కోర్టు తీర్పేమిటో ఆ వార్తలో లేదు. ఆ తీర్పు ఎలా వుంటే మాత్రం ఆ తీర్పుకేం విలువ వుంటుంది?) ఈ వార్తని నేను ఈ మధ్యనే పాత పేపర్లలో చూశాను. నేను రాసిన "అసమానత్వంలో నించి అసమానత్వంలోకి" పుస్తకం రీ ప్రింటులో, ఒక చోట ఈ వార్తనంతా ఫుట్‌నోట్‌గా ఇచ్చాను. ఆ సంస్థల వాళ్ళనీ, ఆ ధనికుల్నీ, ఆ బిడ్డల్ని కని ఇచ్చే స్త్రీలనీ నించోబెట్టి కాల్చెయ్యడం తప్ప. వాళ్ళకి ఇంకో శిక్ష ఏదీ సరిపోదు. పెట్టుబడిదారీ

విధానం గుప్పు గుప్పున కొట్టే దుర్గంధం ఇది. ఇంత భయంకరంగా 'తల్లులు' ప్రవర్తించగలుతూ వుంటే, సంఘ భయంతో బిడ్డల్ని వదలడం ఒక లెక్కా ?'సమాజం' ఎంత వికృతంగా వుందో చెప్పే నిదర్శనాలు ఇవన్నీ.

కాకర్ల సత్యనారాయణ, అమలాపురం.

ప్ర : ఓట్లు వేసినా ఒకటే, వెయ్యకున్నా ఒకటే అంటూ వుంటారు. ఓట్లువేసి, పార్టీ ని ఎన్నుకోకపోతే పరిపాలన చేసేదెవరు ?

కె. బద్రినాథ్, హైదరాబాద్.

ప్ర : ప్రజలు చైతన్యవంతులైతే ఇంకా ఓట్లెందుకు వేస్తారు ?' అని మీరు 2-2-90 సంచికలో ఒక జవాబులో అన్నారు. నా ప్రశ్న ఏమిటంటే ప్రజలెవరూ ఓట్లు వెయ్యకపోతే ప్రభుత్వాన్ని నడిపేదెవరు ? అప్పుడు మనది 'ప్రజాస్వామ్యం' ఎలా అవుతుంది ?

జ : 'ప్రభుత్వం' అంటే ఏమిటో తెలిస్తేగానీ ఈ రకం ప్రశ్నలకు జవాబు తెలీదు. 'ప్రభుత్వం' అంటే ఏమిటో తెలియాలంటే అంతకన్నా ముందు 'సమాజం' అంటే ఏమిటో తెలియాలి. దేశంలో వున్న జనాభా అంతా ఎన్నికల ద్వారా ఎంచుకుంటున్నదే. ప్రభుత్వమనీ: ఆ ప్రభుత్వం, ఆ జనాభానంతటినీ ఒకే న్యాయంతో, సమదృష్టితో పరిపాలిస్తుందనీ సాధారణంగా అందరూ అనుకుంటారు. కానీ అసలు విషయం ఏమిటంటే ఎన్నికల విధానం ప్రారంభం కాని వెనకటి కాలంలో కూడా ప్రభుత్వం వుంది. సమాజంలో వర్గాలు ఏర్పడి పోయిన దగ్గర్నించీ, 'శ్రమ చేసే వర్గాన్ని' ఎదురు తిరగనివ్వకుండా చెయ్యడానికి 'శ్రమ చెయ్యని వర్గానికి' ఒక యంత్రాంగం కావలసి వచ్చింది. ఆ యంత్రాంగమే ఆ వర్గ ప్రభుత్వం. ఆ ప్రభుత్వంలో ముఖ్య అధికారి 'రాజు'. ఆ రాజు శ్రమ చెయ్యని వర్గానికి (భూస్వాములకూ, పెద్ద వర్తకులకూ) ప్రతినిధి. అప్పుడు పెట్టుబడిదారీ

విధానం లేదు. వశిక భూముల పేరుతో వుండే పోలీసులూ, సైన్యమూ, కోర్టులూ, జైళ్ళూ, పురికంబాలూ వంటి అంగాల సహాయంతో రాజూ, తన వర్గానికి కావలసిన 'పరిపాలన' చేస్తాడు. శ్రమ చెయ్యని వర్గం, శ్రమ చేసే వర్గానికి ఇలా చెపుతుంది. "భూమి అంతా మాదే. మా భూముల్లో మీరు పంటలు పండించండి. ఆ పంటలో నించి మీరు చావకుండా వుండడానికి సరిపోయేటంత మాత్రం మీకిస్తాం. మిగతాదంతా మాదే. మేము నిర్ణయించేదే న్యాయం. ఈ న్యాయానికి ఎవరు తిరిగారంటే మీకోసం పురికంబాలు సిద్ధంగా వున్నాయి" అంటుంది. ప్రజల్ని 'పరిపాలించడం' అంటే ఇదే. చరిత్రలో ప్రతీ రోజూ దోపిడీ వర్గ పెత్తనమే. ప్రతీరాజూ తన పరిపాలనా కాలంలో కొన్ని వేల మంది శ్రామికుల్ని 'ఉరి' తీయించి వుంటాడు.

ఇక పెట్టుబడిదారీ విధానం తలెత్తిన దగ్గిర్నించీ, శ్రమ చెయ్యని వర్గంలోకి పెట్టుబడిదారుల సెక్షన్ కూడా చేరింది. 'రాజరికాలు' పోయి, ఎన్నికలద్వారా నడిచే ఆధునిక ప్రభుత్వాలు వచ్చాయి.

ఎన్నికల ద్వారా ప్రభుత్వంలోకి ఏ పార్టీ వచ్చినా అది రకరకాల చట్టాలు చేస్తుంది. ఆ చట్టాలన్నీ ఆ వర్గ ప్రయోజనాలకే అనుగుణంగా వుంటాయి. ఆ చట్టాలు చేసేది ఏ పార్టీ అయినా, ఆ పార్టీ ప్రతినిధులు శ్రమ చెయ్యని వర్గ ప్రతినిధులే. 'శ్రమ చెయ్యని వర్గం' చేసే చట్టాలకీ, శ్రమ చేసే వర్గం కట్టుబడి వుండాలి. విచిత్రంగా లేదూ? ఈ ఆధునిక ప్రభుత్వం కూడా పోలీసులూ, సైన్యమూ, కోర్టులూ, జైళ్ళూ వంటి రాళ్ళ అండతోనే పరిపాలన చేస్తుంది. అంటే, రాజుల ప్రభుత్వమే ఆధునిక ప్రభుత్వంగా మారింది. అంటే, ప్రభుత్వానికి 'స్వభావం' మారకుండా 'రూపం' మాత్రమే మారిందనీ అర్థం.

కానీ, ఇదంతా ఏ వర్గానికి తెలీదు. ('ప్రభుత్వం' అంటే ఏమిటో మార్క్సు వివరించి చెప్పేవరకూ). మార్క్సు చెప్పినదాంట్లో వందోవంతు

కూడా ప్రజలకు అందరేసు కాబట్టి, ఈ నిర్ణయాలు ఈనాటికీ శ్రామిక వర్గానికి తెలియవు. 'రాజు' అంటే దైవస్వరూపుడని ఒకప్పుడు అనుకున్నట్టే ఇప్పుడు ఎన్నికలద్వారా వచ్చే ప్రభుత్వం అంటే ప్రజలందరి ప్రభుత్వమనీ, ప్రజాస్వామ్య ప్రభుత్వమనీ శ్రామికవర్గం కూడా అనుకుంటుంది. 'సమాజం' అనేదంతా ఒకే లక్ష్యంగల, ఒకే జీవిత విధానంగల ఏకమొత్తమనీ, ఎన్నికలద్వారా ఏదో ఒక పార్టీని ప్రభుత్వంలోకి పంపి దాని పరిపాలనకు ప్రజ అందరూ వినయంగా కట్టుబడాలనీ శ్రమ చెయ్యని వర్గం సమాజానికంతటికీ బోధిస్తుంది. 'విద్య' అనేదంతా కూడా అదే చేస్తుంది. కాని ఈ ప్రభుత్వానికి వున్న ప్రజాస్వామ్యం, ప్రజలందరి ప్రజాస్వామ్యం కాదు. ఈ ప్రభుత్వం ఏ వర్గ ప్రయోజనాలకోసం పనిచేస్తుందో ఆ వర్గానికి సంబంధించిన ప్రజాస్వామ్యం మాత్రమే. అంటే, ఆ వర్గంలో వేరువేరు గ్రూపులకూ, సెక్షన్లకూ సమాన హక్కులు ఏర్పరచే ప్రజాస్వామ్యం.

కానీ, ఈ ప్రభుత్వ ఎన్నికల్లో శ్రామికవర్గం కూడా ఓట్లు వేస్తుంది. ఆ ఓట్లు ఏదో ఒక పార్టీని ప్రభుత్వంలోకి తెస్తాయి. అలా వచ్చిన పార్టీ ఎవరికోసం పనిచేస్తుంది? శ్రామిక వర్గం కోసం కాదు. శ్రమ చెయ్యని వర్గం కోసమే పనిచేస్తుంది. 2 వర్గాల కోసమూ సమదృష్టితో పనిచేసే పార్టీ ఏదీ వుండదు. శ్రమచేసే వర్గంద్వారా ఉత్పత్తి అయ్యే మొత్తం "ఉత్పత్తుల రాసి" లో నించీ అపారమైన భాగాన్ని లాక్కుంటేనే శ్రమ చెయ్యని వర్గం విలాసాలతో సహా, జీవించగలుగుతుంది. కాబట్టి 2 వర్గాల ప్రయోజనాల్ని రక్షించడం ఏ పార్టీకీ సాధ్యంకాదు. ఇలాంటి పరిస్థితిలో శ్రామిక వర్గం ఏ పార్టీకి ఓటు వెయ్యాలా అని ఆలోచించడం అంటే, తమని అణచగల చట్టాలు తయారుచేసేహక్కూ, తమని జైళ్ళలోకి నెంటే హక్కూ ఏ పార్టీకి ఇద్దామా అని ఆలోచించడమే. అంటే, ఏ చాయితో

పళ్ళు రాలగొట్టుకుందామా అని ఆలోచించడమే. ఏ పార్టీని 'సింహాసనం' ఎక్కించినా ఒకటే శ్రామిక వర్గానికి!

కాబట్టి శ్రామికవర్గం చెయ్యవలసింది, వేరే వర్గం పార్టీలకు ఓట్లు వేస్తూ, ఆ వర్గ రాజకీయ నాయకులకు సేవలు చేస్తూ, ఆ కొట్లాటల్లో ప్రాణాలర్పిస్తూ, ఆ కార్యక్రమాలలో మునిగితేలడంకాదు. "ఉత్పత్తి స్థలాలలో" ప్రారంభించే వర్గ పోరాటాలద్వారా మొత్తం సమాజాన్ని శ్రామిక వర్గమే పరిపాలించేలాగ ఆ వర్గం రాజకీయాధికారం స్వాధీనం చేసుకోవాలి. (ఎన్నికల ద్వారా ప్రభుత్వంలోకి రావడం కాదు). ఆ క్షణంనించే దోపిడీని తీసివెయ్యగలిగే మార్పులతో, ఆ మార్గంలో దాని పరిపాలన సాగాలి.

శ్రమ చెయ్యని వర్గాన్నికూడా శ్రమలోకి తేవాలి. ఈ పరిపాలన చేసే ప్రభుత్వం - శ్రామిక వర్గ ప్రభుత్వం కాబట్టి, ఇదీ కూడా ఒక వర్గ ప్రభుత్వమే. దీనికి కూడా ఒక 'ప్రత్యేక- ప్రజాస్వామ్యమే' ఉంటుంది. ఈ ప్రజాస్వామ్యంలో, శ్రమ చెయ్యకుండా వెనకటి పద్ధతుల్లో జీవించడానికి ఎవరికీ హక్కు ఉండదు. ఈ వర్గ ప్రభుత్వానికికూడా, దాని ప్రయోజనాల్ని రక్షించే చట్టాలూ, కోర్టులూ, జైళ్ళూ ఉంటాయి. ఇవన్నీ దోపిడీని రక్షించడానికి కాదు- దోపిడీని తీసివెయ్యడానికి! శ్రమ చెయ్యని వర్గం తను పోగొట్టుకున్న రాజకీయాధికారాన్ని తిరిగి సంపాదించి, దోపిడీని తిరిగి సాగించడానికే ప్రయత్నిస్తుంది కాబట్టి దానితో పోరాటానికే అవన్నీ వుంటాయి. ఈ పోరాటం ద్వారానే శ్రామిక వర్గం, తనని తాను విముక్తి చేసుకోగలుగుతుంది. అంటే దోపిడీ వర్గ ప్రభుత్వాన్నీ, శ్రామిక వర్గ ప్రభుత్వాన్నీ ఒకే గాటన కట్టకూడదు. శ్రామిక వర్గ ప్రభుత్వం ద్వారానే "ప్రభుత్వం" అనేదాని "స్వభావం" మారడం ప్రారంభమవుతుంది. ఈ ప్రభుత్వంలో 'దోపిడీ చెయ్యడానికి' తప్ప, మిగిలిన విషయాల్లో నిబంధనలేమీ వుండవు. శ్రామికవర్గ ప్రభుత్వం ద్వారా పరిపాలన సాగుతూ సమా

జంలో సరైన మార్పులన్నీ జరుగుతూ వుంటే కొంత కాలానికి వర్గభేదాలు లేని సమాజాన్ని నిర్మించడం సాధ్యమవుతుంది. అప్పుడు ప్రభుత్వం అనేది, ఒక వర్గం ప్రభుత్వంగా వుండడం పోయి, కేవలం సమాజాన్ని నిర్వహించుకునే సంస్థగా అయిపోతుంది. ఈ విషయాలన్నీ ఎంతో వివరంగా తెలిస్తేనే 'ప్రభుత్వం' అనేది ఒక వర్గ ప్రభుత్వమేననీ, దాని ప్రజాస్వామ్యం ఆ వర్గ ప్రజాస్వామ్యమేననీ తెలుస్తుంది.

'ఓట్లు వెయ్యడం దండగ' అనీ, 'చైతన్యం ఉంటే ఇంకా ఓట్లెందుకు వేస్తారు' అని ఎవరైనా అంటున్నారంటే దాని అర్థం శ్రామిక వర్గం తన విముక్తికి కావలసిన పోరాట మార్గంలో నడవాలిగానీ, తమని దోచుకునే వర్గం చెప్పే తప్పుడు సిద్ధాంతాల్లో పడి వుండకూడదని చెప్పడమే. 'ఓట్లు వెయ్యకపోతే పరిపాలన ఎలా జరుగుతుంది? మనది ప్రజాస్వామ్యం ఎలా అవుతుంది?' అనే ప్రశ్నలు, 'ప్రభుత్వం' గురించీ, 'ప్రజాస్వామ్యం' గురించీ సరిగా తెలియకపోవడం వల్ల వచ్చిన ప్రశ్నలు. ఓట్లు వెయ్యడం మానివేసేటంత చైతన్యం కలిగిన ప్రజలు, 'వర్గపోరాట మార్గమే' చేపడతారు.

* * *

కె. ఎ. బాబు, నెల్లూరు.

ప్ర : స్త్రీ, కుదురుగా, ఒద్దుగా వున్నందువల్ల ఆమెకే మంచిదని నా ఉద్దేశం. అణిగి మణిగి వుండమన్న అర్థంతో కాదు. హుందాగా, గుండె నిబ్బరంగా, కేవలం కళ్ళల్లో ఆత్మవిశ్వాసం అన్న శక్తిని ఉంచుకుని ఎంతటి క్రూరుడినైనా చూపులతో నిలబెట్టి, మంచి మార్గంలోకి తిప్పవచ్చునేమోననిపిస్తూ వుంటుంది.

జ : స్త్రీయే కాదు, స్త్రీ అయినా పురుషుడైనా 'కుదురుగా', 'ఒద్దుగా' (అణిగి మణిగి వుండడం అనే అర్థంలోగాక, మీరు చెప్పే మంచి అర్థం

లోనే) వుండడం ఎప్పుడూ మంచిదే. అది చాలా సంస్కారవంతమైన ప్రవర్తనే. దానివల్ల సత్ఫలితాలు తప్పకుండా వుంటాయి. అయితే స్త్రీ తన మంచితనంతో ఎంతటి క్రూరుడినైనా మంచి మార్గంలోకి తెప్పగలదను కోవడం చాలా భ్రమ. క్రౌర్యాన్ని కేవలం మాటలతో నిలవెట్టవచ్చు ననుకోవడం ఎంత భ్రమో, అంత భ్రమ ఇది. తప్పుడు సినిమాల్లోను, తప్పుడు పుస్తకాల్లోనూ ఇటువంటి అబద్ధపు సంఘటనలు చూపిస్తారు. కానీ, నిజ జీవితంలో అలా ఎన్నడూ జరగదు. క్రూరత్వాన్ని చాలా తక్కువగా అంచనా వేశారు మీరు.

సిహెచ్. లోచన్ శంకర్, మల్లకల్లుపేట.

ప్ర : స్త్రీకి స్వతంత్ర ప్రతిపత్తి కావాలి. సానుభూతి కాదు. ఈ దుష్ట సాంప్రదాయాలు గల వ్యవస్థకు గుణపాఠము నేర్పాలని నా ఏకైక లక్ష్యం. అందుకు నేనెలా సిద్ధం కావాలో మీ సలహా చెప్పండి. నా వయస్సు 17 సంవత్సరాలు.

జ : సలహా కాదు, ఒక ఖచ్చితమైన సిద్ధాంతం వుంది. ఆ సిద్ధాంతమే నా సలహా. 'స్త్రీ పురుష సమానత్వం' అనే సిద్ధాంతం అది. అది ఎలా సాధ్యమవుతుందంటే 'మానవుల సమానత్వాన్ని' సాధించే సిద్ధాంతం ద్వారా. అదే మార్క్సిజం. కాబట్టి మొదట 'కాపిటల్ పరిచయం' చదవడం ప్రారంభించండి. అంతకన్నా ముందు, ఈ వాదించే మీ ఇంట్లో కొన్ని పనులు చెయ్యడం మొదలుపెట్టండి. 'అమ్మ' చేసే పనుల్లో ఒక బాధ్యతగా భాగం తీసుకోండి. ఇంటా, బయటా స్త్రీలని అవమానించే ప్రవర్తన ఎలా ఉంటుందో తెలుసుకదా! అలాంటిదేమీ లేకుండా మీ ప్రవర్తనని ప్రతివిషయంలోను కరెక్టు చేసుకోండి. ప్రస్తుతానికి ఇవి చాలు!

రవీంద్ర, కొత్తగూడెం.

ప్ర : ఆర్థిక, సాంఘిక అసమానతలు వున్నంత వరకూ రిజర్వేషన్లు వుండడం సరైనదేనా?

జ : పూర్తిగా సరైనదే. రిజర్వేషన్లు తీసేస్తే 'తక్కువ' కులాల ప్రజలకు ఇప్పుడు వున్న అవకాశాలు కూడా వుండవు.

ప్ర . కుల, మత, స్త్రీ సమస్యలపై సరియైన అవగాహన లేక, వాటిపై చేసే పోరాటాలను వర్గపోరాటాలుగా కొందరు భావిస్తున్నారు. 'నాస్తికత్వం'పై మీరు వ్రాసిన మూడు పుస్తకాలు; 'బూర్జువా ఫెమినిజం'పై మీరు వ్రాసిన 'అసమానత్వంలోనించి అసమానత్వంలోకి' పుస్తకం; ఆయా అంశాలపై తగిన వివరణలు ఇచ్చాయి. 'కులం' గురించి, లేదా 'దళిత వాదం' గురించి కూడా మీరు ఒక పుస్తకం రాస్తే చాలా ఉపయోగపడుతుందని భావిస్తున్నాను. అటువంటి అభిప్రాయమేదైనా వుందా?

జ : సమాజంలో వున్న ఏ సమస్యనైనా వర్గపోరాటం దృష్టితో చూడవలసిందే. కాకపోతే, ఆ సమస్యని బట్టి వివరణలు ప్రత్యేకంగా వుంటాయి. దళితవాదం గురించి పుస్తకం రాసే అభిప్రాయం ఇప్పటి వరకూ లేదు. 'కాపిటల్ పరిచయం' చివరి భాగంలోనే ఈ విషయం కొంచెం వస్తుంది. సాంఘికంగా 'తక్కువ' వారిగా లెక్కకు వచ్చే 'కులాల' వారంతా ప్రధానంగా 'శారీరక శ్రమలు' చేసేవారే. సమస్య అంతా ఇక్కడే వుంది. 'శ్రమ విలువ' సూత్రం ప్రకారం, ఒక 'మేధా శ్రమ'నీ ఒక 'శారీరక శ్రమ'నీ తీసుకుంటే, 1 గంట మేధా శ్రమ విలువ కన్నా 1 గంట శారీరక శ్రమ విలువ తక్కువగా వుంటుంది. దోపిడీని తీసేశామనీ, ఎవరి శ్రమ విలువ వారికే దక్కుతున్నదనీ అనుకుంటే, అప్పుడు కూడా మేధా శ్రమలు చేసేవారి ఆదాయాలకన్నా, శారీరక శ్రమలు చేసేవారి ఆదాయాలు తక్కువగా వుండి తీరతాయి. అంటే, వారి వృత్తుల

మధ్యా, జీవన పరిస్థితుల మధ్యా తేడాలు వుంటూ, ఇంతా మనుషుల మధ్య అసమానతలే వుంటాయి. ఈ సమస్యకి పరిష్కారం ఏమిటి? మనుషులంతా సమానులవడం ఎలాగ? ప్రతి వ్యక్తీ కొన్ని మేధాశ్రమలూ, కొన్ని శారీరక శ్రమలూ చెయ్యడమే దానికి మార్గం. 'సమాజం'లో వుండే శ్రమలన్నిటినీ 5, 6 గ్రూపులుగా విభజిస్తే, ఒక గ్రూపులో శ్రమలన్నిటికీ ఒకే విలువ వుంటుంది. ప్రతీ మనిషీ, ప్రతీ గ్రూపు నించీ ఒక్కో శ్రమ చేస్తే, 5, 6 రకాల వేరు వేరు విలువలు గల శ్రమలు చేసినట్టవుతుంది. ప్రతీ వ్యక్తికీ మేధా శ్రమల ద్వారా ఎక్కువ విలువా, శారీరక శ్రమల ద్వారా తక్కువ విలువా వచ్చి, అందరికీ ఒకే రకం ఆదాయం పొందే పునాది ఏర్పడుతుంది. అందరూ ఒకే ఆదాయం సంపాదించగలిగేలా వేరు వేరు రకాల శ్రమలు చెయ్యడం అంటే, అందరూ సమానమయ్యారని అర్థం. అలాంటి ఉత్పత్తి సంబంధాలు స్థిరపడిన తర్వాత 'వేతన శ్రమ'నీ, డబ్బు లెక్కల్నీ అమ్మకాల్నీ, కొనుగోళ్ళనీ తీసివెయ్యడం సాధ్యమవుతుంది. మొదట శ్రమ చెయ్యని వర్గాన్ని శ్రమలోకి దించడమూ, మేధాశ్రమల్నీ, శారీరక శ్రమల్నీ కలిపే విధంగా దోపిడీ సమాజాల శ్రమ విభజనలో మార్పులు తేవడమూ అనే విప్లవకరమైన మార్పులు జరిగితేనే గానీ శారీరక శ్రమలు చేస్తూ దుర్భరంగా జీవించే జనాలకు విముక్తి వుండదు. (చైనాలో, 'సాంస్కృతిక విప్లవ కాలం'లో, ఈ 'శ్రమ విభజన'లో మార్పు కార్యక్రమాలు కొంచెంగా మొదలు పెట్టారు. దాన్ని చూసి ప్రపంచ పెట్టుబడిదారీ వర్గం చైనాలో ఏదో 'ఘోరం' జరిగిపోతోందని హాహాకారాలు చేసింది. మరి, వాళ్ళ దృష్టిలో ఘోరమే కదా అది! భారత 'కమ్యూనిస్టులు' కూడా కొందరు చైనాలో జరుగుతోన్న ఘోరాన్ని వ్యతిరేకించారు. మొత్తం మీద ఆ 'ఘోరం' చాలా తక్కువ కాలంలోనే ఆగిపోయింది).

'విలువ సూత్రం' గురించీ, దోపిడీ గురించీ మార్క్సిజం చెప్పిన వాటిని సరిగా అర్థం చేసుకుని, సమస్యలకు తగిన మార్గంలో ప్రయాణిస్తూ, అసమానత్వాల్ని కలిగిస్తోన్న అంశాలన్నీ మార్చివేసుకోవాలి. సోషలిస్టు పరిపాలన ప్రారంభమైన తర్వాత, శ్రమ చెయ్యని వర్గం, శ్రమలోకి రావడానికి ఎంత మొరాయిస్తుందో, మేధా శ్రమల వర్గం శారీరక శ్రమలు చెయ్యడానికి అంత మొరాయిస్తుంది. (అలాగే, పురుషులు కూడా పూర్వం నించీ స్త్రీల పనులుగా వున్న ఇంటి పనులు చెయ్యడానికి అంత మొరాయిస్తారు). కాబట్టి, సోషలిస్టు సమాజం ప్రారంభమైన తర్వాత కూడా అడుగడుగునా వర్గ పోరాటం సాగవలసి వుంటుంది, వర్గాలే నశించే దాకా.

అంబేద్కర్ సాధించిన రిజర్వేషన్ల పోరాటంతో మాత్రమే ఆగిపోతే, శారీరక శ్రమల ప్రజలకు ఎప్పటికీ విముక్తి వుండదు. ఎందుకంటే రిజర్వేషన్ల ద్వారా మాత్రమే అయితే నూటికి ఒక్కరు కూడా మేధా శ్రమలోకి రాలేరు.

'దళితుల'నే పేరు శ్రామిక వర్గాన్ని చీల్చడానికి తప్ప ఎందుకూ పనికిరాదు. వారంతా శారీరక శ్రమల కార్మికులు. శారీరక శ్రమల కార్మికుల్లో అన్ని కులాల వారూ వుంటారు. వారిని విముక్తి చెయ్యగలిగేది వర్గ పోరాటమే గానీ, కుల పోరాటం కాదు. 'హరిజనుల'నే పేరు ఎంత తప్పో, 'దళితుల'నే పేరు కూడా అంత తప్పు.

* * *

ప్రభాకర ప్రసాద్, యానాం.

ప్ర : పెళ్ళికి 'సాంఘిక ప్రకటన' అవసరమా? సాంప్రదాయపు వేడుకలతో జరిగే మామూలు పెళ్ళి విషయంలో కాకుండా, స్త్రీ పురుష లిద్దరూ అభివృద్ధికరమైన ఆలోచనలు కలిగి వుండీ, పరస్పర అవగాహ

నతో, స్నేహ భావంతో ప్రేమ కలిగి వుండీ, వారిద్దరూ కలిసి వుండాలని అనుకున్నప్పుడు ఆ విషయాన్ని నలుగురికీ తెలియ చేయాలా?

జ : తప్పకుండా. "కలిసి వుండాలని అనుకున్నప్పుడు" అన్నారే. ఆ సంగతి నలుగురికీ తెలిస్తే అదే సాంఘిక ప్రకటన. ఒక అమ్మాయికి పెళ్ళి సంబంధం కుదిరినప్పుడు, "మా అమ్మాయికి పెళ్ళి సంబంధం కుదిరింది, ఫలానా సంబంధం" అని పెళ్ళికి ముందు నుంచీ అందరికీ చెప్పుకోమా? అలాగే ఇది కూడా. ఆ స్త్రీ పురుషులిద్దరూ ఒకే ఇంట్లో వుండటం ఏ రోజు నుంచీ ప్రారంభమైనా సరే, ఆ సంబంధం 'రహస్య సంబంధం'గా వుండకూడదు. "ప్రేమ భార్యాభర్తలు" అని అందరికీ తెలిసేలాగ వుండాలి. ఆ సంబంధానికి చట్టబద్ధమైన గుర్తింపు కూడా కావాలనుకుంటే, దానికి తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. 'సహచరులు'గా వుండాలనుకునే వాళ్ళు తమ సంబంధాన్ని రహస్యంగా ఎప్పుడూ వుంచుకోరు. ఆ సంగతి సంతోషంగా ప్రకటించుకుంటారు. కలిసి వుండాలనే ఉద్దేశ్యం లేని వాళ్ళే తాత్కాలిక రహస్య సంబంధాలతో కాలక్షేపాలు చేస్తారు.

* * *

రమాదేవి, హైదరాబాదు.

ప్ర : మా కాలేజీ లెక్చరర్ ఒకావిడ 3 వేలు సంపాదించగల ఆర్థిక స్తోమత వుండీ, భర్త చెత్తతనానికి విసిగి టాంక్‌బండ్‌లో పడి ఆత్మహత్య చేసుకున్నది. 2, 3 సంవత్సరాల కిందట జరిగిందీ సంఘటన. చదువు వున్నది. సంపాదన వున్నది, భర్త నుంచి విడిపోయి జీవించవచ్చు కదా?

జ : 'చదువు వుంది' గానీ, ఈ 'చదువు'లకు 'స్వతంత్ర' భావాలనిచ్చే శక్తి లేదు. భర్త నుంచి విడిపోతే సంఘంలో మర్యాద పోతుందని భయం. భర్తతో ఊహించిన కుటుంబ జీవితం నాశనమైపోయిందని

విరక్తి. ఇలాంటి పొరపాటు అభిప్రాయాలెన్నో కలిసి అలాంటి పనికి దారితీస్తాయి.

ప్ర : స్త్రీల విషయంలో పురుషులు చాలా రకాలుగా మోసాలు చెయ్యడం స్త్రీలు నిత్యం చూస్తూనే వున్నారు. అన్నీ చూస్తూ చదువు సంధ్య లున్న కాలేజీ అమ్మాయిలు కూడా అబ్బాయిల ద్వారా మోసాలకు గురి అవుతున్నారెందుకు?

జ : ఈ 'మోసాల' గురించి చాలా మంది ఆడపిల్లలకు తెలిసి వుండదు. తెలిసిన వాళ్ళు కూడా "ఎవర్తి విషయంలోనో అలా జరిగింది కాని, మన విషయంలో అలా జరగదు" అనుకుంటారు. ఈ సమాజంలో, జీవితంలో ఏ కోణంలోనూ సీరియస్‌నెస్ వుండదు. గాలివాటుగా ప్రవర్తించే బూర్జువా రక్తపు జీవిత విధానమే అన్ని వర్గాల్లోనూ నడుస్తోంది.

* * *

ఉదయలక్ష్మి, కొత్తగూడెం.

ప్ర : 'కళ్యాణి' సమస్యపై మొదటి 3 వారాలు మీరిచ్చిన సమాధానంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. అయితే, ఆ కమిటీ వాళ్ళుగాని, సి.పి.ఐ. వాళ్ళుగాని, తమకున్న పరిజ్ఞానంతో అదే మంచిది అనిపించడం వలన అలా చేసివుంటారు. అంతకన్నా మంచి వుందని తెలిస్తే అదే చేస్తారు కదా?

జ: సరే, అనాడు తెలియకపోతే తెలుసుకోమనండి. తెలుసుకుని "నిజమే, మనం పొరపాటుగా ఆలోచించాం. పొరపాటు ఆచరణలోకి దిగాం" అని పొరపాట్లని దిద్దుకోమనండి. 'వాళ్ళు తెలియక చేసి వుంటారు' అని వాళ్ళగురించి మీకు తోచిన కారణం మీరు వూహిస్తే ఎలాగ? "మేం పొరపాటుకాదు. మేం చేసింది కరెక్టే. రంగనాయకమ్మే తప్పు" అని వాళ్ళు అంటే మీరేమౌతారు? వాళ్ళు అలాగే అంటారనటానికి రుజువు లేమి

ఉంటే, వాళ్ళు అలాంటి తప్పు పోరాటాలనే మళ్ళీ మళ్ళీ సమర్థిస్తున్నారు. కొన్ని సమస్యల గురించి గ్రహించడానికి సాధారణ లోకజ్ఞానం చాలు. పెద్ద సైన్సు అక్కరలేదు. వదిలేసిన వాడి వెనకబడి "నన్ను పెళ్ళి చేసుకోవలసిందే- ఎలా చేసుకోవో చూస్తాను" అనడాన్ని పోరాటంగా భావిస్తోన్న వాళ్ళని చూసి 'అయ్యో పాపం, వాళ్ళకి తెలీక చేశార్లే' అనుకోవాలా? సరే, అలా అనుకున్నా కూడా వాళ్ళ తప్పేమిటో చెప్పాలి కదా? అదే చేశాను నేను. ప్రతి తప్పుకీ "తెలీక చేశారు. తెలిస్తే చేస్తారా?" అనుకుంటూ పోతే చాలా తప్పుల వెనక వున్న నిజమైన కారణాలు అర్థం చేసుకోలేము. చాలా తప్పులు తెలిసే చేస్తారు. అడ్డదారులతో ఏదో సాధించా చాలని.

ప్ర: ఈమధ్య టి.వి.లో 'జీవనజ్యోతి' సినిమా చూశాను. హీరోయిన్, గర్భధారణ శక్తి కోల్పోతుంది. భర్తకి రెండోపెళ్ళిచేసి, తను ఇంట్లోనించి వెళ్ళిపోయి భర్త కూతురి పెళ్ళికి వచ్చి, కట్నం ఇవ్వలేక ఆగిపోతున్న పెళ్ళికి తన 6 లక్షల విలువగల వజ్రాల మంగళసూత్రాలు ఇచ్చి, పెళ్ళి జరిపించి, రోగంతో చచ్చిపోయి 'జీవనజ్యోతి' అవుతుంది. ఆమె త్యాగ నిరతిని, ఔదార్యాన్ని అందరూ పొగుడుతారు. పిల్లలు పుట్టని స్త్రీలు, భర్తలకు రెండో పెళ్ళిళ్ళుచేసి త్యాగమూర్తులు కావాలని చెప్పారు. అదే పిల్లలు కల్గని మగవాళ్ళ భార్యలైతే రెండో పెళ్ళి చెయ్యమని చెప్పరు. పిల్లల్ని పెంచుకోమని చెప్పేవారే. సందేహంలేదు. సమాజానికి మేలు చెయ్యడం చేతకాకపోతే కీడు చెయ్యకూడదు కదా? సినిమాల్లో స్త్రీలకుకీడు చేస్తున్నారు. వెనకటి కాలంనుంచి వస్తున్న వాటినే సినిమాల్లో త్యాగం పేరుతో బోధిస్తున్నారు. కొత్తేమిటి?

జ: సినిమాలు 'కొత్త' సారాంశాన్ని చెపుతాయని ఎందుకనుకుంటున్నారు? 'సినిమా' అంటే ఏమిటి? కొంత 'పెట్టుబడి'తో పనిచెయ్యడం.

'పెట్టుబడి'కి లాభాన్ని సంపాదించడంతప్ప, అంతకన్నా కొత్తదేమీతెలీదు. కొత్తదేమీ నచ్చదు. దానికి తెలిసినవన్నీ 'లాభం' కథలే. పెట్టుబడిపెట్టి ఈ కథ తీస్తే లాభం వస్తుందా, రాదా? అంతే. సమాజపు మేలూ, కీడూ 'పెట్టుబడి'కి పట్టవు. దాని మేలే దానికి కావాలి. 'మూర్ఖపు' జనాల ముందు 'త్యాగాల' కథలు బాగా పనిచేస్తాయికదా? జనాల్ని ఆ స్థాయిలో వుంచి తేలేకదా 'లాభం'?

సి. పద్మలత, వలిగాను.

ప్ర: 'దగాపడిన కళ్యాణి—మోసకారి శ్రీనివాస్' అనే కరపత్రం గురించి మొదట 3 వారాలపాటు జవాబు ఇచ్చారు కదండీ. ఆ కళ్యాణి విషయం ఏమైనదో తెల్పమని కోరుతున్నాను.

జ: తర్వాతేం జరిగిందో నాకు కూడా తెలియదు. మీలాగే నాకూ తెలుసుకోవాలనివుంది. ఎవరైనా రాస్తేగాని తెలియదు.[1]

1 ఈ వారం తర్వాత ఒక పాఠకుడు తనకు తెలిసిన సమాచారం తెలుపుతూ నాకు ఉత్తరం రాశారు. ఆ 'శ్రీనివాస్' అనే వ్యక్తికి ఇంకో అమ్మాయితో తిరుపతిలో 'పెళ్ళి' జరిగిందట. ఇది చాలా సహజమే. పురుషుడు మోసానికి దిగిన సందర్భాల్లో చివరికి ఏం జరుగుతుందో అదే జరిగింది ఇక్కడకూడా. ఒకవేళ ఆ పెళ్ళి మొదటి అమ్మాయితోనే జరిగినా మోసాలూ, తిరస్కారాలూ జరిగిన తర్వాత పెళ్ళి జరిగితే ఆ సంబంధానికి విలువేముంటుంది? ఇరుపక్షాల్లోనూ ఆత్మవంచనలూ, పరవంచనలూ మాత్రమే వుంటాయి అందులో. అతనితో పెళ్ళి జరగకపోవడం అంటే, కళ్యాణికి మంచే జరిగింది. ★

కడియం బాలసుందరశాస్త్రి, [illegible].

ప్ర : దేవుడే మన తల రాతలను వ్రాసినప్పుడు మన తప్పొప్పులకు మనం బాధ్యులమా?

జ: కాదు. దేవుడే మన తలరాతలు రాసి, ఆ రాసిన ప్రకారమే అంతా జరుగుతూవుంటే, మన తప్పొప్పులకు మనమెలా బాధ్యులం? బాధ్యులంకాదు. కాని, దేవుడూ, తలరాతలూ ఏమీలేవనే సిద్ధాంతం మీరు వినలేదా? ఆ ప్రకారం మన తప్పొప్పులకు మనమే బాధ్యులం. 'మనమే' అంటే మనం నిర్మించుకున్న, భరిస్తూవున్న 'సమాజం' అని, 'దేవుడి' సంగతి అలావుంచి 'సమాజం' గురించి తెలుసుకోవడం ప్రారంభించండి.

*　　　*　　　*

విజయ, ఒంగోలు.

ప్ర: 'సెక్యులర్ స్టేట్' అని చాటుకుని, దేశంలో ఒక మతానికి చెందిన రామాయణ, భారతాలు ప్రసారం చెయ్యవచ్చా?

జ: దానిదేముంది? రేపు ఖురాన్నీ, తరువాత బైబిల్నీ, ఆ వెనక ఇంకేదో మతగ్రంథాన్నీ కూడా ప్రసారం చేస్తారు. సరిపోతుంది కదా?

*　　　*　　　*

శ్రీనివాస్ ఆచార్యులు, కంచుకూరు.

ప్ర: నాస్తిక వాదానికీ, హేతువాదానికీ మధ్యగల భేదమేంటి? ప్రతి హేతువాదీ నాస్తికవాది అయివుండాలా?

జ: 'నాస్తికవాదం' అన్నా, 'హేతువాదం' అన్నా పేర్లలో తేడా తప్ప సారాంశం ఒకటే. నాస్తికవాదం అంటే 'దేవుడులేడు' అనడం. దేవుడు లేకపోతే మరి వున్నది ఏమిటి? ప్రకృతి. 'ప్రకృతి' అంటా 'పదార్థం'తో తయారైనది. 'పదార్థం'తో తయారైనదానికి పదార్థానికి సంబంధం

చిన ధర్మాలే వుంటాయిగానీ, మహిమలు వుండవు. 'హేతువాదం' అంటే కూడా అదే. ప్రతీ విషయానికీ 'హేతువు' (కారణం) వుంటుందిగానీ 'మహిమ' వుండదు. అవి రెండూ ఒకటే. హేతువాది, తప్పనిసరిగా నాస్తికుడిగానే వుండాలి. వుండాలి కాదు, నిజంగా హేతువాదాన్ని గ్రహించుకున్న వ్యక్తి నాస్తికుడిగానే వుంటాడు. దేవుణ్ణి నమ్ముతూ హేతువాదిగా వుంటే అది హేతువాదంకాదు. అలాంటి వ్యక్తి తన సిద్ధాంతాన్ని సరిగా అర్థం చేసుకోలేదనో, లేదా అవకాశవాదంగా వున్నాడనో అర్థం

ఎస్.కె. అబ్దుల్ హమీద్, ఖమ్మం.

ప్ర: కోర్టులో భగవద్గీత మీద ప్రమాణం చేసి అంతా నిజం చెప్పుతాను- అని చెప్పిస్తారు. ఇలా తప్పనిసరిగా చెప్పాలా? ప్రమాణం చెయ్యకుండా నిజం చెప్పే పద్ధతిలేదా? ప్రమాణం చెయ్యకుండా నిజం చెప్పకూడదా?

జ: అదే మరి, పెట్టుబడిదారీ సమాజంలో వుండే 'కపటత్వం' అసలు తమాషా చూడండి. ప్రతీకేసులోనూ 2 పక్షాలవాళ్ళు వుంటారు కదా? అందులో, ఒక పక్షంవాళ్ళు నిజమూ, ఒక పక్షంవాళ్ళు అబద్ధమూ చెపుతారుకదా? కానీ, ఆ 2 పక్షాల వాళ్ళతోటీకూడా 'నిజమే చెపుతాను' అని ప్రమాణాలు చేయిస్తారు. 2 పక్షాలూ చెప్పేది నిజం ఎలా అవుతుంది? ఆ ప్రమాణాలు చేయించి ఏమిటి లాభం? అది అంతే. 'తర్కం' మొదలు పెడితే, అది పెట్టుబడిదారీవర్గం తినే లాభాలదగ్గిర తేలుతుంది.కాబట్టి వాళ్ళకి తర్కం అంటే భయం. ఈ సమాజంలో అడుగడుగునా ఈ చెత్త అంతా ఇలాగ వుంటూనే వుంటుంది. కోర్టుల్లో 'ప్రమాణం' చెయ్యకుండా సాక్ష్యం ఇచ్చే పద్ధతిలేదు. అయితే, ఆ ప్రమాణం భగవద్గీతమీదే చెయ్యనక్కర్లేదు.

అది ఇష్టంలేనివాళ్ళు "మనస్సాక్షి"గా అంటారు. నేను కూడా కోర్టులో సాక్ష్యం ఇచ్చినప్పుడు అలాగే అన్నాను.

*　　　*　　　*

కె. డేవిడ్ విల్సన్, జగ్గయ్యపేట.

ప్ర: మా పాప వయస్సు 6 సంవత్సరాలు. ఒక రోజున స్కూలు నుంచి వచ్చీరావడంతోటే 'నాన్నా, మనది ఏ కులం చెప్పు' అని అడిగింది. ఈ 20వ శతాబ్దంలో కూడా కుల్లుకులాల సమాజానికి మాలాంటి వాళ్ళు బలికావలసిందేనా?

జ: సంఘంలో కులాలనేవి వున్నప్పుడు, పిల్లలకి ఎప్పుడో అప్పుడు వాటిని గురించి తెలియక తప్పదు. వాళ్ళు ఎక్కడెక్కడో విని బాధపడేకంటే, అవసరమైనప్పుడు ఇంట్లో తల్లిదండ్రులే చెప్పడం మంచిది. కులాలగురించి చెప్పి, అదంతా పట్టించుకోకూడదనీ, మనుషులందరూ సమానమేననీ, వెనకటి కాలంలో మూర్ఖులెవరో అలాంటివన్నీ ప్రారంభించారనీ, కులం గురించి ఎవరు వెక్కిరించినా లక్ష్యపెట్టనంత ధైర్యంగా వుండాలనీ, పిల్లలకి అర్థమయ్యే పద్ధతిలో సందర్భం వచ్చినప్పుడల్లా చెపుతూ వుండాలి. పిల్లల్ని, సమాజంలో వున్న దుర్మార్గాలకు దూరంగా పెంచలేము. అందులోనే వుండక తప్పదు కాబట్టి సమస్యకి తగిన ధైర్యం నేర్చుకోవాలి. ఇంట్లోవున్న పెద్దవాళ్ళందరూ కులాలంటే లక్ష్యం లేకుండా వుంటే, చిన్న పిల్లలకు కూడా అదే అలవాటవుతుంది.

*　　　*　　　*

అర్చ, హైదరాబాద్.

ప్ర: బూటకపు ఎన్‌కౌంటర్లలో ఎంతోమంది విద్యార్థులు, మేధావులు చంపబడుతున్నా నోరెత్తనివాళ్ళు భూస్వామ్య వర్గాలు హత్యగావించ

బడితే ప్రజాస్వామ్యం మృగ్యమయిందని అరిచి గీపెడుతున్నారు. వారిపై మీ అభిప్రాయం ?

జ : అలా అరిచి గీపెట్టేవాళ్ళకి మీ ఎదురుప్రశ్న సరిపోతుంది. కానీ, బూటకపు ఎన్‌కౌంటర్లనీ, భూస్వామ్య వర్గాల హత్యల్నీ రెంటినీ కూడా విమర్శించేవారి విషయంలో మీరు చెప్పేది సరైన జవాబుగా నిల బడదు.

* * *

సుచరిత, ఈదర.

ప్ర : ఓటు, పార్టీని బట్టి వేయాలా, వ్యక్తినిబట్టి వేయాలా ? ఒక పార్టీ సిద్ధాంతం చాలా మంచిదనుకోండి. కానీ, దాని అభ్యర్థి చెడ్డవాడు. అలాగే, ఇంకో పార్టీ సిద్ధాంతం చెడ్డదనుకోండి. దాని అభ్యర్థి చాలా మంచివాడు. అలాగైతే ఓటు పార్టీకా, అభ్యర్థిని చూశా ?

జ : చాలా మంచి సిద్ధాంతంగల పార్టీ చెడ్డవాణ్ణి అభ్యర్థిగా ఎలా పెట్టుకుంటుంది? పెట్టుకుంటే అది మంచి సిద్ధాంతంగల పార్టీ ఎలా అవుతుంది? అలాగే, చాలా మంచి వ్యక్తి, చెడ్డ సిద్ధాంతంగల పార్టీలో అభ్యర్థిగా ఎందుకు వుంటాడు? ఉంటే, అతను చాలా మంచివాడు ఎలా అవుతాడు ? వాస్తవం అనేది, మీరు తమాషాకి తయారుచేసిన ప్రశ్నలాగ వుండదు.

* * *

నాగేశ్వరరావు, విజయవాడ.

ప్ర . మనకు ఇంకా ఎన్నాళ్ళు ఈ ప్రజాస్వామ్యమని మాయ మాటలు చెప్పే ప్రభుత్వాలు? మిలిటరీ ప్రభుత్వం రావా? ఇక కర్రపెత్తనం చాలా అవసరం దేశానికి.

జ : మీ మీద కర్ర పెత్తనమే బాగుంటుందా మీకు? ఈ ప్రభుత్వాలు చెప్పే ప్రజాస్వామ్యంలో 'మాయ' ఏమిటో అర్థమైనట్లు మాట్లాడుతున్న మీకు కర్రపెత్తనాన్ని కోరుకోవడంలో వున్న తప్పేమిటో అర్థం కావటంలేదా? మిలిటరీ ప్రభుత్వం వస్తే, కర్రపెత్తనం ఎవరిమీద చేస్తుందనుకుంటున్నారు? భూస్వాములమీదో, పెట్టుబడిదారులమీదో చేస్తుందా? మిలిటరీ ప్రభుత్వంలో వుండే డిక్టేటర్ కూడా ధనిక వర్గాల ఏజంటే. అలాంటి ప్రభుత్వం అరాచకాన్ని, దొంగవ్యాపారాన్ని అణచివేస్తుందని చాలామంది భ్రమపడతారు. శ్రామిక జనమే మార్క్సిస్టు దృక్పథంతో సమాజాన్ని మార్చుకోగలిగే విధానం తప్ప, మిగిలిన పద్ధతుల్లో ఏదైనా తప్పే. ఏదైనా ఒకటే.

* * *

ఈమని రామ్మోహన్, తాడేపల్లిగూడెం.

ప్ర : నూటికి తొంభై మంది జనాభా ఎన్నికల్ని బహిష్కరిస్తే తరువాత ఏం జరుగుతుంది?

జ : మొదటి విషయం : నూటికి తొంభై మంది, జనాభా ఎన్నికల్ని ఎప్పుడూ బహిష్కరించరు. ఎందుకంటే, కౌళ్ళూ, వడ్డీలూ, లాభాలూ, వర్తక కమీషన్లూ తింటూ శ్రమచెయ్యకుండా జీవిస్తోన్న జనాభాకి, ఇప్పుడు వున్న రకపు ప్రభుత్వాలే కావాలి గాబట్టి ఆ సెక్షన్లేవీ ఎన్నికల్ని బహిష్కరించవు. చాలా పెద్దపెద్ద జీతాలూ, ఊహాతీతమైనన్ని ప్రత్యేకసౌకర్యాలూ పొందుతోన్న ఉన్నత మేధాశ్రమ సెక్షన్లకు కూడా ఈ ప్రభుత్వాలే కావాలి కాబట్టి అవికూడా ఈ ఎన్నికల్ని బహిష్కరించవు. ఇక శారీరక శ్రమల సెక్షన్లూ, తక్కువ స్థాయి మేధాశ్రమల సెక్షన్లూ మాత్రం ఈ ఎన్నికల్ని బహిష్కరిస్తే బహిష్కరించవచ్చు. అలా బహిష్కరిస్తే ఏమవుతుందంటే ఓట్లు వేసిన వాళ్ళద్వారా ఏదో ఒక పార్టీ ప్రభుత్వంలోకి రావచ్చు. లేదా,

ఎన్నికలే అవసరం లేకుండా మిలిటరీ రకపు ప్రభుత్వం రావచ్చు. ఎన్నికల్ని బహిష్కరించడం మాత్రమే చేసి ఊరుకుంటే దానివల్ల సాధించేదేమీ వుండదు. 'ఈ ప్రభుత్వమే మాకు అనవసరం' అని గ్రహించి, ఎన్నికల్ని బహిష్కరించగల జ్ఞానమే వచ్చిందంటే, తర్వాత ఆ జనం ఇతర కార్యక్రమాలు తీసుకోకుండా ఊరుకోరు.

* * *

బి. జగ్గారావు, విశాఖపట్నం.

ప్ర : ప్రపంచం ఏ దిశగా ప్రయాణిస్తోందని భావించవచ్చు?

జ : సుదీర్ఘమైన కాలాన్ని తీసుకుని చూస్తే ప్రపంచ ప్రయాణం 'అసమానత్వం' వేపునుంచి 'సమానత్వం' వేపుకే. కానీ తాత్కాలిక సంఘటనల్లో అప్పుడప్పుడూ "అసమానత్వం" లోనుంచి "అసమానత్వం" లోకే!

రవీంద్ర, కొత్తగూడెం.

ప్ర : కాశ్మీర్‌పై 3 వాదనలు వినిపిస్తున్నాయి. (1) పాకిస్తాన్‌కి చెందినదని (2) భారత్‌కు చెందినదని (3) స్వతంత్ర కాశ్మీర్‌గా వుండాలని. మూడో వాదనే సరైనదని అనిపిస్తూంది. మీ అభిప్రాయం తెల్పండి.

జ : అక్కడ మెజారిటీ జనాభా ఎలా కోరితే అలా జరగడం సరైంది. సారాంశంలో అన్నీ ఒకటే. 'శ్రామిక వర్గాన్ని' దృష్టిలోకి తీసుకుని చూడండి. కాశ్మీరు పాకిస్తానులో చేరినా, భారత్‌లో చేరినా స్వతంత్రంగా వున్నా, ఎలా జరిగినా శ్రామికవర్గం పెట్టుబడిదారీ వర్గానికి 'అదనపు విలువ'ని వసులుతూనే వుంటుంది. కాబట్టి ఇది శ్రామిక వర్గానికి నిజమైన సమస్య కాదు. ఈ సమస్య పెట్టుబడిదారీ వర్గానిదే. అక్కడ శ్రామిక వర్గం ఇచ్చే 'అదనపు విలువ'లో ఎక్కువ భాగం ఎవరు తినాలా అనే

'ఘర్షణ' యిది. ఆ ప్రాంతం ప్రసక్తి పరంగా ఎటు చేరితే మాత్రం గ్రామిక వరానికి పోయేదేముంది, వచ్చేదేముంది ?

శ్రీనివాస్, విజయవాడ.

ప్ర : .... .... .... .... .... .... .... .... .... ....

జ : మీ ఉత్తరంలో ప్రశ్నలు ఈ శీర్షిక కోసం కాక నాకు పర్సనల్‌గానే రాశారు. కానీ మీకు జవాబు రాయాలంటే మీ అడ్రస్ పోయింది. మీరు మీ అడ్రస్ కవరుమీద రాసి వుంచారు. పొరపాటున దాన్ని నోట్ చేసుకోలేదు. (మీ అడ్రస్ కూడా ఉత్తరం రాసిన కాయితాల మీదే వుంటే అడ్రస్ పోయేది కాదు.) 'బడు' మీద మీరు రాసింది పాఠకులకు కూడా సంబంధించిన విషయమే కాబట్టి మీరీ శీర్షికకోసం రాయకపోయినా ఇక్కడ జవాబు ఇస్తున్నాను.

'కనబడడం', 'వినబడడం' అనేవి కూడా 'బడు'ల కిందకే వస్తాయని మీ మొదటి ఉత్తరంలో రాశారు. అలా రాదని నేను మీకు జవాబు రాశాను. అప్పుడు మీ రెండో ఉత్తరంలో ఒక ఉదాహరణ చూపించారు. అది చూశాక నేను మీకిచ్చిన మొదటి జవాబులో విషయం సరిగా వివరించలేక పోయానని తెలుసుకున్నాను.

మీరిచ్చిన ఉదాహరణ ఇలా వుంది.

"కనబడడం, వినబడడంలో బడు, బడు ప్రయోగమే. ఈ ఉదాహరణలు చూడండి.

1. రాముడు సీతను కనెను.
   రాముని చేత సీత కనబడెను.
2. రాముడు పాటను వినెను.
   రాముని చేత పాట వినబడెను.

అయితే 'రాముని చేత' అనే బదులు, 'రామునికి' అంటాం. అంటే అన్నంతమాత్రాన ఇది బడు కాకపోవుగా" ఇదీ మీరు వ్రాసింది. 'నేను బడులు కావని చెప్పిన క్రియల్ని మీరు బడులుగా నిరూపించగలిగారే, నేను ఎక్కడ తప్పుచేశాన' అని మొదట ఒక్క క్షణం ఆశ్చర్యపడ్డాను కానీ, మరుక్షణం లోనే అంతా స్పష్టంగా వుంది. మీ పొరపాటేమిటో అర్థమైంది. మీరు చూపించింది - నేను 'బడులు' కావని చెప్పిన క్రియల్ని కాదు. వేరే క్రియల్ని.

మీరు ఎక్కడ పొరపాటు పడ్డారంటే, 'కనడం' అనే క్రియా, 'కనపడడం' అనే క్రియా ఒకటే అనుకున్నారు. వాటిని ఏకం పాకం చేశారు. అవి రెండూ వేరు వేరు క్రియలు.

(అలాగే 'వినడం' అనే క్రియా, 'వినపడడం' అనే క్రియా కూడా వేరు వేరు క్రియలు).

'కనడం' అనేది సకర్మక క్రియ. 'దేనిని కనడం' - అని ప్రశ్నించవచ్చు. జవాబు వస్తుంది. ఏదో ఒక 'కర్మ' వుంటుంది కానీ 'కనపడడం' అకర్మక క్రియ. 'దేనిని కనపడడం' - అనే ప్రశ్నకి జవాబు రాదు. 'కర్మ' వుండదు.

'కనడం', 'వినడం' అనే క్రియలు సకర్మక క్రియలు కాబట్టే, వాటితో మీరు బడు వాక్యాలు రాయగలిగారు. "రాముని చేత సీత కనబడెను" "రామునిచేత పాట వినబడెను" అన్నప్పుడు అందులో వున్న క్రియలు 'కనడం' 'వినడం' అనేవే.

'కనడం'తో 'కనబడడం' అనే బడు వస్తుంది. కానీ 'కనబడడమూ', 'కనపడడమూ' ఒకటి కావు. అలాగే, 'వినడం'తో 'వినబడడం' వస్తుంది. కానీ 'వినబడడమూ' 'వినపడడమూ' ఒకటి కావు.

‘రాముని చేత సీత కనబడింది’ (చూడబడింది) అని రాసి. ఇందులో ఎన్ని కనబడడమూ, కనపడడమూ ఒకటే అనుకున్నారు మీరు. అందుకే "రాముని చేత కనబడింది - అనడానికి బదులు, రామునికి కనబడింది అంటాం-అంతే కదా ?" అన్నారు. ‘రామునికి కనబడింది’ ‘రామునికి వినబడింది’ అనే వాటిని బదులే అంటున్నారు మీరు. కాని అది పొరపాటు. మీరన్నట్టు అది "అంతే కదా ?" కాదు. మీ పొరపాటేమిటో తెలియాలంటే ‘కనడం’, ‘వినడం’ అనే క్రియల్ని గాక (అవి ‘కనపడడం’ ‘వినపడడం’ అనే క్రియలతో కలిసి గందరగోళంగా వున్నాయి గనుక, వాటిని గాక) ఇంకేదైనా సకర్మక క్రియని తీసుకుని మీ పద్ధతిలో వాడి చూడండి. "రాముని చేత తినబడింది" అనే బడు వాక్యాన్ని మీ పద్ధతిలో "రామునికి తిన బడింది" అంటే సరిపోతుందా ? సరిపోదు. ఎందుచేత ?

"రామునికి కనబడింది"లో బడు ప్రయోగం లేదు. అది మామూలు వాక్యమే. నిజానికి అది "రామునికి కనపడింది" అని మాత్రమే వుండాలి. అలా వుంటే, దాన్ని ‘బడు’గా పొరపడే పరిస్థితి వుండదు. కాని సాధారణంగా ‘కనపడింది’ అనవలసిన చోట ‘కనబడింది’ అనీ, ‘వినపడింది’ అనవలసిన చోట ‘వినబడింది’ అనీ రాసేస్తూవుంటాం. — అంత మాత్రాన అది ‘బడు’ ప్రయోగాలు కావు. మీ మిగిలిన ప్రశ్నలన్నీ వదిలేశాను. అవన్నీ ఇక్కడ అనవసరం.

ఎం. ప్రభాకర్, ఎ. సురేష్, యల్లాయపాలెం.

ప్ర : మానవుడు తన తెలివితేటలతో ఒక క్రమపద్ధతిలో తాజ్‌మహల్, చార్మినార్ లాంటి పెద్ద పెద్ద ఆశ్చర్యకరమైన కట్టడాలను నిర్మించినట్టు సృష్టిని కూడా భగవంతుడు ఒక క్రమ పద్ధతిలో నిర్మించాడని నా అభిప్రాయం. ఈ సృష్టిపై మీ అభిప్రాయమేమిటి ? ఈ సృష్టి ఎలా

పుట్టింది ? దీనిని ఎవరు పుట్టించారు ? నా అనుమానాన్ని నేను ఎప్పుడు ఎవ్వరినీ అడగలేదు. దీనిమీద ఏవైనా పుస్తకాలు లభ్యమవుతాయా ?

జ : ఇద్దరి పేర్లతో ప్రశ్న రాశారు కదా ? "మేము" అనాలి. 'నేను' అంటే రెండో మనిషి ఏమైనట్టు ? 'మనుషులు, కట్టడాలు నిర్మించినట్టుగా భగవంతుడు ఈ ప్రపంచాన్ని నిర్మించాడని నా అభిప్రాయం అంటున్నారు. ప్రపంచాన్ని భగవంతుడు నిర్మిస్తే, మరి, ఆ భగవంతుణ్ణి ఎవరు నిర్మించారు ? ఈ వాదోపవాదాలు ఈనాటివి కావు. వేల సంవత్సరాల కిందటి నించే ఇవే ప్రశ్నలూ, ఇవే జవాబులూ వున్నాయి. ఏ వస్తువుని తయారుచేయాలన్నా తయారుచేసే 'కర్త' వుండాలి కాబట్టి, ప్రపంచానికి కూడా ఒక 'సృష్టికర్త' వుండాలనే దృష్టితో ఈ తర్కం మొదలుపెట్టారు భక్తులు. ఏది తయారవ్వాలన్నా దాన్ని తయారుచేసే 'కర్త' వుండాలి - అనేటట్టయితే, మరి భగవంతుణ్ణి తయారు చెయ్యడానికి కూడా ఒక కర్త వుండాలి కదా ? భగవంతుణ్ణి సృష్టించేది ఇంకో పెద్ద భగవంతుడా ? ఆ 'పెద్ద భగవంతుణ్ణి' సృష్టించేది మరో పెద్ద భగవంతుడా ? - ఈ రకంగా ఎక్కడిదాకా పోయినా ఇదే ప్రశ్న మిగులుతుంది. కాబట్టి, భక్తులేమంటారంటే, "భగవంతుణ్ణి ఎవరూ సృష్టించనక్కరలేదు. ఆయన 'స్వయంభువుడు' అయిన మొదట తనని తాను సృష్టించుకుని, తర్వాత ప్రపంచాన్ని సృష్టిస్తాడు" అంటారు. అప్పుడు భౌతికవాదులు (నాస్తికులు) ఏమంటారంటే "మొదట ఎక్కడా లేనివాడు తనని తాను సృష్టించుకోవడం అర్థరహితం. కాబట్టి, దేవుడు మొదట తనని తను సృష్టించుకున్నాడనీ, తర్వాత ప్రకృతిని సృష్టించాడని చెప్పేదంతా అర్థంలేని వాదం. అంటే దేవుడు అబద్ధం. ప్రకృతే నిజం" అంటారు.

ప్రకృతి అంతా 'భౌతిక' ప్రపంచం. 'భూతం' అంటే పదార్థం. 'భూతం'తో ఏర్పడినదే 'భౌతిక' ప్రపంచం. పదార్థానికి పదార్థ ధర్మాలే

వుంటాయి గానీ మహిమ లేని వుంటవు. పదార్థానికి ఆదీ, అంతమూ వుండవు. ప్రకృతి ఎప్పుడూ వుంది. దాన్ని ఎవరూ సృష్టించలేదు. దానికి దానికి సృష్టికర్త లేడు. అది మొదట ఎక్కణ్ణించి వచ్చిందనే ప్రశ్న లేదు. అది మొదట ఫలానా దగ్గర్నించి వచ్చిందని జవాబు చెప్పుకుంటే 'అక్కడికి అది ఎలా వచ్చింది' అనే ప్రశ్న వస్తుంది. "అది ఫలానాదాంట్లోంచి వచ్చింది" అని జవాబు చెప్పుకుంటే, "ఆ ఫలానాది ఎలా వచ్చింది?" అనే ప్రశ్నవస్తుంది. మళ్ళీ ఆ ప్రశ్నకి జవాబు చెప్పుకున్నా దానిమీద మళ్ళీ అదే ప్రశ్న వస్తుంది. కాబట్టి, 'ప్రకృతి ఎప్పుడూ వుంది, రూపాలు మారుతూ వుంది' అనేదే సరైన జవాబు. ప్రకృతిని ఎవరూ సృష్టించలేదు కాబట్టి దాన్ని 'సృష్టి' అనకూడదు. 'ప్రకృతి' అనే అనాలి.

"దేవుడు ఎప్పుడూ వున్నాడు, దేవుడికి ఆదీ, అంతమూ లేవు" అని కూడా అంటారు భక్తులు.

ఎప్పుడూ వుండేదేదైనా 'పదార్థమే'. దేవుడు కూడా పదార్థమే అయితే అది స్పష్టంగా రుజువు కావాలి. రుజువులకు దొరకకుండా కేవలం ఊహల రూపంలో మాత్రమే వుంటే అది వున్నట్టు కాదు. కాబట్టి మీరిద్దరూ ఈ సింపుల్ తర్కంతో విషయాన్ని చర్చించుకుంటూ ప్రకృతి శాస్త్రాలకు సంబంధించి ఏది దొరికితే అది చదవండి. నండూరి రామమోహన్‌రావు గారు రాసిన 'విశ్వరూపం', 'నరావతారం' అనే పుస్తకాల వల్ల ప్రాథమికంగా చాలా విషయాలు తెలుస్తాయి. ఈ పుస్తకాల రచయిత 'నాస్తికుడు' కాక పోయినా, కొన్ని సైన్సు విషయాలు తెలుసుకోదల్చుకున్న పాఠకులకు ఈ పుస్తకాలు చాలా వుపయోగపడతాయి. అలాగే ఈ కోవకు సంబంధించిన పుస్తకాలు ఇంకేమైనా కూడా చదవండి. ముఖ్యంగా డాక్టర్ కోవూర్ వ్యాసాలు చదవండి. ఈ వ్యాసాలు తప్పకుండా చదవండి.

జి. శ్రీనివాసులు, కల్వరాల.

ప్ర : దేవుడున్నాడా, లేడా? ఉంటే వున్నాడని, లేకపోతే లేడని ఎట్లు చెప్పాలి? అజ్ఞానమే దేవుడని నాస్తికులంటే, జ్ఞానం దేవుడిచ్చినదే అంటారు ఆస్తికులు. మరేది నమ్మాలి?

జ : పరస్పర విరుద్ధంగా వున్న రెండు వాదాలు మన ముందుకు వచ్చినప్పుడు, మనం కూడా కొంచెం ఆలోచించాలి. రెండు పక్షాల వాదాలూ విని మనం కూడా ఆలోచిస్తే అందులో ఏదో ఒక దాన్ని ఎంచుకోవచ్చు. 'దేవుడు వున్నాడనీ, లేడనీ ఎట్లు చెప్పాలి.' అంటున్నారు కదా? వుంటే కనపడతాడు, లేకపోతే కనపడడు. అంతేకదా? 'కనపడడం' అంటే ఒక్క కళ్ళకి కనపడడమే కాదు, 'వున్నది' ఏదైనా ఏదో రకంగా మన అనుభూతులకు అందుతుంది. కళ్ళకో, ముక్కుకో, చెవులతో, నోటికో, స్పర్శకో, ఏదో ఒక ప్రయోగానికో! "గాలి కనపడుతోందా? కానీ గాలిని లేదంటామా?" అనే 'ఒకటో క్లాసు' పిల్లల ప్రశ్నతో భక్తుల వాదం ప్రారంభమౌతుంది. "గాలి కంటికి కనపడకపోయినా, ఒంటికి తగులుతోంది కదా? గాలిని పీలుస్తున్నాం కదా? దేవుడు ఒంటికి తగులుతున్నాడా?" అని ఒకటో క్లాసు పిల్లలు కూడా జవాబు చెప్పావచ్చు. ఈ జవాబుతో భక్తుడు తన మొదటి ప్రశ్నని వదులుకోవాలి కదా? వదులుకోడు. అంతంత పెద్ద విషయాలు నీకు తెలుసా?" అంటాడు. అంతంత పెద్ద విషయాలు నాకు తెలియనివైతే నీకెలా తెలుసు? దేవుడు వున్నాడని ఏ ఆధారాలతో చెప్తున్నావు? అంటే, "ఛీ! మీ నాస్తికులతో మాట్లాడి లాభం లేదు. టైము దండగ" అని లేచి పోతాడు. 'నిజం' కోసం ఆలోచించేవాళ్ళు ఈ పద్ధతిలో అయితే, నేర్చుకునే దేమీ వుండదు. 'వున్నది' ఏదైనా మనకు అందుతుంది. కరెంటు ఏ రకంగానూ మనకు కనపడకపోయినా తీగలోకి వస్తుంది. అలాగే, మామూలుగా చూడలేని ఎన్నో రకాల కిరణాల్ని వేరు

వేరు పద్ధతుల్లో పట్టుకోవడం సాధ్యమవుతుంది. 'దేవుడు తీగల్లోకి రాడు, గొట్టాల్లోకి రాడు, పేపర్లోకి రాడు, ఎండలోకి రాడు కదా? కాబట్టి, వున్నా దని మనకి ఋజువు కానివాన్నీ, ఆలోచించడానికైనా తర్కబద్ధంగా లేనివాన్నీ వున్నదని అనుకోవడం ఎలాగ? [2]

---

2. "దేవుడు ఉన్నాడా?" అనే ప్రశ్నల మీద నా జవాబులు చూసిన తర్వాత, దాన్ని వ్యతిరేకిస్తూ 22-6-90 సంచికలో ఒక వుత్తరం వచ్చింది. దానికి మళ్ళీ నా జవాబు 6-7-90 సంచికలో వచ్చింది. ఆ వుత్తరంలో వున్న 'వాదన కోసం' ఆ వుత్తరమూ నా జవాబూ కూడా ఇక్కడ ఇస్తున్నాను.

ఇదీ అంతే !

'ఆంధ్రజ్యోతి' 11-5-90 సంచికలో 'దేవుడున్నాడా, లేడా?' అనే ప్రశ్నకు రంగనాయకమ్మగారు సమాధానమిస్తూ "కరెంటు ఏ రకంగానూ మనకు కనబడకపోయినా తీగలోకి వస్తుంది. అలాగే, చూపులకైనా చూడ లేని ఎన్నో రకాల కిరణాల్ని వేరు వేరు పద్ధతుల్లో పట్టుకోవడం సాధ్య మవుతుంది. దేవుడు తీగల్లోకి రాడు, గొట్టాల్లోకి రాడు, పేపర్లోకి రాడు, ఎండలోకి రాడు కదా?" అన్నారు.

కరెంటుని ప్రవహింపచేయాలంటే విద్యుద్వాహకమైన తీగ కావాలి. అలాగే భగవద్భావం సాక్షాత్కరించాలంటే కూడా భగవల్లగ్నమైన హృదయం కావాలి అంటే రంగనాయకమ్మగారేమంటారు?

బి. ఎస్. శాస్త్రి హైదరాబాద్.

* * *

శాస్త్రిగారేమంటారు ?

"కరెంటుని ప్రవహింపచేయాలంటే విద్యుద్వాహకమైన తీగ కావాలి. అలాగే, భగవద్భావం సాక్షాత్కరించాలంటే కూడా భగవల్లగ్నమైన →



హృదయం కావాలి—అంటే రంగనాయకమ్మగారేమంటారు?" అంటూ ఒ.ఎస్. శాస్త్రిగారు (హైదరాబాదు) 22-6-90 సంచికలో 'ఉత్తరాల శీర్షిక'లో ప్రశ్నించారు. తీగలోకి వచ్చిన కరెంటు ద్వారా దీపాలు వెలుగుతాయి. పంకాలు తిరుగుతాయి. రేడియోలు పాడతాయి. కరెంటుని ముట్టుకుంటే షాకులు కొడుతుంది. కరెంటు ద్వారా ఇంకా లక్ష పనులు జరుగుతాయి. ఈ పనులన్నిటినీ నూటికి నూరుమందీ చూడగలుగుతారు కరెంటుని తీగలోకి తెచ్చే మనిషి దాన్ని అందరికీ ప్రదర్శించగలుగుతాడు. ఇది అందరికీ ప్రత్యక్షంగా కనపడే సత్యం. మరి భగవంతుడి విషయంలో కూడా అలా ఎందుకు జరగడంలేదు? భక్తుడి హృదయంలోకి నిజంగా దేవుడు వస్తే (తీగలోకి కరెంటు వచ్చినట్లు), ఆ 'వాస్తవాన్ని' భక్తుడు, ఇతరులకు కూడా ఏదో ఒక మార్గంలో ఎందుకు చూపించలేకపోతున్నాడు? భగవంతుణ్ని భక్తుడి హృదయంలోకే రానివ్వండి, అందరి హృదయాల్లోకి రావొద్దు. కానీ, భగవంతుడు అక్కడి నించే అందరికీ కనబడ్డానికేం? పోనీ, వినపడ్డానికేం? "ఇదిగో, భగవంతుడు నా హృదయంలో వున్నాడు. మీరందరూ కూడా చూడండి" అని ఇప్పటి వరకూ ఏ భక్తుడైనా భగవంతుణ్ని ఏదో ఒక పద్ధతిలో ఇతరులకు చూపించాడా?- అలా ఎన్నడూ జరగలేదని వేరే చెప్పనక్కరలేదు. 'భగవంతుడు' 'భగవంతుడు' అనడమే గానీ, ఇప్పటివరకూ దాన్ని ఏ భక్తుడూ రుజువు చెయ్యలేదు.

"భక్తుడు, తన హృదయంలోకి వచ్చిన భగవంతుణ్ని తనే చూస్తాడు గానీ ఇతరులకు చూపించడు. ఇతరులంతా ఎవరికి వారుగా విడివిడిగా భగవంతుణ్ని తమ హృదయాల ద్వారానే చూసుకోవాలి" అంటారా? ఆ రకం మాటల్లో ఏం 'హేతుబద్ధత' వుంది? భక్తుడు తన హృదయంలో భగవంతుణ్ణే చూస్తున్నాడనీ, భగవంతుడు అక్కడికి



వందనపు మైత్రి, చిట్యాల.

ప్ర : 'పత్రికా ప్రపంచంలో అద్భుత ప్రయోగం', 'అనన్య సామాన్యం' అంటూ ఏమీ లేకున్నా విపరీతమైన పబ్లిసిటీ ఇచ్చుకునే పత్రికలను ఏమనుకోవాలి?

జ : 'ఏమీ లేకున్నా విపరీతమైన పబ్లిసిటీ ఇచ్చుకునే పత్రికలు'

---

→

నిజంగా వచ్చాడనీ-ఇతరులు ఎందుకు నమ్మాలి? ఆ భక్తుడు 'భ్రమల్లో' వున్నాడనుకోకూడదా? 'పిచ్చిగా' వున్నాడనుకోకూడదా?

ఎవరి హృదయంలోనైనా 'జబ్బు'లో కణితలో, గాయాలో అలాంటి వేవో వుంటే ఆపరేషన్ చేసినప్పుడు కనపడడం లేదా? అలాగే, భగవంతుడు కూడా భక్తుడి శరీరంలో ఎక్కడో అక్కడ కనపడవద్దా? 'వున్నది' ఎందుకు కనపడదు? ఇతరులకు రుజువు చెయ్యలేని విషయాల్ని 'వున్నద'ని భావించడం ఎలాగ? 'కరెంటు తీగలోకి వచ్చినట్టే, భగవంతుడు భక్తుడి హృదయంలోకి వస్తాడు' అనగానే సరిపోదు. దాని తర్వాత వచ్చే ప్రశ్నలకు కూడా జవాబులు దొరకాలి.

భక్తులు, 'తర్కాన్ని' వ్యతిరేకిస్తూనే, మళ్ళీ వాళ్ళూ తర్కించ డానికే పూనుకుంటారు. భగవంతుడు, భక్తి అనే కారణం వల్ల భక్తుడి హృదయంలోకే వస్తాడు, భక్తిలేని హృదయంలోకి రాడు' అనడం తర్కం కాదా? ఆ తర్కం, ఇతర ప్రశ్నలకు జవాబులు చెప్పలేకపోతున్నప్పుడు ఆ తర్కమే పొరపాటుగా వుందని గ్రహించి దాన్ని వొదులుకోవద్దా?

తీగల ద్వారా వచ్చే కరెంటు అందరికీ కనపడినట్టే, భగవల్లగ్న మైన హృదయంలో వున్న దేవుడు అందరికీ ఎందుకు కనబడడు అనే ప్రశ్నకి శాస్త్రిగారేమంటారు? — రంగనాయకమ్మ, హైదరాబాదు.

★

అనుకోవాలి. ఏమీ లేకపోతేనే కదా, పబ్లిసిటీతో మాయ చెయ్యవలసిన అవసరం?

* * *

ఎస్. ప్రమీల, కాకినాడ.

ప్ర : వెకిలితనంగా వున్న సెక్సు సాహిత్యం ఎక్కువ ప్రమాదమా; కత్తులు, రక్తం అని రాసే క్రైము సాహిత్యం ప్రమాదమా; మూఢత్వాన్ని పెంచే మత సాహిత్యం ప్రమాదమా?

జ : అన్నీ తప్పులే కాబట్టి అన్నీ ప్రమాదమే. అయితే, ఆ తప్పుల రూపాలు వేరు వేరుగా వుంటాయి కాబట్టి, ఆ ప్రమాదాల రూపాలు కూడా వేరు వేరుగా వుంటాయి. 'రూపం'లోనే తేడా. సారాంశంలో అన్నీ ఒకటే. అన్నీ భయంకరమైనవే.

* * *

గాంధీనగర్ఫు చిట్టిబాబు, విశాఖపట్నం.

ప్ర : నేను ఏ మత సంప్రదాయాలూ పాటించను. మా పిల్లలు పండగలు ఎంజాయ్ చెయ్యడం మిస్ అవుతున్నారేమో అనుకుంటున్నాను. ఈ విషయంలో ఏమైనా సలహా ఇవ్వండి.

జ : 'నేను పాటించను' అంటున్నారు. పిల్లల తల్లి ఆ సంప్రదాయాలన్నీ పాటిస్తారా? తల్లిదండ్రులిద్దరూ నాస్తికులైన కుటుంబాలలోనే ఈ ప్రశ్న వస్తుంది. పండగల్ని 'ఎంజాయ్ చెయ్యడం'లో సాధారణంగా 2 రకాల కార్యక్రమాలు వుంటాయి. పూజలు చెయ్యడం ఒక రకం కార్యక్రమమైతే, కొత్త బట్టలూ, పిండి వంటలూ, మతాబులు కాల్చడాలూ వంటివన్నీ కలిపి రెండో రకం కార్యక్రమం. పిల్లలకు సంతోషం కలిగించేది ఈ రెండో కార్యక్రమమే. కాబట్టి, నాస్తిక కుటుంబాల్లో కూడా, కేవలం పిల్లల కోసం, ఈ రెండో రకం కార్యక్రమాలు వుంచవచ్చు. నిజానికి, 'నాస్తికత్వం' పూర్తిగా అలవడిన మనుషులకు పండగల పేరుతో

జరిగే ఏ కార్యక్రమమూ నచ్చదు. కాని, పిల్లలు ఆ స్థాయిలో వుండలేరు కాబట్టే వాళ్ళ గురించి ఏం చెయ్యాలని ప్రశ్న! నాస్తిక తల్లిదండ్రులు పిల్లలకు చాలా చిన్నతనం నించే సైన్సు విషయాలు వివరిస్తూ వుండాలి. పెద్దవాళ్ళు నాస్తికులైతే పిల్లలకు కూడా ఆటోమేటిక్‌గా నాస్తికత్వం అలవడుతుందనుకోకూడదు. 'దేవుడికి దణ్ణం పెట్టు' అనే మాటలతో చంకల్లో పిల్లలకే కూడా 'భక్తి' బోధించడం ప్రారంభిస్తారు కదా? ఆ మాటలు పిల్లలతో నాస్తిక తల్లిదండ్రులు అనకపోయినా ఇంట్లో పెద్దవాళ్ళో, స్నేహితులో, బంధువులో అలా అంటూ పిల్లలతో దణ్ణాలు పెట్టిస్తూ వుంటారు. పిల్లలు మరీ చిన్నవాళ్ళుగా వున్నప్పుడైతే, పిల్లలచో అలా చేయించేవాళ్ళని తల్లిదండ్రులే వారించాలి. పిల్లలకు మాట్లాడే వయసు వచ్చాక 'దేవుడెక్కడున్నాడో చూపించు, దణ్ణం పెడతాను' అని పిల్లలే అనగలిగేలాగ తల్లిదండ్రులు వాళ్ళకి బోధించాలి. మొదట పిల్లల సందేహాలు తీరుస్తూ వుండాలి. ప్రతీదాన్నీ ప్రశ్నించడం నేర్పుతూవుండాలి. ప్రతీ పండక్కీ ఏదో ఒక 'కథ' వుంటుంది కదా? ఆ కథ రకరకాల తప్పులతో వుండి తీరుతుంది. ఆ కథ చెప్తూ అందులో ప్రతీ తప్పునీ పిల్లలకు వివరించాలి. 'వినాయక చవితి' వుందనుకోండి. 'నలుగు పిండి' దగ్గర్నించీ అడుగడుగునా ప్రశ్నలే కదా? "కథలు వినేటప్పుడు ప్రశ్నిస్తూ వింటే పిల్లలకి అందులో ఆనందం ఏముంటుంది" అంటారా? ప్రశ్నిస్తూ విన్నా ఆనందం పోదు పిల్లలకి. పైగా ఆలోచించగలగడం ఇంకా ఆనందంగా వుంటుంది వాళ్ళకి. "ఎవర్నీ లోపలికి రానివ్వొద్దన్నది కదా వినాయకుడితో వాళ్ళమ్మ? ఆ మాట వినాయకుడు చెప్తే వినకుండా శివుడు వినాయకుణ్ణి చంపెయ్యడమేనా? అలాంటి శివుణ్ణి మంచివాడంటారేం? వినాయకుడి తలకాయ అక్కడ వుంది కదా! దాన్నే మళ్ళీ అంటించకూడదూ, ఎక్కడికో పోయి, ఏనుగు తలకాయ తేవడం ఎందుకూ?"

అంటూ పిల్లలు, కథ చెప్పే మనిషిని ప్రశ్నలతో తికమక పెట్టెయ్యగలిగితే పిల్లలకు చాలా ఆనందంగా వుంటుంది. ఇంట్లో పెద్దవాళ్ళు పూజలు చెయ్యకపోతే' పిల్లలకు కూడా పూజలు అలవాటు కావు. కానీ పిల్లల మీద నాస్తిక తల్లిదండ్రుల ప్రభావమే గాక, మిగిలిన సమాజం ప్రభావం కూడా వుంటుంది కాబట్టి, 'వినాయక చవితి' లాంటి కొన్ని రకాల పండగల్ని పిల్లలు ఇష్టపడితే, వాళ్ళ ఇష్టానికి వాళ్ళని వదిలెయ్యడం మంచిది. కానీ, గట్టి హెచ్చరికలతో! "మీ ఇష్టం, పూజ చేసుకుంటే చేసుకోండి, మీకు కావలలసినవేవో కొనిపెడతాం. మేమైతే మీ పూజ దగ్గరికి రాము. ఈ పూజల్ని అందుకునే దేవుళ్ళు లేరనీ, ఇదంతా మూర్ఖత్వమనీ మేము మీకు చెపుతూనే వున్నాం. ఇంత చెప్పినా మీరు 'ఈ పూజచేస్తాం, ఆ పూజ చేస్తాం' అంటున్నారంటే 'అయ్యో! ఈ పిల్లలు ఇంత తెలివి తక్కువగా వున్నారే' అనుకుంటాం గానీ, మీ మీద కోపం లేదు, ఇంకా మీరు చిన్న పిల్లలు కాబట్టే మీ మూర్ఖత్వాన్ని భరిస్తాం" అని చెప్పాలి. చిన్న పిల్లలు 'పూజల' కన్నా కొత్త బట్టలకీ, పిండి వంటలకీ ఎక్కువ ఆశపడతారు కాబట్టి, కొన్ని పండగలకన్నా అలా చెయ్యవచ్చు. ఇదంతా వాళ్ళు చిన్న పిల్లలుగా వున్నంతవరకే. పిల్లలకి సైన్సు విషయాలు ఎక్కువగా తెలుస్తూ, ఆలోచించడం చేతనవుతోన్న కొద్దీ పండగల్ని మిస్సవుతున్నామనే బాధ లేకుండా వాళ్ళంతట వాళ్ళే మానేస్తారు. తల్లిదండ్రుల్లో ఒకరు భక్తులా, ఒకరు నాస్తికులా అయితే, ఇద్దరి వాదాలూ పిల్లలకి వినిపిస్తూ వుండాలి. పిల్లలు ఏది ఎంచుకుంటే అది ఎంచుకుంటారు. ఎప్పుడూ ఇంట్లో నిరంతరంగా వాదోపవాదాలు వుండాలి.

* * *

కోంటతాల శ్రీనివాసరావు, అనకాపల్లి.

ప్ర : మీరు నాస్తికులు కదా? ఈ నాస్తికవాదం మీరు పుస్తకాల

ద్వారా తెలుసుకొని అవలంబించుతున్నారా? లేక మీ జీవితంలో కొన్ని సన్నివేశముల ద్వారా నాస్తికవాదులుగా మారినారా?

జ : పుస్తకాల ద్వారా తెలుసుకోవడమే. నాకు 20 సంవత్సరాలు వచ్చే వరకూ దేవుడి మీద నమ్మకాలుండేవి. అప్పటి వరకూ పెన్నుతో ఏం రాయాలన్నా కాయితం మీద మొదట 'శ్రీరామ' అని రాస్తూ వుండేవాన్ని. కొన్నిసార్లు అరిచేతిలో 'శ్రీరామ' రాసి కళ్ళకి అద్దుకుంటూ వుండేవాన్ని. రోజూ సూర్య నమస్కారాలు చేస్తూ వుండేవాన్ని. అంత 'మంచి'వాన్నయిన నేను ఒక రోజు నుంచీ వీరేశలింగం గారి పుస్తకాలు చదవడం ప్రారంభించాను. ఆ పుస్తకాల్లో సాంప్రదాయాల్నీ, దేవుడి మహాత్యాల్నీ ప్రశ్నించడం వుంటుంది. అవన్నీ చదువుతోంటే 'ఇదేమిటి, ఇంత చిన్న చిన్న విషయాలు ఇప్పటి దాకా తెలీలేదే! ఎవరూ చెప్పలేదే!' అని ఆశ్చర్యం ప్రారంభమైంది. ఇంకేముంది? 'ఆలోచనలు' ప్రారంభమయ్యాయి. వీరేశలింగంగారు పూర్తిగా నాస్తికుడు కాదు. ఆ సంగతి నాకు అప్పుడు సరీగా తెలీదు. తర్వాత చలంగారి పుస్తకాలు! వాటిలో కూడా చాలా తర్కం! చాలా రకాల ప్రశ్నలు! చలంగారు కూడా నాస్తికుడుకాడు! ఆ సంగతీ అప్పట్లో నాకు సరీగా తెలీదు. వారి తర్కంతో వారు పూర్తిగా నాస్తికులు కాలేకపోయినా, ఆ తర్కమే నాకు పూర్తిగా నాస్తికదృష్టి కలిగించడానికి ఉపయోగపడింది. నాస్తికత్వానికి సంబంధించి, ఆ ఇద్దరూ నా గురువులు! ఇంకా వుండిపోయిన ప్రశ్నలకి నా తర్కంతో నేను జవాబులు వెతుక్కున్నాను.

'మార్క్సిజం' అనేది భౌతిక వాదమే అయినా, మార్క్సిజం చదవడం ప్రారంభించే నాటికే నేను నాస్తిక భావాలతో వున్నాను. నాస్తిక

తర్కానికి ఇంకా ఇంకా తోడ్పడ్డవి డాక్టర్ కోవూర్ వ్యాసాలు. కోవూర్ వ్యాసాలు చదివితే చిన్నపిల్లలైనా నాస్తికులై పోతారు. వీరేశలింగమూ, చలమూలాంటి రచయితల తర్కంలోవున్న లోపాలేవీ కోవూర్ తర్కంలో వుండవు. కోవూర్ పూర్తిగా నాస్తికుడు. ఆయనకి 'ప్రకృతి శాస్త్రాలు' బాగా తెలుసు. (కానీ, ఆయనకి 'మార్క్సిజం' తెలియదు).

సాధారణంగా అందరూ చిన్నతనంలో 'భక్తులు'గానే వుంటారు. (నాస్తిక కుటుంబాల్లో పెరిగే పిల్లలు కూడా చిన్నతనంలో నాస్తికత్వాన్ని సరిగా అర్థం చేసుకోలేరు.) చిన్నప్పుడు ఇళ్ళల్లో తల్లిదండ్రులు నాస్తికత్వం నేర్పరు. ఆ విషయాలు వాళ్ళకేమీ తెలీవు. చదువుకుంటూ వున్న వయస్సులో కొందరూ, ఇంకా తర్వాత కొందరూ నాస్తికత్వం మీదవున్న పుస్తకాలేవో చదివి నాస్తికులవుతూ వుంటారు. ఆ పుస్తకాల్లో వున్న దాన్ని బట్టీ, దాన్ని గ్రహించడంలో ఆ వ్యక్తుల శక్తిసామర్థ్యాల్ని బట్టీ వాళ్ళు పూర్తిగా నాస్తికులుగా గానీ, అరకొర నాస్తికులుగాగానీ వుంటారు. జీవితంలో జరిగే ఏవో సంఘటనలవల్ల (విషాద సంఘటనలని మీ అభిప్రాయం అనుకుంటాను) నాస్తికులుగా మారడం ఎక్కడా జరగదు. ఎందుకంటే, స్వంత 'కష్టాల' వల్ల ప్రకృతికి సంబంధించిన జ్ఞానం రాదు. నాస్తికత్వం అంటే ప్రకృతికి సంబంధించిన సత్యం. ఇది భౌతిక ప్రపంచ మనీ, పదార్థానికి పదార్థ ధర్మాలే గాని మహిమలు వుండవనీ, ఇంకా ఆ రకం విషయాలు తెలిస్తేనే దేవుడు నిజం కాదని తెలిసి నాస్తిక భావాలు ఏర్పడతాయి. ఇదంతా కష్టాల వల్ల రాదు. చెప్పాలంటే, కష్టాల వల్ల భక్తి ఇంకా ఎక్కువవుతుంది. ఒక దేవుడిమీద నమ్మకం పోతే ఇంకో దేవుణ్ని నమ్మడం ప్రారంభిస్తారు గానీ (దేవుళ్ళకి కరువా?) 'దేవుడే లేడు' అనే అర్థానికిరారు. పైగా, కష్టాలు ఎక్కువైన కొద్దీ 'దేవుడు పరీక్షిస్తున్నాడు, ఓర్చుకోవాలి' అనుకుంటారు గానీ దేవుళ్ళమీద ఎవరూ కోపాలు తెచ్చు

కోరు. ఒకవేళ, నాలుగు రోజులు కోపం వున్నా, కోపం పోగానే మళ్ళీ నమ్మకం ఎప్పటిలాగే వుంటుంది. (కష్టాలవల్ల నాస్తికులై పోయినట్టుగా సినిమాల్లో తప్పు తప్పుగా చూపిస్తారు.)

అసలు చిన్నతనం నుంచే ఇళ్ళల్లో తల్లిదండ్రులూ, ఇతరులూ, స్కూళ్ళల్లో టీచర్లూ అందరూ ప్రతిదాన్నీ ప్రశ్నించడం నేర్పుతూ వుంటే, పాఠ్యపుస్తకాలు ఆ పద్ధతిలో వుంటే, చిన్నతనం నుంచే పిల్లలు భక్తులు కాకుండానే వుంటారు. ఇరవై ఏళ్ళో పాతికేళ్ళో వచ్చాక, అప్పుడు ఏదో పుస్తకం దొరికి, అది కూడా సగం తెలిసీ సగం తెలీకా, అప్పుడు 'ఆలోచించడం' ప్రారంభించడం అంటే, అప్పటిదాకా అది 'ఆలోచన' లేని జంతువు' జీవితం కాదూ? అయితే, జంతువుకీ, మనిషికీ ఒక తేడా వుంది. జంతువుకి భక్తి' వుండదు, నాస్తికత్వమూ' వుండదు. మనిషికి ఏదో ఒకటి వుంటుంది. అందులో ఒకటే నిజం గానీ, రెండూ నిజం కాలేవు.

వీరయ్య, సమిడిపాడు.

ప్ర: ప్రాచీన కాలంలో పని విభజన కొనసాగింపే సమాజంలో కులాలుగా ఏర్పడిందంటారు. కులాలు భారతదేశంలో తప్ప యితర దేశాల్లో లేవంటారు ప్రతీ దేశంలోనూ పని విభజన వుంటుంది కదా? కులాలకు పని విభజనే ప్రాతిపదిక అయితే, అన్ని దేశాల్లోనూ కులాలు ఏర్పడి వుండవలసింది కదా? కమ్మ, రెడ్డి, వెలమ, బలిజ మున్నగు కులాలకు వేర్వేరు వృత్తులు లేవు. మాలలు పూర్వకాలంలో నేత పని చేసేవారట. ఇప్పటికీ కొన్ని ప్రాంతాల్లో చేస్తున్నారట. నేత పని ప్రధానంగా సాలీలు చేస్తారు. ఒకే రకం పనిని వేరు వేరు కులాల వారు చేస్తున్నారు కదా?

జ : పని విభజన ఒకచోట కులాల రూపంలో వుంటే, ఇంకొక చోట గిల్డుల రూపంలోనూ మరోచోట మరో రూపంలోనూ వుండి వుండ

వచ్చు. ఒక జబ్బు 4,5 లక్షణాలను కనబరుస్తుందనుకుంటే ఆ లక్షణాలన్నీ ఒకే రోగి మీద కనపడకపోవచ్చు. ఆ రోగులందరికీ ఒకే జబ్బు వున్నా, రోగాన్ని వ్యక్తపరచే లక్షణాలు తేడాగా వుండవచ్చు. అలాగే పని విభజన-ఒక్కో దేశ ప్రత్యేక పరిస్థితుల్ని బట్టి ఒక్కో రూపంలో వ్యక్తమై వుండవచ్చు. 'పురుషాధిక్యత' అనే జబ్బు ప్రపంచమంతటా వున్నా, దాని లక్షణాలు అన్ని చోట్లా ఒకే రకంగా లేవు. భర్త పోగానే భార్యకి జుట్టు తీయించి వెయ్యడం గానీ, సతీ సహగమనం గానీ భారతదేశంలోనే వున్నాయి. ఒకప్పుడు రష్యాలో పిల్లలు పుట్టని స్త్రీలతో నాగళ్ళు లాగిస్తూ పొలాలు దున్నించేవారని రష్యన్ కథల్లో చదివాను. ఆ సాంప్రదాయం భారత దేశంలో లేదు. అంటే పురుషాధిక్యత అనే ఒకే కారణంతో పుట్టుకొచ్చే లక్షణాలు ఒక చోట వున్నట్టు ఇంకోచోట లేవు. ఎందుకంటే ఆ "మూలానికి" వేరు వేరు చోట్ల, వేరు వేరు ప్రత్యేక పరిస్థితులు కలిసి ప్రత్యేక లక్షణాలు ఏర్పడతాయి. భారత దేశంలో ప్రాచీన కాలపు సాహిత్యం ప్రకారం కులాలన్నీ కలిసి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగు రకాలు. ఒక్కో రకంలో మళ్ళీ ఉపవిభజన వుంటే వుండవచ్చు. ఒకప్పుడు శారీరక శ్రమలు చేసే వారంతా శూద్రులే. ఇప్పుడు ఆ శూద్రుల్లోనే శారీరక శ్రమలు పూర్తిగా వదిలేసి మేధా శ్రమలు చేసే సెక్షన్లు తయారయ్యాయి. ఈనాడు వున్న కులాలన్నిటినీ తీసుకుని, 'వృత్తిని బట్టి కులాలు ఏర్పడ్డాయ్యి అంటున్నాం కదా, ఈ కులాల్లో ఒక్కో కులానికీ ఒక్కో వృత్తి కనబడడం లేదే' అనే పద్ధతిలో ఆలోచిస్తే, ఈ విషయాలు అర్థం చేసుకోలేము.

* * *

నిరంజన్, రాజమండ్రి.

ప్ర : స్వర్గానికి ఎన్ని నిచ్చెనలు పడతాయి?

జ : అన్ని నిచ్చెనలు కట్టుకుంటూ పోవ్వడం కంటే స్వర్గాన్నే భూమి మీదకి తెచ్చుకుంటే పోలా? స్వర్గానికి నిచ్చెనలు కట్టగలిగేవాళ్ళు స్వర్గాన్నే భూమి మీదకి తేలేరా?

* * *

నై. సులోచన, పాలకొల్లు.

ప్ర : భారతదేశపు 'జాతీయ పక్షి' నెమలి అంటారు. భారతదేశంలో నెమళ్ళు అధికంగా వుంటాయని అర్థమా?

జ : భారతదేశంలో కాకులకన్న ఎక్కువగా వున్నాయా నెమళ్ళు? కాబట్టి ఆ అర్థం కాదు. దానికేదో గొప్ప అర్థం ఏదీ లేదు. అనేక రకాల పక్షుల్లో ఒక పక్షి మనుషులకు 'జాతీయ పక్షి' అవడం ఏమిటి? దానికేమీ అర్థం పర్థం లేదు. ఏ ప్రాంతంలోనైనా అక్కడ వున్న వాతావరణాన్ని బట్టి కొన్ని రకాల జంతువులూ, కొన్ని రకాల పక్షులూ పెరుగుతాయి. ఒక జంతువుని జాతీయ జంతువు అనీ, ఒక పక్షిని జాతీయ పక్షి అనీ పేర్లు పెట్టుకుంటే దానికేం అర్థం వుంటుంది? తప్పుడు 'ఆర్థిక పునాది' మీద ఏర్పడే సంస్కృతిలో అనేక విషయాలు ఇలాగే అర్థం పర్థం లేకుండా వుంటాయి. ఇలాగే అసహజమైన విషయాలెన్నో జరిగిపోతున్నాయంటే, సమాజ పునాదే అసహజంగా వుందని అర్థం.

* * *

జయశంకర్, ఆసీఫాబాదు.

ప్ర : కాశ్మీరు మనకు దక్కుతుందా?

జ : మనకు అంటే భారతదేశానికి అనే కదా మీ అర్థం? ఇదే మాట పాకిస్తాన్‌లో కూడా అనుకుంటారు. నిజానికి కాశ్మీరు 1947 వరకూ వేరే దేశం. తర్వాత కాలంలో అందులో కొంత భాగాన్ని పాకిస్తానూ, మిగిలిన దాన్ని భారత దేశమూ ఆక్రమించాయి. అదీ కాశ్మీర్ చరిత్ర. కాబ

కాశ్మీర్ మనకి దక్కుతుందా అని భారత్‌లో అనుకున్నా, పాకిస్తాన్‌లో అనుకున్నా అది న్యాయం కాదు. బ్రిటిష్ వాళ్ళు ఈ దేశాన్ని వదిలేసి వెళ్ళిపోవాలని అనుకున్నాం కదా! ఆ సూత్రం భారత దేశానికి వర్తించదా? అది కాశ్మీర్‌ని వదలనక్కరలేదా? కాశ్మీర్ కాశ్మీర్ జనాభాకే దక్కాలి: ఇది ప్రస్తుత పరిష్కారం. అయితే అక్కడ కూడా వర్గాలు వుంటాయి కాబట్టి, కాశ్మీరు అక్కడ వున్న శ్రామిక ప్రజలకే దక్కాలి. (ఏ దేశానికైనా అంతే)· ఇది తర్వాత జరగవలసిన పరిష్కారం.

*　　　*　　　*

వై. రామకృష్ణ, రాజమండ్రి.

ప్ర : (2-2-90 సంచిక చదివి) "మార్క్సిజమ్ విఫలం కాలేదు, దాన్ని ఆచరణల్లో పెట్టకపోయిన నాయకులదే (స్టాలిన్ నుంచీ గోర్బచెవ్ దాకా) వైఫల్యం" అంటున్నారు కదా, అయినప్పుడు మార్క్సిజమ్‌కీ బౌద్ధం, క్రైస్తవం, జైనం, ఇస్లాం వంటి ఆదర్శ వాదాలకీ తేడా ఏమిటండీ? మార్క్సిజమ్ కూడా ఒక మతం. ఒక ఆదర్శవాదమే. అన్ని మతాలూ పుట్టిన కొన్నాళ్ళు బాగా ఆకర్షించి, ఆశ చూపి, మానవుల వైఫల్యంతో మూలబడటంతో, మరోవాదం అవతరించడమూ, కొన్నాళ్ళు ప్రాబల్యం చూపడమూ జరుగుతోంది. అంతే కదా మార్క్సిజమ్ సంగతీనూ? అచ్చం, పదార్థం నుంచీ జీవమూ, మానవుడూ వచ్చి, వ్యక్తి సంఘం చేసిన శక్తే గాని వేరు కాదు- అనే సిద్ధాంతం కూడా ఒక సిద్ధాంతమేననీ, చరమ సత్యం కాదనీ తేలిపోయింది! మార్క్సిజమ్ సైన్సు అయితే, వ్యక్తుల ప్రమేయం లేకుండా అది దాని ఫలితాల్ని చూపిస్తూ, గమ్యం చేరుకోవాలి. ఎప్పుడైతే వ్యక్తులు దాన్ని 'ఆచరణలో పెట్టడం' మీద మార్క్సిజమ్ ఆధారపడుతుంది—అంటున్నారో, అంతటితో మార్క్సిజమ్ సైన్సు కాదనీ, ఒక సిద్ధాంతమనీ, అన్ని సిద్ధాంతాలకూ మతాలకూ మల్లేనే దానికీ కాలదోషం

పడుతోందనీ స్పష్టంగా తెలుస్తోంది కదా? దీనికి మీ సమాధాన మేమిటి? మార్క్సిస్ట్ దృక్పథాన్ని 'ఆచరణలో పెట్టగలగడం' ఏమిటి: క్రైస్తవ' వొద్ద ఏ యితర పూర్వ ధర్మాల్ని 'ఆచరణలో పెట్టగలిగినా' మీరు చెప్పే 'సోషలిస్టు స్వర్గం' సిద్ధిస్తుంది కదా? మానవాళి 'ఆచరణ'ను గూర్చి యిదమిద్ధంగా నిర్ణయించి, నిగ్గుతేల్చే చరమ సిద్ధాంతం ఇంతవరకూ పుట్టలేదు. పుట్టబోదు-అని నాకు తోస్తూంది. మార్క్సిజమ్ సిద్ధాంతానికి కాలం తీరి పోయింది మీరు అంగీకరిస్తారా? కాకపోతే 200 ఏళ్ళనాటి హ్యూమో-మానవ వాదం చెప్పిన మానవ సమానత్వం, స్వేచ్ఛ, సౌభ్రాత్రం (ఈక్వాలిటీ, లిబర్టీ, ఫ్రెటర్నిటీ) అనే ధ్యేయాల్లో—ఈనాడు ఎక్కడ చూచినా 'స్వేచ్ఛ' 'వ్యక్తి స్వేచ్ఛ'! దానికోసం ఉద్యమించడం కనిపిస్తోంది. కమ్యూనిస్టు దేశాల్లో, కాపిటలిస్టు దేశాల్లో, వెనుకబడిన జాతుల్లో—ఈ స్వేచ్ఛ స్వాతంత్ర్యాలకోసం వెల్లువిరిసే ఉత్సాహం, చైతన్యం ఎంతో గొప్పగా వుంది. మీరు వ్యక్తి స్వేచ్ఛను ప్రోత్సాహిస్తూ వ్రాస్తే ఎంతో సంతోషిస్తాను. కమ్యూనిస్టు 'ఉటోపియా, మాట వదిలెయ్యండి!

జ : ఈ శీర్షిక ప్రారంభమైన తర్వాత, ఈ రకం ప్రశ్న కోసమే నేను చాలా ఎదురు చూశాను. 'మార్క్సిజం' ప్రత్యేకత ఏమిటి ?' అనే ప్రశ్న పాఠకులకు రావాలని!

'మార్క్సిజమూ, మతమూ ఒకటే కదా, ఏమతం చెప్పేదాన్ని ఆచరణలో పెట్టగలిగినా సమ సమాజం ('సోషలిస్టు స్వర్గం') సిద్ధిస్తుంది కదా ? ఇక మార్క్సిజం ప్రత్యేకత ఏముంది ?' - అంటున్నారు మీరు.

మొదటి సంగతి : మార్క్సిజమూ, మతమూ ఒకటి కాదు. ఒకటి కాకపోవడమే కాదు: అవి రెండూ ఒకదాని కొకటి పూర్తిగా విరుద్ధాలు. ఏ విధంగానంటే, 'ప్రకృతి'కి సంబంధించిన విషయాల్లో మతం, ఒక 'సృష్టికర్త'ని అంగీకరిస్తుంది. సృష్టికర్తే ఈ ప్రపంచాన్ని సృష్టించి,

తన ఇష్టప్రకారం నడుపుతున్నాడంటుంది. మార్క్సిజం దాన్ని ఒప్పుకోదు. మార్క్సిజం ప్రకారం - సృష్టికర్త లేడు. ప్రపంచమంతా భౌతిక ప్రపంచం. దాని ధర్మాలన్నీ భౌతిక ధర్మాలు. ఆ రకంగా ఆ కోణంలో, మతానికి, మార్క్సిజం పూర్తిగా విరుద్ధం.

ఇక, 'సామాజిక' కోణంలో కూడా మతమూ, మార్క్సిజమూ పూర్తిగా విరుద్ధాలే. ఏ విధంగానంటే, సమాజంలో మానవులు 'అసమానులు'గా ఎందుకు వున్నారనే ప్రధానమైన విషయంమీద (కొందరు ధనికులుగానూ, కొందరు 'పేదలు'గానూ; కొందరు 'యజమానులు' గానూ, కొందరు 'సేవకులు'గానూ; కొందరు 'ఎక్కువ' వారిగానూ, కొందరు 'తక్కువ' వారిగానూ — ఎందుకు వున్నారనే విషయం మీద) మతం ఏం చెపుతుంది ?

'ఖర్మ' 'అనీ,' అదృష్ట దురదృష్టా'లనీ, లేదా 'అది అంతే' అనీ - చెపుతుంది. సూర్యుడు తూర్పున ఉదయించడం ఎంత సహజమో, నీరు పల్లానికి ప్రవహించడం కూడా ఎంత సహజమో, మానవులు 'అసమానులు'గా వుండడం అంత సహజం - మతం దృష్టికి! కాకపోతే, అది మనుషుల్ని 'దేవుడిదృష్టి'లో సమానుల్ని చేస్తుంది. 'ఈ తేడాలన్నీ ఇక్కడే. ఈ లోకంలోనే. పరమాత్ముని దగ్గర అందరూ ఒక్కటే. ఈ లోకంలో ఒకడు అమీరు కావచ్చు, ఒకడు గరీబు కావచ్చు. పల్లకీలో అమీరూ, గాడిదపై గరీబూ, కాలినడకన మరోడూ సాగిపోవచ్చు. అందరూ చేరే గమ్య మొక్కటే, నడిచేవాడికి అందరొక్కటే' అంటూ, మరో లోకపు సమానత్వాన్ని చూపిస్తుంది. అంటే, 'చివరికి అందరూ మరణిస్తారు' అనే ప్రకృతి సూత్రాన్ని, 'ధనిక పేద తేడాలు' అనే సామాజిక విషయంలో కలగా పులగం చేసి, 'అక్కడి అందరూ సమానులే, అందరూ అక్కడికే చేరతారు' - అని తేలుస్తుంది. 'అక్కడ' అంటే 'మరణం దగ్గిర' అని !

'అక్కడి సంగతి కాదు, ఇక్కడి సంగతి చెప్పు, మరణం సంగతి కాదు, జీవితం సంగతి చెప్పు. ఒకడు సౌధంలో ఒకడు గుడిసెలో ఎందుకు వుంటున్నారు ? ఒకడు పల్లకి ఎక్కితే, కొందరు పల్లకి మోసేవారిగా ఎందుకు వుంటున్నారు ? అందర్నీ నడిపేవాడు మనుషుల్ని ఇంత తేడాగా ఎందుకు చూస్తున్నాడు ?' - అని ఎవరు అడుగుతున్నారు 'మత బోధకుల్ని' పట్టుకుని ? అడిగినా ఆ ప్రశ్నకి మతాల దగ్గర సమాధానం లేదు.

కానీ, ఆ ప్రశ్నకి 'మార్క్సిజం' దగ్గర పూర్తిగా సమాధానం వుంది. 'శ్రమదోపిడీ' అనేదే ఆ సమాధానం ! ('శ్రమ దోపిడీ' ఎలా జరుగుతున్నదో తెలుసుకోవాలంటే 'కాపిటల్' చదవాలి.)

తమకోసం తాము శ్రమ చెయ్యకుండా ఇతరుల శ్రమని దోస్తూ బతుకుతున్న వాళ్ళే ధనికులూ, తమ శ్రమలో ఎంతో భాగాన్ని పోగొట్టుకుంటున్న వాళ్ళు పేదలూ అయ్యారు. ఇంకా అవుతున్నారు.

ధనికులే - యజమానులూ గొప్పవారూ !

లేదా యజమానులే - ధనికులూ, గొప్పవారూ !

పేదలే - సేవకులూ, అధములూ !

లేదా, సేవకులే - పేదలూ, అధములూ !

ఇవి రెండూ 'శత్రువర్గాలు ?

శ్రమ చెయ్యని వాళ్ళంతా శ్రమలోకి వచ్చి, ఎవరి భాగం శ్రమ వాళ్ళ చేసే విధానం ప్రారంభమై, 'లాభాలూ వడ్డీలూ కౌళ్లూ' మాయమైనప్పుడే వర్గాలు నశించడం ప్రారంభమవుతుంది. ఆ మార్గంలోనే 'సమానత్వం' ఏర్పడుతుంది.

కానీ, ఈ మార్పు ఇతరుల శ్రమని తింటూ కూర్చునే వర్గం ద్వారా జరగదు. తమ శ్రమని పోగొట్టుకుంటోన్న వర్గం ద్వారానే జరగాలి. ధానిసత్వం ప్రారంభమైన కాలం నించే, దానితో పాటు 'వర్గ పోరాటం'

కూడా ప్రారంభమైంది. వర్గాలు వున్నంత కాలమూ వర్గ పోరాటాలు నిర్విరామం. దోపిడీకి గురి అవుతోన్న వర్గం, పూర్తిగా విముక్తి చెందే వరకూ వర్గ పోరాటం నడుస్తూనే వుంటుంది - ఇదీ, మార్క్సిజం ఇచ్చే సమాధానం!

అంటే, మతాలన్నీ ఏ అక్రమాలనైతే, ఏ అసమానత్వాలనైతే గ్రహించనేలేదో, పట్టించుకోనేలేదో ఆ సమస్య సంతటినీ మార్క్సిజం గ్రహించింది. వాటికి 'కారణాలు' చెప్పింది. వాటిని తీసి వెయ్యగల మార్గం చెప్పింది. సామాజికమైన సమానత్వాన్ని బోధించింది.

శ్రమ దోపిడీ ప్రారంభమైన కాలం నించీ మానవుల మధ్య వున్న తప్పుడు సంబంధాల్ని 'ఫాల్స్ సోషల్ రిలేషన్స్' అన్నాడు మార్క్స్. 'సమాజంలో వున్న సమస్తమైన బానిసత్వాలూ ఉత్పత్తి సంబంధాలలో వున్న బానిసత్వం నించి పుట్టుకొస్తున్నవే' - అన్నాడు మార్క్స్. సమాజంలో వున్న ఏ సమస్యనైనా తీసుకోండి. ఏదైనా, ఏదైనా, ఏదైనా తీసుకోండి. సమస్త సమస్యలూ 'ఉత్పత్తి సంబంధాలలో' వున్న శ్రమ దోపిడీతో సంబంధించి వుంటాయి. ఆ పునాదిని మార్చడం ద్వారా మాత్రమే మానవ జీవితంలో వున్న సమస్తమైన తప్పుల్నీ తీసివెయ్యడం సాధ్యమవుతుంది. ఆ మార్గంలోనే శ్రమ చేసే వర్గం తనని తను విముక్తి చేసుకుంటూ, శ్రమ చెయ్యని వర్గాన్ని కూడా ఇక ఎన్నడూ ఆ 'దోపిడీ' అనే దుర్మార్గానికి తలపడకుండా విముక్తి చెయ్యడం సాధ్యమవుతుంది. అంటే, మార్క్సిజం అనేది శ్రామికవర్గ సిద్ధాంతంగా కనబడినా, చివరికి అది మొత్తం మానవ సమాజాన్నే సమస్యల నించీ విముక్తి చేస్తూ, మానవుల్నీ సమానుల్ని చెయ్యగల సిద్ధాంతం.

కాబట్టి, మతానికీ, మార్క్సిజానికీ ఏ కోణంలోనూ సంబంధం లేదు.

మత సామగ్రి అంతా - దేవుడూ, పూజలూ, మహిమలూ, పాప పుణ్యాలూ, స్వర్గ నరకాలూ, ఎక్కువ తక్కువలూ, యజమానులకు సేవలూ, వరాలూ, శాపాలూ, ఆత్మలూ, జన్మలూ !

మార్క్సిజం సామగ్రి : శ్రమ చెయ్యడమూ, శ్రమ చెయ్యక పోవడమూ ఉత్పత్తి సంబంధాలూ, దోపిడీ, వస్తువూ సరుకూ, ఉపయోగపు విలువా, మారకం విలువా, అదనపు విలువా: డబ్బూ, డబ్బుని తీసివెయ్యడం: వడ్డీలూ, లాభాలూ, కౌళ్ళూ తీసివెయ్యడం: అమ్మకాలూ, కొనుగోళ్ళూ తీసి వెయ్యడం: ఎక్కువ తక్కువలు తీసివెయ్యడం: దోపిడీ శ్రమ విభజనని తీసివెయ్యడం: సమానత్వమూ, విముక్తీ, స్వేచ్ఛా, న్యాయమూ, ధర్మమూ, పరిశుభ్రమూ, ఆనందమూ ! మతానికీ, మార్క్సిజానికీ ఇంత తేడా !

“క్రైస్తవ, బౌద్ధ - ఏ ఇతర పూర్వ ధర్మాల్ని ఆచరణలో పెట్ట గలిగినా సోషలిస్టు స్వర్గం సిద్ధిస్తుంది కదా” అంటున్నారు మీరు. ఆ మతాలు - సోషలిస్టు స్వర్గానికే మార్గం చెప్పాయా ? అవి శ్రమ దోపిడీ జరుగుతోందని చెప్పాయా ? ‘వర్గ పోరాటం’ చెయ్యాలని చెప్పాయా ? అదేమీ చెప్పలేదు. దోపిడీకి వ్యతిరేకంగా పోరాడాలని చెప్పని సిద్ధాంతాల ద్వారా ‘సోషలిస్టు స్వర్గం’ ఏ రకంగా సిద్ధిస్తుంది ? క్రైస్తవ, బౌద్ధ మతాల్లోనే కాదు, ఏ మతాన్ని తీసుకున్నా ఏవేవో కొన్ని మంచి సూక్తులు వుంటూనే వుంటాయి. అయితే వాటివల్ల ఏం ప్రయోజనం ? సామాజికమైన బాధలకు విముక్తి మార్గాన్ని సామాజికమైన పరిస్థితుల్లో చూపించకుండా ‘మరో లోకం’ వేపు చూపిస్తే దానివల్ల జరిగే దేమిటి ? ‘మతం’ అనేది ఏదైనా పేదలకు, ‘తలవంచుకుని కన్నీరు కార్చడం’ మాత్రమే నేర్పుతుంది. “ప్రశ్నించకండి. సందేహించకండి. సందేహం అనర్థ హేతువు. విశ్వసించండి. సహనం వహించండి. సేవలు చెయ్యండి” అనేదే దాని బోధనంతా !

ఈ బోధనల్ని 'చక్కగా ఆచరిస్తే' దాని ఫలితం ఎలా వుండే దంటే, ఈ నాటికీ బానిసలు బానిసలుగానే పడి వుండేవారు. 'వర్గ పోరాటమే' లేకపోతే ఈనాటికీ బానిస సమాజమే నడుస్తూ వుండేది. అంటే, మతం అనేది దోపిడీ వర్గాలకు సహాకరించే విధానం మాత్రమే.

మతాన్నే కాదు: వర్గపోరాటాన్ని చెప్పని ఏ సిద్ధాంతాన్నయినా తీసుకోండి. ఉదాహరణకి 'గాంధీ' చెప్పిన 'ట్రస్టీ షిప్పు' సిద్ధాంతాన్ని తీసుకోండి. ధనవంతులంతా తమ ఆస్తులకు 'ధర్మకర్తలు'గా వుండాలనీ, పేదల్ని 'దయ'గా చూడాలనీ చెప్తుంటే సిద్ధాంతం. అసలు ధనం అంటే ఏమిటీ, ఆస్తి అంటే ఏమిటీ, పేదరికం అంటే ఏమిటీ — అనే సంగతులు ఎత్తదు అది. ధనికులూ, పేదలూ అలాగే వుండాలి. ధనికులు పేదల్ని 'దయ'గా చూడాలి! ఈ సిద్ధాంతాన్ని 'చక్కగా ఆచరిస్తే' ఏం ఫలితం వస్తుంది? పేదల వర్గం-ఎప్పుడూ ధనవంతుల వర్గానికి 'ఉత్పాదక' 'అనుత్పాదక' సేవలుచేస్తూ ధనవంతుల ధనరాసుల్నీ, సౌఖ్యాల్నీ ప్రతీ సటా పెంచుతూ 'ధనం' అన్నా, 'ఆస్తి' అన్నా తన శ్రమేననే సంగతి గ్రహించకుండా ధనవంతుల దయతోనే తాను జీవిస్తున్నాననే భ్రమల్లోపడివుంటుంది. ట్రస్టీషిప్పు సిద్ధాంతాన్ని చక్కగా ఆచరిస్తూవుంటే ఎంతకాలమైనా పరిస్థితి ఇలాగే నడుస్తూవుంటుంది. ఇది పేదలవర్గ సిద్ధాంతమా, ధనికవర్గ సిద్ధాంతమా? ఒక తప్పుడు సిద్ధాంతాన్ని పేదలవర్గం చక్కగా ఆచరించడంవల్ల ఆ వర్గానికేం ఫలితం వస్తుంది?

ప్రపంచంలోవున్న ఇంకే సిద్ధాంతాన్నయినాతీసుకోండి, మార్క్సిజం కాక ఏ సిద్ధాంతాన్నయినా అది ధనిక పేద తేడాల గురించి ఏంచెపుతోందో చూడండి. అప్పుడు తెలుస్తుంది. మార్క్సిజానికీ, ఇతర సిద్ధాంతాలకీ తేడా ఏమిటో? శ్రమ దోపిడీ జరుగుతోందని అంగీకరించడమూ, దాన్ని వర్గ పోరాటం ద్వారా సంపూర్ణంగా తీసివెయ్యాలనే కార్యక్రమం చెప్పడమూ

చెయ్యని ఏ మతమూ, ఏ సిద్ధాంతమూ 'సోషలిస్టు స్వర్గాన్ని' నిర్మించ లేవు.

కాబట్టి ఏదో ఒక వంకరటింకర సిద్ధాంతాన్నో, అరకొర సిద్ధాంతాన్నో పట్టుకుని అది చెప్పేదాన్ని 'చక్కగా ఆచరిస్తే' సోషలిస్టు స్వర్గం రాదు. చక్కగా ఆచరించేపని, చక్కని సిద్ధాంతం మీదే జరగాలి.

'రాయి'ని పొదగేస్తే, ఆ పొదగేసే పని ఎంత నవ్యంగా జరిగినా అది కోడిపిల్ల అవదు. కోడిపిల్ల రావాలంటే పొదగేసే పని 'కోడిగుడ్డు' మీదే జరగాలి. 'రాయి'మీద జరిగితే లాభం లేదు.

'కోడిగుడ్డు'మీద కూడా ఆ పని ఎలా జరగాలో అలా జరగాలిగానీ, ఎలావడితే అలా జరిగితే కూడా ఫలితంరాదు. కోడిగుడ్డుని నీళ్ళలో పడేసి ఎన్నాళ్ళు ఎదురుచూసినా కోడిపిల్ల రాదు.

'సిద్ధాంతం' మొదట సరైనదై వుండాలి. దానిపై 'ఆచరణ' కూడా సరైనదై వుండాలి. ఆరెండూ కలిస్తేనే మంచి ఫలితం.

కాబట్టి సిద్ధాంతానికీ, ఆచరణకీ వున్న సంబంధాన్ని అర్థం చేసుకోండి. ఈ సూత్రాలు చూడండి:

1. సిద్ధాంతం మంచిది+ఆచరణ మంచిది=మంచి ఫలితం
2. సిద్ధాంతం మంచిది+ఆచరణ చెడ్డది=చెడ్డఫలితం
3. సిద్ధాంతం చెడ్డది+ఆచరణ మంచిది=చెడ్డ ఫలితం
4. సిద్ధాంతం చెడ్డది+ఆచరణ చెడ్డది=చెడ్డ ఫలితం

మంచి సిద్ధాంతమూ, మంచి ఆచరణా కలిస్తేనే మంచి ఫలితం వస్తుందికానీ, ఆచరించడంతో సంబంధం లేకుండానే సరిగా ఆచరించినా తప్పుగా ఆచరించినా మంచిఫలితం రావడానికి ఆ సిద్ధాంతానికేమన్నా మహిమలు వుంటాయా?

ఏ సైన్సునైనా సిద్ధాంతమూ, ఆచరణా అనే భాగాలుగా విడదీయ్య వచ్చు. ఒక సైన్సు సూత్రాన్ని సరిగా ఆచరించినప్పుడే ఆ సూత్రం పని చేస్తుంది.

మార్క్సిజం-సమాజంలో వున్న శ్రమ సంబంధాల్ని చెప్పే సైన్సు, దాన్ని గ్రహించి ఆచరించవలసింది శ్రామికవర్గం. ఆ జ్ఞానం శ్రామిక వర్గంలో మెజారిటీ సంఖ్యకి అందాలి. ఆ వర్గం సమిష్టితనంతో దాన్ని ఆచరించాలి.

“మార్క్సిజం సైన్సు అయితే వ్యక్తుల ప్రమేయం లేకుండా అది దాని ఫలితాన్ని చూపిస్తూ గమ్యం చేరుకోవాలికదా?” అని మీ సందేహం! మీ సందేహం చాలా సరైనదే! మార్క్సిజం చెప్పేసూత్రాలన్నీ వ్యక్తుల ప్రమేయంలేకుండానే నడుస్తాయి. వ్యక్తుల ప్రమేయాలతో అవి ఆగవు. వర్గాలు నశించేవరకూ వర్గపోరాటాలు నడిచితీరతాయి. అసలులో ‘వ్యక్తుల’ ప్రమేయం ఏమీలేదు. అయితే వ్యక్తుల ప్రమేయం ఎక్కడంటే పోరాటం నడిచే ‘తీరు’లోనే.

ఇక్కడ ‘వ్యక్తులు’ అంటే ‘నాయకులు’ శ్రామికవర్గ ప్రయోజనాల్ని సరిగా గ్రహించడమూ, పెట్టుబడిదారీవర్గ దృక్పథాన్ని ఏ కోణంలోనూ అనుసరించలేకపోవడమూ, మార్క్సిజం ఇచ్చిన సరైన అవగాహనతో శ్రామికవర్గాన్ని నడపడమూ నాయకులు చెయ్యాలి. నాయకులుగాక, మిగిలిన ప్రజలందరూ కేవలం నాయకుల్ని అనుసరించేవారిగా మాత్రమే వుంటారని దీని అర్థంకాదు. ప్రజలపాత్ర ఎంత శక్తివంతమైనదైనా, నాయకులు కూడా ఆ వర్గపోరాటాలనించి రూపొందినవారే అయినా, నాయకుల పాత్రకు ప్రత్యేకతవుంది. నాయకులు సరైన అవగాహనతో వుంటేనే శ్రామికవర్గానికి సరైన జ్ఞానం అందుతూవుంటుంది. నాయకులే తప్పుగా వుంటే (తెలిసా, తెలియకా అనేది ఇక్కడ అనవసరం) శ్రామికవర్గం

మొత్తంగానే పోరాటాల్లో తప్పులుచేస్తూ వుంటుంది. అయితే, తప్పులవల్ల సమస్యలు పుట్టుకొస్తాయి కాబట్టి, కొంత కాలానికి జరిగిన తప్పులవల్ల పునరాలోచనలు ప్రారంభమవుతాయి. తప్పుల్ని దిద్దుకోవడంలో కూడా తప్పులు జరిగితే శ్రామికవర్గం తప్పుల్ని ఇంకా సరిగా గ్రహించలేదని అర్థం. తప్పుల్ని సరిగా గ్రహించి, సరిగా దిద్దుకుని, పోరాటాన్ని సరైన మార్గంలోకి తిప్పుకునేదాకా నడిచిన కాలమంతా వృథా అవుతుంది. నాయకుల అవగాహనా, ఆచరణా మొదటినుంచీ సరిగావుంటే ఆ నాయకత్వంలో ప్రజలు తక్కువకాలంలోనే ఎక్కువ చైతన్యవంతులవుతారు. అంటే 'మార్క్సిజం' అనేది 'వర్గ' సిద్ధాంతమే అయినా, ఆ 'వర్గాన్ని' చైతన్యవంతం చెయ్యడంలో నాయకుల పాత్ర (వ్యక్తుల పాత్ర) తప్పనిసరిగా వుంటుంది. 'నాయకులు' అనేవాళ్ళు 'వర్గం'నించే వేరుకాదు. ఏ వర్గ నాయకులు ఆ వర్గంలో భాగం. నాయకులు చేసే తప్పొప్పులు, వర్గం చేసే తప్పొప్పులే.

శ్రామికవర్గం గ్రహించవలసిన జ్ఞానాన్నీ, అది చెయ్యవలసినదాన్నీ కలిసి 'వర్గాచరణ' అనీ, 'వర్గ కృషి' అనీ అనుకుంటే ఆ 'కృషి' శ్రామిక వర్గం త్వరగా చేస్తుందా, ఆలస్యంగా చేస్తుందా అనే తేడాయే వుంటుంది గానీ, ఆ కృషి ఆగిపోవడం వుండదు. వర్గాలు, వాటి ప్రయోజనాలకోసం అవి పోరాడుతూనేవుంటాయి. రెండువర్గాలూ కలిసిపోయేదాకా ఆ పోరాటం నడుస్తూనే వుంటుంది. అంటే, మార్క్సిజం ఏ సూత్రాలు చెపుతోందో అవి, 'వ్యక్తుల' ప్రమేయాలతో ఆగిపోకుండానే నడుస్తాయి. అయితే వ్యక్తుల ప్రమేయాలతో ఏం జరుగుతుందంటే - శ్రామికవర్గ పోరాటం త్వరగా నడవడమో ఆలస్యంగా నడవడమో, శక్తివంతంగా నడవడమో, శక్తిహీనంగా నడవడమో; కరెక్టుగా నడవడమో; తప్పుతప్పులుగా నడవడమో; ధారావాహికంగా నడవడమో, ఆటంకాలతో నడవడమో - జరుగు

తుంది. పోరాటం నడిచే తీరులోనే వ్యక్తుల ప్రమేయం. పోరాటం వుంటుందా, వుండదా అనేదాంట్లో వ్యక్తుల ప్రమేయం వుండదు.

ఈ క్షణాన ప్రపంచంలో ఎక్కడా శక్తివంతమైన శ్రామికవర్గ పోరాటంలేదు. కానీ ఈ పరిస్థితి ఇలాగే నిశ్చలంగా వుండిపోదు. అదే జరిగితే 'మార్క్సిజమే తప్పు, సమానత్వమే తప్పు, దోపిడీయే రైటు' అనే అర్థాలకు రావలసిందే. ఇప్పుడు అంతా అద్భుతంగా వుందనీ, ఇందులో ఏమీ మారనక్కరలేదనీ, 'సమసమాజ' సూత్రం తప్పని తేలిపోయిందనీ ధనికులూ, యజమానులూ తమ తత్వశాస్త్రాలు పునర్ముద్రణలు వేసుకోవచ్చుగానీ, దానికి పేదలూ, సేవకులూ ఒప్పుకోరు. వారికి శ్రమ దోపిడీ గురించి ఎంతోకొంత తెలిసిపోయిన తర్వాత అసలే ఒప్పుకోరు. కాబట్టి ఈ పరిస్థితి ఎల్లకాలమూ ఇలాగే వుండదు.

"మానవాళి ఆచరణను గురించి ఇతమిద్ధంగా నిర్ణయించి నిగ్గుతేల్చే చరమ సిద్ధాంతం యింతవరకు పుట్టలేదు, పుట్టబోదు" అన్నారు మీరు. మానవాళి అంతా ఒకటి అయితే కదా, దానికి ఒకే ఆచరణ వుండడానికి? మానవాళిలో వేరు వేరు వర్గాలకు వేరు వేరు ఆచరణలు ఇప్పుడు కాదు, ఎప్పుడో వేలవేల సంవత్సరాలక్రితమే 'ఇతమిద్ధంగా' నిర్ణయమైపోయాయి. వర్గ పోరాటమే ఆ ఆచరణ. అది బానిసలకాలం నించీ నడుస్తూనే వుంది. ఇంకా నడుస్తూనే వుంటుంది. మీరా సంగతి గ్రహిస్తే, సమాజం గురించి సరైన జ్ఞానం నేర్చుకున్నట్టు అవుతుంది. లేకపోతే అజ్ఞానంలో పడివున్నట్టు అవుతుంది. మీరు శ్రామికులైతే మీరు మార్క్సిజాన్ని గ్రహిస్తే, మీ జ్ఞానం శ్రామిక వర్గ పోరాటానికి మేలు చేస్తుంది. లేదా మీరు శ్రామికులైకూడా మార్క్సిజాన్ని గ్రహించకపోతే మీ అజ్ఞానం శ్రామిక వర్గానికి హాని చేస్తుంది.

"మీరు వ్యక్తిస్వేచ్ఛను ప్రోత్సహిస్తూ రాస్తే ఎంతో సంతోషిస్తాను" అన్నారు. "వ్యక్తి స్వేచ్ఛ" అంటే ఏ వ్యక్తి స్వేచ్ఛ? యజమాని స్వేచ్ఛా, సేవకుడి స్వేచ్ఛా? సేవకుడికి కూడా స్వేచ్ఛ ఉండాలంటే ఆ వ్యక్తికి యజమానే ఉండకూడదు. యజమానికీ, సేవకుడికీ కూడా సమానమైన స్వేచ్ఛని చెప్పగలరా ఎవరైనా? ఇద్దరికీ సమానమైన నిబంధనలుగల స్వేచ్ఛ వుండాలంటే ఒకరు యజమానీ, ఒకరు సేవకుడూ కాకుండా ఇద్దరూ 'సమానులైన స్వతంత్ర వ్యక్తులై' వుండాలి. అదే కదా మార్క్సిజం చెపుతున్నదీ? "అందరూ ఎవరిభాగం శ్రమ వారు చెయ్యండి. అందరూ స్వతంత్రులై సమానులై ఉండండి" అనే సూత్రంలో మీకు అభ్యంతర మేమిటీ, మీరు యజమానులైతే తప్ప!

'కమ్యూనిస్టు ఉటోపియా' ని వదిలి వెయ్యాలా? అంటే, 'అక్రమాన్ని' వ్యతిరేకించే బాటని వదిలివెయ్యాలన్నమాట! అక్రమాన్ని వ్యతిరేకించే బాటని వదిలిపేసి 'అక్రమం'లోకే చేరాలన్నమాట! ప్రపంచంలో రెండే బాటలు, రెండే శిబిరాలు వున్నాయి. 'పెట్టుబడివారీ మురిగ్గుంట' గానీ, 'కమ్యూనిస్టు ఉటోపియా' గానీ! మనిషన్నవాడు ఇటో అటో చేరవలసిందే! కొందరు మురిగ్గుంటలోకే పోతారు, కొందరు ఉటోపియా కోసం కలలు కంటారు.

జయాపజయాలు లేకుండా పోరాటాలు వస్తాయా? 'అపజయాల్ని' చూసి పోరాటాలనే వదులుకుంటారా? కమ్యూనిజం, 'ఉటోపియా' ని నేటికి నూరుపాళ్ళా నిజం చేస్తుంది-భవిష్యత్తులో! ప్రపంచం ఇప్పుడే 'అంతం' కావడంలేదు!

  

..................

ప్ర : నాకు 35 సంవత్సరములు. పిల్లలు కలగరని పదేళ్ళ క్రితమే డాక్టర్లు చెప్పినారు. ఒక ఆడపిల్లను పెంచుకోవాలని భార్యాభర్తలము నిశ్చయించుకొన్నాము. దగ్గర బంధువుల పిల్లను పెంచుకోవాలని నాకుంటే నా భర్తగారు బంధువుల పిల్ల ఒద్దంటారు. అనాథాశ్రమంనుంచి తెచ్చుకో వచ్చునంటున్నారు. బంధువుల పిల్లలైతే తగాదాలు వస్తాయంటారు. బొత్తిగా తెలియని పిల్లలెందుకని నాకు సందేహము. ముమ్మల్ని సలహా అడుగుదా మని నేనంటే మా ఆయన అంగీకరించినారు...

జ ; ఈ విషయంలో మీ భర్తగారు చెప్పేదే సరైనదని నా అభి ప్రాయం. బంధువుల పిల్లలైతే, చాలా రకాల సమస్యలు రావడానికి అవ కాశం వుంది. తల్లిదండ్రులు జీవించి యుండగా, వాళ్ళ పిల్లను తీసుకుని ఆ పిల్లకి అసలు తల్లిదండ్రుల్ని గురించి చెప్పకుండా మిమ్మల్నే తల్లి దండ్రులుగా నమ్మించడం అంటే, ఆ బిడ్డకి జీవితమంతా ఒక సత్యం తెలియనివ్వకుండా ఉంచడమే కదా? ఆ బిడ్డకు చెప్పినా, దానివల్ల కూడా సమస్య వుంటుంది. తనని కన్నవాళ్ళు వదిలేశారనే బాధ ఆ బిడ్డకు కలగ వచ్చు. అంతేగాక, పెంచుకునే తల్లిదండ్రులు ఏ విషయానికైనా బిడ్డని మందలిస్తే, 'నా కన్న తల్లిదండ్రులైతే ఇలా చెయ్యరుకదా' అనే రకంగా ఆ బిడ్డ ఆలోచిస్తుంది. మీరు పిల్లని సరిగా చూశారనీ, చూడలేదనీ బంధు వులతో అనేక గొడవలు వస్తాయి. ఈ విషయం మీ భర్తగారే బాగా అర్థం చేసుకున్నారు. తల్లిదండ్రులు లేని అమ్మాయి అయితే, మీరు అసలు తల్లి తండ్రులు కారని తెలిసినా, తనకు తల్లిదండ్రులు లేరుకాబట్టి మీరు పెంచు కుంటున్నారని మిమ్మల్నే తల్లిదండ్రులుగా ప్రేమిస్తుంది. ఆ బిడ్డ మీ కన్న బిడ్డతో సమానంఅవుతుంది. మీ బిడ్డకీ, మీకూ మధ్య ఇతరుల ప్రమేయం వుండదు. ఆ బిడ్డ తల్లిదండ్రులు ఏ కులమో, ఏ మతమో అనే సందేహ

లేమైనా మీకువుంటే, విశాలమైన మనసుతో అదంతా వదిలిపెట్టేయండి. అవన్నీ సంకుచితమైన ఆలోచనలు. మీ ఒడిలోకి వచ్చే బిడ్డ మీ బిడ్డే-కదా? తల్లిదండ్రులు లేని బిడ్డకే మీరు తల్లిదండ్రులుగా ఉంటే, బిడ్డలులేని మీకు ఆ అమ్మాయి కన్నబిడ్డగా వుంటుంది. అదే పూర్తిగా మంచి విషయం.

*　　　　*　　　　*

కేశవరావు, టిటాగర్ (పశ్చిమ బెంగాల్).

ప్ర : పుస్తకాన్ని ఎవరికో ఒకరికి 'అంకితం' ఎందుకు ఇస్తారు? ఇది బూర్జువా సాంప్రదాయమేనా?

జ : ఇది వెనకటి సమాజాల తప్పుడు సాంప్రదాయమే. నేను కూడా గతంలో నా పుస్తకాల్ని అంకితాలిచ్చాను. తర్వాత వాటిమీద ప్రశ్నలు ప్రారంభమై, ఆ పద్ధతి సరైంది కాదనే నిర్ణయానికి వచ్చి పునర్ముద్రణల్లో ఆ అంకితాలన్నీ తీసేశాను. 'అంకితం' ఇవ్వడంలో నాకేమీ అర్థం కారక లేదు. పుస్తకం ఏ ఒకరికో కాదు, అనేకమందికి. అలాంటప్పుడు, ఒకరి పేరుకోసం పుస్తకాన్ని ప్రత్యేకించడంలో అర్థం లేదు.

*　　　　*　　　　*

సి. నర్స్మ, ఇంటూరు.

ప్ర : శైశవ దశలోనున్న సోషలిజాన్ని మెన్షివిక్కులు, వైట్ గార్డులు మొదలైన అంతర్గత శత్రువులనుండి కాపాడి నిలబెట్టిన యోధుడిగానూ, ఫాసిస్టు దాడిని విజయవంతంగా (రెండో ప్రపంచ యుద్ధంలో) తిప్పికొట్టిన నాయకుడిగానూ స్టాలిన్‌ని చెప్పుకునేవారు. అటువంటి స్టాలిన్ గురించి నేడు రష్యన్ పత్రికలన్నీ విపరీతంగా వ్యతిరేక ప్రచారం చేస్తున్నాయి. ఎంతవరకు ఆయనపై విమర్శలు సరైనవి?

జ : స్టాలిన్ నాయకత్వంలో, పార్టీ అనుసరించింది 'మార్క్సిజం' కాదు, 'ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం' మాత్రమే. మొదట ఈ విషయం

అర్థం చేసుకుంటే, స్టాలిన్ నాటి పార్టీ మీద సరైన విమర్శ ఎలా వుండాలీ, అది ఎలా వుంటున్నదీ అనే విషయాలు అర్థం చేసుకోవచ్చు.

'విమర్శ' అనేది, ఒక 'తప్పు' లోనించి 'సరైన దానిలోకి' పోయేది గానూ వుండవచ్చు, ఇంకో తప్పులోకి పోయేదిగానూ ఉండవచ్చు. స్టాలిన్ మీద రష్యా పార్టీలో విమర్శలన్నీ రెండోరకానివే. అంటే ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానంలో నించీ ప్రైవేటు పెట్టుబడిదారీ విధానంలోకి పోయే దృష్టితో సాగే విమర్శలే అవన్నీ.

కానీ, స్టాలిన్ మీద (స్టాలిన్ నాటి పార్టీ మీద) మార్క్సిస్టుదృష్టితో సాగే విమర్శ చాలా అవసరం.

విప్లవ ప్రారంభంలో గానీ, లెనిన్ నాయకత్వంలోగానీ సోషలిస్టు మార్పులు కొంచెంగా 'ప్రారంభం' మాత్రమే అయ్యాయి. సోషలిజం వేపు ఇంకా ఎంతో సుదీర్ఘమైన ప్రయాణం సాగవలసి వుంది. ప్రైవేటు ఆస్తి హక్కుల్ని తీసివెయ్యడం మాత్రమే కాకుండా, 'అదనపు విలువ'ని వేరే రూపంలో తినే వర్గం ఏదీ లేకుండా చేసే పద్ధతులు ప్రారంభించడమూ; జనాభాలో వున్న ప్రతీ వ్యక్తినీ 'శ్రమ'లోకి తేవడమూ; 'శ్రమ'కూ, శ్రమ పరిస్థితులకూ మధ్య 'పరాయితనాన్ని' తీసివెయ్యగల విధానాలు రూపొందించడమూ; క్రమంగా "మారకాల్ని" తీసి వెయ్యడమూ - వంటి కార్యక్రమాలతో సాగవలసిన ఎంతో సుదీర్ఘమైన ప్రయాణం అది! ఇదంతా జరగాలంటే, జనాభాలో అందరికీ మార్క్సిస్టు ఆర్థిక శాస్త్రాన్నీ, తత్వ శాస్త్రాన్నీ బోధించాలి. సమాజంలో ఎటుచూస్తే అటు నిత్యమూ సిద్ధాంత పరమైన చర్చలు సాగుతూ వుండాలి. సోషలిస్టు ప్రజాస్వామ్య పద్ధతుల్నీ, క్రమశిక్షణా సూత్రాల్నీ పార్టీలో నాయకులూ, కార్యకర్తలూ ఐచ్ఛికంగా పాటిస్తూ, వాటిని జనాభాకి బోధిస్తూ వుండాలి. 'దోపిడీ సమాజ జీవిత విధానాన్ని తీసివెయ్యడం' అనే సిద్ధాంత పునాది మీద, 'సమసమాజం' అనే

గమ్యం కోసం, 'వర్గ పోరాటం' అనే ఆయుధంతో, ఎప్పటికప్పుడు సరైనదాన్ని అనుసరిస్తూ, తప్పులు జరిగినప్పుడల్లా వాటిని గ్రహించగానే దిద్దుకుంటూ, సరైన అనుభవాలు పెంచుకుంటూ ప్రయాణం సాగిస్తూ వుండాలి. నాయకత్వం, ఎక్కడికక్కడ మార్క్సిస్టు దృష్టిని అనుసరిస్తూ వుంటే ఇదంతా సవ్యంగా సాగిపోతూ వుంటుంది. లెనిన్ కాలంలో పార్టీలో వుండిన క్రమశిక్షణా సూత్రాలూ, ప్రజాస్వామ్య పద్ధతులూ స్టాలిన్ కాలంలో పూర్తిగా అంతరించాయి. 'మార్క్సిజం' అంటే ఏమిటో, సోషలిస్టు సమాజ నిర్మాణం అంటే ఏమిటో శ్రామిక వర్గంలో మెజారిటీ ప్రజలకు ఏమీ తెలియక పోవడం వల్ల, మార్క్సిస్టు పద్ధతుల కోసం గట్టిగా పోరాడిన నాయకుడు వున్నప్పుడు పార్టీ విధానాలన్నీ ఒక రకంగానూ, ఆ నాయకుడు పోయి, మార్క్సిజం పేరుతో పెట్టుబడిదారీ పంథాని అనుసరించే ఇంకో నాయకుడు రాగానే పార్టీ విధానాలన్నీ ఇంకో రకంగానూ నడిచాయి—అనే అర్థానికే ఇప్పుడు రావలసి వస్తోంది.

అయితే, మార్క్సిజాన్ని కోరేవాళ్ళు కూడా మార్క్సిస్టు మార్గం అనుసరించని స్టాలిన్‌ని ఎందుకు సమర్థిస్తున్నారంటే, మార్క్సిజం గురించి సరిగా తెలీకా, స్టాలిన్ నిరంకుశ ధోరణుల గురించి కూడా సరిగా తెలీకా! ఆనాడు రష్యా పార్టీ, స్టాలిన్ గురించి ఎలాంటి పొగడ్తలు గుప్పించిందో వాటినే ప్రపంచ 'విప్లవ కారులందరూ' 'నిర్విమర్శ'గా (ఆ పొగడ్తల్ని చూసి ఏ మాత్రమూ చెదరపడకుండా) పల్లించారు. స్టాలిన్ ఇంత చేశాడనీ, అంత చేశాడనీ, చేసిన పొగడ్తలన్నీ కనీసపు మంచి చెడ్డల విచక్షణ లేకుండానూ, హేతుబద్ధమైన విమర్శ లేకుండానూ సాగినవే. స్టాలిన్ నాయకత్వంలో జరిగిన కొన్ని మంచి పనులేమైనా వుంటే వుండవచ్చు. ఆ మాత్రం మంచి పనులు లేకపోతే ఇక 'నాయకులు' అనే వాళ్ళు ఎందుకు? మంచి పనుల మీద ప్రశంసలు వున్నట్టే, మార్క్సిస్టు దృష్టిలేక

ఫ్యూడల్ ధోరణుల మీద విమర్శలు కూడా వుండాలి. అలాంటి విమర్శలు ఎక్కడా లేవు.

తేలిగ్గా అర్థమయ్యే వుదాహరణ చెప్పాలంటే, కమ్యూనిస్టు నాయకులు వ్యక్తి పూజలు చేయించుకోవడం మార్క్సిజమా? కమ్యూనిస్టుల వ్యక్తి పూజల్లో భౌతిక వాదమూ, సమానత్వమూ ఎంత వున్నట్టు? 'స్టాలిన్ పూజ' గురించి గానీ, 'మావో పూజ' గురించి గానీ, ఏ విప్లవకారుడైనా నోరు తెరిచాడా? ఏ దేశ కమ్యూనిస్టు పార్టీలైనా - "వ్యక్తి పూజలు మార్క్సిజం కాదు. ఇదీ ఫ్యూడల్ సంస్కృతి. దీన్ని మేము వ్యతిరేకిస్తున్నాము" అని తమ పత్రికల్లో రాశాయా? నిన్న మొన్న మావో పూజ కాలంలో గానీ, లిన్ పియావోని 'మావోకి వారసుడి'గా ప్రకటించినప్పుడు గానీ, ఈ అసహ్యకరమైన ఫ్యూడల్ ధోరణుల్ని ఏ దేశ కమ్యూనిస్టు పార్టీలైనా విమర్శించాయా? ఇదేమీ జరగలేదంటే కమ్యూనిస్టు పార్టీల్లో 'మార్క్సిజం' ఎంత వున్నట్టు?

స్టాలిన్ నిరంకుశత్వాన్ని వివరించే ఒక చిన్న వుదాహరణ చూడండి. (స్టాలిన్ అంటే స్టాలిన్ ఒక్కడే కాదు. పార్టీలో మెజారిటీ సభ్యులు ఆ నిరంకుశత్వానికి అనుకూలంగా వుంటేనే అది జరుగుతుంది. ఈ వుదాహరణలో ఇచ్చే వివరాలన్నీ 'బెర్ట్రామ్ వుల్ఫ్' అనే పెట్టుబడి వారీ రచయిత రాసిన "కృశ్చేవ్ అండ్ స్టాలిన్స్ ఘోస్ట్" అనే పుస్తకం లోవి. ఈ రచయిత ఇచ్చిన డాక్యుమెంటరీ ఆధారాలు ఇక్కడ ముఖ్యం.)

అప్పటికే స్టాలిన్ పార్టీకి 'జనరల్ సెక్రటరీ'గా వున్నాడు. అప్పుడు లెనిన్, జబ్బుపడి చివరి దశలో వున్నాడు. చివరగా చెప్పదల్చు కొన్న కొన్ని అభిప్రాయాల్ని లెనిన్ 1922 డిసెంబరు చివరినుంచీ, 1923 జనవరి చివరి వరకూ (1 నెల రోజుల పాటు) 13 వేరు వేరు పత్రాలుగా డిక్టేట్ చేశాడు.

ఈ పత్రాల్లో లెనిన్, 'జాతుల సమస్య' గురించీ, పార్టీలో చీలికని నివారించడానికి తీసుకోవలసిన చర్యలగురించీ, కేంద్ర ప్రజాశికాసంఘంలో మార్పుల గురించీ, ఇంకా ఆ రకంగా కొన్ని విషయాల గురించి తన లభిప్రాయాలు రాశాడు. అంతేగాక, పార్టీలో కొందరు నాయకుల వ్యక్తిగత స్వభావాల గురించి కూడా (స్టాలిన్, ట్రాట్స్కీ, బుఖారిన్, జినోవియేవ్ కామెనేవ్, పియతకోవ్ మొదలైన వారి గురించి) తన అభిప్రాయాలు రాశాడు. ఇందులో ముఖ్యంగా స్టాలిన్ 'జనరల్ సెక్రటరీ' పదవిలో వుండడానికి తగిన వ్యక్తికాడనీ, అతన్ని ఆ పదవి నించీ తొలగించడం మంచిదనీ, ఈ విషయం గురించి సీరియస్‌గా చర్చించాలనీ రాశాడు. జనరల్ సెక్రటరి అయ్యాక స్టాలిన్ తన చేతిలో విపరీతమైన అధికారాలు కేంద్రీకరించుకున్నాడు. ఆ పవర్‌ని తగినంత జాగురూకతతో వినియోగించగల వ్యక్తి కాడు అతను. స్టాలిన్ చాలా మొరటు (రూడ్). ఈ లోపం (ఫాల్ట్) సాధారణ కమ్యూనిస్టుల్లో వుంటే సర్దుకోవచ్చునేమో గానీ, జనరల్ సెక్రటరీ పదవిలో వుండే వ్యక్తిలో వుంటే ఏ మాత్రమూ సమర్థనీయం కాదు. కాబట్టి, స్టాలిన్‌ని ఆ పదవి నించీ తీసివేసి, స్టాలిన్ కన్నా వున్నతంగా వుండే వ్యక్తిని, అంటే సహనవంతుడి గానూ (టాలరెంట్) విశ్వాసపాత్రుడి గానూ (లాయల్), నమ్రతగల వాడిగానూ (పొలైట్), అర్థం చేసుకోగల వాడిగానూ (కన్సిడరేట్), తక్కువ చంచలత్వం గల వాడిగానూ (లెస్ కాప్రిషియస్)వుండే మరో వ్యక్తిగత ఎంచుకోవలసిందిగా కామ్రేడ్స్‌కి నేను ప్రతిపాదిస్తున్నాను. 'వ్యక్తిని స్వభావం' అనేది చాలా స్వల్ప విషయంగా (ట్రైఫిల్‌గా) కనిపించవచ్చుగానీ, కొన్ని సందర్భాల్లో నిర్ణయాత్మకమైన ప్రాధాన్యతని సంతరించుకుంటే 'స్వల్ప విషయం అది' - అని రాశాడు లెనిన్. (జనరల్ సెక్రటరీ అయ్యాక స్టాలిన్, తన చేతిలో విపరీతమైన అధికారాలు కేంద్రీకరించుకున్నాడు — అనే వాన్ని బట్టి తెలు

ప్రశ్నదేమిటంటే 'పవరంతా ఒకే వ్యక్తిచేతిలో కేంద్రీకృతమయ్యే అవకాశం పార్టీ నిర్మాణంలోనే వుందని. అలా వుంటే, ఆ నిర్మాణమే తప్పు. అది కమ్యూనిస్టు పార్టీకి తగిన నిర్మాణం కాదు. సెక్రటరీ పదవి అయినా, ఇంకో పదవి అయినా ఎవరి చేతిలోనూ ఎక్కువ పవరువుండడం సాధ్యం కాని నిర్మాణాన్ని కమ్యూనిస్టులు రూపొందించాలి).

లెనిన్, ట్రాట్‌స్కీ గురించి రాసింది: 'ఇప్పుడున్న కేంద్ర కమిటీ సభ్యుల్లో ఇతడు వ్యక్తిగతంగా అసాధారణమైన సామర్థ్యాలు కల వ్యక్తి కానీ, ఇతనికి ఆత్మ విశ్వాసం మరీ ఎక్కువ. సమస్యల్ని పరిపాలనా దృష్టితో మాత్రమే (ప్యూర్లీ ఎడ్మినిస్ట్రేటివ్ సైడ్ ఆఫ్ ఎఫైర్స్) చూస్తాడు'. (అంటే, సమస్యల్ని 'సిద్ధాంతపరంగా' చూసే దృష్టి తక్కువ అని చెప్పడం).

(ఈ పత్రాల్నే 'లెనిన్ వీలునామా' అంటారు.)

ఈ పత్రాల్ని రాబోయే పార్టీ మహాసభలో చర్చకుపెట్టమని, లెనిన్ వాటిని కృపస్కయాకి అప్పగించాడు.

తర్వాత లెనిన్ 1924 జనవరి 21న చచ్చిపోయాడు.

1924 మేలో 13వ మహాసభ ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. లెనిన్ పత్రాల్ని కృపస్కయా మే 18న సంబంధిత వ్యక్తులకు అప్పగించింది.

అయితే, 'మహాసభ'కి ముందు జరిగిన సన్నాహక సంఘం సమావేశంలో, స్టాలినూ, జినోవియేవ్. కామెనెవ్‌ల గ్రూపు లెనిన్ పత్రాల్ని "మహాసభ"లో పెట్టనక్కరలేదనీ, వాటి గురించి ప్రతినిధి బృందాలకు విడివిడిగా చెప్పి, ఆ సమాచారాన్ని రహస్యంగా వుంచమని ఆదేశించాలనీ నిర్ణయించాయి. దీనికి కృపస్కయా, ట్రాట్‌స్కీలు వ్యతిరేకించినా అదే నిర్ణయం జరిగింది. (ఈ వ్యతిరేకించడం - జరగవలసినంతగా జరగలేదనే

అర్థానికే రావచ్చును. "పార్టీ సభ్యులకూ, ప్రజలకూ సమాచారం అందనివ్వకుండా చేసే ఈ పద్ధతిన్ని మేము అంగీకరించం. కేంద్ర కమిటీ ఇలా చేస్తున్నదని మేము మహాసభలో ప్రకటించి తీరతాము" అని వాళ్ళు ఆ పద్ధతిని తీవ్రంగా వ్యతిరేకించి వుంటే, స్టాలిన్ గ్రూపు తన అభిప్రాయాల్ని మార్చుకోవడమో, లేదా ఏదో ఒక వంకతో వాళ్ళని అరెస్టులుచెయ్యడమో చేసేది. అందులో ఏది జరిగినా లెనిన్ పత్రాల విషయం అనాడే బయటపడేది.)

1924 మే 23-31 తారీకుల్లో పార్టీ 13వ మహాసభ జరిగింది. లెనిన్ పత్రాల్ని సభలో ప్రకటించలేదు. ఇక వాటిని 'చర్చించడం' అనే మాటే వుంది? (లెనిన్ పత్రాల్లో స్టాలిన్ స్వభావంమీద విమర్శేగాక, ఇతర విషయాల్లో కూడా స్టాలిన్ పద్ధతుల్ని వ్యతిరేకించేదేదో వుండి వుంటుంది. అందుకే అన్ని పత్రాల్ని అణగదొక్కెయ్యడానికి స్టాలిన్ నిర్ణయించాడు). ప్రతినిధి బృందాలకు ఆ సమాచారం వేరువేరుగా క్లుప్తంగా చెప్పారు. ఆ పత్రాల కాపీలు ఇవ్వడంలాంటిదేమీ లేదు. పైగా, ఆ సమాచారాన్ని సాధారణ సభ్యులకూ, ప్రజలకూ తెలియకుండా చాలా రహస్యంగా వుంచాలని ఆజ్ఞాపించారు. మహాసభ ప్రతినిధులందరూ ఈ ఆజ్ఞలకు తలలువూపి ఊరుకున్నారు! (ఆహా! స్టాలిన్, లెనిన్ పత్రాలన్నిటినీ మహాసభలో చర్చకు పెట్టేస్తే, అతను లెనిన్ విమర్శని అంగీకరిస్తున్నాడనీ, తన మొరటుతనాన్ని మార్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాడనీ రుజువయ్యేది. కానీ అలా జరగలేదు)

తర్వాత కొన్ని నెలలకి బెర్లిన్ (జర్మని) నించి వచ్చే ఒక రష్యన్ పత్రికలో (1924 జులై 24న) 'లెనిన్ పత్రాలకు సంబంధించిన సమాచారం కొంత' వచ్చింది. (అంటే, రష్యానుంచే ఎవరో ఆ పత్రిక్కి ఆ

సమాచారం అందించాలన్నమాట. ట్రాట్స్కీయే ఆ పని చేసి వుంటాడని స్టాలిన్ గ్రూపు అభిప్రాయపడింది.)

తర్వాత 1926 అక్టోబరు 18న "న్యూయార్క్‌టైమ్స్" పత్రికలో లెనిన్ పత్రాలన్నీ యథాతథంగా వచ్చేశాయి. లెనిన్ పత్రాల్ని మరుగుపరిచారనే విషయం బయటపడిపోయింది కాబట్టి, ఆ 'అపకీర్తి'ని పోగొట్టుకోడానికి స్టాలిన్, కృపస్కాయాతోటీ, ట్రాట్స్కీతోటీ ఆ పత్రికలో వచ్చిన పత్రాల్ని ఖండిస్తూ ప్రకటనలు ఇప్పించాడు. ట్రాట్స్కీ ప్రకటన ఇలా వుంది— "లెనిన్ తన చివరికాలంలో జాతుల సమస్య గురించీ, ఇతర విషయాలగురించీ రాసిన అసాధారణ ప్రాముఖ్యతగల డాక్యుమెంట్లని పార్టీ నించి కేంద్రకమిటీ మరుగుపరచింది — అంటూ జరుగుతున్న ప్రచారమంతా దురుద్దేశపూరితమైనది."

అంటే, 'లెనిన్ అసలు అలాంటి పత్రాలే రాయలేదు. వాటిని మరుగుపరచడమూ లేదు'— అని చెప్పడమన్నమాట ఇది! పత్రాల గురించి అన్నీ తెలిసిన వాళ్ళే ఇలాంటి ప్రకటనలు ఇవ్వడమంటే. ఈ ప్రకటనలు ఇప్పించిన వాళ్ళది ఎంత నేరమో, ఇచ్చిన వాళ్ళది కూడా అంత నేరమే. ఇలాంటి దబాయింపులతో పార్టీ ప్రతిష్టని ఎలా కాపాడతారో (ఇంకా ఆ పార్టీకి ఏం ప్రతిష్ట మిగిలిందో?) 'సోషలిజాన్ని' (ఇదేం నరకో!) ఎలా కొనసాగించగలమనుకున్నారో అర్థం చేసుకోవడం అసాధ్యం.

దాని తర్వాత 1927లో కృపస్కాయా, ట్రాట్స్కీలు లెనిన్ పత్రాల్ని బయటపెట్టవలసిందేనని పట్టుబట్టారట. దానికి స్టాలిను, ట్రాట్స్కీ ఇచ్చిన పాత ప్రకటనని ప్రస్తావిస్తూ "అలాంటి పత్రాలేవీ లేవని అప్పుడు మీరే-ప్రకటించారు. ఇప్పుడిలా అంటున్నారే" అనే పద్ధతిలో దాన్ని తిరస్కరించాడట (అంతేకదా మరి!).

తర్వాత 1927 అక్టోబరు 23న కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశంలో మాట్లాడుతూ స్టాలిన్— "స్టాలిన్ మొరటు వ్యక్తి అనీ, జనరల్ సెక్రటరీ పదవిలోకి వేరొకర్ని నియమించే విషయం పరిశీలించాలనీ లెనిన్ సూచించా రంటున్నారు. అవును కామ్రేడ్స్, 'స్టాలిన్ మొరటు' అనేది నిజమే. పార్టీని విచ్ఛిన్నం చెయ్యాలని ప్రయత్నం చేసే విచ్ఛిన్నకారుల విషయంలో నేను మొరటే. ఈ విషయం నేను దాచుకోదలచను. విచ్ఛిన్నకారులతో ప్రవర్తించే విషయంలో బహుశా కొంత మెతకదనం అవసరమేమో! కాని. అది నాకు చేతకాదు. 13వ మహాసభ తర్వాత జరిగిన మొదటి ప్లీనరీ సమావేశంలోనే నన్ను సెక్రటరీ బాధ్యతలనుండి తప్పించమని అడిగాను. కానీ, క్రూప్‌స్కాయా, కామెనెవ్, జినోవియేవ్ వగైరాలు నన్నే వుండమని ఒత్తిడి చేశారు. మరి నేనేం చెయ్యగలను? నా పోస్టుని వదిలి పెట్టాలా? పార్టీ నా మీద ఒక బాధ్యత మోపినప్పుడు దాన్ని నేను నిర్వహించాలికదా?" అని శ్రామిక వర్గానికి సేవచెయ్యటానికే తను 'పదవి'లో వుంటున్నట్టు చెప్పుకొన్నాడు.

"పార్టీని చీల్చేవాళ్ళపట్ల నేను మొరటే" అని స్టాలిన్ అన్నప్పుడు, ఆ దబాయింపు మాటల్ని ఎవరూ ఎదుర్కోలేదు. "మొరటుతనం" అని లెనిన్ అన్నది, పార్టీని చీల్చేవాళ్ళతో కఠినంగా వ్యవహరించటం గురించి కాదు కామ్రేడ్! ఒక మంచి పనికోసం పట్టుదలగా నిలబడటం మొరటుతనం అవుతుందని ఎవరూ అనడంలేదు. ఏ దబాయింపులు కట్టిపెట్టి లెనిన్ హెచ్చరికల్ని కొంచెం అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు. ఏమన్నా బాగుపడతావేమో చూద్దాం" అని ఎవ్వరూ లెనిన్ పక్షాన తమ అభిప్రాయం ప్రకటించలేదు. అందరూ స్టాలిన్‌కే అనుకూలంగా వున్నారుగానీ లెనిన్‌కి అనుకూలంగాలేరు. సెక్రటరీతో వాదించటానికి కేంద్రకమిటీసభ్యులే భయపడటం అంటే, 'పాతరాజు'గారికీ ఈ 'కమ్యూనిస్టు సెక్రటరీ'కీ తేడా

ఏమిటి? 'జారు చక్రవర్తి'కి బదులు, ఈ 'కమ్యూనిస్టు చక్రవర్తి'ని తెచ్చు కోవడం అయితే ఈ వృత్త'పేరు మార్పు' 'ఎవడికొక్కావాలి? ఈ పార్టీ పెద్ద లంతా ఈ రకం 'పటుకుళ్ళ'తో నూతన సమాజాన్ని ఏరకంగా, ఏ పదా ర్థంతో నిర్మిస్తారు?

అసలు 'మార్క్సిజం' అంటే అడుగడుగునా తర్కమూ, చర్చలూ గతంలో ఎన్నడూలేని నూతన ప్రజాస్వామ్య పద్ధతులూ వుండవలసిన సిద్ధాంతం. చర్చించడమూ, వైరుధ్యాల్ని గ్రహిస్తూ వుండడమూ లేకపోతే, సమస్యల్ని పట్టుకోవడమే సాధ్యంకాదు. అలాంటి 'మార్క్సిజం' గురించి పైకి కేవలం నోటి మాటలు పల్లిస్తూ 'పార్టీ'లోకి మాత్రం దాన్ని రానివ్వ కుండా, ఫ్యూడల్ రాజుల కుట్రల్ని మరిపించే 'కేంద్ర కమిటీ' సమావేశా లతో, శ్రామిక వర్గాన్ని విముక్తి చెయ్యగల నూతన సమాజాన్ని ఎవరైనా ఎప్పటికైనా నిర్మించగలరా?

లెనిన్ పత్రాల విషయం, పార్టీలో సాధారణ సభ్యులంతా ఒకరి నించి ఒకరు 'గుసగుసల'ద్వారా, అరకొరగా మాత్రమే విన్నారు. సామాన్య జనానికైతే ఈ పార్టీ లేమిటో, ఈ కేంద్ర కమిటీలేమిటో, ఈ గోలలేమిటో ఏమీ తెలీవు.

ఈ లెనిన్ పత్రాల విషయం, రష్యా ప్రజలందరికీ బహిరంగంగా ఎప్పటికి తెలిసిందంటే—34 సంవత్సరాల తర్వాత! అది కూడా స్టాలిన్ మరణించడంవల్ల! స్టాలిన్ పోయిన తర్వాత 3 సంవత్సరాలకి, 1956 లో 20వ పార్టీ మహాసభలో కృశ్చేవ్ నాయకత్వంలో ఆ పత్రాల విషయం బయటికి వచ్చింది. 1956 జనవరి 30 న 'కమ్యూనిస్టు' అనే రష్యన్ పత్రికలో ఆ పత్రాలు ప్రింటయ్యాయి. కృశ్చేవ్, మార్క్సిస్టు దృక్పథంతో ఈ పని చేశాడని కాదు. కృశ్చేవ్ పంథా ప్రైవేటు పెట్టుబడిదారీ విధానం వేపు మొగ్గడం కాబట్టి, స్టాలిన్ వ్యతిరేక ప్రచారం మొదలుపెట్టి, స్టాలిన్

చేసిన తప్పుల్ని తప్పుకొంటూ, లెనిన్ పత్రాల్ని బయటికి తెచ్చారు. (స్టాలిన్ వున్నంతకాలమూ ఈ కృశ్చేవ్ స్టాలిన్‌కి వంత పాడుతూనే వున్నాడు. ఈ వంతపాట గాళ్ళలో మిగతా వాళ్ళందర్నీ స్టాలిన్‌కి 'సన్నిహితులు' అనీ, కృశ్చేవ్‌ని మాత్రం 'అత్యంత సన్నిహితుడు' అనీ అంటూ వుండేవారు. ఒక పార్టీ సభ్యుడి గొప్పని కొలిచే మార్గం, ఆ వ్యక్తి జనరల్ సెక్రటరీ దగ్గిరవాడా, దూరంవాడా అనేదే! అలాంటి అత్యంత సన్నిహితుడే స్టాలిన్‌కి వ్యతిరేకంగా లెనిన్ పత్రాలు బయట పెట్టాడు. అప్పుడు మాత్రమే వాటి సంగతి ప్రజలకు తెలిసింది.)

లెనిన్ పత్రాల్ని ఇంత క్రూరమైన పద్ధతిలో స్టాలిన్ అణగ దొక్కేశాడని బహిరంగంగా తెలిసినప్పుడైనా ఇతర దేశాల విప్లవకారులు, తమ పార్టీలో స్టాలిన్ చేసినదాన్ని గురించి చర్చించి ఖండించలేదు. కమ్యూనిస్టు పార్టీలన్నీ స్టాలిన్‌కే వంతపాడాయి.

స్టాలిన్ ఇంతకన్నా ఘోర మరణాలు చాలా చేశాడు.

రష్యాని వదిలి పోయిన ట్రాట్స్కీని వెంటాడి వెంటాడి చంపించి నప్పుడైనా విప్లవకారులమని చెప్పుకునేవాళ్ళు స్టాలిన్‌ను పల్లెత్తుమాట అనలేదు. ట్రాట్స్కీనే కాదు, అంతకు పూర్వం నుంచీ కూడా స్టాలిన్ తనకు వంతపాడని ప్రతీ ఒక్క నాయకుణ్ణీ దేశద్రోహ నేరాలూ, ప్రజా ద్రోహ నేరాలూ ఆరోపించి, పై పై నాటకంగా విచారణలు జరిపించి, మరణశిక్షలు వేసి చంపించేశాడు. పార్టీలో అగ్రనాయకులైన కామినేవ్, జినో వియేవ్, రైకోవ్, బుఖారిన్‌లను కూడా ఒక వరుస ప్రకారం చంపించే శాడు. దాదాపు పాత బోల్షివిక్ నాయకులందర్నీ చంపించి వేశాడు.

అభిప్రాయభేదాలు ఏర్పడినప్పుడు, వాటి గురించి చర్చించడమూ, భేదాల్ని సిద్ధాంత పరంగా ఎదుర్కోవడమూ చెయ్యడం కన్నా ఆ భేదాలు గలవాళ్ళని చంపించి వెయ్యడం చాలా తేలిక కదా! ఒక్క తుపాకీ దెబ్బతో

పోయింది. పార్టీ సహచరులకే కాదు, జీవిత సహచరి అయిన భార్యకు కూడా స్టాలిన్ నుంచి ప్రమాదం వచ్చి పుట్టింది. 1932 నవంబర్‌లో ఒకనాడు, స్టాలిన్ భార్య అతని పద్ధతుల మీద ఘర్షణ పడింది. ఆ రాత్రే ఆమె తుపాకీ దెబ్బతో మరణించింది. అది 'ఆత్మహత్య' అన్నారు. ఆత్మ హత్యో, హత్యో బయట పడలేదు. ఆత్మహత్యే అయినా, ఆత్మ హత్యలన్నీ హత్యలే కదా?

ఇవేకాదు, "వర్గాలే నశించిపోయాయి" అంటూ ఆర్థికంగానూ, రాజకీయంగానూ "మార్క్సిజం అనే మాటని తలచడానికి కూడా అర్హత లేని అసహ్యాకరమైన పనులెన్నో చేశాడు స్టాలిన్. ఎన్ని చేసినా స్టాలిన్ 'మార్క్సిస్టు మహోపాధ్యాయుడే,' 'శ్రామిక వర్గ యోధుడే, ఇలాంటి గుడ్డి అనుసరణ మత మౌఢ్యంలో కూరుకుపోయిన వాళ్ళకి మాత్రమే వుంటుంది.

(కృశ్చేవ్ కాలంలో లెనిన్ సంపుటాల రీ ప్రింటు జరిగినప్పుడు, వాటిలో ఈ 13 పత్రాల్నీ చేర్చి ప్రింటు చేశారు. అయితే కృశ్చేవ్ తర్వాత బ్రెజ్నెవ్ వచ్చినప్పుడు, లెనిన్ సంపుటాల్లోంచి ఈ పత్రాల్ని మళ్ళీ తీసేశారు. ఎందుకంటే బ్రెజ్నెవ్‌ది స్టాలిన్ పంథా అన్నమాట! అంటే, లెనిన్ రాసిన విషయాల్ని యథాతథంగా వుంచి వాటిని చర్చించడం కాకుండా, జనరల్ సెక్రటరీగారి గ్రూపు ప్రయోజనాల్ని బట్టి, వాటిని పుస్తకాల్లో పెట్టడమో, తీసెయ్యడమో చేస్తూ వుంటారన్నమాట!)

కమ్యూనిస్టు పార్టీ లవాళ్ళు 'స్వతంత్రంగా ఆలోచించడం' అనేదేదైనా వుంటే, అది ఎప్పుడో మానేశారు. 'సిద్ధాంతాన్ని అనుసరించడం' అంటే ఏమిటో, 'పార్టీ క్రమశిక్షణని పాటించడం అంటే ఏమిటో, ఏ సందర్భంలో దేన్ని పాటించాలో వాళ్ళు ఆలోచించరు. వాళ్ళకి కావలసింది మార్క్సిజం కాదు. వాళ్ళు అనుసరించేది వాళ్ళ కళ్ళముందు వున్న

వ్యాపకతే, పెట్టుబడిదారీ విధానమే. అనుగుణమైన మార్క్సిస్టు విధానాలను రూపొందించుకోవాలనే విషయమే వాళ్ళకి తెలియదు. స్టాలిన్ కాలంలో పుట్టిన కమ్యూనిస్టు పార్టీలన్నీ స్టాలిన్ నాయకత్వాన నడిచే 'స్టాలినిస్టు పార్టీ'లే. అందుకే ఏ పార్టీలోనూ స్టాలిన్ మీద మార్క్సిస్టు దృక్పథంగల విమర్శ లేదు.

జార్జి ఆర్వెల్ అనే (అమెరికన్) పెట్టుబడిదారీ రచయిత, స్టాలిన్ ఇంకా బతికివున్న కాలంలో (1946లో) "స్టాలిన్‌ని వ్యతిరేకించడం ఇప్పుడు చాలా ప్రమాదకరంగా వుంది, ఇంకా కొంత కాలానికి స్టాలిన్‌ని కీర్తించడమే ప్రమాదకరం కావచ్చు. అంత మాత్రాన అదేమీ అభివృద్ధి కాదు. 'చిలక'కి ఇంకొక్క మాట ఎక్కువగా నేర్పడంవల్ల ఏం ప్రయోజనం?" అన్నాడు. అంటే చిలక స్వంత బుర్రతో ఆలోచించకుండా ఏ మాటలు నేర్పితే అవే ముక్కున పెట్టుకుని పలుకుతుంది కదా? అలాగే, కమ్యూనిస్టు పార్టీలవాళ్ళు, నాయకులు చెప్పే వాటిని ముక్కున పెట్టుకుని వల్లిస్తారు, అని చెప్పడం! ఈ పార్టీల వాళ్ళంతా ఈ రకం హేళనలకు అర్హులే. (అయితే జార్జి ఆర్వెల్‌గారు ఎంత స్వంత బుర్రతో ఆలోచించారు? స్వంత బుర్రతో ఆలోచించేవాడెవడైనా ఏ విషయంలోనైనా ఏది 'సత్యమో' గ్రహించి దాన్నే అనుసరిస్తాడు. స్వంత బుర్రతో ఆలోచించేవాడెవడైనా అదనపు విలువని తినడం దోపిడీ సిద్ధాంతమనే సత్యం తెలుసుకుంటాడు. ఆ క్షణం నుంచీ ఆ వ్యక్తి 'మార్క్సిస్టు' అయి తీరతాడు. ఆ వ్యక్తికి కమ్యూనిస్టు పార్టీల ఆచరణలు నచ్చకపోతే అది వేరే సంగతి. కానీ పెట్టుబడిదారీ సిద్ధాంతాన్ని బుర్రలో పెట్టుకున్న జార్జి ఆర్వెల్‌గారు ఇతరులకు స్వంత బుర్ర లేదని విమర్శించబోతే ఆ వ్యక్తికి ఎంత స్వంత బుర్ర వున్నట్టు?)

"స్టాలిన్‌ని జనరల్ సెక్రటరీ పదవి నించి తీసివేసి, ఇంకో సరైన వ్యక్తిని ఎన్నుకునే విషయం ఆలోచించండి" అని లెనిన్, ఎంతో బాధ్యతతో ఎంతో నిర్మొహమాటంగా తన అభిప్రాయం చెప్తే, ఆ అభిప్రాయం పార్టీ ప్రతినిధులందరికీ తెలిసికూడా స్టాలిన్‌ని తీసివేసే ప్రయత్నం కనీసం తర్వాత కాలంలో కూడా చెయ్యలేదు. కొంత కాలం తర్వాత ట్రాట్‌స్కీనో, ఇంకో వ్యక్తినో ఎన్నుకోకూడదూ? తర్వాత మరో వ్యక్తిని ఎన్నుకోకూడదూ? పదవి నించి దిగే వ్యక్తి పార్టీలో సాధారణ సభ్యుడిగా వుంటూ తను చెయ్యగలిగేది చేస్తూ వుండకూడదూ? పెట్టుబడిదారీ దేశాల్లో సైతం ప్రెసిడెంట్లూ ప్రధాన మంత్రులూ 1,2 దఫాలకన్నా ఎక్కువ సార్లు నిలబడరాదనే 'ప్రజాస్వామ్య నిబంధన' వుంటుంది అలాంటి కనీసపు ప్రజాస్వామ్యం కమ్యూనిస్టు పార్టీలో లేదు. కమ్యూనిస్టు రాజుగారు సింహాసనం ఎక్కారంటే ఇక దిగే పనిలేదు. దిగాలనే, దింపాలనే నిబంధనలు లేవు. 'మరణం' మాత్రమే వారిని సింహాసనం మీద నుంచి దింపాలి. స్టాలిన్ తన సింహాసనం మీద మరణం వరకూ 31 సంవత్సరాలపాటు వున్నాడు. అప్పటికీ మరణించకపోతే ఇంకా వుండేవాడన్నమాట! (మావో 33 సం॥ మిగతా వాళ్ళు కూడా ఇంతే!)

స్టాలిన్ 1953 మార్చి 5న మరణించాడు. ఆ వార్తని 6 గంటల తర్వాత కొందరు 'ప్రముఖులకు' మాత్రమే అందించారు. ప్రజలందరికీ చెప్పింది 3 రోజుల తర్వాత! ఆ 3 రోజుల వరకూ పార్టీ పెద్దలు సెక్రటరీ పదవిలోకి ఎవరు రావాలా అని, ఆ దేహాన్ని అలా వుంచి, కుమ్ములాడుకుంటున్నారన్నమాట! (3 రోజుల తర్వాత ప్రకటించడం అంటే, ఆ రోజే పోయినట్టు ప్రకటించారా? 3 రోజుల కిందటే పోయినట్టు ప్రకటించారా—అనే వివరం ఈ పుస్తకంలో లేదు.)

స్టాలిన్ పోయినప్పుడు ఆ వార్తని ప్రకటించిన విధానం ఎలా వుందో చూడండి:

"లెనిన్ యొక్క అత్యంత సన్నిహితుడూ, లెనిన్ ఆశయాల్ని ఉత్తేజ భరితంగా కొనసాగించినవాడూ, తెలివైన ఉపాధ్యాయుడూ, పార్టీకీ ప్రజలకూ నాయకుడూ అయినటువంటి 'గుండె' కొట్టుకోవడం ఆగి పోయింది. స్టాలిన్ పేరు మన పార్టీకీ, సోవియట్ ప్రజలకూ, ప్రపంచ శ్రామిక జనులకూ హద్దులు లేనంత ప్రియతమమైనది" ఇలా అబద్దాలతోటీ, అతిశయాలతోటీ భజన చేసిచేసి చివర్లో "పార్టీలో ఉక్కువంటి ఏకశిలా సదృశమైనటువంటి ఐక్యతనూ, పార్టీ లోపలా బయటా వున్న శతృవులకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో రాజీలేనితనాన్నీ, సమర్థతనూ వున్నతమైన రాజకీయమైన జాగరూకతనూ కాపాడుకోవడం మన కర్తవ్యం! అరాచ కత్వమూ, గందరగోళమూ (డిజార్డర్ అండ్ పానిక్) రాకుండా నిరో ధించడమూ, పార్టీ నాయకత్వంలో గొప్ప ఐక్యతను సాధించడమూ, పార్టీకీ ప్రభుత్వానికీ వున్న అత్యంత ముఖ్యమైన కర్తవ్యం." అనే హెచ్చరికతో ముగించారు. పార్టీలో ఉక్కు వంటి ఏకశిల వంటి ఐక్యత వుందని చెపుటూనే, పార్టీ లోపలా బయటా శతృవులు వున్నారని చెపు తున్నారు, పిచ్చివాళ్ళో, తాగిన వాళ్ళో మాట్లాడినట్టే!

ఒక నాయకుడు పోతే 'తాత్కాలికంగా' ఇంకో నాయకుడు ఆ 'పదవి'లోకి రావచ్చు. తర్వాత వెంటనే ఎన్నికలు జరిగితే సరిపోతుంది. ఇంత సాధారణ విషయం కోసం 'డిజార్డరూ, పానిక్కూ' రావచ్చునని హెచ్చరికలు!

ఈ 'ప్రకటన'గురించి ఈ పుస్తక రచయిత ఇలా హేళన చేస్తు న్నాడు. "డిజార్డరట! పానిక్ అట! అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్ట్ చచ్చిపోయినప్పుడు ఉపాధ్యక్షుడైన ట్రూమన్ ఆటోమాటిక్‌గా అధ్యక్షు డయ్యాడు. అప్పుడు ఇలా హెచ్చరించాల్సిన అవసరం కలిగిందా? ఇంత

విింతైన మాటలు స్టాలిన్ సన్నిహితులు అనడం అంటే ఒక నియంతృత్వ రాజ్యం యొక్క 'మార్మికత' దగ్గరికి వస్తాం!"

నిజానికి పెట్టుబడిదారీ రచయితలకు 'మార్మికతల' గురించి మాట్లాడే నైతిక అర్హత లేదు. కానీ స్టాలిన్ రాజ్యంలో మార్మికత పెట్టుబడిదారీ రచయితలు కూడా హేళన చెయ్యగలిగేటంతగా బలిసి పోయింది. కాబట్టి "ఇదేనా మీరు నిర్మించే నూతన సమాజం?"- అని ఇతర సిద్ధాంతాల వాళ్ళంతా దాన్ని హేళన చెయ్యగలుగుతారు. మార్క్సిజాన్ని ప్రేమించినవాళ్ళు కూడా స్టాలిన్ రాజ్యం చూసి 'ఇదే మార్క్సిజం అయితే మార్క్సిజమే వద్దు' అనే అర్థానికి వచ్చారు.

ఆనాటినించీ ఈనాటి వరకూ కమ్యూనిస్టు పార్టీలన్నీ మార్క్సిస్టు పార్టీలుగా గాక, 'స్టాలినిస్టు' పార్టీలుగా మాత్రమే వుంటున్నాయి.

గతం నించీ స్టాలిన్‌ని కీర్తించే వాళ్ళంతా అలా కీర్తించడానికి కారణం నిజానికి మార్క్సిజం గురించి గానీ, స్టాలినిజం గురించిగానీ, సరైన వివరాలు తెలిసి కాదు. అదో 'సాంప్రదాయం' అంతే!

మార్క్సిజాన్ని వదిలేసిన వాళ్ళంతా మళ్ళీ ఫ్యూడల్ పెట్టుబడిదారీ విధానాలలోకి పోగలరేగాని నూతనమైనదాన్ని దేన్నీ నిర్మించలేరని స్టాలిన్ కాలం నుంచీ రుజువవుతూనే వుంది. స్టాలిన్ చేసిందంతా పాతకాలపు క్రూర, నిరంకుశ విధానాలే.

* * *

శ్రీను, మద్రాసు.

ప్ర: ఇప్పుడున్న పెట్టుబడిదారీ సమాజం పోయి, సోషలిస్టు సమాజం ఏర్పడుతుందనడానికి, సిద్ధాంతపరమైన రుజువు (థీరిటికల్ ప్రూఫ్) ఏదైనా వుందా?

జ : స్థిర పెట్టుబడి + అస్థిర పెట్టుబడి + అదనపు విలువ = సరుకు విలువ

$$C + V + S = C'$$

అనే సూత్రమే ఆ రహస్యం.

దానివత్వం ప్రారంభమైన కాలం నుంచీ, యజమాని వర్గం దానిస వర్గం నుంచి, అదనపు విలువని (Sని) లాగుతూనే వుంది. అదే శత్రు వైరుధ్యాన్నీ, వర్గ పోరాటాన్నీ సృష్టించింది. 'వర్గాలు' నశించే స్థితి ఏర్పడే వరకూ, వైరుధ్యాలూ, దానివల్ల పోరాటమూ ఏర్పడి తీరాలన్నది హేతుబద్ధమైన విషయం. వర్గసమాజం వర్గరహిత సమాజానికీ, సమానత్వానికీ దారితీస్తుందనేది కూడా హేతుబద్ధమైన విషయం. బానిస సమాజం నుంచే ఈ చారిత్రకమైన నడక కనబడుతూనే వుంది.

ప్రకృతి సహజమైన మార్పుల్లో అయితే కాల నియమాలు ఖచ్చితంగా వుంటాయి. 'పౌర్ణమి' తర్వాత 15 రోజులకు 'అమావాస్య' వస్తుంది. 'అమావాస్య' తరువాత 15 రోజులకు 'పౌర్ణమి' వస్తుంది. సూర్యోదయాలు, సూర్యాస్తమయాలూ, ఋతువులూ, కాలాలూ, అన్నీ ఖచ్చితమైన సమయాలలోనే, వచ్చిపోతూ వుంటాయి. సామాజిక మార్పులకు అలాంటి ఖచ్చితమైన కాల నిర్ణయాలు వుండవు. శ్రామిక వర్గ చైతన్యమూ, కృషీ అనే వాటి మీదే ఆ మార్పులు ఆధారపడి త్వరగానో, ఆలస్యంగానో జరుగుతూ వుంటాయి.

* * *

ఎం. జ్ఞానేశ్వర్రావు, మద్రాసు.

ప్ర : పేదవాళ్ళు కూడా బాగా బ్రతకవచ్చంటాను. తాగి తందనాలాడి ఆదాయమంతా ధ్వంసం చేసుకోకపోతే.

జ : తాగని పేదవాళ్ళెవరైనా తమ కుటుంబ నిర్వహణనీ, తమ ఆదాయాన్నీ మీకు అప్పగిస్తారనుకుందాం. ఆ కుటుంబం 'బాగా బతికేలాగ'

మీరు చెయ్యగలరా ? అలాగైతే, మీకు నేనో కుటుంబాన్ని అప్పగిస్తాను. ఆ కుటుంబ సభ్యుల అంగీకారంతోనే. వాళ్ళ ఆదాయాలన్నీ మీ చేతికి ఇస్తారు. ఆ కుటుంబ వ్యవహారాలన్నీ మీరే చూడండి అతను గ్లాసు ఫ్యాక్టరీలో టెంపరరీ వర్కరు. నెలకి 250 ఇస్తారు. భార్య, ఇళ్ళ కట్టడాల పనుల్లో తట్టలు మోసే పని చేస్తుంది. నెలకి 10,12 రోజులు మాత్రమే పని వుంటుంది. పని వున్నప్పుడు రోజుకి 15 రూపాయలు ఇస్తారు. బస్సు ఛార్జీలకి రోజూ 2, 3 రూపాయలు ఖర్చవుతుంది. అంటే, భార్య సంపాదన నెలకి సుమారు 200. మొత్తం ఆదాయం 450. వాళ్ళకి ఇద్దరు పిల్లలు. అతనికి తల్లిదండ్రులు వున్నారు. చిన్న గుడిసెలో వుంటున్నారు. కుటుంబంలో ఎవరూ తాగరు. ఇప్పుడు ఈ కుటుంబం బాధ్యత మీదే. వాళ్ళ ఆదాయం మీ చేతికి ఇచ్చేస్తారు. ఒక సంవత్సరం వరకూ మీరే చక్కగా మెయింటైన్ చేసి 'బాగా బతకడం' ఎలాగో వాళ్ళకి నేర్పండి, ఇక అప్పటినించీ వాళ్ళే బతుకుతారు.

'బాగా బతకడం' అనే దానికి కొన్ని 'కనీసమైన' షరతులు వున్నాయి. మీ నిర్వహణలో ఆ షరతులు నెరవేరాలి. 1) 4 గదుల ఇల్లు 2) కుటుంబంలో వున్న 6 గురికి 2 పూటలా కనీసపు పోషక విలువలు దొరికే ఆహారం. పిల్లలకి రోజూ పుదయం పాలు 3) ఒక్కొక్కరికీ కనీసం నాలుగేసి బట్టలు 4) అందరికీ మంచాలూ, పక్కబట్టలూ 5) కుటుంబానికి సరిపోయే నీళ్ళు. రోజూ స్నానాలకు కూడా. 6) నెలకి కొన్ని మందులు 7) పిల్లలకి చదువులూ, పుస్తకాలూ 8) సబ్బులూ, చెప్పులూ, కొన్ని కుర్చీలూ, కనీసం 3 ఫేన్లు 9) ఒక రేడియో, ఒక సైకిలూ 10) నెలకి ఒక సినిమా. కనీసంగా 'బాగా బతకడం' అంటే ఇదీ ! ఇందులో విలాసాలూ, అనవసరపు వేస్టు ఖర్చులూ ఏమీలేవు. అన్నీ అవసరాలే. ఈ అవసరాలు తీరితేనే దాన్ని బాగా బతకడం అనాలి.

మొత్తం 450 ఆదాయంలో ఈ కనీస అవసరాలు ఎవరన్నా తీర్చగలరా? ఈ ఆదాయమైనా ప్రతీ నెలా తప్పనిసరిగా వచ్చి తీరుతుందని గ్యారంటీ వుందా? కుటుంబంలో భార్యాభర్తలిద్దరూ శ్రమపడుతోన్నా, ఎవ్వరికీ ఏ వ్యసనాలూ లేకపోయినా, పిల్లలు ఇద్దరే వున్నా, ఆ కుటుంబం కనీస అవసరాలైనా తీరకుండా ఎందుకు వుంటున్నది? 'తాగడం' వల్ల కాదు ఆదాయమే వూహాతీతమైనంత తక్కువగా వుండడం వల్ల. (ఒక వేళ తాగడం కూడా వుంటే వాళ్ళు ఇంకా బాధలు పడిపోతారు. అది వేరే సంగతి). "వాళ్ళు చేసే పనులకు అంతే ఆదాయం వస్తుందికదా. దానికి ఎవరేం చెయ్యగలరు?" అంటారా? వాళ్ళు చేసే పనికి కనీసం '4 వేల' విలువ వుంటుందనీ, అందులో 10 వ వంతు మాత్రమే వాళ్ళకు అందుతోందనీ, మిగిలిన 9 భాగాలూ వాళ్ళకి దక్కడంలేదనీ రుజువైతే దాన్ని 'చాలా అన్యాయమ'ని మీరు ఒప్పుకుంటారా? ఆ 'అన్యాయమే' జరుగుతోంది సమాజంలో వేల సంవత్సరాలనించీ. 'కనీస అవసరాలు' అంటూ నేను చూపించిన ఆ 10 అవసరాలూ తీరడం చాలా అతిశయమైన కోరికగా ఎవరికైనా అనిపిస్తే, వాళ్ళు 'ధనవంతుల' ఇళ్ళని పరిశీలించండి. వాళ్ళ ఇళ్ళూ, వాళ్ళ తిళ్ళూ, వాళ్ళ బట్టలూ, వాళ్ళ వస్తువులూ, వాళ్ళ కార్లూ, వాళ్ళ ఆభరణాలూ, వాళ్ళ విహారాలూ, వాళ్ళ విలాసాలూ వగైరాలన్నీ వాళ్ళకి ఏ శ్రమలు చేసినందుకు వస్తున్నాయని అనుకోవాలి? సోనియా గాంధీకి 6 వేల చీరలూ, ఇతర రకాల బట్టలు ఇంకా ఎన్నో వేలూ ఉన్నాయని ఈ మధ్యనే ఒక పేపర్‌లో (ఆంధ్రభూమి వీక్లీలో) చదివాను. కొంత తక్కువస్థాయి ధనిక కుటుంబాల్ని తీసుకున్నా వందల స్థాయిలోనైనా వుంటాయి బట్టలు. ఇతర వస్తువులన్నీ అదే స్థాయిలో వుంటాయి. వెయ్యేసి గజాలకన్నా కూడా ఎక్కువ స్థలాల్లో అనేక డజన్ల గదులుగల ఇళ్ళూ, గది గదికీ ఏసీలూ, మనిషి మనిషికీ ప్రత్యేక సౌకర్యాలూ, [illegible]

తయారయ్యే "ఉత్పత్తి రాసి"లోనించే శ్రమ చెయ్యని వర్గం ఇంత బ్రహ్మాండమైన భాగాన్ని లాగేస్తూవుంటే, శ్రమచేసే వర్గానికి మురికివాడల్లో గుడిసెలూ, నగ్నత్వమూ, వాళ్ళ సంతానానికి రోగాలూగాక ఏం మిగులు తాయి? పేదరికానికి వున్న అసలు 'మూలాన్ని' అనేకమంది ఎప్పటినించో బోధిస్తూ వున్నా, దాన్ని పట్టించుకోకుండా తప్పంతా 'తాగడం' మీదకో, ఇంకో దాని మీదకో తోసేస్తే ఏం ప్రయోజనం? 'ధనవంతులు' ప్రతీనెలా వందలూ, వేలూ పెట్టి తాగడం లేదూ? దానివల్ల వాళ్ళ 'సంపదలు' తర గడంలేదేం? వాళ్ళకి ఎన్నటికీ తరగని అంతంత సంపద రాసులు ఏ శ్రమ లకు బదులుగా వస్తున్నాయి? (తాగడాన్ని విమర్శించవలసిందే. ఆ ఉత్ప త్తుల్ని ఆపెయ్యవలసిందే. అదంతా వేరే సమస్య) 'తాగడం మానేస్తే పేదవాళ్ళుకూడా బాగా బతకవచ్చు' అన్నారు కాబట్టి, తాగని పేద వ్యక్తుల కుటుంబం ఖర్చుల్ని మీ చేతిలోకి తీసుకోమని నేనంటున్నాను.

* * *

సి. రమణా గిరిజ, అనకాపల్లి.

ప్ర : 'పేదవాళ్ళకేం, కూలి చేసుకుని నిక్షేపంలా బతుకుతారు' అంటారు చాలామంది. మాకు మామ వరస అయ్యే ఒకాయన ఎప్పుడూ ఇదే అంటూంటాడు. ఆయనకి పాతిక ఎకరాల తోటలున్నాయి. బోరు బావులకింద పండిస్తాడు. పనులన్నీ కూలీలు చేస్తారు. తను ఇబ్బందులు పడుతున్నట్టూ, కూలీలే సుఖంగా జీవిస్తున్నట్టూ మాట్లాడతాడు ఆయన. కూలీలు సుఖపడుతున్నదేమిటని ఎంత వాదించినా ఒప్పుకోడు.

జ : ఈసారి మీతో ఆ మాటలు అన్నప్పుడు ఆయనకో 'సలహా' ఇవ్వండి. ఆ తోటలన్నీ ఆ కూలీలకు ఇచ్చేసి, తనని ఆ తోటల్లో కూలి పని చెయ్యమనండి. అప్పుడు తను సుఖంగా వుండొచ్చనీ, ఆ భూమి తీసు కున్నవాళ్ళే కష్టాలు పడతారనీ చెప్పండి. "అలా చేసెయ్యి మామయ్యా!

కావాలి పని చేసుకుంటూ నువ్వు చాలా సుఖంగా వుండొచ్చు" అని చెప్పండి. ఇక మళ్ళీ మీ దగ్గర నోరెత్తడు.

*   *   *

కె. భద్రం, ఏలూరు.

ప్ర : మీరు 'కాపిటల్' చదివి తీరాలని చెప్తున్నారు. అది తప్ప మిగతా మార్క్సిస్టు పుస్తకాలు చదివితే 'మార్క్సిజం' తెలియదా?

జ : తెలియదు. మిగతా పుస్తకాలద్వారా తెలిసేది చాలా అస్పష్టంగా వుంటుంది. 'కాపిటల్' లో 'ఆర్థిక శాస్త్రం' వుంది. దానివల్ల వర్గాలూ, వర్గాల్లో సెక్షన్లూ తెలుస్తాయి. 'దోపిడీ' జరిగే విధానం తెలుస్తుంది. ఈ 'మూలం' స్పష్టంగా తెలియకుండా ఇతర విషయాలు ఎన్ని చదివినా వర్గాల్ని అర్థం చేసుకోవడంగానీ, ఆర్థిక విషయాలు అర్థం చేసుకోవడం గానీ సాధ్యంకాదు. ఈ మధ్య వడ్డీలు లేకుండా బ్యాంకు విధానం వుండవచ్చనీ, డిపాజిట్లు లాభంలో కొంతభాగం తీసుకునే పద్ధతిలో వడ్డీల్ని తీసివెయ్యవచ్చనీ, ఇది చాలాగొప్ప సంస్కరణ అనీ చెప్తున్నారు. అలాగే కార్మికులకు కూడా షేర్లు వుంటే, అది కార్మికులకు కూడా యాజమాన్యం వున్నట్టేనని చెప్తున్నారు. ఇలాంటి మాటల్లోవుండే పెత్తపేమిటో 'కాపిటల్' చదవకపోతే ఏం తెలుస్తుంది? 'కాపిటల్' చదవకముందు, 'కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక'తో మొదలుపెట్టి, ఇతర పుస్తకాలు చదివినప్పుడు, అవన్నీ సత్యమనే నమ్మకం కలుగుతోన్నా, "దోపిడీ జరుగుతోందని సిద్ధాంత పరంగా ఎలా రుజువు చెయ్యగలం?" అనే ప్రశ్న నన్ను వదిలేది కాదు. ఆ విషయం అర్థంకాకపోతే ఇక 'మార్క్సిజం' నేర్చుకోవడం ఏముంది? కాబట్టి, మార్క్సిజాన్ని చదవడం 'కాపిటల్' తోనే ప్రారంభించాలి. ఇతర పుస్తకాలన్నీ తర్వాత చదవాలి. అప్పుడు అవి బాగా అర్థమవుతాయి.

*   *   *

జి. దయాకరరెడ్డి, నల్లగొండ.

ప్ర : మీరు (26-1-90) సంచికల్లో 'నైట్ షిఫ్టులు లాభాల దృష్టి కోసే ప్రారంభించారనీ, నైట్ షిఫ్టులు లేకుండా అంతే పనిని అందరూ కలిసి పగలే చెయ్యవచ్చు, పనిలోనూ యంత్రాల ఖర్చులోనూ తేడారాదు. కేవలం స్థలం దగ్గరే తేడావస్తుం'దన్నారు. మీ అభిప్రాయం తప్పని నేనం టాను. నైట్ షిఫ్టులు మీరన్నట్టుగా లాభాల దృష్టితో కాదు, తక్కువ పెట్టుబడితో, తక్కువ యంత్రాలతో, కాలయాపనలేకుండా వినిమయదారుల అవసరాలను తీర్చాలనే సదభిప్రాయంతోనే నైట్ షిఫ్టులు ప్రారంభ మయ్యాయి. ఎలాగంటారా? ఓ 10 యంత్రాలు వున్నాయనుకోండి, వాటి మీద 10 మంది శ్రామికులు పనిచెయ్యగలరు. మీరన్నట్టు పగలే పని చెయ్యాల్సి వస్తే 20 మంది మాత్రమే ఆ యంత్రాలతో పనిచెయ్యగలుగు తారు. (షిఫ్టుకి పదిమంది చొప్పున). అదే నైట్ షిఫ్టు ప్రవేశపెడితే 30 మందికి శ్రమ జీవనం దొరుకుతుంది. వస్తూత్పత్తి కూడా పెరుగుతుంది. ఇంతే వస్తూత్పత్తిని పగలే తయారు చెయ్యాలంటే కనీసం 15 యంత్రాలు కొనుగోలు చెయ్యాలి. అంటే, ఇక్కడ పెట్టుబడి ఎక్కువైంది, యంత్రాలమీద. నైట్ షిఫ్టు వుంటే వస్తూత్పత్తి కొరకు సమయం కూడా 8 గంటలు ఆదా అవుతుంది. నైట్ షిఫ్టువల్ల ఎక్కువమందికి జీవనోపాధి కలుగుతుంది. మీరు కేవలం స్థలం దగ్గర తేడా అన్నారు. స్థలం పెంచు కోవడంలో ఎవరికీ ఇబ్బందులు ఎదురుకావు. మన దేశంలోనైతేనేమి, రష్యా, చైనాల్లో అయితేనేమి చాలావరకు భూమి వృధాగానే వుంది. కాక పోతే, 'నైట్ షిఫ్టుల్లో పనిచేసే వారికి పారిశ్రామికవేత్తలు తదనుగుణంగా వాళ్ళకు కావలసిన సదుపాయాలు కల్పించడంలేదు. వృత్తిరీత్యా నేను నైట్ షిఫ్టులు చేస్తుంటాను. నైట్ షిఫ్టుల ద్వారానే కార్మికుల జీవితాలు ఒక నియమ నిబంధన లేకుండా అస్తవ్యస్తం అవుతున్నాయనండి నేనొప్పు

కోసం. లేకపోతే 'మార్క్సిజం'లో లోపం లేదని మీరంటున్నారు. ఇది పూర్తిగా నిజం కాదు. ఎందుకంటే, ఆ కాల పరిస్థితుల్లో ఆనాటి సాంఘిక సమస్యలపట్ల (మార్క్స్) ఆనాడు సాధ్యమైనంత వరకు న్యాయం కలిగా అనే సదుద్దేశ్యంతో మార్క్సిజం వ్రాయబడింది. అప్పటికీ, ఇప్పటికి పరిస్థితి ప్రభావంలో, వనరుల సమీకరణలో చాలా మార్పు వచ్చింది. ఇప్పటి పరిస్థితులకు అనుకూలంగా మార్క్సిజం వ్రాసుకోవాల్సిన అవసరం ఎంతేనా వుంది. కాదంటారా?

జ: మొదట, మీ యంత్రాల లెక్క వినండి. నేనిచ్చిన వెనకటి జవాబులో వివరాల్ని బట్టి ఆ విషయాలు తేలిగ్గానే అర్థంచేసుకోవచ్చు. కానీ అర్థం చేసుకోవడానికి మీరు సరిగా ప్రయత్నించలేదు. రోజుకి 24 గంటలు. ఇప్పుడు అది 3 షిఫ్టులుగా వుంటున్నది. ప్రతి షిఫ్టూ 8 గంటలు, నైట్ షిఫ్టును తీసివెయ్యడం అంటే, మిగతా 2 షిఫ్టులూ అలాగే వుండాలని అర్థంకాదు. 2 షిఫ్టులు వుండాలంటే 16 గంటలు కావాలి. తెల్లారగట్ట 4 గంటలనించి రాత్రి 8 గంటలవరకూ వుండే కాలాన్ని తీసుకుంటేనే 2 షిఫ్టులు అవుతాయి. అది మళ్ళీ రాత్రి పనిచెయ్యడం లాంటిదే. కాబట్టి విషయం అదికాదు. నైట్‌షిఫ్టుని తీసివెయ్యడం అంటే, అసలు షిఫ్టుల పద్ధతే వుండరాదనీ, ఇప్పుడు 3 షిఫ్టుల్లో పనిచేస్తోన్న జనం అంతా పగలు ఒకే షిఫ్టులో పనిచెయ్యాలనీ అర్థం. అన్ని షిఫ్టులూ కలిసి ఒకే జనరల్ షిఫ్టు ఉదయం 9గంటలనించి సాయంత్రం 5 వరకూ కావచ్చు. లేదా, 8 నుంచి 4 వరకూ కావచ్చు. (మనిషి జీవితంలో వుదయాలూ, సాయంత్రాలూ అనేవి, ఆందోళన లేకుండా ఇంటిపనులూ, పిల్లలపనులూ చేసుకోవడానికీ; కళాత్మక, సాంస్కృతిక కార్యక్రమాలకీ; విశ్రాంతిగా గడపడానికీ కావలసిన కాలంగా వుండాలి)ఆస్పత్రులూ, రవాణా, కొన్ని రసాయ

నిక వుత్పత్తుల కాలాపంటి వాటి విషయాలు కొంత తేడాగా వుంటాయి. ఏ సిద్ధాంతాన్ని మాట్లాడినా మొదట 'జనరల్ సూత్రాలు' అర్థం చేసుకుని, వాన్నిబట్టి ప్రత్యేక విషయాలు చూడాలి. ఇప్పుడు 3 షిఫ్టుల పద్ధతిలో ఏం జరుగుతున్నదంటే ఒకే స్థలంలో, ఒకే యంత్రంమీద ఒక షిఫ్టు కార్మికులు పనిచేసి వెళ్ళిపోయిన తర్వాత ఇంకో షిఫ్టు కార్మికులు పనిచేస్తారు. ఏ కార్మికుడైనా ఒక్క షిఫ్టులోనే పనిచేస్తాడు. యంత్రంమాత్రం 24 గంటలూ పనిలో వుంటుంది. ఇలాంటి పరిస్థితిని ఒకే జనరల్ షిఫ్టుగా మార్చాలంటే ఏం జరగాలి? ఇంకా 2 స్థలాలూ, ఇంకా 2 యంత్రాలూ కావాలి. మొత్తం 3స్థలాల్లో, 3 యంత్రాలమీద, 3 షిఫ్టుల కార్మికులూ ఒకే సమయంలో పని చేస్తారు. ఒక షిఫ్టు తర్వాత ఒక షిఫ్టుగా 3 షిఫ్టుల పద్ధతిలో పనిచేసి నప్పుడు రోజుకి ఎన్నియూనిట్ల వుత్పత్తి తయారవుతుందో, అందరూ కలిసి ఒకేషిఫ్టుగా పనిచేసినప్పుడు కూడా ఆ వుత్పత్తి అంతా తయారవు తుంది. వుత్పత్తి తగ్గడంగానీ, హెచ్చడంగానీ జరగదు.

ఇక యంత్రాల ఖర్చుసంగతి. ఒకయంత్రం 24 గంటలూ పనిచేస్తూ 1నెలరోజుల్లో పాతదై పోతే, అదేయంత్రం రోజుకి 8 గంటలు మాత్రమే పనిచేస్తే 3నెలలకు పాతదవుతుంది. యంత్రం 24 గంటలూ పనిచేస్తే నెలకో యంత్రాన్ని మార్చాలి 3 నెలలకు 3యంత్రాలు ఖర్చవుతాయి. అలా గాక, 3యంత్రాల్నీ ఒకేసమయంలో వాడుతూ రోజుకి 8గంటలు మాత్రమే పనిచేయిస్తే, అందులో ప్రతీయంత్రమూ 3నెలలవరకూ వస్తుంది. అప్పుడూ కూడా 3నెలలకు 3యంత్రాలు ఖర్చవుతాయి. రెండూఒకటే. ఎంతో సింపుల్ లెక్క. ఒక ఇంట్లో ముగ్గురు మనుషులు ఒకే సబ్బుని వాడితే అది 10 రోజులవరకూ వస్తుందనుకుందాం. నెలకి 3 సబ్బులు కావాలి. ముగ్గురూ 3వేరువేరు సబ్బులు పెట్టుకుంటే,ప్రతి సబ్బూ 30రోజులు వస్తుంది.అప్పుడు కూడా నెలకి 3సబ్బులే. ఎలాచూసినా ఒకటే.ముగ్గురూ ఒకే సబ్బు వాడినా,

వేరువేరు షిఫ్టులు వాడినా షిఫ్టుల ఖర్చు ఒకటే. (కాకపోతే, వేరు వేరు షిఫ్టులువాడే ఉదాహరణలో ఒక్క షిఫ్టు పెట్టే స్థలంగాక, ఇంకా 2 షిఫ్టులుపెట్టే స్థలమూ, ఇంకా 2 షిఫ్టుపెట్టేందుకు కావాలి) యంత్రాల ఖర్చు సంగతికూడా అంతే. నైట్‌షిఫ్టువుంటే తక్కువ యంత్రాలూ, అదీ లేకపోతే ఎక్కువయంత్రాలూ ఖర్చుచెయ్యటమేమీ వుండదు. ఈ విషయం సరిగా అర్థం చేసుకుని మీయంత్రాల లెక్కలోవున్న తప్పేమిటో పరిశీలించుకోండి. ఈ విషయం మీకు ఇప్పటికీ అర్థంకాకపోతే మీ తోటి కార్మికులతో చర్చించండి.

3 షిఫ్టుల్ని ఒకే జనరల్ షిఫ్టుగా మారిస్తే, ఇంకా 2రెట్లుస్థలం కావాలని ఇంతకుముందే చెప్పాను. “స్థలానిదేముంది, కావలసినంతవుంది” అని మీరుకూడా ఒప్పుకున్నారు. కాబట్టి ఆ విషయంలో చర్చలేదు. నైట్‌షిఫ్టు వున్నా, లేకపోయినా యంత్రాలఖర్చు విషయంలో తేడా రానట్టే ముడి పదార్థాల విషయంలో కూడా తేడారాదు. అలాగే నైట్‌షిఫ్టు వుంటే ఎక్కువ మందికి పనివుండడమూ, లేకపోతే పనితగ్గడమూ అనే తేడారాదు. అలాగే, నైట్‌షిఫ్టు లేకపోతే, వుత్పత్తులు తయారపడంలో మీరన్న ‘కాలయాపన’ కూడా ఏమీవుండదు. నైట్‌షిఫ్టు వున్నా లేకపోయినా 24గంటల కాలంలో (1రోజులో) ఒకేసైజు పని జరుగుతుంది. ఒకే వుత్పత్తి వుంటుంది. తేడా స్థలం విషయంలోనూ, అందులో వుండవలసిన బిల్డింగుల విషయంలోనూ మాత్రమే. పెట్టుబడిదారీ విధానంలో ఇది చిన్న విషయమేమీకాదు. ఒక్క స్థలంలో జరిగిపోయే పనికోసం 3 స్థలాలు కేటాయించడం పెట్టుబడిదారీ దృష్టికి “తెలివైన”పనిగా కనపడదు. అంతకన్నా ముఖ్యంగా నైట్‌షిఫ్టు ఎందుకంటే. పెట్టుబడిదారులమధ్య ‘పోటీ’లో యంత్రాల టెక్నిక్కులు త్వర త్వరగా మారిపోతూవుంటాయి. కాబట్టి, యంత్రాన్ని త్వర త్వరగా మార్చివెయ్యాలంటే, వాటిని త్వరత్వరగా ఖర్చుచేసెయ్యగలిగే విధానం

వుండాలి. 24గంటలూ పనిచేసే యంత్రం 5 సంవత్సరాల్లో పాతదై పోతే, రోజూ 8గంటలే పనిచేసే యంత్రం పాతదపడానికి 15సం.లు పడుతుంది. యంత్రాల్ని త్వరగా మార్చెయ్యాలంటే వాటిని త్వరత్వరగా అరగ్గొట్టెయ్యడమే మార్గంకదా? కాబట్టి, నైట్‌షిఫ్టు వుంటేనే యంత్రాల్ని త్వరగా అరగ్గొట్టేసి, అవసరమైతే త్వరగా మార్చెయ్యడానికి వీలవుతుంది. కాబట్టి, నైట్‌షిఫ్టు నూటికి నూరుపాళ్ళూ 'లాభ' దృష్టితో ఏర్పడి కొనసాగుతున్నదే.

"నైట్ షిఫ్టుల ద్వారానే కార్మికుల జీవితాలు నియమ నిబంధనలు లేకుండా అస్తవ్యస్తం అవుతున్నాయంటే నేనొప్పుకోను" అంటున్నారు మీరు. నైట్‌షిఫ్టులు లేనప్పుడు కూడా శ్రామికుల జీవితాల్లో అస్తవ్యస్తత వుంది. కానీ, నైట్‌షిఫ్టులవల్ల అది అనేక రకాలుగా అనేక కోణాల్లో విస్తరిస్తుంది. రాత్రిళ్ళు నిద్రపోయి, పగలు పని చేసుకోవలసిన మనుషులు రాత్రిళ్ళు పనిచేసి పగలు నిద్రపోవడంలో మీకేమీ అస్తవ్యస్తత కనబడడం లేదన్నమాట! చిన్నతనంనించీ 'అసహజత్వం'లోనేపడి పెరుగుతూవుంటే, అదే 'సహజత్వం' అయిపోతుంది.

ఇక 'మార్క్సిజం' గురించి మీరంటున్నది. మార్క్సిజంలో లోపం లేదనుకోరాదనీ, మార్క్సిజాన్ని ఈనాటి పరిస్థితులకు అనుకూలంగా రాసుకోవాలనీ, ఈనాటి పరిస్థితులకు అనుకూలంగా అంటే! 'గోర్బచేవ్ గారికి' అనుకూలంగా అనా? సబ్బుల లెక్కంత సింపుల్ యంత్రాల లెక్కనే అర్థంచేసుకోలేకపోయారు మీరు. మార్క్సిజంలో ఇంకా మీరు అర్థం చేసుకోకుండా వున్న విషయాలు 999 వున్నాయి! ఏదైనా ఒక విషయంలో సవరణలూ, సూచనలూ చెయ్యాలంటే, మొదట ఆ విషయం గురించి పూర్తిగా తెలిసి వుండాలి. లేకపోతే ఆ విషయం గురించి విమర్శించడం న్యాయంగా వుండదు. పెట్టుబడిదారీ విధానానికి

లాభదృష్టి వుండదనీ, వినిమయదారులకు మేలు చెయ్యాలనే సదభిప్రాయం తోనే అది నైట్‌షిప్టులు నడుపుకోందనీ రాపిస్తోన్న మీరు మీ అభి ప్రాయాల్లో వున్న పొరపాటేమిటో మొదట అర్థం చేసుకోవాలి.

కాత్యాయని, విజయనాడ.

ప్ర: రష్యాలో లెనిన్ దేహాన్ని అలా వుంచటం 'శవపూజ' అవదా?

జ : 'శవపూజ' కాదు, 'వ్యక్తిపూజ' అవుతుంది. ఈ 'వ్యక్తి పూజ'కి లెనిన్ బాధ్యత ఏమీ లేదు. 'వ్యక్తిపూజ'లకు లెనిన్ మహా వ్యతి రేకం. 'పుట్టిన రోజులు' జరుపుకోవడం లాంటి వాటిని కూడా ఆయన వ్యతిరేకించాడు. ఇలాంటి వాన్నయితే వూహలో కూడా భరించడు. ఒక నాయకుడు ఎంత గొప్ప వ్యక్తి అయినా, ప్రజలకు ఆయన మీద ఎంత ప్రేమ వున్నా ఆ ప్రేమని ప్రకటించే మార్గం ఇది కాదు. జీవించినప్పుడూ మరణించి నప్పుడూ కూడా నాయకుడు ప్రజలతో 'సమానంగా' వుండాలి. అంటే, మరణం తర్వాత నాయకుల దేహాల్ని కూడా ప్రకృతి ధర్మాల ప్రకారమే వెళ్ళిపోనివ్వాలి. ప్రకృతి ధర్మాల దగ్గిర ఎవరికీ ప్రత్యేకతలు వుండవు. దేహాన్ని ఈ రకంగా వుంచడం అంటే ప్రకృతి ధర్మాల్ని పాటించడం లేదని అర్థం. ఇది చాలా అసహజమైన విషయం. లెనిన్ మీద ప్రేమతోనే ఇలా చేశామనీ, ఆ నాయకుడి మీద ప్రేమతోనే ఆ దేహాన్ని చూస్తారనీ అంటే అదంతా పూర్తిగా కపటత్వం. లెనిన్ భావాల మీదా, కృషి మీదా అంత ప్రేమే వుంటే ఈ 'రివిజనిజం' ఎక్క డ్నించి వచ్చింది? యాత్రికులందరూ కేవలం కాలక్షేపంగా గుహ్యా గోపు రాలూ, కట్టడాలూ, సుందిరాలూ చూసినట్టే ఆ దేహాన్ని కూడా చూసి పోతూ వుంటారు. జీవితంలో ఎన్నడూ 'వ్యక్తిపూజ'ని ఇష్టపడని వ్యక్తి

దేహాన్ని, ఆయన భావాలకు విరుద్ధంగా అలా ప్రదర్శించడానికి ఇతరులకేం హక్కు వుంటుంది? ఆత్మాభిమానం గల ఏ వ్యక్తి తన దేహాన్ని అలా ప్రదర్శించడానికి ఒప్పుకోడు.

వర్గ పోరాటం సుదీర్ఘమైనది. ప్రతీ దేశంలోనూ అనేక మంది నాయకులు వుంటారు. చిత్తశుద్ధితో ప్రవర్తించిన నాయకుల మీద ప్రజలకు నిజంగానే ప్రేమ వుంటుంది. ఎంత ప్రేమ వున్నా, ఎంతమంది నాయకుల దేహాల్ని నిలిపి వుంచగలరు? ఈ సంస్కృతే కొనసాగితే క్రమ క్రమంగా అలాంటి అద్దాల పెట్టెల సమాధుల సంఖ్య పెరిగిపోతూ వుంటుంది. వాటి కోసం ప్రత్యేక మందిరాలూ, వాటి సంరక్షణలూ, అదంతా ఎంత అసహజమైన పరిస్థితి!

కొన్ని సంవత్సరాల క్రితం ఒకసారి నేను మార్క్సిజం గురించి ఒక వ్యక్తితో మాట్లాడుతూ వుంటే, ఎక్కడా జవాబు చెప్పలేకపోయిన ఆ వ్యక్తి చివరికి చాలానిర్లక్ష్యంగా "మీది శవాల్ని పూజించే మతమండి" అన్నాడు. ఎక్కడా నోరెత్తలేకపోయినవాడు చివరికి ఆ మాట అనగలిగాడు. "అవును, మావాళ్ళు మూర్ఖులు. అందుకే మీకు ఇలా తప్పుకోగలిగే అవకాశం ఇచ్చారు" అన్నాను. ఒక సిద్ధాంతం ఎంత మంచిదైనా, దాన్ని అనుసరించే వాళ్ళు చేసే ఘోరమైన తప్పులవల్ల దాని విలువ తగ్గిపోతూ వుంటుంది. ఆ సిద్ధాంతం గురించి సరిగా తెలియనివాళ్ళ దృష్టిలో!

* * *

గొండేల రాంబాబు, కొంపిమళ్ళ (ఖమ్మం).

ప్ర : నేను చాలాసార్లు విన్నాను. బహిరంగ సభల్లాంటివి జరిగేటప్పుడు కొంత మంది వక్తలు ప్రజల నుద్దేశించి ప్రసంగిస్తూ — ఆర్థిక అసమానతలు తొలగాలనీ, టాటా, బిర్లా మొదలగువారి ఆస్తుల్ని జాతీయము చేయాలనీ—చెప్తూంటారు. నిజంగా అలా అడగటము భావ్యమేనా?

వాళ్ళు ఎంతో కష్టపడి నిద్రాహారాలు లేకుండా తమ తెలివితేటలతో సంపా దించిన ఆస్తిని అందరికీ పంచమనే హక్కు పీరికెక్కడిది? వక్తలు ఒక్కోసారి అంటూంటారు. "ప్రజల్ని మోసగించి ఇంత ఆస్తి సంపా దించారు కాబట్టి ఆ ఆస్తి మొత్తము ప్రజలదే" అని. కోటీశ్వరుడు అయిన ప్రతీ ఒక్కడూ ప్రజల్ని మోసగించినట్లేనా? మధ్యతరగతి కుటుం బీకులు ప్రజల్ని మోసగించటంలేదా? వేదిక లెక్కి చెప్పేవాళ్ళు, ప్రజల్ని ఆకట్టుకోవటానికే ఇలా మాట్లాడుతుంటారా? లేక వాళ్ళ మాటల్లో నిజ ముందా?

జ : ఆ వక్తలు చెప్పింది అదే అయితే అది నూటికి నూరుపాళ్ళా నిజమే. అయితే, ఒక 'నిజం' మాట్లాడేవాళ్ళంతా ఒకే రకంగా వుండరు. వాళ్ళల్లో కూడా రకరకాలవాళ్లు వుంటారు. కొంతమంది, ఆ విషయాలు పూర్తిగా తెలిసి, వాటిని పూర్తిగా అంగీకరిస్తూ మాట్లాడతారు కొంత మంది, ఆ విషయాలు తగినంత బాగా తెలియకపోయినా, తెలిసినదాని ఆధా రంతోనే ఆ నిజాన్ని అంగీకరిస్తూ మాట్లాడతారు. కొందరైతే, తాము మాట్లాడుతున్నదేమిటో సరిగ్గా తెలియకుండానే, తెలుసుకోవాలనే దృష్టి లేకుండానే, ఇక్కడా అక్కడా విన్న మాటలు వల్లిస్తూ, వాటి మీద మన సులో నిజమైన నమ్మకమూ ప్రేమా లేకుండానే, ఆ చెప్పేదాన్ని తమ జీవితంలో ఏ మాత్రమూ ఆచరించకుండానే, మీరన్నట్లు కేవలం 'ప్రజల్ని ఆకర్షించడం' కోసం మాత్రమే — మాట్లాడతారు. ఈ రకంగా, ఒక 'నిజాన్ని' అనేకమంది అనేక స్థాయిల్లో, అనేక వుద్దేశాలతో మాట్లాడ తారు. కాబట్టి, మాట్లాడే వాళ్ళల్లో ఎన్నో రకాల తేడాలు వుంటాయని గ్రహించి, ఆ సంగతి పక్కకి పెట్టెయ్యండి ఆ మాటల్లో వున్న 'నిజం' సంగతి మాత్రమే ఇప్పుడిది చూద్దాం.

మీ ప్రశ్నల్లో, ఆర్థిక అసమానతలు, ఆస్తులు, కోటీశ్వరుడు, మధ్య తరగతి ప్రజలు—అనే మాటలు వాడారుగానీ వాటికి వున్న నిజమైన అర్థాలు మీకు తెలియవు. "రాత్రింబవళ్ళూ నిద్రాహారాలు లేకుండా తమ తెలివితేటలతో ఎంతో కష్టపడే" వాళ్ళే కోటీశ్వరులవుతారనీ; సోమరిగా తిరిగేవాళ్ళు పేదవాళ్ళుగా వుండిపోతారనీ; అందుకే "ఆర్థిక అసమానతలు" ఏర్పడతాయనీ—అందరూ చిన్నతనం నించీ వింటూ వుండేదాన్నే మీరూ విన్నారు. కానీ, 'సత్యం' దానికి పూర్తిగా విరుద్ధం. అంటే, సోమరులే కోటీశ్వరులవుతారు. రాత్రింబవళ్ళూ నిద్రాహారాలు లేకుండా కష్టపడే వాళ్ళు నిరుపేదలవుతారు. ఆశ్చర్యంగా లేదూ?

'డబ్బు' అంటే 'శ్రమ'! ఎవరి దగ్గిరన్నా 1 రూపాయి వుందంటే, 'కొంత శ్రమ' వుందని అర్థం. ఆ శ్రమ ఆ వ్యక్తిదా, ఇతరులదా అనేది ఆ రూపాయిని చూస్తే తెలియదు. (ఈ విషయాలు ఇక్కడ ఈ పద్ధతిలో సరిగా అర్థంకావు.) శ్రమచేసే మనిషి దగ్గిర రోజూ ఎంత డబ్బువుండడం సాధ్యమవుతుందంటే—అతను రోజూ ఎంత శ్రమ చెయ్యడం సాధ్యమో అంత డబ్బు మాత్రమే. అది కూడా ఆ వ్యక్తి ఏ యజమాని దగ్గిరా పని చెయ్యని స్వతంత్ర శ్రామికుడైతేనే ఈ లెక్క. యజమాని దగ్గిర పనిచేసే వాడైతే అతని శ్రమంతా అతనికి రాదు. అంటే, స్వయంగా శ్రమచేసే మనిషి దగ్గిర, అతను రోజూ ఎంత శ్రమ చెయ్యగలడో అంతేగానీ, అంతకన్నా తక్కువగానీ వుంటుందిగానీ, అంతకన్నా ఎక్కువ శ్రమ వుండడం మాత్రం ఎప్పుడూ సాధ్యం కాదు. కాబట్టి, ఒక మనిషి దగ్గిర చాలా ఎక్కువ డబ్బు వుందంటే, అదంతా స్వంత శ్రమ ద్వారా వచ్చింది కాదని అర్థం. ఇతరుల శ్రమని తన సంచిలోకి రాబట్టే విధానం వల్ల మాత్రమే అది సాధ్యం. ఆ ఇతరుల శ్రమని రాబట్టే విధానంలో అయితే, 'ఒక మనిషి దగ్గిర ఇంత శ్రమే (ఇంత డబ్బే) పేరగలిగింది' అనే ప్రశ్నకు

వుండదు. ఆ శ్రమ ఇతరులనించి వచ్చేదే కాబట్టి ఒక యజమాని దగ్గర ఎంత శ్రమైనా పేరడం సాధ్యమే. (ఆ శ్రమరాశిలో అతని స్వంత శ్రమ కూడా కొంత వుంటే వుండవచ్చు. మిగిలినదంతా ఇతరులదే. పెద్ద పెట్టుబడిదారుల దగ్గరైతే స్వంత శ్రమ అనేది మచ్చుకైనా వుండదు.) 100మంది శ్రామికుల్ని పనిలో పెట్టే యజమాని, ఆ శ్రామికులు చేసే శ్రమ నించి రోజుకి 100 యూనిట్ల శ్రమని తన సంచిలో వేసుకోగలిగితే, ఆ యజమానే 'పెట్టుబడి'ని రెట్టింపుచేసి 200 మంది శ్రామికులతో పని చేయిస్తే రోజూ 200 యూనిట్ల శ్రమని సంచిలో వేసుకోగలడు. 500మందిని పెడితే 500 యూనిట్ల శ్రమని! పెట్టుబడిని ఎన్ని రెట్లు పెంచితే అన్ని రెట్ల శ్రమని! దానికి హద్దు వుండదు. కోటీశ్వరులూ, శత కోటీశ్వరులూ తయారయ్యేది ఈ విధంగానే! అందుకనే రాత్రింబవళ్ళు 'శ్రమించడం' వల్ల కాదు! "దానంతో తెలివితేటలతో" అన్నారే! ఆ 'తెలివితేటలు' ఇచ్చే వాళ్ళంతా కూడా శ్రామికులే. వాళ్ళు 'ఉన్నత మేధాశ్రమలు' చేసే శ్రామికులు. మొత్తంమీద యజమానులు కూడా మేనేజర్లుగానో, డైరెక్టర్లుగానో 'కష్టిస్తే', ఆ కష్టానికి, వాళ్ళు కూడా 'జీతాలు' తీసుకుంటారు. ఎంతెంత జీతాలంటే, వాళ్ళకి వాళ్ళే నిర్ణయించుకున్నంతంత జీతాలు! ఆ జీతాలు కాకుండానే పెట్టుబడి మీద వడ్డీ, కౌలూ, లాభం, వర్తక కమీషన్, వగైరా పేర్లతో అనేక ఆదాయాలు తీసుకుంటారు.

నిజంగా శ్రమ చేసేవాళ్ళ శ్రమలోనించే ఎంతో భాగం వాళ్ళకి రాకుండా పోగొడితే వాళ్ళకేం మిగులుతుంది? రోజుకి 10 గంటలు పనిచేసే వ్యవసాయ శ్రామికుడి దగ్గరకానీ, ఫ్యాక్టరీ శ్రామికుడి దగ్గరగానీ రోజూ ఎంత డబ్బు వుంటుంది? కుట్టు మనిషి దగ్గరా, నేత మనిషి దగ్గరా, బట్టలుతికే మనుషుల దగ్గరా, గనులు తవ్వే, రోడ్లు వూడ్చే మనుషులదగ్గరా ఎంతెంత డబ్బు వుంటుంది?

శ్రమకి ఎంత దగ్గిరగా ఉంటే అంత దరిద్రులుగానూ, ఎంత దూరంగా ఉంటే అంత కోటీశ్వరులుగానూ ఉండటం అనే సత్యం ప్రపంచంలో అందరికీ పూర్తిగా తలకిందులుగా కనపడుతూ ఉంటుంది. కోటీశ్వరులంతా కష్టజీవులనీ, నిరుపేదలంతా సోమరులనీ! 'నిరుపేదలంతా కష్టిస్తూనే ఉన్నారే! వాళ్ళ దగ్గిర ఎందుకు డబ్బు లేదు, ఎందుకు ఆస్తులు లేవు' అనే ప్రశ్న ఎవరికీ లేదు. ఆ నిరుపేదలకి కూడా లేదు. అందుకే "ప్రపంచం తల్లకిందులుగా ఉంది. దాన్ని తిన్నగా తిప్పాలి" అన్నాడు మార్క్సు. ఇప్పుడు చెప్పండి! భూస్వాముల భూముల్ని శ్రామికులంతా కలిసి స్వాధీనం చేసుకుని, అందరూ పంచుకుని, భూస్వామి కుటుంబానికి కూడా కొంత భూమి ఇచ్చి "మీ భూమిని మీ కుటుంబ సభ్యుల శ్రమతోనే పండించుకోండి" అంటే, దానివల్ల అందరూ శ్రమలోకి వస్తారు. ఒకరి శ్రమని ఒకరు తినరు. దీనితో మీరు ఏకీభవిస్తారా, లేదా ? (కొంతకాలం తర్వాత, ఆ భూముల్ని సమిష్టి సేద్యంగా ఏర్పరచవలసి వుంటుంది. అది తర్వాత సంగతి). "ఆస్తుల్ని జాతీయం చెయ్యాల"ని ఉపన్యాసాలిచ్చావన్నారే! "జాతీయం చెయ్యడానికి" రకరకాల అర్థాలు ఉన్నాయి. అందరూ శ్రమలోకి రావాలనే దృష్టిలేకుండా, కేవలం ఆ ఆస్తులు "ప్రభుత్వ ఆధీనంలోకి వెళ్ళాలి" అనే దృష్టితోనే చాలామంది మాట్లాడతారు. పెట్టుబడిదార్ల గ్రూపులమధ్య తగవుల వల్ల కూడా ఒక గ్రూపు ఆస్తుల్ని జాతీయం చెయ్యాలని ఇంకో గ్రూపు వాళ్ళు అలా మాట్లాడతారు.కాబట్టి, జాతీయం చెయ్యాలనడంలో రకరకాల అర్థాలున్నాయి.

* * *

డి. రాములు, ఏలూరు.

ప్ర : ఆమధ్య ఒక దినపత్రికలో "తూర్పు యూరప్ పరిణామాలు – పాఠం" అను వ్యాసంలో రచయిత మార్క్సిజం మీద ఈ విధంగా

రాశాడు — "మార్క్సు మొదలు ఇప్పటివారినుంచి నేటివరకు వెలువడిన ప్రధానమైన పాఠాలలో ఒకటి — మార్క్సిజం లోపభూయిష్టం, అసమగ్రం అన్నది — మార్క్సిస్టు సిద్ధాంతం మానవ చరిత్రలోని అన్ని కోణాలను, సర్వతోముఖమైన అభివృద్ధిని వివరించలేకపోయిందని. సర్వవ్యాపితమైన సిద్ధాంతంగా దానిని నమ్ముకోవడమే దాని పతనానికి కారణమని మార్క్స్ అనుయాయులకు తప్ప మిగిలిన అందరికీ మొదటినుంచి స్పష్టమవుతూనే వచ్చింది. ఎంత ఉత్తమ సిద్ధాంతాలైనప్పటికీ సమస్త విషయాలను వివరించలేవన్న నిరహంకార దృష్టి లోపించడమే మార్క్సిస్టుల తలబిరుసుతనానికి చెరగని గుర్తు" — అంటూ విమర్శించాడు. ఇటువంటివి చదవడానికి చాలా బాధ కలుగుతున్నది. ఈ విమర్శను ఖండించాలని అనిపిస్తున్నా — నేనింకా మార్క్సిజంలో 'ఓనమాల్లో' వున్నవాడిని. ఇటువంటి విమర్శలను ఏ విధంగా అర్థం చేసుకోవాలో తెల్పండి.

జ : ఆ రచయిత, తన వ్యాసం రాసిన 'కాలం'లోనే కాలం ఆగిపోతున్నదనుకున్నట్టుంది. ఒక రచయితేమిటి, ఒక పత్రికేమిటి. దోపిడీని మరిగిన వర్గమూ దాన్ని సమర్థించేవారూ ప్రపంచమంతా ఆనందోత్సాహాలతో కేరింతలు కొడుతున్నారు. వాళ్ళు ఆనందపడకపోతే ఆశ్చర్యంగానీ, ఆనందపడుతున్నారంటే ఆశ్చర్యం ఏముంది? పోరాటంలో వాళ్ళు చాలా బలంగా వున్నారు. కాబట్టి చాలా ఆనందంగా వున్నారు. తమ బలాన్ని చూసుకుని 'మేమే కరెక్టు' అనుకుంటున్నారు. దోపిడీని వ్యతిరేకించే సిద్ధాంతం లోపభూయిష్టమూ, అసమగ్రమూ అయితే దోపిడీయే లోప రహితమూ, సమగ్రమూ అన్నమాట! 'మార్క్స్ అనుయాయులు' నిజంగా మార్క్స్ అనుయాయులుగానే వుంటే, దోపిడీమీద మార్క్సిస్టు పద్ధతిలో పోరాటం చేసిననాడు అద్భుతమైన ఫలితాలే చూశారు. లెనిన్ కాలంనాటి విప్లవ ప్రారంభాన్నీ, మావో కాలంనాటి కొన్ని ముందడుగుల్నీ గుర్తు

తెచ్చుకునే ధైర్యం మన మేధావి రచయితకి లేకపోయి వుండాలి. మార్క్సు అనుయాయులు మార్క్సిజాన్ని వదిలిపెట్టిన తర్వాతే, అసత్యాల పరంపర ప్రారంభమైంది.

మార్క్సిజం సరైన సిద్ధాంతం కాదని మార్క్సు అనుయాయులకు తప్ప మిగిలిన అందరికీ మొదటినుంచీ స్పష్టమవుతూనే వచ్చిందంటున్నారు రచయిత. మార్క్సు అనుయాయులు కానివాళ్ళు 'పెట్టుబడి' అనుయాయులే కదా? వాళ్ళు "మార్క్సిజం సరైంది కాదు, మా దోపిడీయే సరైంది" అని మొదటినించీనేకాదు, వాళ్ళ నమ్మకాల ప్రకారం, వెనక జన్మలనించీ కూడా నమ్ముతూ వుంటారు. వాళ్ళ 'ప్రయోజనాలకు' కావలసినదాన్ని వాళ్ళు నమ్మరూ?

"ఎంత ఉత్తమ సిద్ధాంతాలైనప్పటికీ సమస్త విషయాలనూ వివరించ లేవు" అని, ఒక మహా సత్యం ప్రకటించాననుకుంటున్నాడు రచయిత. 'మార్క్సిజం' గురించి మాట్లాడుతూ "ఎంత ఉత్తమ సిద్ధాంతాలైనప్పటికీ" అనడం అంటే మార్క్సిజాన్ని 'ఉత్తమ' సిద్ధాంతంగా చెప్పడం కాదా? మార్క్సిజం, దేనికన్నా ఉత్తమ సిద్ధాంతం? పెట్టుబడిదారీ సిద్ధాంతం కన్నా ఉత్తమ సిద్ధాంతం. మరి ఇక మార్క్సిజం మీద విమర్శ ఎందుకు? ఒక పక్క దాన్ని 'ఉత్తమ' సిద్ధాంతంగా ఒప్పుకుంటూనే మళ్ళీ దానికన్నా తక్కువ సిద్ధాంతాన్నే ఎందుకు ఆశ్రయిస్తున్నట్టు? "మార్క్సిజం 'సమస్త' విషయాలనూ వివరించగలద"నటంలో మార్క్సిజం తెలిసినవాళ్ళకేమీ సందేహం లేదు. అయినా 'సమస్త విషయాల సంగతి' ఇప్పుడెందుకు? 'దోపిడీ'ని వివరించే సంగతి ఒక్కటీ ఇప్పుడు చాలు! దోపిడీ అంటే ఏమిటో, ధనికులూ పేదలూ ఎందుకు ఉన్నారో, యజమానులూ సేవకులూ ఎందుకు వున్నారో, మార్క్సిజం అద్భుతంగా వివరించగలదు! మార్క్సు

అను యాయులకు అది చాలు! దోపిడీదార్ల గుండెల్లో రైళ్ళు పరిగెత్తడానికి అది చాలు! 'సమస్త' విషయాల సంగతి ఎవడికొక్కాలి?

1990 లో ఒక తేదీనాడు ఒక వ్యాసం రాసే రచయితకి, ఆ తేదీ ఒక్కటే శాశ్వత సత్యంగా కనపడితే లాభంలేదు. ఆ తేదీకన్నా వెనక కాలం వర్గపోరాటాలతో గడిచింది. ఆ తేదీ తర్వాతకాలం కూడా వర్గపోరాటాలతో గడపబోతోంది. మానవ సమాజంలో శత్రు వైరుధ్యాలు నశించే వరకూ, శ్రమ చెయ్యని సోమరి వర్గం 'శ్రమ' మీంచి మోకరిల్లే వరకూ, ముగింపు లేకుండా వర్గ పోరాటాలు జరగబోతాయి. త్వరగా కాకపోతే ఆలస్యంగానైనా అది జరిగి తీరుతుంది. దానికి రుజువేమిటంటే — ఏరీ ఇప్పుడు వెనకటి కాలపు బానిస యజమానులందరూ? బానిసల్ని సింహాల బోనుల్లోకి తోసి వినోదించిన ప్రభువులు ఏరీ ఇప్పుడు? ఏరీ 'వెనకటి రకపు' రాజులూ, చక్రవర్తులూ ఇప్పుడు? వారి సింహాసనాలూ, వారి ఏక చ్ఛత్రాధిపత్యాలూ, వారి ఏక వంశ పాలనలూ ఏవీ ఇప్పుడు? ఇక, ఈ పెట్టుబడిదారీ ప్రభువులూ, వారి బంటు రచయితలూ శాశ్వతులు? వారి 'సరుకు' ఉత్పత్తులూ, వారి గొంతులు కోసుకునే పోటీలూ, వారి నర్తకాలూ, వారు సృష్టించే నిరుద్యోగాలూ, సంక్షోభాలూ, యుద్ధాలూ—ఇదేనా 'మార్క్సిజం' కన్నా సమగ్రమైన, లోపరహితమైన, సర్వతోముఖాభివృద్ధినీయగల సిద్ధాంతం? ఇదేనా, మానవులు నిర్మించుకోవలసిన శాశ్వత సుందర సమాజం?

మార్క్సిజాన్ని అంగీకరిస్తూ, ఆ బాటలో సమసమాజాన్ని నిర్మించాలని కలలు కంటున్నవారికి 'పెట్టుబడిదారీ నవ్వులు' చూసి బాధ కలగడం సహజమే. కానీ, ఆ అవమానాలన్నీ మార్క్సిస్టులు చేతులారా తెచ్చుకున్నవే. వాళ్ళ సిద్ధాంతమేమిటో వాళ్ళకే తెలియని మూర్ఖులుగా ఉన్న వాళ్ళకి అవమానాలుగాక ఏం దొరుకుతాయి? 'ఈ పరిస్థితి ఎందుకు వచ్చింది,

ఎక్కడ తప్పు చేశాం' అనే ప్రశ్నలు మార్క్సిస్టులకు కలిగితే. 'మార్క్సిజాన్ని అంగీకరిస్తున్నామ'ని మనసుల్లో అనుకోడానికైనా వాళ్ళకి అర్హత వుండదు.

* * *

శి. కనకమ్మ, వెంగుటూరు.

ప్ర: 'శాంతి పరుగు' అని శాంతి కోసం రోడ్ల మీద పరుగులు తీశారని చదివాను. (ఏ పత్రికలో చదివానో గుర్తులేదు) ఈ పరుగుల అర్థమేమిటి ?

జ: సమస్యలకు వుండే నిజమైన పరిష్కార మార్గం నుంచి దూరంగా పరిగెత్తడం అన్నమాట అది ! పరుగులతో శాంతి వస్తుందా అని సందేహం రాలేదా మీకు ?

* * *

[illegible], ఒంగోలు.

ప్ర: "....రామ జన్మభూమి - బాబ్రీ మసీదు ప్రాంతంలో తగాదా పడడానికి అవకాశమిచ్చే ప్రదేశాన్ని మూసేస్తూ ఎప్పుడూ ప్రవేశించడానికి వీలులేని నిషిద్ధ ప్రాంతంగా ప్రకటించాలి. దాని చుట్టూ విద్యుత్ కంచె వెయ్యాలి. దాని పరిరక్షణకు ప్రత్యేక సాయుధ సిబ్బందిని నియమించాలి. అదే దానికి పరిష్కార మార్గం. తాత్కాలికమూ, శాశ్వతమూ కూడా అదే" అని ఒక పత్రికలో చదివాను. ఇలా అయితే ఈ సమస్య పరిష్కారమైనట్టేనంటారా ?

జ: సమస్య పరిష్కారమై పోయిందంటే, ఇంకా కరెంట్ ఫెన్సింగులూ, పోలీసు కాపలాలూ ఎందుకు ? అవన్నీ వుండవలసివస్తే సమస్య సజీవంగా వున్నట్టే కదా ? కలహం లేకుండా పోతేనే అది సరైన పరిష్కారం.

* * *

నందిగాం మురళీమోహన్, నరసన్న పేట.

ప్ర : ఏ నాయకుడొచ్చినా ప్రజలకు ఒరిగేదేమీలేదు. ఓటు విలువని దుర్వినియోగ పర్చడం ఇష్టంలేక ఎవరో ఒకరికి ఓటు వెయ్యక తప్పడం లేదు. అలాంటప్పుడు ఎన్నిక లెందుకు? ప్రజాధనాన్ని దుర్వినియోగం చెయ్యటమెందుకు?

జ : ఏ నాయకుడొచ్చినా ప్రజలకు ఒరిగేదేమీ వుండదని మీరే చెపుతున్నారు. ఓటు విలువని దుర్వినియోగం చెయ్యడమెందుకని ఓటు వేస్తున్నామంటున్నారు. 'ప్రజలకోసం ఏమీ చెయ్యని' నాయకులని తెలిసి కూడా అలాంటి వాళ్ళకే ఓట్లు ఇస్తే, అంతకన్నా ఓటుని దుర్వినియోగం చెయ్యడం ఏముంటుంది? అలాంటప్పుడు దుర్వినియోగం అంటే ఓట్లు వెయ్యకుండా మానడం కాదు, వెయ్యడమే దుర్వినియోగం. ఈ ఎన్నిక లెందుకు అంటున్నారుకదా? ఈ ఎన్నికలు మీ కోసమో ప్రజలకోసమో కాదు. వాళ్ళకోసం! ప్రజాధనం దుర్వినియోగం సంగతా? అది ప్రజలకు దుర్వినియోగం అయితే, ప్రజలకోసం ఏమీ చెయ్యని ప్రజా వ్యతిరేకులకు అది సద్వినియోగమే కదా?

* * *

రమాకాంతారావు, పెనుగొండ.

ప్ర : సిరజాడ పెన్సిల్‌తో రాసేవారట. ఆ రాసినవి ఈనాటికీ చెరిగిపోకుండా వున్నాయట. ఇప్పటి పెన్సిళ్ళు సరిగ్గా రాయవు. బాల్ పెన్నులు కూడా రాయవు. సాంకేతిక నైపుణ్యం పెరగాలిగాని తగ్గిందేమిటి?

జ : సాంకేతిక నైపుణ్యం అద్భుతంగానే వుంది. నైపుణ్యం తెలియక కాదు. నైపుణ్యం పెరగకపోయినా పాతనైపుణ్యం అయినా వుండాలి కదా? కాబట్టి విషయం అది కాదు. ఉత్పత్తిలో కత్తి పద్ధతులు

పెరిగిపోయాయి. ఎంత సాంకేతిక విషయాలు తెలిసినా 'లాభాల'కోసం వాటిని కల్తీ చేసేస్తోంటే నైపుణ్యం తెలిసి ఏం ప్రయోజనం ?

* * *

న్యాయపతి రమేష్‌బాబు, హైదరాబాద్.

ప్ర : తమ్ముడికి కావలసిన భూమి - డబ్బు సరిగా ఇవ్వక అన్యాయం చేస్తున్న అన్నకి భగవంతుడు అండగా వుండి రక్షిస్తున్నాడు. ఇదేం న్యాయం ?

జ : భగవంతుడు లేడు కాబట్టి, లేని భగవంతుడు అన్నకీ అండగా వుండడు, తమ్ముడికీ అండగా వుండడు. న్యాయాన్యాయాలన్నీ సామాజిక మైన పరిస్థితులవల్లనే ఏర్పడతాయి. మీ సమస్యలోకి 'ఎక్కడా లేని' భగవంతుణ్ణి ఇరికించడం ఎందుకు ?

* * *

పేరు లేదు, కంభంపాడు.

ప్ర : జీవితంలో నృత్యం ఎందుకు ఉపయోగపడుతుందండీ ?

జ : జీవితంలో కళలన్నీ ఎందుకు ఉపయోగపడతాయో నృత్యం కూడా అందుకే. నృత్యం కూడా ఒక కళ. జీవితంలో నేర్చుకోవలసిన విషయాల్ని రచనల ద్వారా చెప్పుకున్నట్టే సంగీత నృత్యాల ద్వారా కూడా చెప్పుకుంటాము. కళలు లేని జీవితం జంతుత్వంతో సమానం కదా?

* * *

పి. పద్మజ, హైదరాబాదు.

ప్ర : 'నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి. ఏ కన్నీ రెనకాల ఏముందో తెలుసునా' అనే పంక్తుల్లో గొప్ప భావన వుందంటారు. అది నాకు అర్థం కాదు. దాని గొప్పతనమేమిటో మీరు వివరించాలని కోరుతున్నాను.

జ : నా అభిప్రాయమైతే అందులో గొప్ప అర్థమేమీ లేదు. 'ఏ కన్నీరెనకాల ఏముందో' చక్కగానే తెలుస్తుంది. నవ్వే మొహం, ఏడ్చే మొహం ఒక్కలాగే వుండవు. మొహాన్ని చూడకుండా కన్నీళ్ళని విడదీసిచూడడం కాబట్టి ఏ కన్నీరెనకాల ఏముందో స్పష్టంగానే తెలుస్తుంది. ఈ రకం వంకర టింకర సెంటిమెంటల్ పాటలే చాలామందికి నచ్చుతూ వుంటాయి. చెప్పే విషయం అర్థరహితంగా వున్నకొద్దీ, అందులో ఏదో గొప్పతనం వున్నట్టు విచిత్రమైన అర్థాలు చెపుతూ వుంటారు.

బల్లి ఏడుకొండలు, తాళ్ళమ్మ సీత.

ప్ర : బాతు, గ్రుడ్లు పెట్టుతుంది. కానీ, పొదగడం తెలియదు. అదే విధముగా మన దేశంలో ఎందరో మహానుభావులు స్వాతంత్ర్యము తెచ్చి నారు. కానీ, వారికి దేశమును పరిపాలించుట తెలియదు. కారణము ?

జ : ఏ పక్షి అయినా తన గ్రుడ్లని తను పొదగకపోతే, అది ప్రకృతి సహజమైన విషయం. అందులో ఆ పక్షి తప్పేమీ ఉండదు. పొదిగే పక్షులన్నీ మంచివీ, పొదగని పక్షులు చెడ్డవీ కావు. ప్రకృతి సహజ ధర్మాల్లో మంచి చెడ్డలు వుండవు. కానీ స్వాతంత్ర్యం తేవడం, దేశాన్ని పరిపాలించడం-లాంటి విషయాలు అలాంటివి కావు. ఇవి 'సామాజికమైన' విషయాలు. దేశంలో మహానుభావులు స్వాతంత్ర్యం తెచ్చినారు - అన్నారు. మళ్ళీ ఆ మహానుభావులకే దేశాన్ని పరిపాలించడం తెలియదు - అంటున్నారు. ఈ రెంటికీ ఎలా సరిపోతుంది ? ప్రజలకోసం స్వాతంత్ర్యం తేవడం తెలిసినవారికి, అది ప్రజలకు అందేవిధంగా పరిపా లించడం తెలియకుండా ఎలా వుంటుంది ? కాబట్టి 'స్వాతంత్ర్యం' అనే మాటకి మీ దృష్టిలో వున్న అర్థం మార్చుకుంటే సరిపోతుందేమో

చూడండి. ప్రజల స్వాతంత్ర్యంగా కనబడుతున్నది నిజానికి ప్రజల స్వాతంత్ర్యం కాదనీ, అది పరిపాలకుల స్వాతంత్ర్యమనీ, తెల్లవారల చేతుల్లో అధికారం నల్లవార చేతుల్లోకిమారడం మాత్రమే జరిగిందనీ అర్థం చేసుకుని చూడండి. అప్పుడు అంతా సరిపోతుంది. తమకు ఎలాంటి సుఖ శాంతులూ ఎలాంటి స్వాతంత్ర్యాలూ వుండాలో పాలకులకు చక్కగానే తెలుసు. అంతే కాదు. ప్రజలకు ఎలాంటి సుఖ శాంతులూ స్వాతంత్ర్యాలూ వుండకూడదో కూడా వారికి తెలుసు. ఇవన్నీ తెలియనిది ప్రజలకే. అందుకే పాలకులు తమ స్వాతంత్ర్యాన్నే అందరి స్వాతంత్ర్యంగా నమ్మించ గలుగుతూ వున్నారు. కాబట్టి స్వాతంత్ర్యమూ, పరిపాలనా అనేవి వేరు వేరు వర్గ ప్రయోజనాలకు తగిన స్వభావాలతో వుంటాయని అర్థం చేసు కుంటే స్వాతంత్ర్యం తెచ్చిన మహానుభావులకు దేశాన్ని పరిపాలించడం 'తెలియకపోవడానికి' కారణమేమిటో అందుతుంది.

*　　　*　　　*

టి. రవీందర్ రెడ్డి, వరంగల్.

ప్ర: పాశ్చాత్యులు కనిపెట్టిన పరికరాలు వాడతారు కాని వారి నాగరి కతను ఎవరైనా అనుసరిస్తే ఏహ్యాభావంతో చూస్తారెందుకండీ ?

జ: 'నాగరికత' అంటే నూతన పరికరాలూ, నూతన వేష భాషలూ, నూతన భావాలూ అన్నీ కలిసిన మొత్తమే. అందులో 'పరికరాల్ని' వాడ తారు గానీ వేషభాషల్ని ఏహ్య భావంతో చూస్తారెందుకని మీ ప్రశ్న అను కుంటాను. పరికరాల వల్ల కొన్ని రకాల సౌకర్యాలు కలుగుతాయి. కాబట్టి వాటిని ఇష్టపడతారు. వేషభాషలు 'పరాయివి'గా వుంటాయి కాబట్టి వాటిని ఇష్టపడరు. కానీ పరాయి వేషభాషలమీద పూర్తిగా ఏహ్య భావం వుందనుకోవడం కూడా కరెక్టు కాదు ఇంగ్లీషు భాష అంటే తీవ్రమైన ఆకర్షణ లేదూ? అలాగే ఇంగ్లీషు పద్ధతిలో బట్టలు వేసుకోవడం

(పేంటులా, షర్టులా వేసుకోవడం) పూర్తిగా అలవాటై పోలేదా? కాబట్టి 'పాశ్చాత్యుల నాగరికత' మీద పూర్తిగా ఏహ్య భావం వుంచుకోవడం కరెక్టు కాదు.

*　　　　*　　　　*

కొండల అప్పారావు, కంచరపాలెం. (వైజాగ్)

ప్ర : ఈ రోజుల్లో కట్నం తీసుకోకుండా వివాహం చేసుకోవాలనుకుంటే, కట్నం వద్దు అంటున్నారంటే వాళ్ళకేదో శారీరక లోపం వుందనుకుంటున్నారు. అలాంటి అపోహలు పొందడం కన్నా కట్నం తీసుకోవడమే మేలు కదా?

జ: కట్నం తీసుకోనంటే ఏం "అపార్థాలు" రావచ్చో మీరు చెప్తున్నారు. కట్నం తీసుకోకపోవడం అంటే ఇంత కట్నం కావాలని పీడించకూడదని అర్థం గానీ, వాళ్ళ అమ్మాయికి వాళ్ళు ఏమీ ఇచ్చుకో కూడదని అర్థం కాదు. సాధారణంగా అమ్మాయి తరఫు వాళ్ళు మేము ఇంత ఇవ్వగలం అని చెప్తారు. "మీ ఇష్టం. మీ అమ్మాయికి మీరు ఎంత ఇవ్వగలరో అది ఆమెకు ఇచ్చుకోండి" అని అబ్బాయి తరఫు వాళ్ళు అంటే, దానికి అమ్మాయి తరఫు వాళ్ళు అంగీకరించరా? "అలా లాభం లేదు. ఇచ్చేదంతా మీకే ఇస్తాం. మీ చేతుల్లోనే పెడతాం. మీరు తీసుకోకపోతే పెళ్ళి కాదు" అంటారా? కట్నాలు తీసుకోవడాన్ని సమర్థించుకోవాలనే తాపత్రయం తప్ప "మీరిచ్చేది మీ అమ్మాయికి ఇచ్చుకోండి" అనడంలో కూడా సమస్య వుందని వాదించడంలో ఇంకో అర్థమేమీ లేదు.

*　　　　*　　　　*

కె. కమల, అమలాపురం.

ప్ర : మనదేశంలో సమస్యల గురించి మాట్లాడక రష్యా చైనాలు అంటారెందుకండి?

జ : సమస్యల స్వభావం ప్రపంచమంతటా ఒక్కటే. 'సమస్యల్ని' పరిష్కరించే ప్రయత్నాలు రష్యా చైనాల్లో ప్రారంభించారు గనక, ప్రపంచం దృష్టి అటే వుంటుంది. 'పేదతనాన్ని' తీసుకోండి. ఈ సమస్యని పరిష్కరించే ప్రయత్నం రష్యా చైనాల్లోనే వర్గపోరాటం ద్వారా ప్రారంభమైంది. అక్కడ శ్రామిక వర్గానికి అనుకూలమైన మంచి మార్పులు జరుగుతూవుంటే ప్రపంచ శ్రామిక వర్గం సంతోషిస్తుంది; దాని వ్యతిరేక వర్గం విచారిస్తుంది. లేదా, అక్కడ మంచి మార్పులు ఆగిపోతే మొదటి వర్గం విచారిస్తుంది, రెండోవర్గం సంతోషిస్తుంది. కాబట్టి, రష్యా చైనాల్లో మార్పుల గురించి మాట్లాడితే, ఇక్కడి సమస్యల గురించి మాట్లాడుతోన్నట్టే లెక్క. ఇక్కడ ప్రత్యేక సమస్యలేవీ లేవని కాని అర్థంకాదు.

* * *

మోహన్, ఏలూరు.

ప్ర : ఆదిమ సమాజంలో వర్గాలు లేవని మనకి తెలుసు. ఆదిమ సమాజంలో వర్గాలు ఏర్పడి అది బానిస సమాజంగా మారింది. ఆదిమ సమాజం కన్నా, బానిస సమాజం అభివృద్ధి చెందిన సమాజం. విరుద్ధాంశాల మధ్య ఘర్షణే అభివృద్ధికి మూలం అంటారు. ఆదిమ సమాజంలో విరుద్ధాంశాలు లేవు కదా? (వర్గాలు లేవు కదా?) మరి, అది బానిస సమాజంగా ఎలా మారింది?

జ : 'ఆదిమ సమాజం'లో, 'శ్రమ దోపిడీ' లేనికాలంలో కూడా, అంటే 'వర్గాలు' లేని కాలంలో కూడా, శత్రు వైరుధ్యాలు వున్నాయి. ఎలాగంటే, ఆటవిక కాలంలో వేరువేరు తెగల మధ్య కొట్లాటలు వుండేవి. పళ్ళ చెట్లూ, నీళ్ళ మడుగులూ, అడవి జంతువులూ, సురక్షిత స్థలాలూ వంటి ప్రకృతి వనరుల కోసం జరిగిన కొట్లాటలు అవి. గెలిచిన తెగ మనుషులు, ఓడిపోయి పట్టుబడిన రెండో తెగ మనుషుల్ని చంపివెయ్యడమో,

తమ తెగలో చేర్చుకోవడమో చేసేవారు. తర్వాత కాలంలో ఆ రెండు పద్ధతులా మానేసి, రెండో తెగ మనుషుల్ని 'బానిసలు'గా చేసుకోవడం ప్రారంభించారు. ఒక మనిషి, తన శ్రమతో, తను జీవించడానికి కావలసిన కనీస పుత్పత్తుల కన్నా ఎంతో కొంత 'అదనాన్ని' పుత్పత్తి చెయ్యగలిగే విధంగా పుత్పత్తి శక్తులు అభివృద్ధి చెందినప్పుడు మాత్రమే 'బానిస విధానం' సాధ్యమవుతుంది. అందుకే, సమాజంలో బానిస విధానం ప్రారంభం కావడానికి కూడా కొంత కాలం పట్టింది గానీ, మానవులు ఆటవిక దశలో వున్నప్పటి నించే అది ప్రారంభం కాలేదు. ఆనాటి పరిస్థితుల్లో ఒక్క తెగనే తీసుకుంటే, ఆ తెగలో మనుషుల మధ్య వుండే వైరుధ్యాలు మిత్ర వైరుధ్యాలు. వేరు వేరు తెగల మధ్య వుండే వైరుధ్యాలు శతృ వైరుధ్యాలు. వేరు వేరు తెగలు వుండడం అంటే వర్గాలు వుండడం కాదు. వర్గాలు లేకుండానే వేరు వేరు తెగల మధ్య శతృత్వ పరిస్థితులు వున్నాయి. ఆ 'శత్రుత్వం' అనే 'అంతర్గత పరిస్థితి'కి, పుత్పత్తి శక్తులు అదనాన్ని ఇవ్వగల స్థాయికి పెరగడం అనే 'బాహ్య పరిస్థితి' కూడా కలిసి నప్పుడు, శ్రమదోపిడీకి అవకాశమిచ్చే బానిస విధానం ప్రారంభమైంది.

* * *

గి. రామలక్ష్మి, నర్సీపట్నం.

ప్ర : ప్రశ్న అడిగినా వర్గాల దగ్గిరికి తీసుకుపోతున్నారే మీరు!

జ : ఏ ప్రశ్నకైనా జవాబు అక్కడే వుంది గనక.

* * *

తుమ్మల మోహన్, బ్రాహ్మణపల్లె.

ప్ర : 'వ్యక్తిగత ఆస్తి' లేనపుడు పనిలో శ్రద్ధ తగ్గి, తద్వారా పుత్పత్తి తగ్గి, దేశానికి నష్టం కదా? దేశమంతా ఇప్పటి సోకాల్డ్ ప్రభుత్వ కార్యాలయాల్లా తయారవదా?

జ : ఇప్పుడు ఒక కార్మికుడు, భూస్వామి పొలంలో గానీ, పెట్టుబడి దారుడి ఫ్యాక్టరీలోగాని పనిచేస్తున్నాడంటే ఆ ఆస్తి అతని స్వంతనిది కాబట్టే పని చేస్తున్నాడా? అతని వ్యక్తిగత ఆస్తి కాని దాంట్లో కూడా ఎందుకు పనిచేస్తున్నాడు? ఏ పనివాడైనా పని స్థలంలోకి రాగానే పనిలోకి దిగుతున్నాడా, కుర్చీఎక్కి కూర్చుంటున్నాడా? తన స్వంతంకానిదీ, పరాయి వాళ్ళదీ అయిన ఆస్తిలో కూడా పనిచేస్తోన్న వ్యక్తి, 'సమిష్టి ఆస్తి'లో పనిచెయ్యడా? పరాయివాళ్ళ ఆస్తిలో 'జీతం' కోసం పనిచేస్తే, 'సమిష్టి ఆస్తి విధానం'లో కూడా జీతం తీసుకునే ఏర్పాటు వుండదనుకుంటున్నారా? 'జీతం' అంటే ఏమిటనుకుంటున్నారు? శ్రామికుడు వుత్పత్తి చేసిన విలువలో కొంత భాగమే-జీతం. మిగిలినది 'యజమాని'కి! 'సమిష్టి ఆస్తి విధానం'లో అయితే ఆ యజమాని కూడా తన కోసం కావలసిన పని తను చేస్తాడు కాబట్టి ఒకరు యజమానీ, మిగిలినవాళ్ళు ఆ యజమాని చేతిలో వుండే కార్మికులూ అవరు. అందరూ ఒకటే. అందరూ శ్రమచేసి ఎవరి శ్రమకు వాళ్ళు జీతాలు తీసుకొంటూ వుంటారు. అందరూ శ్రమచేస్తారు కాబట్టి, అందరూ కలిసి సమిష్టి వుత్పత్తి కార్యక్రమాల్ని ఎలా నిర్వహించుకోవాలో చర్చలు జరుపుకుంటూ, క్రమక్రమంగా సరైన పద్ధతులు గ్రహిస్తారు. అయితే, జరగవలసిన మార్పు అంతేకాదు. 'జీతాల పద్ధతి'ని కూడా పూర్తిగా తీసివెయ్యాలి. మానవ సంబంధాలు ఇంకా అసహజంగానూ, అవమానంగానూ వున్నాయనడానికి గుర్తు జీతాల పద్ధతి. అందరూ 'శ్రమ' చేసినా, ఆ చేసే శ్రమ 'అసమానంగా' వున్నంత కాలమూ జీతాల పద్ధతిని వదిలి వెయ్యడం సాధ్యం కాదు. ప్రతీ మనిషీ ఏదో 'ఒక్క శ్రమే' చెయ్యడం గాక, కొన్ని శరీరక శ్రమలూ, కొన్ని మేధాశ్రమలూ చేసే విధానం ఏర్పడి స్థిరపడిపోతే ఏ ఇద్దరు మనుషులు చేసే శ్రమ మొత్తమైనా ఒకే విలువతో వుంటుంది కాబట్టి, అలాంటి సమాన పరిస్థితుల్లో జీతాల

పద్ధతిని తీసివెయ్యడం సాధ్యమవుతుంది. మనుషులు 'సమానులయ్యే' భౌతిక పరిస్థితిని ఏర్పరచుకుని అప్పుడు జీతాల పద్ధతిని వదిలివేస్తే 'వేతన శ్రమ బానిసత్వాన్ని' వదిలివేసే క్రమంలో చివరి అంశం కూడా పూర్తి అవుతుంది. ఈ రకంగా, అందరూ 'శ్రమ'లోకి దిగి 'సమిష్టి' జీవిత విధానానికి సంబంధించిన సరైన జ్ఞానం అలవర్చుకుంటూ వుంటే, ప్రతీ మనిషీ, "పనిచెయ్యడాన్ని" తన బాధ్యతగానూ, ఆత్మగౌరవంగానూ భావిస్తాడు.

దోపిడీ మరిగి శ్రమపడకుండా విలాసాలతో జీవించేవాళ్ళే, 'సమిష్టి ఆస్తి విధానం' మీద రకరకాల తప్పుడు వాదాలు చేస్తూ వుంటారు. "స్వంతాస్తి లేకపోతే పని చెయ్యాలనే శ్రద్ధేం వుంటుంది?" అంటారు. అదే నిజమనుకోవడం వల్లే మీరీ ప్రశ్న అడిగారు. స్వంతాస్తి వున్న భూస్వామి, (పరిశ్రమల యజమానులు కూడా) 'శ్రద్ధగా' పని చెయ్యడం మాట అలా వుంచి, అసలు పనే చెయ్యడం లేదేం? స్వంతాస్తి వున్న భూస్వామికి పనిమీద 'శ్రద్ధ' ఎందుకు లేదు? పనిచెయ్యకుండానే పంటల్ని స్వాధీనపరచుకునే విధానం వుంది కాబట్టే భూస్వామి పనిచెయ్యడు. స్వంతానికి బారెడు భూమి లేనివాళ్ళే భూస్వామి భూమిలోకి దిగి పంటలు పండించి, అందులో కొంత భాగాన్ని తమ జీతాలుగా పొంది, మిగిలిన దాన్ని భూస్వామి ఇంట్లో పోస్తారు. అంటే 'స్వంతాస్తి' వున్నవాళ్ళే పని చెయ్యరనీ, అది లేనివాళ్ళు పనిచేస్తారనీ తేలడం లేదూ? వాస్తవం ఇలా వుండగా 'పనివాళ్ళు శ్రద్ధగా పనిచెయ్యరు' అనే రకం మాటలు మాట్లాడే వాళ్ళు, 'భూస్వామి పని చెయ్యడేం?' అని ప్రశ్న ఎందుకు వేసుకోలేక పోతున్నారు? పనివాళ్ళమీద అసంతృప్తితో మాట్లాడే వాళ్ళంతా ఎవరి తరుపున మాట్లాడుతున్నట్టు? పనివాళ్ళ శ్రమని దోచుకునే యజమానుల తరుపున మాట్లాడుతున్నట్టు పనివాళ్ళు నిజంగా ఇంకా శ్రద్ధగా

పనిచేస్తే ఏం జరుగుతుంది? ఉత్పత్తి పెరుగుతుంది. పెరిగిన ఉత్పత్తి ఏమౌతుంది? అది కూడా భూస్వామికి పోయే భాగంలోకే చేరుతుంది. ఉత్పత్తి తక్కువైనా ఎక్కువైనా దాని కోసం పనిచేసిన వాళ్ళకి ఒరిగేదేమిటి? ఒక శ్రామికుడు తన శ్రమతో 10 విలువగల ఉత్పత్తి చేసి, అందులో 2 విలువని తన జీతంగా పొంది మిగిలిన 8 ని యజమాని కోసం పోగొట్టుకుంటున్నాడనుకుందాం. ఆ శ్రామికుడే ఇంకా ఎక్కువ శ్రద్ధగా పనిచేసి 12 విలువని ఉత్పత్తిచేసి అందులోనించి కూడా 2నే జీతంగా తీసుకుంటే, యజమానికి పోయే భాగం 10 అవుతుంది. అంటే, శ్రామికుడు ఎక్కువ శ్రద్ధతో చేసిన శ్రమ ఫలితం అంతా కూడా యజమానికే పోయింది. ఎందుకంటే, జీతం అనేది నిర్ణయమైపోయిన తర్వాతే శ్రామికుడు పనిలోకి దిగుతాడు. జీతం 2 అని నిర్ణయమయ్యాక శ్రామికుడు 8 విలువగల శ్రమ చేసినా, 10 విలువగల శ్రమ చేసినా, శ్రామికుడికి దక్కేది 2 మాత్రమే. 2 కన్నా ఎక్కువేమీ రాదు. కాబట్టి, జీతం పోగా మిగిలినదాన్ని యజమానికి అప్పజెప్పే విధానంలో 'శ్రద్ధగా పనిచెయ్యడం' అనే దానికి అర్థం లేదు. శ్రామికుడికి అలాంటి 'శ్రద్ధ' ఎప్పుడు వస్తుందంటే, తనశ్రమ విలువనంతా తనే తీసుకోగలిగినప్పుడు! 8విలువగల శ్రమ చేస్తే 8 నీ, 10 విలువగల శ్రమచేస్తే 10నీ, ఎంత శ్రమ చేస్తే అంతనీ, శ్రమచేసే మనిషే తీసుకోగలిగితే శ్రమచేసే మనిషి, శ్రమ మీద నిజమైన శ్రద్ధతో వుంటాడు. శ్రామికుడు ఎంత ఎక్కువ శ్రద్ధతో పనిచేసినా అతనికి దక్కేది జీతమే అయినప్పుడు ఏ శ్రామికుడైనా ఎక్కువ శ్రద్ధతో ఎందుకు పనిచెయ్యాలి? విరామం ఎరగని పనిచేస్తూ దానికి బదులుగా గంజి తాగి, గుడిసెల్లో మురికి ఓడుతూ జీవిస్తోన్న వాళ్ళేమో ఇంకా ఇంకా శ్రద్ధగా పనిచెయ్యాలి! శ్రమచెయ్యని వాళ్ళంతా అందరి విశ్రాంతులూ తామే తీసు

కుంటూ విలాసాలతో, జూదాలతో, కుక్కల్నీ నక్కల్నీ తిప్పుకుంటూ సోమరిమందగా తిరగాలి!

పనిలో అశ్రద్ధా, దొంగ ఎత్తులూ లాంటివన్నీ సమాజంలో 'పని చెయ్యని వర్గాన్ని' చూసి పుట్టుకొస్తున్నవే. ఒక వర్గం అంతా పనే చెయ్యకుండా బ్రహ్మాండమైన దొంగ ఎత్తుతో జీవిస్తోంటే, పుట్టిన దగ్గర్నించీ చచ్చిపోయే వరకూ పనితనమనీ, వృద్ధాప్యమనీ తేడా లేకుండా జీవితమంతా దుర్భరమైన పనిలో మునిగిపోయిన వాళ్ళకి 'పని' అంటే అసహ్యం పుట్టదూ!

కారు డోరు స్వయంగా తీసుకునే 'కష్టం' కూడా పడకుండా కారు లెక్కి తిరగడం గొప్ప విలువగానూ, అడుగడుగునా సేవలందడం గొప్ప ప్రతిష్టగానూ చలామణీ అవుతోన్న ప్రపంచంలో శ్రమచేసే మనుషులకు కూడా శ్రమ అనేది సిగ్గుపడే విషయంగా వుండదూ? శ్రమ మీద విముఖత్వం కలగదూ? శ్రమని తప్పించుకోవాలనిపించదూ?

ప్రభుత్వ కార్యాలయాల్లో వుద్యోగుల మీద అసంతృప్తి ప్రకటిస్తున్నారు, మీరు. ఏనాడూ శ్రమ చెయ్యకుండా జీవిస్తోన్న 'సోమరిమంద వర్గం'తో పోలిస్తే ప్రభుత్వ వుద్యోగులంతా చాలా శ్రమ చేస్తున్నవాళ్ళే. కానీ, వ్యవసాయ కార్మికులతోటీ, పరిశ్రమల కార్మికుల తోటీ పోల్చిస్తే మేధా శ్రమల కార్మికులంతా చాలా తక్కువ శ్రమే చేస్తున్నట్టు అర్థం. ఈ తప్పులన్నీ దోపిడీ అనే అసలైన తప్పులోంచి పుట్టుకొస్తున్నాయి కాబట్టి, ఇవి కాలక్షేపానికి మాట్లాడే ఆషామాషీ విషయాలు కావు.

ఒకరు అడిగిన ప్రశ్నకి ఎదటివాళ్ళు చెప్పిన సమాధానం 'సమంజసంగా' వుంటే మొదటి వ్యక్తి తన ప్రశ్న వదులుకోవాలి. లేకపోతే, ఒకరు ఇంకొకరిని అడగడమూ, చెప్పడమూ, చర్చించడమూ అనేవన్నీ

పూర్తిగా దండగ్గై, ఎవరి వాదం వాళ్ళకి మిగులుతుంది. ప్రశ్నకి ముందు వున్న పరిస్థితే వుంటుంది.

*

కొల్లా సంపూర్ణమ్మ, గుంటూరు.

ప్ర: ఫలానా వూరిలో కట్నం ఎక్కువ తీసుకుని రాలేదని అత్త, మామ, ఆడపడుచులు కలసి కోడలు మీద కిరసనాయిలు పోసి కాల్చి చంపారని, ఇంకొకచోట పుట్టింటి నుండి డబ్బు తీసుకొని రాలేదని భర్త నానా హింసలు పెట్టి వేధిస్తున్నాడని, ఆ వేధింపులు భరించలేక పాపం భార్య ఉరిపోసుకుని చచ్చిపోయిందని, వేరొకచోట మరొక విధంగా అని, పరకట్నం చావుల గురించి ప్రతీ దినం దిన పత్రికల్లో చదువుకుంటూనే వున్నాము. కొందరు కోడళ్ళలో కూడా, తప్పులు చేసే వాళ్ళున్నారు. ఆ తప్పులు పొరపాటున గాని, ఏదో ఒక విధంగా గాని అత్త కళ్ళతోనో లేక ఆడపడుచు కళ్ళతోనే చూస్తే ఎక్కడ భర్తకి చెబుతారో అని, ముందుగా తన తప్పు బయటకు రానివ్వకుండా కిరసనాయిల్ పోసుకునో, ఉరివేసుకునో తనంతట తానుగా చచ్చిపోతూ, భర్త నన్ను వేధిస్తున్నాడని, అత్త నన్ను బాధ పెడ్తున్నదని, ఆ బాధలు భరించలేక జీవితం మీద విరక్తి చెంది ఇట్లా చేసుకున్నాను అని చిన్న స్టేటుమెంటు ఇచ్చి కన్ను మూసిందనుకోండి. ఆ అమాయకుడైన భర్త గతి, ఇంత తప్పుచేసి కూడా నా మీద ఇంత నింద వేసిందేంటాని అత్త, ఈ ఇద్దరూ అన్యాయంగా శిక్ష అనుభవించాల్సిందేనా, ఇదేనా న్యాయం? ఇట్లాంటి కోడళ్ళకి మీరిచ్చే సలహా వినాలని, ఇట్లాంటి తప్పులు చేసే కోడళ్ళు కూడా మీ సమాధానం విని బుద్ధి తెచ్చుకోవాలని ఎంతో ఆశతో మీ జవాబు కోసం ఎదురు చూస్తూ వుంటాము.

జ : ఇప్పుడు పత్రికల్లో వస్తున్న కట్నం మరణాల వార్తలూ, పోలీసు స్టేషన్లలో నమోదు అవుతున్న కేసులూ అన్నీ మీరు వర్ణించిన లాంటివేననీ, ఆ స్త్రీలందరూ తమ 'రహస్య సంబంధాలు' బయట పడి పోవడం వల్లనే ఆత్మహత్యలు చేసుకున్నారనీ, ఈ ఆత్మహత్యల కారణ మంతా అదేననీ మీ అభిప్రాయమన్నమాట! చాలా దుర్మార్గంగా వుంది మీ అభిప్రాయం. కట్నం మరణాల కేసుల్లో మీరు చెప్పే రకం కేసు నూటికి ఒక్కటి కూడా వుండదు. ఒకవేళ వుంటే నూటికి ఒక్కటి వుంటుంది. 'రహస్య సంబంధం' బయటపడ్డప్పుడు పురుషుడైతే ఆత్మ హత్య చేసుకోడు. స్త్రీకే ఆ పరిస్థితి వుండడం అంటే, అది కూడా స్త్రీ అధమ స్థితికి రుజువే. కాబట్టి స్త్రీలు ఆ కారణం వల్ల ఆత్మహత్య చేసు కున్నా ఆ స్త్రీల మీదే సానుభూతి వుండాలి. భర్త నిజంగా అమాయకుడై భార్య 'పెంకితనం' వల్లనే ఆమె ఆత్మహత్య జరిగి వుంటే ఆ నిజానిజాలు చుట్టుప్రక్కల జనాలకు తెలిసే వుంటాయి. ఎవరి ప్రవర్తన ఎలాంటిదో అందరికీ తెలుస్తుంది. అమాయకుడైన భర్తని తీసుకుపోయి వురికంబం ఎక్కించే కేసు ఎక్కడా జరగదు.

కోడళ్ళ ఆత్మహత్యలకు వాళ్ళ రహస్య సంబంధాలే కారణమని మీరు చెప్పదలిస్తే, అలాంటి 'రహస్య సంబంధాలు' కోడళ్ళకే గానీ అత్తలకూ, ఆడబడుచులకూ వుండవా? అవి కోడళ్ళ కళ్ళల్లో పడే సంఘ టనలేవీ జరగవా? కోడలు ఆ విషయాన్ని కొడుక్కి చెప్పేస్తుందనే భయ ముతో అత్తలూ, ఆడబడుచులూ ఆత్మహత్యలు చేసుకుంటున్నారా? అలాంటి ఆత్మహత్యలేవీ జరగడం లేదు ఎందుకనీ? కోడళ్ళే చెడ్డవాళ్ళనీ, అత్తలూ, ఆడబడుచులూ ఉత్తములనీ మీరు చెప్పదలిస్తే ఒక ఇంట్లో కోడళ్ళే వేరే ఇళ్ళల్లో ఆడబడుచులు కదా? ఒకప్పుడు కోడళ్ళుగా వున్న వాళ్ళే ఇంకొకప్పుడు అత్తలు కదా? ఈ అత్తలు కూడా చిన్నప్పుడు చెడ్డ

వాళ్ళనీ:. ఈ ఆడబడుచులందరూ పుట్టిళ్ళలో ఉత్తములూ, అత్తిళ్ళల్లో చెడ్డ వాళ్లూ అనీ అనుకోవాలా?

కోడళ్ళే ఆడబడుచులనీ, కోడళ్ళే అత్తలనీ మరచిపోయి కేవలం కోడళ్ళమీద కక్షతో మీరు మాట్లాడారంటే కట్నకానుకల కోసం కోడళ్ళని పీడించే అత్తల్నీ, ఆడబడుచుల్నీ సమర్థించే రకం వ్యక్తి మీరు అని అర్థం వస్తోంది. ఏటా, ప్రతి రాష్ట్రంలోనూ వేలకొద్దీ కట్నం హత్యలు జరిగిపోతూంటే అవన్నీ మీకు 'రహస్య సంబంధాల'వల్ల జరిగిన ఆత్మహత్యలుగా కనబడుతున్నాయా? చెడ్డ అత్తలుకూడా పైకి కనీసం నాటకం కోసమైనా రెండు మంచిమాటలు మాట్లాడతారు. మీ మాటల్లో అది కూడా లేదు. మీరు నిజంగా తెలివి మాలినతనంతో అస్తవ్యస్తంగా మాట్లాడేసి వుంటే, మీ తప్పు మీరు గ్రహించుకుని, మీ అభిప్రాయం పూర్తిగా మార్చుకోండి. లేకపోతే కట్నం హత్య జరిగినప్పుడల్లా మీరూ అత్తలవర్గం మాటలే మాట్లాడుతూవుంటే, మీరు తప్పకుండా నవ్వులపాలవుతారు. మీరకం వాళ్ళు తప్ప, మిగతా వాళ్ళంతా మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. మళ్ళీ మళ్ళీ జాగ్రత్తగా ఆలోచించుకోండి.

.., శ్రీకాకుళం.

ప్ర: నా సమస్యకి సలహా కోరుతున్నాను. ఒకమ్మాయిని నేనిష్టపడుతున్నాను. ఆమెకూడా నన్నిష్టపడుచున్నది. ఆమె వయస్సు 16. నా వయస్సు 18. ఆమె అక్కను నేను మొదటినుండి అక్కా అని పిలుస్తూ వుంటాను. కనుక ఈమె నాకు చెల్లె అవుతుంది కదా అంటున్నారు. ఒక కులంగాధు. బంధుత్వం లేదు. ఈమె నాకు చెల్లెలవుతుందా?

జ: అలా అవదు మీమధ్య రక్తసంబంధమైన బంధుత్వం లేదు కాబట్టి. 'అక్క'మీద వున్న సోదరభావం చెల్లెలిమీద లేకపోవచ్చు. కానీ

ఇంత చిన్న వయసులో ఇష్టాల్నినమ్మి వాటికి లోబడడం ఇద్దరికీ మంచిదీ కాదు. స్త్రీ పురుషుల సహజీవనం పరస్పరం కలిగే ఇష్టాల ఆధారంతో ఏర్పడవలసిందే. కానీ, ఇంత చిన్న వయసులో కలిగే ఇష్టాలతో సరైన నిర్ణయాలు వుండకపోవచ్చు. (పెద్ద వయసులో కలిగే ఇష్టాల్లో కూడా సరైన నిర్ణయాలు వుండకపోవచ్చు. కానీ ఆ ప్రమాదం చిన్న వయసులో మరీ ఎక్కువగా వుంటుంది). కాబట్టి ఇంకా కనీసం 3, 4 సంవత్సరాలవరకూ మీ ఇష్టాల్ని మీ మనసుల్లోనే వుంచుకోవడం మంచిది. మీ ఇష్టాలు నిజంగానే గాఢమైనవి అయితే అవిమారిపోకుండానే వుంటాయి. మీ ఇష్టాలు స్థిరంగా వున్నాయా లేదా అనేది కూడా ఆ కాలంలో రుజువవుతుంది. చదువులూ, ఏవైనా వృత్తులు ఇద్దరికీ ముఖ్యం. మామూలుగా పరిచయస్తుల్లాగా, స్నేహితుల్లాగావుంటూ ఇద్దరూ మీపోషణ మీరు చేసుకోగలిగే పనులు చూసుకుంటూ వుండండి. చిన్న వయస్సు ప్రేమలన్నీ పొరపాటు ప్రేమలే. 'ప్రేమ' గురించి గూడా పొరపాటు అభిప్రాయాన్ని మార్చుకోవాలి.

సి. యస్. ప్రకాశం, కాకినాడ.

ప్ర: "తప్పు రెండు వైపులా వున్నప్పుడే ఘర్షణ కొనసాగుతుంది" అని 'వాల్టేర్' అన్నాడని ఒకచోట చదివాను. ఇది తప్పని నా అభిప్రాయం. ఒకరు తప్పు, ఒకరు రైటు అయినప్పుడు కూడా ఘర్షణ వుండదా?

జ: ఈ విషయంలో మీరే కరెక్టు. తప్పు రెండువైపులా వున్నప్పుడూ ఘర్షణ వుంటుంది; ఒకవేపుతప్పూ, ఒకవేపు రైటూ వున్నప్పుడూ ఘర్షణవుంటుంది. రెండువేపులా రైటు వున్నప్పుడు మాత్రమే ఘర్షణ వుండదు.

ప్ర: "పుస్తకాల్లో మంచివీ, చెడ్డవీ అని లేవు. మంచిగా రాసినవీ, చెడ్డగా రాసినవీ మాత్రమే వుంటాయి"- అని ఆస్కార్ వైల్డ్ అన్నాడని రచయిత శ్రీకాంతశర్మగారు ఒకచోట రాశారు. ఇది కూడా పొరపాటని నా అభిప్రాయం. మీ అభిప్రాయం కావాలి.

జః నా అభిప్రాయం కూడా మీ అభిప్రాయమే. "పుస్తకాల్లో మంచివీ, చెడ్డవీ అని తేడాలే వుండవు" అనడం అంటే 'సమాజంలో మంచీ, చెడ్డా వుండవు' అనడమే. సమాజంలో మంచీ చెడ్డా వున్నాయి. అవి పుస్తకాల్లో కూడా వుంటాయి. 'పుస్తకం' అన్నప్పుడు అందులో ఒక 'విషయమూ', దాన్ని చెప్పే 'విధానమూ' వుంటాయి. మంచి విషయాన్ని- మంచి విధానంతోనూ చెప్పవచ్చు, చెడ్డ విధానంతోనూ చెప్పవచ్చు. అంటే, కళాత్మకంగానూ చెప్పవచ్చు, కళావిహీనంగానూ చెప్పవచ్చు. కానీ, చెడ్డ విషయాన్ని- కళాత్మకంగానూ, చాలా మంచిగానూ చెప్పడం సాధ్యంకాదు. మతపరమైన కథలకూ, భక్తిగీతాలకూ మాత్రమే ఇది కొంత ప్రత్యేకంగా వుంటుంది. భక్తిగీతాల్లో చెప్పే 'విషయం' అంతా అసత్యమే. కానీ, ఆ 'అసత్యం'కూడా అద్భుతమైన 'కవిత్వం'తోటీ, 'సంగీతం'తోటీ వుంటుంది. అంటే, ఒక అసత్య విషయాన్ని కళాత్మకంగా చెప్పడం భక్తిగీతాల్లోనే సాధ్యమవుతుంది. ఈ పని 'సాంఘిక' విషయాల్లో సాధ్యంకాదు. ఒక చెడ్డ విషయాన్ని, కళాత్మకంగా ఎవరూ చెప్పలేరు. చెప్పాలని ఎంత ప్రయత్నించినా దాని లోపాలన్నీ దానికి వుంటాయి. కాబట్టి, 'పుస్తకాల్లో మంచివీ చెడ్డవీ వుండవు. వాటిని రాయడంలోనే మంచిచెడ్డలు వుంటాయి' అనడం చాలాతప్పు. ఈ విషయంలో ఆస్కార్ వైల్డ్ అభిప్రాయంతోటీ, శ్రీకాంత్ శర్మ అభిప్రాయంతోటీ గాక, మీ అభిప్రాయంతోచే నేను ఏకీభవిస్తున్నాను.

కె. మంగమణి, సామర్లకోట.

ప్ర: విజయవాడలో ఒకహత్య జరిగినప్పుడు " 'ప్రజాస్వామ్యం'లో హత్యలకు తావులేదు"- అన్నారు అప్పటి ముఖ్యమంత్రిగారు. కాని హత్యలు జరుగుతూనే వున్నాయి. ప్రజాస్వామ్యంలో హత్యలకు తావు వున్నట్టేనా?

జ: కాదు. ముఖ్యమంత్రిగారు సరిగానే చెప్పారు. ప్రజాస్వామ్యంలో హత్యలకు తావులేదు! కానీ, హత్యలు జరుగుతూనే వున్నాయి కాబట్టి, 'ప్రజాస్వామ్య'మే లేదన్నమాట!

* * *

కె.వి. రెడ్డి, తిరుపతి.

ప్ర: ఏడేళ్ళ పాలనలో ఎన్.టి.ఆర్. ఏం సాధించాడు?

జ: 40 ఏళ్ళపాలనలో కాంగ్రెస్ ఏం సాధించిందో చెప్తే ఏడేళ్ళ పరిపాలన సంగతి తర్వాత.

* * *

బి. శ్రీరాం, కాకినాడ.

ప్ర: రాష్ట్రంలో తెలుగుదేశంపోయి కాంగ్రెస్ వచ్చింది. కేంద్రంలో కాంగ్రెస్‌పోయి ఇంకోపార్టీ వచ్చింది. ప్రజలు, ఇదంతా రాజకీయ చైతన్యంతోనే చేశారా?

జ: ఒక మనిషికి 2 చొక్కాలే వున్నాయనుకోండీ. అవి కూడా చిరిగినవే. మూడోచొక్కా ఏదీలేదు. ఏంచేస్తాడు ఆమనిషి? ఆ 2చొక్కాలే మార్చి మార్చి తొడుక్కుంటాడు. అలాగే జనం ఆ వున్న పార్టీలనే ఇటూ అటూ మారుస్తున్నారు. అదిరాజకీయచైతన్యమేనా అంటే, ఆ పరిధిలో అది చైతన్యమే. అయితే, అసలు కావలసింది ఆ పరిధిలోనేపడి తిరగడంకాదు. ఆ పరిధిని దాటిపోయి తమ విముక్తిమార్గం గ్రహించడం కావాలి. ఈపెట్టు

బడిదారీ పార్టీల మార్గంలో తాము విముక్తి చెందలేమని గ్రహించడం కావాలి. నిజంగా కావలసిన ఆ రాజకీయ చైతన్యం ఇంకాలేదు.

ప్ర: తెలుగుదేశం పాలనలో పదవుల పంపకం కుల ప్రాతిపదికనే జరిగింది. ఎన్టీ ఆర్ వచ్చాకే 'కులం' పాత్ర ఎక్కువైందని గమనించారా?

జ: ఏ కులం అధికారంలోవుంటే, ఆ కులం ప్రకారం పదవుల పంపకం ఎప్పుడూవుంది. ఎన్టీఆర్ వచ్చాకే అది ఎక్కువైందనో, తక్కువైందనో నోటిమాటలతో వాదోపవాదాలు చేస్తే లాభంలేదు. ప్రధానమైన పదవుల్నీ, ఆ పదవుల్లో నియమితులైన వారికులాల్నీ లెక్కలువేసిచూస్తే- కావలసిన విషయం తేలుతుంది. (కుల పక్షపాతం అనేదికూడా ఆ కులంలో వున్న బీదా బిక్కీవేపు వుండదు. పెద్ద ఆస్తిపరులవేపే వుంటుంది)

* * *

పి. సుందరరామారావు, పెనుగొండ.

ప్ర: 'తెలుగుజాతి ఐక్యం కావాల'ని ఇటీవల అభ్యుదయవాదులు కూడా మాట్లాడటం విన్నాను. తెలుగు జాతేమిటి? హిందీ జాతేమిటి? యన్.టి.ఆర్. మాట్లాడినట్టే అభ్యుదయవాదులు మాట్లాడితే ఇక అభ్యుదయ మేముందో అర్థం కావడంలేదు. నా అభిప్రాయంలోనే పొరపాటుందంటారా?

జ: లేదు. మీ అభిప్రాయమే సరైంది. మనుషులు, ఏ విషయాన్ని చూడవలసిందైనా 'తెలుగుజాతీ', 'హిందీ జాతీ' అనే దృష్టితో కాదు. 'వర్గాల' దృష్టితోనే చూడాలి. తెలుగు జాతిలో పెట్టుబడిదారులూ, భూస్వాములూ, శ్రామికులూ అనే భేదాలు లేవూ? తెలుగు శ్రామికులు తెలుగు భూస్వాముల తోటీ, తెలుగు పెట్టుబడిదారుల తోటీ 'ఐక్యం' అవ్వాలా? అలాగే హిందీ శ్రామికులు హిందీ భూస్వాములతోటీ, హిందీ

పెట్టుబడిదారులతోటే ఐక్యం అవ్వాలా? ఇలా 'ఐక్యం' అయ్యి, అన్ని జాతుల శ్రామికులా 'వర్గపోరాటాలు' వదిలేసి, ఇక మానవ సమాజం వున్నంత వరకూ తమ జాతుల్లో పెట్టుబడిదారులకూ, భూస్వాములకూ లాభాలూ, వడ్డీలూ, కౌళ్ళూ అప్పగిస్తూ వుండాలా? ఇలాంటి ఐక్యతల్ని బోధించే వాళ్ళెవరైనా అభ్యుదయవాదులెలా అవుతారు? ప్రపంచంలో ఎక్కడైనా ఏ సమస్యలోనైనా 'ఐక్యత' సాధించడానికిమార్గం 'వర్గపోరాటాల'లోనించి మాత్రమే వుంది. ఇంకెక్కడా లేదు.

బాలాజీ, కిరేరే సరాయ్ (గయ).

ప్ర: మీ పుస్తకాల్లో 'వెల' అని వుండాల్సిన చోట 'ధర' అని వుంటుంది. దీనికి కమ్యూనిస్టు అర్థశాస్త్రపరంగా ఏమైనా కారణముందా? 'వెల'కీ 'ధర'కీ ఏమైనా తేడా వుందా?

జ: ఏమీ తేడాలేదు. 'వెల' అనేమాట అన్నిప్రాంతాలవారికీ అర్థం కాకపోవచ్చు. 'ధర' అనే మాట అందరికీ అర్థమవుతుందని మాత్రమే అలా రాయడం.

* * *

జి. వి. రావ్, వైజాగ్-20.

ప్ర: మార్క్స్ తన తుదిరోజుల్లో ఎంగెల్స్‌కి వ్రాసిన మాన్యుస్క్రిప్టులో కొన్ని సిద్ధాంతపరమైన మార్పులను అంగీకరిస్తూ సూచించినట్టు విన్నాను. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌లో అటువంటి బుక్స్ వున్నాయేమోనని తరచి చూశాను. నాకు ఎక్కడా కనపడలేదు. నిజంగా అటువంటి వేమైనా వున్నాయంటారా?

జ: మీరు విన్న విషయం గురించి నాకేమీ తెలీదు.సిద్ధాంతపరమైన మార్పులగురించి తర్వాత కాలంలో మార్క్స్ ఏమైనా రాసివుంటే, అవంతా ఆ సిద్ధాంత మూలానికి ఇంకా దోహదపడేవే అయివుంటుంది. ఆ సిద్ధాంతంలో ఎలాంటి మార్పులు సూచించినా, "శ్రమ దోపిడీ జరగడంలేదు" అని చెప్పే మార్పయితే మాత్రం జరగదుకదా? మార్క్సిజం ప్రత్యేకత అంతా, శ్రమ దోపిడీని, అదనపు విలువని గ్రహించటమే.మిగతా విషయాలన్నీ గ్రహించడానికి, ఆ ఒక్క అంశం చాలు. కార్మికవర్గ ఆచరణ అంతా ఆ మూలంమీదే ఆధారపడివుంటుంది. మార్క్సుగాని, మార్క్సిస్టులు గానీ ఆ 'మూలం'లో మార్పులు సూచించిందేమీ వుండదు.

* * *

ఆర్. నాగేశ్వర్, ఏలూరు.

ప్ర: 9-3-90 సంచికలో 'కుటుంబాలకు ఎక్కువకాలం దూరంగా వుండడంవల్ల ఇతర స్త్రీలతో సంబంధాలు ఏర్పడతాయని పార్టీ నాయకులు చెప్పేదాన్ని విమర్శిస్తూ ఒకరు ఒక ప్రశ్న అడిగారు. అది చదివిన తర్వాత కూడా నాకు తెలిసిన ఛోటా నాయకుడొకాయన అదే వాదన చేస్తున్నాడు.

జ: కుటుంబాల్ని వదిలి భర్తలు ఎక్కువకాలం దూరంగా వుండడం అంటే, వారి భార్యలుకూడా భర్తలకు దూరంగావుంటున్నట్టేకదా? భార్యలకు కూడా అలాగే 'ఇతరసంబంధాలు' ఏర్పడాలని ఆ నాయకుడుఅంగీకరిస్తాడో లేదో అడగండి. ఏదో పంతానికి'అంగీకరిస్తాన'ని ఆ మనిషిఅన్నా, ఆరకం ప్రవర్తన ఏ పక్షానికీ సరైనదికాదు. వాళ్ళు కుటుంబాలకు దూరంగా ఏ 'ఆదర్శం కోసం' వుంటున్నామని చెపుతారో, ఆ ఆదర్శంకోసం వాళ్ళు నిజంగా నిలబడటంలేదు కాబట్టే, 'కుటుంబానికి దూరంగా వుంటే, ఇతర స్త్రీలతో సంబంధాలు వుండవా' అని బుద్ధిలేని మాటలు మాట్లాడగలుగుతున్నారు.

* * *

టి. మధుసూధన, బెంగుళూరు.

ప్ర: కమ్యూనిస్టులంటే ఎవరు? వారి ఆశయం ఏమిటి?

జ: ఫ్యూడల్ వాళ్ళు-ఫ్యూడల్ మాటలు చెప్పి, ఫ్యూడల్ పనులు చేస్తారు. బూర్జువా వాళ్ళు - బూర్జువా మాటలుచెప్పి బూర్జువాపనులు చేస్తారు.

కమ్యూనిస్టులు - కమ్యూనిస్టు మాటలు చెప్పి, ఫ్యూడల్ పనులూ, బూర్జువా పనులూ చేస్తారు. కమ్యూనిస్టులంటే అలాంటివాళ్ళన్నమాట!

వారి ఆశయం- చెప్పేది చెయ్యకపోవడం, చేసేది చెప్పకపోవడం!

* * *

ఎ. కమల, నెల్లూరు.

ప్ర: కమ్యూనిస్టు సంఘాలలో లోపాలున్నా వాటిలో మీరెందుకు పనిచెయ్యరు? చర్చలద్వారా, మీ వాదనల ద్వారా మీ లక్ష్యాన్ని సాధించ గలరు కదా?

జ: అన్నారు కదా, 'చర్చల ద్వారా' 'వాదనల ద్వారా' అని! కమ్యూనిస్టు సంఘాల్లో లేనివి అవే. అక్కడ అంతా 'ఏకగ్రీవమే'! ఆ 'గ్రీవం' హైకమాండ్‌ది! అదే అక్కడ 'సుగ్రీవం'! మార్క్సిజంమీద ఆధారపడిన చర్చలూ, ఆ ప్రకారమే ఆచరించడమూ, తప్పులు జరిగితే నిజంగా దిద్దుకోవడమూ వంటి లక్షణాలన్నీ ఆ సంఘాల్లోవుంటే ప్రపంచ చరిత్ర ఈపాటికి ఇంకోరకంగావుండేది. 'లోపాలు'లేని 'ఆదర్శ'సంఘాల్ని నేను 'కల'గనడంలేదు. కానీ కమ్యూనిస్టులద్వారా జరిగే లోపాలకు కూడా ఒక స్థాయి వుండాలి. 'మార్క్సిజాన్నే వదిలివేసే' లోపాల్ని సర్దుకోవడం అర్థంలేని విషయం.

ప్ర: మీరేనైనా కమ్యూనిస్టు సంఘం పెట్టదలిచారా?

జ: ఇప్పటివరకూ సిద్ధాంతానికి సంబంధించిన పనిలోనే వున్నాను. భవిష్యత్‌లో ఏంచెయ్యగలనో ఇంకా నిర్ణయం లేదు. చిన్న చిన్న అధ్య

యన తరగతుల్లో 'కాపిటల్'ని బోధించాలని వుద్దేశం. సంఘాల గురించి ఆలోచన లేదు.

* * *

టి. కృష్ణ, రాజమండ్రి.

ప్ర: "అసంఖ్యాకమైన నిరుపేదలు నాకు దేవుడిచ్చిన వరం. పేదలు, రూపం మారిన జీసస్‌లు. పేదల సేవే జీసస్ సేవ. నేను జీసస్ చేతిలో పెన్సిల్‌ని"-ఇవి మదర్ తెరెస్సా పలుకులు. పేదలకు సేవచేయటం మంచిపనేగాని, పేదలను "దేవుడిచ్చిన వరం" అనటం వింతగా వుంది. 'వరం' అంటే ఆనందం కలిగించే విషయంకదా? పేదలు అసంఖ్యాకంగా వుండటం మదర్ తెరెస్సాకి ఆనందం కలిగిస్తుందా?

జ: ఆమె లక్ష్యం పేదల సేవకాదు, జీసస్ సేవ. జీసస్‌కి సేవ చేస్తే 'పుణ్యం' వస్తుంది. తనకి 'పుణ్యం' రావటంకోసం పేదల సేవ చెయ్యడం అంటే, ఆ పని తనకోసం తను చేసుకోవడమే. 'పేదల సేవ' ద్వారా పుణ్యం సంపాదించదల్చుకున్నప్పుడు, అసంఖ్యాకంగా పేదలు వుండడం'వరం' కాదూ? అందుకే ఆ పరిస్థితిని ఆమె 'వరం'గాభావించడం. పేదలూ జీసస్సే, పేదలకు సేవ చేయించేదీ జీసస్సే. అంటే, జీసస్సు, జీసస్సుకే సేవ చేయించుకుంటాడు! ఈ'వేదాంతం' తెలిసిందేకదా?

పేదల్ని అసంఖ్యాకంగా 'సృష్టించేదీ', వారి సేవలకోసం సంఘాలు తెరిచేవారికి చందాలు పడేసేదీ జీసస్‌కాదు, ధనికవర్గ ప్రభువులే. తెరిస్సా రకపు సంస్కర్తలు చేసే సేవ పేదలకీకాదు, జీసస్‌కీకాదు, ధనికవర్గానికే! అందుకే ఆ సంస్కర్తలు, తమ సేవలకు బదులుగా ధనిక వర్గం నించీ అవార్డులూ, ప్రశంసలూ, సన్మానాలూ పొందుతారు.

మదర్ తెరిస్సా, తను అనుకుంటున్నట్టు జీసస్ చేతిలో 'పనిముట్టు' కాదు, ధనిక వర్గం చేతిలో పనిముట్టు! (తెలిసిగానీ, తెలియకగానీ).

* * *

జె.యు.బి.వి. ప్రసాద్, మద్రాస్.

ప్ర: శ్రీ శ్రీ 'అనంతం' పుస్తకంలో పుస్తకం హక్కులు జూనియర్ శ్రీశ్రీవి అని రాశారు. భార్యా, కూతుళ్ళూ వున్నా, పుస్తకం మీద హక్కులు కొడుక్కి ఇవ్వడం విడ్డూరంగా వుంది. అంతకన్నా ముఖ్యంగా నా సందేహం-శ్రీ శ్రీ లాగా రాసే ఇంకో కవి నెవరినైనా 'జూనియర్ శ్రీ శ్రీ' అనవచ్చుగానీ, శ్రీ శ్రీ కొడుకుని జూనియర్ శ్రీ శ్రీ అనవచ్చా? పిల్లల్ని కూడా జూనియర్లు అంటారనుకోండి. ఆ అర్థంతోనే 'జూనియర్ శ్రీ శ్రీ' అన్నారనుకుంటే, అప్పుడైతే కూతుళ్ళు కూడా జూనియర్లే అవుతారు గదా? 'జూనియర్ శ్రీ శ్రీ' అంటే కొడుకా, కూతుళ్ళలో ఒకరా? ఒకరైతే ఏ కూతురు? ఆ పేరే రాయవచ్చు గదా? ఆ పుస్తకంలో చాలా దుర్భర సంఘటనలున్నాయి. ఆ సంఘటనలు ఆ 'జూనియర్లు' ఎలా చదువుకుంటారో! (తెలుగు పాఠకులంతా చదవాలనుకోండీ!) "విప్లవ" సంఘం వారా పుస్తకం ఎలా ప్రచురించారో అర్థం కాలేదు నాకైతే.

జ : మీరీ ప్రశ్నలు ఆ 'సంఘం' వారినే, పుత్తరం రాసి అడిగే అవకాశం వుంది కదా? ఆ పుస్తకంలో మీకు ఆ సంఘం అడ్రసు దొరకలేదా? 'జూనియర్ శ్రీ శ్రీ' అనే మాటలు, మీరన్నట్టు ఇంకో కవి విషయంలో వాడితేనే సమంజసంగా వుంటుంది. ఆ జూనియరిటీని కవిత్వం విషయంలో తప్ప ఇతర విషయాల్లో చెప్పకూడదు. కానీ, ఆ పుస్తకంలో ఆ మాటల్ని వారసత్వ-విషయంలో వుపయోగించారు. అక్కడ 'జూనియర్ శ్రీ శ్రీ' అన్నవానికి 'శ్రీ శ్రీ కొడుకు' అనే అర్థమే-ఎవరికైనా కనపడుతుంది. 'కూతురు' అని కాదు. కూతుళ్ళు కూడా జూనియర్లే అయినా, ఇంగ్లీషు సాంప్రదాయంలో కొడుకులనే గానీ, కూతుళ్ళని జూనియర్లు అనరు. 'జూనియర్ శ్రీ శ్రీ' అని రాసిన వాళ్ళు కొడుకులకే ప్రత్యేకత వుండే సాంప్రదాయాన్ని పాటించారన్న మాట! ఆ మాటలు ఎవరు

రావారో, శ్రీ శ్రీ భార్యని గానీ, ఆ పుస్తక ప్రచురణ కర్తల్ని గానీ అడిగితే తెలుస్తుంది. (వాళ్ళు నిజం చెప్తే). ఆ పుస్తకాన్ని ప్రచురించడం నేరమైతే అర్థం చేసుకోలేని విషయం ఏముంది? అందులో మీకు 'దుర్భరంగా' తోచిన విషయాలు ప్రచురణ కర్తలకు దుర్భరంగా తోచలేదని అర్థం. అవి వారికి నచ్చాయి కాబట్టే వాటిని ప్రచారం చేద్దామని ప్రచురించారు. ఇందులో అర్థం కానిదేముంది?

ప్ర : నక్సలైట్లు వుత్పత్తిదారుల, వర్తకుల సంఘాలనుంచి చందాలు వసూలు చేస్తున్నారనే వార్తలు చాలాకాలం నుంచి చదువుతున్నా. ఇవి తప్పు వార్తలై వుంటాయని నమ్మేను. కానీ ఈ మధ్య కాలంలో ఈ వార్తలు బట్ట బయలవుతున్నాయి. నక్సలైట్లే అది నిజమని చెప్పుకుంటున్నారు. పేదల కోసమే ధనికుల్ని చందాలడుగుతున్నా మంటున్నారు. ధనికులు స్వచ్ఛందంగానే చందాలిస్తున్నారని నక్సలైట్లు చెప్పిన ప్రకటనలు చదివాను. నక్సలైట్లు పేదల కోసమే పనిచెయ్యడం నిజమైతే, పేదల కోసం పని చేసేవారికి ధనికులు 'స్వచ్ఛందంగా' చందాలెందుకిస్తారు? చందాలతో పేదలు వుద్యమాలు నిర్మించి, తమపై ఎదురు తిరగడం ధనికులకు ఇష్టమా? 'భయపడి' ఇస్తున్నారంటేనే అది నమ్మదగ్గ విషయం. పేదలు వర్గపోరాటాల ద్వారా ధనికుల ఆధీనంలోవున్న వుత్పత్తి సాధనాలను స్వాధీన పర్చుకోవలసి వుంటుంది. కానీ చందాల వసూళ్ళ ద్వారా వర్గ పోరాటాలు చేస్తామని చెప్పటం హాస్యాస్పదంగా వుంది. ఉత్పత్తి దారుల, వర్తకుల సంఘాల నుంచి లక్షల, కోట్ల చందాలు తీసుకున్న తర్వాత ఆ వుత్పత్తిదారుల, వర్తకుల కార్మికులు సమ్మెలుచేస్తే, యజమానులనుంచి డబ్బు తీసుకున్న నక్సలైట్లు కార్మికుల సమ్మెలకు ఏ విధంగా తోడ్పడ గలరు ? యజమానుల నుంచి డబ్బు తీసుకొని, తుపాకులు కొంటే, ఆ తుపాకులు ఎవరిపై పోరాటాలకు ప్రయోగిస్తారు? ధనికులు చందాలిచ్చిన

డబ్బు పేదలదే కావచ్చు. పేదలదైతే పేదల డబ్బు పేదలు పోరాటంతోనే తీసుకోగలగాలి గానీ చందాలివ్వమని అడగవలసి — వస్తున్నదెందుకు? ఏ విధంగా చూసినా పుత్పత్తి—ప ర్తక సంఘాల నుంచి చందాల వసూళ్ళలో వర్గపోరాటం కనబడడం లేదు. మీ అభిప్రాయం తెల్పండి.

జ : నా అభిప్రాయం కూడా అదే. మీ ప్రశ్నలన్నీ కరెక్టుగానే వున్నాయి. వర్గపోరాటం అంటే ఏమిటి? శ్రమ చేసే వర్గం, దోచేవర్గం దగ్గరికి పోయి "మీ మీద పోరాడతాం, చందాలు ఇవ్వండి" అని అడుగుతుందా? అప్పుడు దోచేవర్గం 'స్వచ్ఛందంగా' చందాలు ఇస్తుందా? ఆ చందాలతో, శ్రమచేసే వర్గం, దోచేవర్గంమీద పోరాడుతుందా? చందాలు తీసుకునేది ఒకరిద్దరు పెట్టుబడిదారుల నించో, ఒకరిద్దరు ప ర్తకుల నించో కాదు. మొత్తం పుత్పత్తిదారుల సంఘాల నించీ, ప ర్తకుల సంఘాల నించీ చందాలు తీసుకుంటున్నప్పుడు తర్వాత జరగవలసిన పోరాటం ఎవరి మీద? ఈ విషయాలన్నీ మీరు సరిగానే అర్థంచేసుకుని ప్రశ్నలోనే చాలా వివరణ ఇచ్చారు. కానీ మీరు గమనించని, లేదా ప్రశ్నించని ఇంకో విషయం వుంది- 'నకిలీ'లు కూడా చందాలు వసూలు చేసే విషయం. 'అసలు' నక్సలైట్లు చేసే పని (దోపిడీ వర్గం నించీ చందాలు వసూలు చేసే పని) తప్పు పని కాబట్టే దాన్ని నకిలీలు కూడా అనుకరించగలుగుతున్నారు. నకిలీలు కూడా ఆ మార్గాన్ని వుపయోగించుకోగలుగుతున్నారు. వుద్యమకారులు చేసేది మంచి పనే అయితే దాన్ని నకిలీలు అనుకరించలేరు. వుద్యమకారుల ద్వారా సమ్మెలూ, వుత్పత్తి సాధనాల్ని స్వాధీనం చేసుకునే కార్యక్రమాలూ జరుగుతూ వుంటాయనుకుందాం. ఆ పనుల్ని నకిలీలు అనుకరించరు. అనుకరించలేరు. ఒకవేళ, నకిలీలు కూడా ఆ పనులే చేస్తే అప్పుడు వాళ్ళు నకిలీలు కారు. వాళ్ళు కూడా, వుద్యమాల ప్రభావంతో వుద్యమ కారులుగా మారిపోయారని అర్థం. దానివల్ల వుద్యమానికి మంచే

గానీ చెడ్డ జరగదు. అంటే, వుద్యమకారులు చేసే పని తప్పుపని అయినప్పుడే 'నకిలీల' సమస్య వస్తుంది. మంచి పనికి నకిలీల సమస్య వుండదు. దోపిడీ వర్గం నించి చందాలు వసూలు చేస్తూ, ఆ డబ్బుతో వుద్యమాలు నడుపుతామనడం ఎలాంటి పనో చెప్పడానికి నకిలీల సమస్యే రుజువు. నకిలీలకు 'దేహశుద్ధులు' చేసుకుంటూ పోతే నకిలీల సమస్య తీరదు. నకిలీల సృష్టికి 'అసలీల'లో వున్న తప్పే కారణం. మీ ప్రశ్నల్లోకి ఈ పాయింటుని కూడా చేర్చుకుని ఆలోచించండి.

* * *

ఎ.వి. రామారావు, జీడిమెట్ల, హైదరాబాద్.

ప్ర : అనేక అభ్యుదయ వాద రాజకీయ సంస్కరణలు ప్రవేశ పెట్టినప్పటికీ, తెలుగుదేశం పార్టీ ఓడిపోవడానికి కారణాలేమిటి?

జ : 'తెలుగుదేశం పార్టీ ఓడిపోయిందనేది నిజమే కదా? కాబట్టి అది ప్రవేశపెట్టిన సంస్కరణలు మీరు భావిస్తున్నంత 'అభ్యుదయ సంస్కరణలు' కాకపోయి వుండాలి. లేదా, అవి 'అభ్యుదయ సంస్కరణలే' అయితే, వాటిని మించిన 'అనభ్యుదయ సంస్కరణ'లేవో కూడా ప్రవేశ పెట్టి వుండాలి. అందులో దేని ప్రభావమో ఎక్కువగా వుండి వుంటుంది.

ప్ర : తమ 'శ్రమకు తగిన ఫలితం' లేక, ఉసూరోమంటూ నిరాశా నిస్పృహలతో బ్రతుకుతోన్న గ్రామీణ వ్యవసాయ కార్మిక వర్గానికి ఆహార వసతులలోనూ, వస్త్ర సరఫరాలోనూ ప్రభుత్వం సబ్సిడీ ఇయ్యడం 'అన్ ప్రొడక్టివ్'గా భావించడం న్యాయమేనా?

జ : మీకు నిజంగా 'న్యాయం' కావాలా? మీ మాటల్లోనే చెప్పాలంటే "తమ శ్రమకు తగిన ఫలితం లేక ఉసూరోమంటూ నిరాశా నిస్పృహలతో బ్రతుకుతోన్న" కార్మిక వర్గానికి, శ్రమకు తగిన ఫలితం ఎందుకు లేదో చెప్పిన మార్క్సిజం వుంది కదా? ఆ 'అసలైన న్యాయం' అక్కడ

లేదా మీకు ఏ బూర్జువా పార్టీ అయినా కార్మికుల కోసం ఖర్చుపెట్టే సబ్సిడీలు ఓట్లు సంపాదించాలనే దృష్టితోనే ఖర్చుపెడుతుందిగానీ, 'న్యాయా న్యాయాలు' ఆలోచించి, ఖర్చుపెడుతుందనుకుంటున్నారా? ఒక పార్టీ చేసే 'దాన ధర్మాలన్నీ' ఏ దృష్టితో జరుగుతాయో ఇంకో పార్టీకి తెలియదా? ఓట్లు సంపాదించడానికి అనుకూలించే పనులు ఒక పార్టీ చేస్తోంటే, ఇంకో పార్టీకి కడుపు మండదా? ఎవరికి కావలసిందైనా ఓట్లేగానీ, పేదల కష్ట సుఖాలు కావుగదా? కాబట్టి ఏ పార్టీ సంస్కరణలైనా 'న్యాయం' కోసం చేస్తున్నారంటే పేదలైనా నమ్ముతారుగానీ, ఇతర పార్టీలు నమ్మవు. అందుకే ఆ పార్టీ వాళ్ళు ఈ 'అన్ ప్రొడక్టివ్' ఖర్చు ఎందుకూ అనడం. కాంగ్రెస్సే ఆ రకం దాన ధర్మాలు చేస్తూ ఓట్లు సంపాదించడానికి చూస్తే తెలుగుదేశం పార్టీ అయినా అదే మాట అంటుంది. న్యాయా 'న్యాయాలు' తీసి గట్టున పెట్టండి.

*　　　*　　　*

ఎస్. శిలానాగర్, జిల్లా జైలు (నిజామాబాద్).

ప : పీపుల్స్‌వార్ గ్రూపులో అత్యంత ప్రముఖుడైన సత్యమూర్తిని ఎందుగురించి బహిష్కరించింద్రు? అతని లోపాలేంటి?

జ : నాకు తెలియదు. పీపుల్స్ వార్ గ్రూపు మనుషులకే రాసి తెలుసుకోండి. మీ సందేహాన్ని ఏదైనా పత్రికలో 'ప్రశ్నోత్తరం'గా రాయండి. లేదా, ఆ గ్రూపు మనుషులకు రాసి ఆ బహిష్కారానికి సంబంధించిన ప్రతాలేమైనా వుంటే మీకు పంపమని అడగండి.

ప్ర : ముక్కు సుబ్బారెడ్డి లొంగిపోవడానికి కారణాలేంటి? అతను ప్రభుత్వంతో ఎందుకు చేతులు కలపవలసి వచ్చింది?

జ : ఇది కూడా మీరు ఆ వ్యక్తినే అడగండి. మీ సందేహాల్ని ఏదైనా పత్రికలో వివరంగా రాయండి. అసలు వ్యక్తినించే ఏమైనా జవాబు రావచ్చు మీకు. అతనిమీద మాత్రమే ఆ ప్రశ్న ఎందుకు మీకు ? ఇప్పుడు 'అందరూ' ప్రభుత్వంతో చేతులు కలుపుతూనే వున్నారుకదా ? ప్రభుత్వంతో చేతులు కలపడానికి ఏదో కారణం వుంటుందనీ, 'ఆ కారణం ఏమిటబ్బా' అని తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నారా ?

* * *

వి. ఫణికుమార్, హైదరాబాదు.

ప్ర : గూండాలైతే షాపులమీద పడి, వర్తకుల నుంచి చందాలు వసూలు చేస్తారు. కమ్యూనిస్టులమని చెప్పుకునే వాళ్ళు, పెట్టుబడి దారుల నుంచీ, కంట్రాక్టర్లూ - వర్తకులూ - షాపు యజమానులూ మొదలైనవారి నుంచి కోటాలు నిర్ణయించి చందాలు వసూలు చెయ్యవచ్చా ?

జ : చెయ్యరాదు. ఎవరి నుంచైతే చందాలు వసూలు చేస్తారో వాళ్ళని 'రక్షించవలసిందే' గానీ వాళ్ళమీద ఏరకమైన పోరాటాలూ చెయ్యడానికి వీలులేదు. అంటే పెట్టుబడి దారులనుంచీ వర్తకుల నుంచీ చందాలు వసూలుచేసే కమ్యూనిస్టులు కార్మికవర్గ కార్యకర్తలుగా గాక, పెట్టుబడి దారీ వర్గ కార్యకర్తలుగా పనిచేస్తారన్నమాట ! కమ్యూనిస్టులమని చెప్పుకుంటూ, ఈ చందాల వసూళ్ళతో తిరిగేవాళ్ళు మామూలు గూండాలు కాదు, కమ్యూనిస్టు గూండాలు. మొత్తానికి అన్నిరకాల గూండాలూ కలిసి సేవ చేస్తున్నది పెట్టుబడి దారీ వర్గానికే !

* * *

కుమార్, ఢిల్లీ.

ప్ర : ఎవరి 'సృజన'ను వాళ్ళు కరెక్టుగా ఎస్టిమేట్ చేసుకోవడం

సాధ్యమేనా ? ఒక కవిత నిజంగా బావుంటే దానిని రాసిన కవీ, దానిని చదివేవాళ్ళూ ఒకే ఇన్‌టెన్సిటీలో ఫీల్ అవుతారా ?

జ : అలా జరగదని నా అభిప్రాయం. మంచి కవిత అయినా, పాట అయినా, చిత్రం అయినా అందరూ ఒకే రకంగా ఫీలవరు. పాఠకులు రకరకాల స్థాయిల్లో వుంటారు. ఎందుకంటే - 1. ఆ 'కళ'తో ఆ వ్యక్తులకు గతం నించీ వుండే సంబంధాన్నిబట్టీ, (ఆ సంబంధం ఎక్కువ కాలం నించా, తక్కువకాలం నించా ?); 2. ఆ 'కళ' గురించి తెలియడాన్నిబట్టీ (ఎక్కువ తెలుసా. తక్కువ తెలుసా ? సరిగా తెలుసా, అరకొరగా తెలుసా ?); 3. స్పందించే స్వభావాన్నిబట్టీ (ఆ కళ విషయంలో ఆ వ్యక్తి ఎక్కువ స్పందిస్తారా, తక్కువ స్పందిస్తారా ?) - ఈ అంశాల కలయికలు తేడాగా వుంటాయి కాబట్టీ, వాటివల్ల ఏర్పడే చైతన్యాలు కూడా తేడాగా వుంటాయి. దానివల్లే, అందరూ ఒకే స్థాయిలో ఫీలవకపోవడం జరుగుతుంది. 'కవిత'ని చదివేవారిలో కొందరు 'కవి'తో సమానంగానే ఫీల్ కావచ్చు; కొందరు ఫీల్ కాకపోవచ్చు. ఎవరి 'సృజన'ని వాళ్ళు అంచనా వేసుకోవడం కూడా, ఆ 'కళకి' సంబంధించి ఆ వ్యక్తికి వున్న చైతన్యాన్ని బట్టే వుంటుంది. కొందరు అతిగా అంచనా వేసుకోవచ్చు. విషయాలు చక్కగా తెలిసిన కవి, తను రాసింది బాగుండకపోతే బాగుండలేదని గ్రహించడం అసాధ్యం కాదు. తెలియని వ్యక్తికే అది అసాధ్యం. అలాంటి వ్యక్తులు తమ విషయంలోనేగాక ఇతరుల విషయంలో కూడా తగినంత స్థాయిలో బాగోగులు గ్రహించలేరు.

* * *

పి. శకుంతలమ్మ, అనంతపురం.

ప్ర : భారతదేశంలో ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో విప్లవోద్యమాలు పురోగమిస్తుంటే, మీ జవాబుల్లో అది ప్రతిబింబించడం లేదు. ఎందుకని

జ.: మీరు చెప్పే విప్లవ గ్రూపుల్లో ఎవ్వరూకూడా ఒక్క లీగల్ పత్రికనైనా క్రమం తప్పకుండా తీసుకు రాగలిగే పరిస్థితుల్లో లేరని, పత్రికల ధోరణే తెలియజేస్తోంది. "చందాలు తిన్నగా కట్టండి! ఎగ్గొట్టకండి" అని పత్రికా నిర్వాహకులు పదే పదే విజ్ఞప్తులు చెయ్యవలసిన పరిస్థితుల్లో విప్లవ పత్రికల పాఠకులు వున్నారంటే, విప్లవోద్యమాలు పురోగమించి పోతున్నాయని నేను నమ్మి, వాన్ని నా జవాబుల్లో ప్రకటించాలా ?

* * *

కేశవరావు, టిటాగడ్.

ప్ర : నాకు తెలిసిన ఒకాయన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని అధ్యయనం చేస్తూ, నిస్వార్థంగా, నిజాయితీగా వుంటాడు. కానీ పేద స్థితిలో వున్నారు. ఏదైనా చిన్న వ్యాపారం చెయ్యొచ్చు కదా అని మా స్నేహితులం సలహానిస్తూ వుంటాం. కానీ వ్యాపార మనేది లాభార్జనకోసమేననీ, అది దోపిడీ వరకూ దారితీస్తుందనీ, అలాంటప్పుడు మార్క్సిజం యొక్క మౌలిక విషయాలే భంగమౌతాయనే ఆయన వాదన. కాని జీవితం యొక్క కనీస అవసరాల్ని తీర్చుకొనే దృష్టితో ఆ పని చెయ్యొచ్చు కదా అని మా వాదన. ఆయనదే తప్పు అభిప్రాయమో, మాదే తప్పు అభిప్రాయమో, లేదా యిరువురిదీ తప్పు అభిప్రాయమో తేల్చుకోలేక పోతున్నాం! వివరిస్తారని ఆశిస్తూ....

జ : కార్మికులు లేకుండా కుటుంబ సభ్యులే వ్యాపారానికి సంబంధించిన పనులన్నీ చేసుకుంటే, ఆ వ్యాపారం ద్వారా మిగిలే ఆదాయం ఆ వ్యక్తుల శ్రమ ఫలితమే అవుతుంది. ఒక వేళ, కొందరు కార్మికుల్ని పెట్టుకున్నా ఆ యజమాని కూడా శ్రమ చేస్తూ కార్మికుల మీద 'యజమానితనం' నెరపకుండా, ఇతర యజమానులు ఇచ్చే జీతాలకన్నా ఎక్కువ

జీతాలు ఇస్తూ, 'పని స్థలం'లో తగిన సౌకర్యాలు కల్పిస్తూ కార్మికులతో మితిమీరిన శ్రమ చేయించి పీడించకుండా, మార్క్సిజం తెలిసిన వ్యక్తిగా కార్మికులతో ప్రవర్తిస్తూ వుంటే (నిజంగా ఇలా చేస్తే) ఇది కూడా మంచిదే. ప్రస్తుత సమాజంలో ఎవరి బతుకుతెరువు కోసం వాళ్ళే వెతుక్కోవాలి. వుద్యోగాలు దొరక్కపోయినా, చిన్నస్థాయి వుద్యోగాలతో కుటుంబ అవసరాలు తీరకపోయినా ఆ కుటుంబం చిన్న పరిశ్రమో, చిన్న వ్యాపారమో చేసుకోక తప్పదు. లేకపోతే జీవించడమే సాధ్యంకాదు. కాబట్టి, కుటుంబ సభ్యుల శ్రమతోనే నిర్వహించుకోగలిగే ఏ పని అయినా చేసుకోవచ్చు. అందులో ఇతరుల శ్రమని దోచడం వుండదు. లేదా కార్మికుల్ని పెట్టుకోవడం తప్పనిసరి అయ్యే పరిశ్రమో, వ్యాపారమో అయితే, ఇంతకు ముందు చెప్పినట్టు కార్మికులతో ప్రవర్తించాలి. కార్మికుల్ని పెట్టుకోవడంవల్ల పరిశ్రమగానీ వ్యాపారంగానీ కొంత ఎక్కువ స్థాయిలో నడుస్తుంది కాబట్టి, యజమానికి ఎక్కువ ఆదాయం వుంటుంది. అందులో నుంచి కార్మికులకోసం ఎక్కువ ఖర్చుపెడితే యజమానికి మిగిలే ఆదాయం తగ్గుతుంది. ఆ మిగిలిన ఆదాయం యజమాని చేసిన స్వంత శ్రమ ఫలితంగా వుంటుంది, కాబట్టి మార్క్సిస్టు దృక్పథం కలిగిన వ్యక్తులు కూడా ప్రస్తుత సమాజంలో. 'యజమాని తనవు దురహంకారంలేని' యజమానులుగా వుంటూ, చిన్న స్థాయి పరిశ్రమలో, వ్యాపారాలో చేసుకుంటూ జీవించడంలో ఏమీ తప్పులేదు.

కె. రమామణి, టి.పి.గూడెం.

ప్ర : కొంతకాలం క్రిందట ఒక పత్రికలో చదివాను. వివరాలు గుర్తులేవు. ఒక ఇంగ్లీషు వనితకు ఒక గాయకుడెవరో చాలా ఇష్టమట. ఆమె గర్భవతిగా వున్నకాలంలో ఆ గాయకుడి గీతాలు ఎక్కువగా వింటూ

వుండేదట. ఆమెకు పుట్టిన బిడ్డకు ఎడం చేతి భుజంమీద ఆ గాయకుడి ముఖం బొమ్మ వున్నదట. ఆ పత్రికలో ఆ బిడ్డ ఫోటో కూడా వేశారు. బిడ్డ భుజంమీద ఒక మనిషి ముఖం బొమ్మ గీచినట్లు ఉంది. ఇది సైన్సు పరంగా సాధ్యమంటారా? ఆ బొమ్మ మా ఇంట్లోవారందరికీ అమితాశ్చర్యం కలిగించింది.

జ : అది సైన్సు పరంగా కాదు, 'పెట్టుబడిదారీ బిజినెస్ పరంగా' మాత్రమే సాధ్యం. వింతలూ, విడ్డూరాలూ అనే పేర్లతో పత్రికల్లో వచ్చే వార్తల్లో నూటికి 90 వార్తలు పచ్చి అబద్ధాలే వుంటాయి. కొన్ని సంస్థలు ఇలాంటి దొంగవార్తలు తయారుచేసి, వాటికోసం దొంగ ఫోటోలు కూడా తీసి, వాటిని పత్రికలకు సరఫరాచేస్తూ వుంటాయి. ప్రతీసరుకులోనూ 'కల్తీ' వుండదూ? బియ్యంలో కలపడానికి రాళ్ళు ప్రత్యేకంగా తయారుచెయ్యరూ? అలాగే వార్తల్లో కల్తీకూడా! ఎక్కడో పెన్సిల్వేనియాలో ఫలానా గ్రామంలో ఒక బాలిక తన పునర్జన్మ సంగతులన్నీ చెప్పేసిందంటే ఈ దేశంలో ఎవరు కాదంటారు? పెన్సిల్వేనియా పోయి ఆ గ్రామంలో ఎవరు చూసొచ్చారు? తూర్పు కెనడాలో ఫలానా వూళ్ళో ఫలానా బాలుడు పుట్టగానే పరిగెత్తాడంటేనో, అసలు కడుపులో వుండగానే రోజూ 'తండ్రికి నమస్కారం పెట్టేవాడం'టేనో, దాన్నిమాత్రం ఎవరు కాదంటారు? ఇరాన్‌లోనో ఎక్కడో కడుపులో బిడ్డ మాట్లాడుతోందనే వార్త కొన్నాళ్ళు ప్రచారమై, తర్వాత అది 'బట్టల్లో టేప్ రికార్డర్ పెట్టుకొని చేసినమోసం' అని బయట పడలేదూ? అలాగే, ఈ వింతలన్నీ రకరకాల పద్ధతుల్లో జరిగే మోసాలే. ఏది రాసినా, ఎలా రాసినా ఆలోచించేవాళ్ళూ, ప్రశ్నించేవాళ్ళూ వుంటేకదా? ఈ కల్తీ వార్తలనే వ్యాపార పత్రికలు పోటీలు పడి అందిస్తూ వుంటాయి. మీరు చదివిన వార్త మీ ఇంటిల్లిపాదికీ ఆశ్చర్యం కలిగించింది కదా? దాన్ని చదివిన వెంటనే మీరు "ఇదెలా సాధ్యం? పచ్చి అబద్ధంలా ఉంది"

అనుకోలేకపోయారు కదా? మీరా వింతవార్తని ఆశ్చర్యంతో ఇతర్లకు కూడా చెపుతారు కదా? వాళ్ళు కూడా ఆ పత్రికను ఆసక్తిగా చూస్తారు. అలాంటి వార్తలే ఆ పత్రికలో తరుచుగా వస్తూవుంటే, ఆ పత్రిక ఎక్కడెక్కడి 'గొప్ప' వార్తలూ అందించే పత్రికలా కనిపిస్తుంది. అదే కావాలి పత్రికల వర్తకానికి. 'పెట్టుబడిదారీ వర్తకం' అంటే ఏమిటనుకుంటున్నారు? అసలు 'వర్తకం' అంటేనే మోసం. 'వర్తకం'లో వర్తక మోసాలు వుండి తీరతాయి. వెనకటి కాలపు వర్తకంలో ఇంత పోటీ లేదు కాబట్టి, ఇంత కక్తికి అవకాశం లేదు. కానీ పెట్టుబడిదారీ వర్తకం అంటే, దానికి ఉచ్ఛ నీచాలు వుండవు. డబ్బు కుప్పల్ని పోగుచెయ్యటమే దాని బతుకు. పాఠకుల్ని మోసంగా ఆకర్షించడం కోసం ఎంతెంత తప్పుడు వార్తలైనా సృష్టిస్తారు వాళ్ళు. పాఠకుల్లో నూటికి 99 మందికి ఏదైనా వింతవార్త చదివినప్పుడు, 'ఇది నిజమా? ఇది సాధ్యమా' అని ఒక్క క్షణం కూడా ఆలోచించే దృష్టి వుండదు. దేవుళ్ళనీ, దెయ్యాల్నీ, బాబాల్నీ, అమ్మల్నీ, మంత్రాల్నీ, చేతబళ్ళనీ, ప్రతీ అడ్డమైనదాన్నీ నమ్మేవాళ్ళకి పత్రికల్లో చదివే వార్తల్లో మాత్రం సందేహం ఎందుకు కలుగుతుంది? కాళ్ళూ చేతులూ ఉపయోగించడమేగానీ, 'తలకాయను' ఉపయోగించడం మనుషుల్లో ఇంకా ప్రారంభం కాలేదు. అలాంటి స్థాయిలో వున్న మనుష్యుల్ని నమ్మించి డబ్బు చేసుకోవడం ఎంతో తేలిక! దానికోసమే రకరకాల బిజినెస్‌లు.

కె. కిషోర్ కుమార్, విజయవాడ.

ప్ర : న్యూటన్ మహాశయుడు 'లా ఆఫ్ మోషన్' లో "నథింగ్ ఈజ్ అబ్సల్యూట్, ఎవ్విరి థింగ్ ఈజ్ రెలెటివ్" అని పేర్కొన్నాడు. ఈ సిద్ధాంతం సామాజిక జీవన విధానంలో కూడా వర్తిస్తుందని ఎం. ఎ. పొలిటికల్ సైన్సు సబ్జెక్టులో కూడా వున్నది. ఏ విధంగా అంటే, మంచి

అనేది ఏదీ నిర్దిష్టంగా ఏమీ వుండదు. మంచీ, చెడూ అనేవి పరిస్థితులను బట్టీ, కాలాన్నిబట్టీ, మనుషులయొక్క మనస్తత్వాలనుబట్టీ మారుతూ వుంటవి- అని. ఇది ఎంతవరకూ సమంజసమైనది? తెలుపగోరుతాను.

జ : మీరు ఉదహరించిన సూత్రం 'ప్రకృతి' విషయాలకు సంబంధించినది. ప్రకృతి సూత్రాలు, సామాజిక విషయాలకు యథాతథంగా వర్తించవు.

మొదట ప్రకృతి విషయాలు చూడండి: ఒక 'కొండ'ని చూసి, 'ఇది పెద్దదా, చిన్నదా' అంటే, 'పెద్దది' అనో, 'చిన్నది' అనో నిర్ణయించడం సాధ్యం కాదు. అంతకన్నా పెద్ద కొండతో పోలిస్తే అది చిన్నదే, చిన్న కొండతో పోలిస్తే అది పెద్దదే! కాబట్టి చిన్నా-పెద్దా అనే మాటలు ఇంకో దానితో పోల్చి (రెలెటివ్‌గా) చెప్పగలిగే మాటలేగానీ, స్వతంత్ర సత్యాలు కావు.

ప్రకృతికి సంబంధించినదే ఇంకో రకం ఉదాహరణ: పిల్లి ఎలకని చంపుతుంది. అది మంచిదా, చెడ్డదా? ఇక్కడ మంచి చెడ్డల ప్రసక్తి లేదు. ఇది ప్రకృతి నియమం. ఒకవేళ దీన్ని 'పిల్లి కి మంచీ, ఎలకకి చెడ్డా' అని మనుషుల అర్థంతో మాట్లాడినా, ఈ మంచి చెడ్డల్ని ఎలుకలుగానీ, పిల్లులుగానీ, మనుషులుగానీ మార్చలేరు. ప్రకృతి నియమాలకు మంచి చెడ్డలు వుండవు.

'ప్రకృతి'కి సంబంధించి ఈ 2 ఉదాహరణల్లోనూ చూసిన అంశాలు 'సామాజిక' విషయాలకు యథాతథంగా వర్తించవు. 'ప్రకృతి' విషయాల్లో మంచి చెడ్డల ప్రసక్తే వుండదు. సామాజిక విషయాల్లో ప్రతీచోటా అదే వుంటుంది. ఆ 'వుండడం' కూడా 'రెలెటివ్'గా మాత్రమేగాక, 'అబ్సొల్యూట్'గా (స్వతంత్ర సత్యంగా) కూడా వుంటుంది.

'దోపిడీ'ని తీసుకుందాం. అది శ్రమచేసే మనిషికి చెడ్డదీ, శ్రమని దోచే మనిషికి మంచిదీ! ఇక్కడ 'మంచి చెడ్డల' ప్రసక్తి వుంది. అంత వరకే చూస్తే అది 'రెలెటివ్'గా వున్నట్టు మాత్రమే కనబడుతుంది. కానీ అంతేకాదు. ఇది "పిల్లి ఎలకని చంపడం" లాంటి సహజ నియమంకాదు. "దోపిడీ మంచిదో, చెడ్డదో చెప్పలేం" అని గానీ; "దోపిడీని ఏదో ఒక వర్గం వేపునుంచి చూసినప్పుడే దాని మంచి చెడ్డలు చెప్పగలం. దానికై దాన్ని విడిగా చూసి అది మంచిదో, చెడ్డదో చెప్పలేం" అనిగానీ అనడానికి వీలు లేదు. దోపిడీని ఒక స్వతంత్ర విషయంగా కూడా చూడవచ్చు. ఏ వర్గంవేపునించీ చూడకుండా కూడా దాని అసలు సత్యాన్ని గ్రహించవచ్చు. కొందరు మనుషులు, మరి కొందరు మనుషుల శ్రమని లాక్కోవడమే దోపిడీ కాబట్టి "దోపిడీ చెడ్డది" అని తార్కికంగా నిర్ణయించవచ్చు. అది స్వతంత్ర సత్యమే.

అంటే, ప్రకృతి విషయాల్ని రెలెటివ్‌గా మాత్రమే చూడగలిగితే, సామాజిక విషయాల్ని 'రెలెటివ్' గానూ, 'అబ్సల్యూట్' గానూ కూడా చూడగలం.

దోపిడీ - ఒక వర్గానికి మంచిదీ, ఒక వర్గానికి చెడ్డదీ- అంటే అది రెలెటివ్‌గా చూడడం! దోపిడీ- 'మొత్తం సమాజానికే చెడ్డది' అంటే, అది అబ్సల్యూట్‌గా చూడడం! ఈ రెండోదే అసలైన సత్యం. 'దోపిడీ'ని రెలెటివ్‌గా చూసి, 'అది ఒక వర్గానికి మంచిదే' అన్నప్పుడు ఆ మంచి ఎలాంటిది? అది, శ్రమ చెయ్యకుండానే అన్యాయం చేస్తూ జీవించడమే. కాబట్టి, అది ఆ వర్గానికి కూడా సహజమైన మంచికాదు. అందుకే 'దోపిడీ అనేది, సమాజానికంతటికీ చెడ్డదే' అనేదే అసలైన సత్యం.

ఏ విషయాన్నయినా రెలెటివ్‌గా మాత్రమే చూసేవాళ్ళు దాని అసలు సత్యాన్ని అర్థంచేసుకోరు. వాళ్ళకి మంచికీ, చెడ్డకీ తేడా తెలియదు. "మంచి చెడ్డల్ని ఎలా నిర్ణయించగలం? ఒకరికి చెడ్డదైన విషయమే ఇంకొకరికి మంచిదవుతుంది కదా? కాబట్టి, ఇది మంచీ, ఇదీ చెడ్డా అని నిర్ణయించలేం. ఇది తప్పూ, ఇది ఒప్పూ అని నిర్ణయించలేం. ఇది నీతీ, ఇది అవినీతీ అని నిర్ణయించలేం" అని, 'సారాంశం'లో చెడ్డకే వంతపాడే సూత్రీకరణలు చేస్తారు. వీళ్ళు ప్రకృతి విషయాల్నీ సామాజిక విషయాల్నీ కలగా పులగం చేస్తారు.

వీళ్ళ ప్రకారం అయితే—'సతీసహగమనం' మంచిదో చెడ్డదో నిర్ణయించలేరు. ఆ మంచి చెడ్డలు ఆ పరిస్థితుల్ని బట్టీ, సహగమనం చేసే, చేయించే మనుషుల్ని బట్టీ వుంటాయి! అలాగే, మనుషుల్ని బలి ఇవ్వడం మంచిదో చెడ్డదో నిర్ణయించలేరు. ఆ మంచి చెడ్డలు, ఆ పరిస్థితుల్ని బట్టీ బలి ఇచ్చే, బలిపడే మనుషుల్ని బట్టీ వుంటాయి! అలాగే, 'వ్యభిచారం' మంచిదో చెడ్డదో నిర్ణయించలేరు! ఆ మంచి చెడ్డలు, ఆ పరిస్థితుల్ని బట్టీ ఆ మనుషుల్ని బట్టీ వుంటాయి. వాళ్ళ ప్రకారం ప్రతిదీ ఇంతే.

కానీ, సామాజిక విషయాల్ని కేవలం రెలెటివ్‌గానే కాక, అబ్సల్యూట్‌గా కూడా గ్రహించేవాళ్ళ ప్రకారం, ఏ విషయాన్నయినా ఇది మంచిదీ, ఇది చెడ్డదీ అని చాలా స్పష్టంగా నిర్ణయించవచ్చు. వ్యభిచారం ఈనాటిదైనా, ఆనాటిదైనా, ఏనాటిదైనా చెడ్డదే. దాని మంచి చెడ్డలు, పరిస్థితుల్ని బట్టి గానీ, ఆ మనుషుల్ని బట్టి గానీ వుండవు. 'గర్వం' ఏ పరిస్థితుల్లోనైనా చెడ్డదే. దాని మంచి చెడ్డలు పరిస్థితుల్ని బట్టీ, మనుషుల్ని బట్టీ వుండవు. 'నిగర్వం' ఏ పరిస్థితుల్లోనైనా మంచిదే. దాని మంచి చెడ్డలు కూడా ఆ పరిస్థితుల్ని బట్టీ, ఆ మనుషుల్ని బట్టీ వుండవు.

దేనితోనూ పోల్చకుండా చూసినప్పుడు కూడా దానికదే మంచిది గానూ, దానికదే చెడ్డదిగానూ వుండే 'శాశ్వత సామాజిక సత్యాలు' అనేకం వున్నాయి.

మీరు చెప్పిన పొలిటికల్ సైన్సు పుస్తకం —పెట్టుబడిదారీ దృష్టితో రాసినది. అందుకే ఆ రచయిత 'మంచి' అనేది నిర్దిష్టంగా వుండదని చెప్పాడు. అలా చెప్తేనే కదా - చాలా అక్రమాల్ని మంచో చెడ్డో తేల్చ కుండా తప్పించుకోగలడు? "మంచి చెడ్డల్ని ఖచ్చితంగా నిర్ణయించగలం" అని చెప్తే, ఆ చెడ్డని వదిలేసి ఆ మంచినే అనుసరించవలసి వుంటుంది కదా? అది వాళ్ళ పునాదినే కూలుస్తుంది కదా? కాబట్టి మంచి చెడ్డల్నీ, తప్పొప్పుల్నీ నిర్దిష్టంగా తేల్చలేమని వాళ్ళ సైన్సు చెపుతుంది.

పరీక్షలు పేసవ్వడానికే ఆ పుస్తకాలు. సామాజికమైన నిజానిజాలు గ్రహించడానికి అవి ఎందుకూ పనికిరావు. చదువులు అయిపోయాక ఆ పుస్తకాలన్నీ అవతల పారెయ్యండి! మళ్ళీ వాటి మొహం చూడొద్దు.

* * *

పమిడి శ్రీనివాసరావు, తిరుపతి.

ప్ర : "దోపిడీ వర్గము మరియు శ్రామిక వర్గాల ఇద్దరి ప్రయోజ నాన్నీ, ఆశించే సంయుక్త సాహిత్యం ఎప్పుడూ వుండదు! అది ఏదో ఒక వర్గం ప్రయోజనాన్ని మాత్రమే ఆశిస్తుంది" అని మీరు "రామాయణ విషవృక్షం" రెండవ భాగంలో వ్రాశారు. సైన్సు కూడా సాహిత్యమే కదా! మరి ఆ సైన్స్-సాహిత్యం ఏ వర్గ ప్రయోజనానికి చెందింది?

జ : 'సాహిత్యం' అని దేన్ని అంటామో సైన్సు ఆ రకం సాహిత్యం కాదు. 'సైన్సు' అంటే 'ప్రకృతి' సూత్రాలకు సంబంధించిన జ్ఞానం. ఆ సూత్రాల్ని, సూత్రాలుగా చూసినప్పుడు అవి ఏ వర్గానికి చెంద

నివే. కానీ, ఆ సూత్రాల్ని 'వుపయోగించడం'లో తప్పని సరిగా వర్గాల ప్రమేయం వుంటుంది. ప్రకృతి సూత్రాల్ని కనిపెట్టడానికి మేధా శ్రమలూ, శారీరక శ్రమలూ చేసేది శ్రామిక వర్గమే. ఆ సూత్రాల్ని వుపయోగించడం ద్వారా వాటి ఫలితాల్ని 'ఎక్కువ వుత్పత్తి' రూపంలోనూ, 'సుఖాల' రూపంలోనూ అనుభవించేది దోపిడీ వర్గం. 'సైన్స్'కి చాలా స్పష్టమైన వుదాహరణ తీసుకోవాలంటే ఏదైనాయంత్రాన్ని తీసుకోవచ్చు. యంత్రాన్ని నిర్మించడంలో సైన్సుని ఎలా కావాలంటే అలా వుపయోగించవచ్చు. యంత్రాన్ని సాధారణ వేగంతోనూ చెయ్యవచ్చు. ఎక్కువ వేగంతోనూ చెయ్యవచ్చు. యంత్రం నిదానంగా కదిలితే, యంత్రం మీద పనిచేసే మనుషులు నిదానంగా పని చెయ్యగలుగుతారు. యంత్రం ఎక్కువవేగంగా కదులుతూ వుంటే, పని చేసే మనుషులు కూడా యంత్రం వేగానికి తగ్గట్టుగా చకచకా పనిచెయ్యవలసి వుంటుంది. దానివల్ల ఎక్కువ పని జరుగుతుంది. అంటే, యంత్రం ఎక్కువ వేగంగా వుంటే పని చేసే మనుషులు ఎక్కువ పని చేస్తారు. ఆ 'పని విలువ'లో నించీ వాళ్ళ 'జీతాల్ని' తీసివేస్తే యజమానికి మిగిలే భాగం ఎక్కువగా వుంటుంది. కాబట్టి, కార్మికులతో ఎక్కువ పని చేయించే టెక్నిక్కులతో యంత్రం తయారైతే అది పెట్టుబడిదారుడికి ఎక్కువ లాభం. యంత్రంమీద పనిచేసే మనిషి చేతులు ఏ స్పీడుతో కదలాలో యంత్రం యజమానే నిర్ణయిస్తాడు. (అంటే, పని చేసే మనిషి కదలికల్ని, పని చెయ్యని మనిషి నిర్ణయిస్తాడు! దీనినే 'యజమానీ వర్కరూ కూడా ఒకే రకంగా స్వేచ్ఛగా, సమానంగా వున్నారు' అంటారు పెట్టుబడిదారీ మేధావులు!) పనిచేసే మనుషుల శారీరక మానసిక కష్టాలూ, వారి సుఖ దుఃఖాలూ, వారి ఆరోగ్యాలూ వగైరాలేవీ యజమానికి పట్టవు. కార్మికులనించీ ఎంత ఎక్కువ వీలైతే అంత ఎక్కువ పనిని లాగే టెక్నిక్కులే యజమానికి కావాలి. "అలాంటి యంత్రం

కావాలి" అని యజమాని తన ఇంజనీర్లకి ఆజ్ఞాపిస్తాడు. ఆ ఇంజనీర్లు కూడా ఆ యజమాని దగ్గిర పని వాళ్ళే. వాళ్ళు మేధాశ్రమలు చేస్తారు. ఆ ఇంజనీర్లు యజమానితో "ఈ యంత్రం అంత స్పీడుగా తిరగకూడదు. దాని మీద పని చేసే మనిషి చాలా తొందరగా అలిసిపోతాడు దాని వల్ల ఎక్కువ యాక్సిడెంట్లు కూడా జరుగుతాయి" అంటారనుకుందాం.

యజమాని కళ్ళెర్రజేస్తాడు - "ఎక్కువ యాక్సిడెంట్ల మాట చెప్పకండి. ఎక్కువ 'పని' జరుగుతుందా, లేదా?"

"జరుగుతుంది సార్"

"మరింకేం? 'వర్క్' దృష్టితో వుండండయ్యా! 'వుత్పత్తి'ని పెంచాలి! నిదానంగా సోమరిపోతుల్లాగ కునికిపాట్లు పడుతూ పని చెయ్యాలంటే యంత్రాలెందుకూ? చెప్పినట్టు చెయ్యండి. ఆ యంత్రం అలాగే కావాలి నాకు. మీకు జీతాలు ఇచ్చేది నేను చెప్పినట్టు చెయ్యడానికేగానీ, నాకు సలహాలు ఇవ్వడానికి కాదు. మళ్ళీ నోరెత్తితే నేను వేరే ఇంజనీర్లనీ మీరు వేరే యజమానినీ చూసుకోవలసి వుంటుంది."

వేరే యజమాని కూడా ఇదే అంటాడని ఇంజనీర్లకి తెలుసు. కాబట్టి వాళ్ళు తమ 'సలహాలు' కట్టిపెడతారు. "యంత్రాల్ని అలా తయారు చెయ్యం" అనవలసిన అవసరం వాళ్ళకేం వుంది? రేపు ఆ యంత్రం మీద పని చెయ్యవలసింది వాళ్ళు కారు గదా? యజమానికి కోపం తెప్పించి వుద్యోగాలు పోగొట్టుకోవడం ఎందుకు? కాబట్టి వాళ్ళు, యంత్రాల టెక్నిక్కుల్లో ప్రయోగాలు చేసీ చేసీ యజమాని కూడా విస్తుబోయే విధంగా యంత్రాన్ని తయారుచేసి ప్రత్యేక బహుమతులు పొందుతారు. అసలు, యజమాని అంత చెప్పక ముందే, వాళ్ళు చదువుకునే రోజులనించే 'యజమానుల్ని ఆనందపెట్టే' టెక్నిక్కుల దృష్టితోనే వాళ్లు వుంటారు

యంత్రం నెమ్మదిగా కదిలినా, వేగంగా కదిలినా సూత్రాలు ఒకటే. కానీ, 'యజమాని లాభం' దృష్టితో ఆలోచిస్తే ఒక రకంగానూ, 'పనిచేసే మను షుల క్షేమం' దృష్టితో ఆలోచిస్తే ఇంకోరకంగానూ యంత్రం తయారవ వలసి వుంటుంది. అంటే, సహజంగా ఏ వర్గానికీ చెందని సైన్సుసూత్రాల్ని ఏ వర్గం కోసం కావాలంటే ఆ వర్గం కోసం వుపయోగించవచ్చునన్న మాట!

చార్లీ చాప్లిన్ తీసిన 'మోడరన్ టైమ్స్' సినిమాలో ఒక కార్మికుడు యంత్రం లెక్కిక్కులకు విసిగెత్తిపోయి పిచ్చివాడైపోతాడు.

ఈ మధ్య, అమెరికాలో ఒక కంపెనీలో కార్మికుడు పనిలోవుండగా పిచ్చివాడైపోయి, తుపాకీతో సూపర్‌వైజర్లని వేశ్చేశాడు తర్వాత కేసు నడిచినప్పుడు, జడ్జీ కూడా ఆ పని స్థలాన్నీ, పని పద్ధతుల్నీ చూసి- "ఈ పనిలో కార్మికులకు పిచ్చెత్తకపోతే ఆశ్చర్యంగానీ, పిచ్చెత్తితే ఆశ్చర్యం లేదు" అన్నాడు.

'కత్తి'ని ఎవరూ వుపయోగించకుండా వున్నప్పుడు అది ఏ పక్షానికీ చెందదు. కానీ దాన్ని వంట మనిషి వుపయోగిస్తే ఒక రకంగానూ, హంతకుడు వుపయోగిస్తే ఇంకో రకంగానూ పని చేస్తుంది. దాన్ని వుప యోగించే వ్యక్తి దృష్టిని బట్టి అది పనిచేస్తుంది. సైన్సు సూత్రాలన్నీ అలాంటివే. వాటిని వుపయోగించ కుండా వున్నప్పుడు అవి ఏ వర్గానికీ చెందవు కానీ, వాటిని వుపయోగించేటప్పుడు ఏ వర్గ ప్రయోజనాల కోసం, ఎలా కావాలంటే అలా వుపయోగించవచ్చు. ఈ సమాజంలో కంప్యూ టర్లు ఏ వర్గానికి వుపయోగం? రాకెట్లు ఏ వర్గానికి వుపయోగం? ఆయుధా లన్నీ ఏ వర్గానికి వుపయోగం? శ్రామిక ప్రజలకు మంచినీళ్ళే లేని సమా జంలో కంప్యూటర్లూ, రాకెట్లూ ఎందుకు?

'సోషలిస్టు సమాజాలు' అని చెప్పుకునే దేశాల్లోకూడా, యంత్రాల నిర్మాణం దగ్గర్నించి ప్రతి అంశాన్నీ 'లాభ దృష్టి'తోటే, పెట్టుబడిదారీ టెక్నిక్కులతోటే రూపొందిస్తున్నారు. ఎందుకంటే, అక్కడకూడా పెట్టుబడిదారీ దేశాల్లాగే, పరిపాలనాధికారం, 'శ్రమ చెయ్యకుండా అదనపు విలువని తింటూవున్న వర్గం చేతుల్లోనే' వుంది. అక్కడకూడా, మేధా శ్రమల వర్గం, ప్రత్యేక సౌకర్యాలు పొందుతూ 'పెట్టుబడిదారీ లాభదృష్టి తోనే' వుంది! అక్కడకూడా శారీరక శ్రమల వర్గం, మహా వెనకబడ్డ తప్పుడు చైతన్యంతోటీ, వ్యసనాలతోటీ వుంది. కాబట్టి, ప్రతీ 'సోషలిస్టు' దేశమూ, జపాన్, జర్మనీ, అమెరికా టెక్నిక్కుల్ని అనుకరించే దృష్టితోనే వుంది.

కాబట్టి 'సైన్సు' కూడా ఆచరణలోకి దిగినప్పుడు 'వర్గాతీతమైనదిగా వుండదనే సంగతి' అర్థం చేసుకోండి.

* * *

పి. శకుంతలమ్మ, అనంతపురం.

ప్ర: ఎంతెంతో చదువుకున్నవాళ్ళుకూడా మూఢనమ్మకాలతో ప్రవర్తించడం ఆశ్చర్యంకొల్పుతోంది. డాక్టర్లుకూడా కాశీలు,గయలు తిరపతులు పోయి పూజలుచేసివస్తున్నారు. చుక్కల్నితాకివస్తున్న ఈ రాకెట్టుయుగంలో యింకా ఈ మూఢనమ్మకాలేమిటి.

జ: మూఢనమ్మకాలకున్న 'ఆస్తి' మూలాన్ని తెలుసుకోలేకపోవటం మూఢనమ్మకంకాదూ? కోట్లకొద్దీ జనం మంచినీళ్ళయినాలేక జంతువుల కన్నా హీనంగా జీవిస్తూవుంటే, కనీసపు పోషకాహారంలేక రోజూ వేల కొద్దీ పిల్లలు గుడ్డివాళ్ళు, చెవిటివాళ్ళూ అయిపోతూవుంటే, 'రాకెట్లు ఎందుక'నే ప్రశ్న లేకపోవడం మూఢనమ్మకంకాదూ? 'రాకెట్టు యుగమ'నీ, 'కంప్యూటర్ యుగమ'నీ, 'రాబోట్ల యుగమ'నీ పెట్టుబడిదార్లు తమ

ప్రయోజనాలకోసం పెంచేస్తున్న యంత్రాల్నిచూసి ముగ్ధులైపోవడం మూఢ నమ్మకం కాదూ? అలాగే, వాళ్ళ మూఢనమ్మకాలు వాళ్ళవి.

*   *   *

ఎం. మేఘశ్యాం, భీమవరం.

ప్ర: నేను నాస్తికుడిని. మీరు 'దేముడుంటే మన సెన్సెస్‌కిగానీ, ప్రయోగాలకుగానీ అందాల'ని రాశారు. విద్యుత్ ఉందికాబట్టి తీగలలోకి వస్తోంది. అలాగే, ఇన్‌ఫ్రా కిరణాలు, అల్ట్రా కిరణాలు ఈ మధ్యనే కనిపెట్టారు. వాటిని కనిపెట్టేవరకూ అవి వున్నాయని మనకు తెలియదు. మనకు తెలియనంత మాత్రాన అవి లేవనలేము కదా? అలాగే, దేముడు ఇప్పుడు మన ప్రయోగాలకు అందకపోవచ్చు. కానీ, తర్వాతకాలంలో అది బయటపడవచ్చు కదా?

జ: 'బయట పడ్డప్పుడు' మాట్లాడండి. అప్పుడు చెప్పండి-"అదిగో దేవుడు వున్నాడు. ఇక్కడ కనపడుతున్నాడు చూడండి" అని, అప్పుడు అందరికీ చూపించండి. ఇప్పటికైతే 'బయటపడలేద'కదా? ఇంకా బయట పడనిదాన్ని గురించి—'వున్నాడు, వున్నాడు' అని ఇప్పుడే ఎందుకుమాట్లాడ తారు? 'మనకు తెలియనంతమాత్రాన లేదనలేముకదా' అంటున్నారు. మనకు తెలియనిదాన్ని లేదనలేముగానీ, తెలియనిదాన్ని 'వుంద'నగలమా? 'వుందో లేదో తెలీదుకదా' అని సందేహించేవాళ్ళు (మీ రకం వాదన చేసేవాళ్ళు) 'ఇంకా తెలీదు' అనిమాత్రమే అనాలిగానీ, 'వుంది' అనో, 'వుండొచ్చు' అనో ఇప్పుడే ఎలా అనగలుగుతారు? విద్యుత్‌లా, కిరణాలలా ప్రకృతిలో 'వున్నాయి' కాబట్టి, కొంతకాలానికి కనపడ్డాయి. 'లేనిది' కూడా కొంత కాలానికి కనపడి తీరుతుందా? లేనిదైతే ఎంతకాలానికీ 'కనపడకపోవచ్చు' కూడా కదా? కాబట్టి, 'వుందో లేదో తెలీదు' అనే సందేహంతో వున్న వాళ్ళకీ, 'కొంతకాలానికైనా కనపడవచ్చుకదా' అని వాదించే హక్కు వుండదు. వాళ్ళు ఎంతసేపూ 'ఇంకా తెలీదు, ఇంకా తెలీదు' అనిమాత్రమే

అనవలసి వుంటుంది. నాస్తికులకైతే ఈ 'ఇంకాతెలీదు' సూత్రం అవసరం లేదు. వాళ్ళకి ఇంకా తెలియనిదేమీలేదు. దేవుడు లేకపోవడమే హేతుబద్ధమైన సంగతి అని వాళ్ళకి ఇప్పటికే తెలుసు. ఒక 'సృష్టికర్త'ని వూహిస్తే ఆ సృష్టికర్త కోసం ఇంకో సృష్టికర్తా, మరో సృష్టికర్తా........ ఇలా సృష్టికర్తల వరసకి అంతం వుండదు కాబట్టి, సృష్టికర్తలు వున్నారని ఎప్పటికీ బయటపడదని వాళ్ళ అర్థం. 'లేనిదాన్ని' వున్నట్టు రుజువుచేసే ఆధారాలు ఎప్పటికీ దొరకవు. నాస్తికులు, తమ తర్కంతో, 'దేవుడు లేడు' అని ఇప్పటికే గ్రహించేశారు. 'వుందో లేదో' అనిగానీ, 'రేపు కనపడవచ్చేమో' అనిగానీ వాళ్ళకి సందేహం లేదు. దేవుడు ఎప్పటికీ కనపడడనీ, ప్రకృతిఅంతా భౌతికమైనదనీ వాళ్ళకి ఇప్పటికే తెలుసు. ఈ విషయాల్లో సందేహాలు వుంటూ మీరు 'నేను నాస్తికుడిని' అని ఎలా చెప్పుకున్నారు?

* * *

సూరం సురేష్, మద్రాసు.

ప్ర: 100 మందిలో 70 మందే ఓటర్లు (ఓటువేసే వయసు గల వారు). ఆ 70 మందిలో ఓటువేసేవారు 70 శాతం. అంటే 49 మంది. ఆ 49 మందిలో 40 శాతం ఎవరికి ఓటేస్తే వారికి అధికారం. అంటే 20 మంది, ఎవరికివేస్తే వారికి: ఆ 20 మందిలో 10 దొంగఓట్లు, 5 సారా ఓట్లు, 3 డబ్బు ఓట్లు, 1 కులం ఓటు, 1 ప్రాంతీయతత్వం ఓటు.

ఇదేనా 'ప్రజాస్వామ్యం' అంటే?

జ: అవును, అదే 'పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం' అంటే!

* * *

కె. శ్రీను, నల్లూరు.

ప్ర: నేను ఇటీవల "మూగ మనసులు" సినిమా చూశాను. ఆ సినిమా కథ పునర్జన్మల్ని సమర్థించేదిగా వుంది. కాని సినిమా చూస్తున్నంతసేపూ నాగేశ్వరరావు నటనా-ఆ పాటలూ-ఆ సంగీతం-ఆ పిక్చరైజేషన్ చాలా బాగున్నాయి. అయితే ఎవరైనా "ఎలావుంది నీకా సినిమా?" అని అడిగితే ఏం చెప్పాలి? బాగుందనా, బాగాలేదనా?

జ: రెండూనూ. రెండూ చెప్పాలి. "కథ మూఢ నమ్మకాల్ని పెంచేది కాబట్టి కథ బాగాలేదు. సినిమాతియ్యడం బాగుంది" అని మీరెండు అభిప్రాయాలూ చెప్పాలి. కథ బాగోనట్టే, తియ్యడం కూడా బాగోకపోతే ఒకే అభిప్రాయం సరిపోతుంది. అలాగే, రెండూ బాగుంటేకూడా ఒకే అభిప్రాయం సరిపోతుంది. ఒకటి బాగుండి, ఒకటి బాగోకపోతే రెండు అభిప్రాయాలు తప్పవు.

  

వి.ఎస్. రవి (8వ తరగతి), హైదరాబాద్.

ప్ర: ఒక పుస్తకంలో ప్రపంచదేశాల జెండాలెన్నో చూశాను. అన్నీ వేరు వేరు డిజైన్లతో వున్నాయి. జెండాపై డిజైన్‌ని ఏ అర్థంతో ఏర్పరుస్తారు?

జ: ఆ డిజైన్‌కి అర్థమేమీ వుండదు. అది ఒక గుర్తు మాత్రమే. ఎవరికి నచ్చిన గుర్తుని వాళ్లు పెట్టుకుంటారు. నీ ప్రశ్న చూశాక జెండాల డిజైన్ల గురించి ఆలోచిస్తే, అసలు ఏ దేశపు జెండామీద ఆ 'దేశపు పటం' వుండటం సరైన పద్ధతి అనిపిస్తోంది. అంతర్జాతీయ జెండామీద 'ప్రపంచ పటం'గానీ, 'భూగోళం'గానీ! 'దేశపటం' అనేది ఆ దేశపు భూమిచిత్రం. అది కేవలం ఏదో 'గుర్తు'గా' తయారు చేసిన డిజైన్ కాదు. కాబట్టి, జెండాలమీద భూమిపటాలే వుంటే హేతుబద్ధమైన గుర్తులుగా వుంటాయి

 

ఎ. రమేష్, కె. దిలీప్, విజయవాడ.

ప్ర 1: శ్రీశ్రీగారి లాంటి వాళ్లు పాత సాహిత్యంలో మంచి పట్టు సంపాదించి తర్వాత కొత్త పద్ధతులకు మారారు. జనాల్ని మెప్పించారు. మరి ఇప్పటి కుర్రాళ్ళు రాసేటప్పుడుకూడా పాతవాటిని బాగా అధ్యయనం చేసి కొత్త విధానంలో (అంటే వ్యవహారిక భాషలో) రాయాలంటారా? లేదంటే, సూటిగా కొత్తపద్ధతులలోకి దిగొచ్చునంటారా? 'ప్రాచీనతమీద నవీనత నిలబడుతుంది' అని పుట్టపర్తి నారాయణాచార్యులు గారంటారు.

జ: 'ప్రాచీనత'తో సంబంధంలేని 'నవీనత' వుండదు. 'ప్రాచీనత'లో నెగిటివ్ అంశాల్ని వదిలిపేసి, అరకొరగావున్న పాజిటివ్ అంశాల్ని మరింత అభివృద్ధి పరచుకుంటే- అదే నవీనత. పాత దాన్నంతా చదవడం సాధ్యం కాకపోయినా, కొన్నిటినైనా పాత వాటిని చదివి అందులో విషయాలు గ్రహించడం చాలామంచిది. సూటిగా కొత్తపద్ధతుల్లో చక్కగానే రాయగల వాళ్ళెవరైనావుంటే వాళ్ళు పాతదాన్ని కూడా చదివితే (ఎంత వీలైతే అంత) అది వాళ్ళకు మరింత ఉపయోగపడుతుంది. జనరల్ పరిస్థితిగా చెప్పాలంటే, పాతదాన్ని చదవడం చాలా మంచిదనే నా అభిప్రాయం.

ప్ర : 2 టాగూర్ 'గీతాంజలి'కంటే 'వాడే వీడు' అనే డిటెక్టివ్ నవల ఎక్కువ విలువగలది" అని శ్రీశ్రీగారు 'హాస్యప్రియ' పుస్తకంలో రాశారు. మీ అభిప్రాయం ఏమిటి?

జ: ఎక్కడాలేని దేవుడి గురించి రాసే పుస్తకాలకన్నా, నిజంగా వున్న మనుషుల గురించిరాసే పుస్తకాలు విలువైనవే కదా? ఆ అర్థంతోనే ఆ మాటలు తీసుకోవాలి. త్యాగరాజ కీర్తనల్లో అద్భుతమైన సంగీతమూ. కవిత్వమూ వుంటాయి. అంత అద్భుత సంగీతంతోటీ. కవిత్వంతోటీ చెప్పింది ఏమిటి? - దైవభక్తి! అంతే. పెద్ద అసత్యాన్ని అద్భుతమైన

సంగీతంతో పాడడం అన్నమాట! ఆ సంగీతాన్ని ఇవ్వగలిగిన గాయకుడు భక్తుడు కాబట్టి, సంగీతాన్ని భక్తితో కలిపి ఇచ్చాడు. కానీ, మానవ జీవితానికి కావలసింది సత్యమే కానీ, అసత్యంకాదు. మానవ జీవితానికి సంగీతంతోనే ఉపయోగం కానీ, భక్తితో ఉపయోగంలేదు. కాబట్టి, ఆభక్తిని వదిలేసి ఆ సంగీతాన్నే తీసుకోవాలి.అంటే, ఎవరైనా ఆ సంగీతం పాడాలన్నా, పాడుతోంటే వినాలన్నా ఆ భక్తిని పట్టించుకోకుండా సంగీతాన్ని పాడీ, వినీ ఆనందించవచ్చు. అలా ఆనందించగలం. ఆ కీర్తనల ప్రయోజనం- సంగీత కళే. 'భక్తే లేకపోతే సంగీతానికి జీవమే పోతుంది' అంటారు. అది నిజంకాదు. సంగీతం పాడేవాళ్ళందరూ భక్తితోనే పాడినా, అందరూ చక్కగా పాడగలుగుతున్నారా? ఆ 'కళ'ని చక్కగా గ్రహించే వాళ్ళే చక్కగా పాడగలుగుతున్నారు. జీవం పుట్టిపడే విధంగా చక్కగా పాడడానికి, ఆ 'కళ' చక్కగా అలవడడమే ప్రధానంగానీ భక్తి ప్రధానం కాదు. సంగీత కళని ఎరిగిన నాస్తికుడు కూడా భక్తిగీతాల్ని చక్కగానే పాడవచ్చు. పాడగలడు. 'నటన' చక్కగా చేతనైతే 'నాస్తికుడు' కూడా భక్తుడి పాత్రని ధరించి తన్మయత్వంతో నటించవచ్చు. లేకపోతే 'కళ'కి అర్థమేలేదు. ఇది కవిత్వానికి కూడా వర్తిస్తుంది. టాగూర్ భక్తుడు కాబట్టి 'భక్తి'తో కలిపి 'కవిత్వం' ఇచ్చాడు. భక్తిని నేర్చుకోకుండా ఆ కవిత్వం చదివి ఆనందించవచ్చు. కవిత్వరీతులకు సంబంధించి నేర్చుకోవలసిందేమైనా అందులో వుంటే నేర్చుకోవచ్చు. అందులో కవిత్వ విలువలు కూడా లేకపోతే అప్పుడు పూర్తిగా వదిలెయ్యవలసిందే. మంచి సంగీతమూ, మంచి కవిత్వమూ 'భక్తి'తో కలిసివున్నా, వాటిని నిలుపుకోవాలి. భక్తిని వదిలేసి, సంగీతాన్నీ, కవిత్వాన్నీ మాత్రమే పట్టించుకోవా అన్నే స్పష్టతతో వుండాలి!

ప్ర 3 : 'ఇజాల' విషయమైగానీ, ఇంకే విషయమైనాగానీ చుట్టూ వున్నవాళ్ళతో వాదించడంవల్ల ఫలితం వుంటుందా? అసలు వాదించడం అవసరమా?

జ: 'వాదించడం' కోసం వాదించరు ఎవరూ. ఒక సందర్భం వచ్చినప్పుడు ఎవరి అభిప్రాయాలు వాళ్లు చెప్తే అదే వాదం అవుతుంది. జీవితంలో ప్రతి అడుగులోనూ వాదం వుంటుంది. ఎవరి అవగాహనకి అనుగుణంగా వాళ్ళవాదం వుంటుంది. సందర్భాన్నిబట్టి, అవసరమైనప్పుడు సరైన విషయాలు వివరించడంవల్ల ఫలితం ఎందుకు వుండదు? ఈ సమాజంలో ఇంకా ఎన్నో మార్పులు జరగవలసి వున్నప్పుడు అదంతాచర్చించుకోవడాలూ, వాదించుకోవడాలూ లేకుండా ఎలా నడుస్తుంది? ఎప్పటికప్పుడు సరైన దాన్ని నేర్చుకుంటూ వుండవలసింది వాదనల ద్వారానే కదా?

ప్ర 4 : 'జీవితాదర్శం శాంతి' అని చలంగారన్నారు మీరు అంగీకరిస్తారా? మీ దృష్టిలో జీవితాదర్శం ఏమిటి?

జ: జీవితాదర్శం శాంతే. 'శాంతి' వుండడం అంటే, సుఖ సంతోషాలూ, ఆత్మగౌరవాలూ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ అన్నీ వుండడమే. అందులో ఏదీ లేకపోయినా, 'శాంతి' వుండదు. మంచి లక్షణాలన్నీ కలసినదే 'శాంతి', అయితే 'శాంతి' అనేమాట చాలా అస్పష్టమైన అర్థంతో వుంటుంది. యుద్ధం లేకుండా వున్నదే 'శాంతి' అనేటంత పొరపాటు అర్థాన్ని కూడా అది ఇస్తుంది. కాబట్టి 'శాంతి'కి బదులుగా 'సమానత్వం' అనే మాటని ఉపయోగిస్తే అప్పుడు విషయం స్పష్టంగా వుంటుంది. వైరుధ్యాలు లేని పరిస్థితే 'సమానత్వం' అదే 'శాంతి'. కాబట్టి మానవ సమాజ జీవితాదర్శం 'సమానత్వమే'. (చలంగారు ఈ అర్థంతోనే 'జీవితాదర్శం-శాంతి' అన్నారని నా అభిప్రాయంకాదు). వైరుధ్యాలులేని పరిస్థితే శాంతిని ఇస్తుంది- అనే స్పష్టతవుంటే, 'జీవితాదర్శం-శాంతి' అనడానికేమీ అభ్యం

తరంలేదు. అయితే, శాంతిని ఎవరూ వ్యక్తిగత స్థాయిలో సాధించలేరు. 'సమిష్టి'కి శాంతిని ఇచ్చే పరిస్థితులే అందులో ప్రతి వ్యక్తికీ శాంతిని ఇస్తాయి. ఆ మార్గమే శాంతిని ఏర్పరుస్తుంది.

ప్ర 5 : 'పెట్టుబడి పరిచయం' పనిని మీరొక్కరే చేశారా? ఇంకె వరి సహాయమైనా వుందా?

జ: విషయాలు అర్థం చేసుకోవడంలోనూ 'పరిచయం' రాయడం లోనూ ఎవరి సహాయమూలేదు. మార్క్స్ ఒరిజినల్‌ని చదవడంలో ఇంకోవ్యక్తి (గాంధీ) సహాయం వుంది. మొదట ఇద్దరమూ ఒరిజినల్ చదువుతూ కొన్ని కొన్ని భాగాలు తెలుగులోకి అనువాదం చేసుకుంటూ వచ్చాము. ఒరిజినల్ చదువుతూ వున్నప్పుడు అర్థం చేసుకోగలిగేది చాలా తక్కువ. మళ్ళీ మళ్ళీ అనేకసార్లు చదివితేనేగానీ అర్థం చేసుకోగలిగే పద్ధతిలో ఒరిజినల్ వుండదు. అనువాదాన్ని మళ్ళీ మళ్ళీ చదివి 'పరిచయం' రాసేపని నేనే చేశాను. నేను రాసిన తర్వాత ఆ చాప్టర్లు గాంధీ చదివి తన కెలా అర్థమైందో చెప్పేవాడు. అతను అర్థం చేసుకోవడంలో ఏమైనా సమస్య వున్నట్టు అనిపిస్తే రేపు రీడర్స్‌తోనైనా అదే సమస్య వస్తుంది కాబట్టి, అలాంటి సందర్భాల్లో ఇంకా వివరంగా చేసేదాన్ని. ఇంత చేసినా మొదటి భాగాన్ని 2సార్లు తీసివెయ్యవలసి వచ్చింది. 'మార్క్స్ కాపిటల్'కి చాలా ఖచ్చితమైన తెలుగు అనువాదం గనుక వుండివుంటే, 'పరిచయం' పని ఇన్ని సంవత్సరాలు పట్టేదికాదు.

ప్ర. 6 : మిమ్మల్ని మీరు 'మార్క్సిస్టు' అనుకుంటున్నారా? లేక, ఇంకా కొంత బూర్జువా మనస్తత్వం మిగిలివున్న వ్యక్తిగా అనుకుంటు న్నారా?

జ: ఎవరి గురించి వాళ్ళే అంచనా వేసుకుంటే ఆ అంచనా కరెక్టుగా వుండదు. నా గురించి నేనే చెప్పుకోవాలంటే నాకు బూర్జువా మనస్తత్వం

వుందని అంటానా? లేదనే అంటాను. లేదనే అనుకుంటాను. నా పరీక్ష పేపరు నేనే దిద్దుకుంటే, నా జవాబులన్నిటికీ ఫుల్ మార్కులు వేసుకోనా? ఎవరికి వాళ్ళే మార్కులు వేసుకుంటే ఆ మార్కులకేం విలువ? ఒకజోక్ వినండి! "నువ్వు ఇంద్రుడివి! చంద్రుడివి!" అని పొగిడితేనూటికి 99మంది లొంగిపోతారట- ఒక్కడు తప్ప! "నువ్వు ఇంద్రుడన్నా లొంగవు, చంద్రుడన్నా లొంగవు" అంటే, ఆ ఒక్కడూ కూడా లొంగిపోతాడు! అంటే, కొందరి విషయంలో పొగడ్తల పద్ధతి కొంచెం మార్చాలి. అంతే. అందరూ పొగడ్తలకి లొంగేవాళ్ళే. ఇది జోకే అయినా ఇందులో చాలా 'సత్యం'వుందికదా? ఎవరి గురించి వాళ్ళు అంచనాలు వేసుకోవడం అంటే అవి పొగుడుకోవడంతో సమానమే. కాబట్టి, ఏ వ్యక్తి మంచి చెడ్డలయినా ఇతరులే చెప్పాలి. ఆ వ్యక్తికి చాలా సన్నిహితంగా తెలిసిన ఇతరులు. ఇక్కడ ఈ ఉదాహరణలో, బూర్జువా మనస్తత్వం వుండడం అంటే ఏమిటో, లేకపోవడం అంటే ఏమిటో తెలిసిన ఇతరులు. మంచిని మంచి గానూ, చెడ్డని చెడ్డగానూ గ్రహించి, పక్షపాతం లేకుండా మాట్లాడేస్వభావం గల ఇతరులు. అలాంటి ఇతరులు, అసలు వ్యక్తికి స్నేహితులైనా, శత్రువులైనా కూడా ఫర్వాలేదు. అలాంటి వ్యక్తులు, స్నేహితుల గురించే గాక, శత్రువుల గురించి కూడా నిజాలే చెపుతారు. అలాంటి వ్యక్తులు వారికితే అడిగి తెలుసుకోండి.

ప్ర 7 : మీరు పిల్లలకోసమైనా ఏవైనా పండుగలు చేసుకోరా? కనీసం 'మేడే' లాంటివి.

జ : 'మేడే' చేసుకోవాలంటే పిల్లలకోసం చేసుకోవడం ఏమిటి ? అది పెద్దవాళ్ళకే కదా ? పైగా కమ్యూనిస్టులకి ! కమ్యూనిజం పిల్లలకేం తెలుస్తుంది ? మా పిల్లలు, చిన్నప్పట్నించీ ఏ పండగలూ చెయ్యలేదు గానీ, 'దీపావళి' సామాన్లు మాత్రం కొనుక్కునేవారు. 'వీటి వల్ల ఎన్నో

ప్రమాదాలు జరుగుతూ వుంటాయి. ఎంతో వృథా ఖర్చు' అని ఎంత చెప్పినా వాళ్ళకి అదే దృష్టి వుండేది. "మీరు నాస్తికులు కదా? పండగ మతాబులు కొన్నారే" అని ఎవరన్నా అంటే, "మేం నాస్తికులమే గానీ మా పిల్లలు ఇంకా నాస్తికులు కాలేదు గదా? ప్రపంచంలో మాలాంటి నాస్తికులతో పాటు మీలాంటి భక్తులు కూడా వున్నారు కదా? మీ పద్ధతులు చూసే కదా పిల్లలంతా చెడిపోతున్నదీ? మా పద్ధతే అయితే, ఈ పండగలూ, ఈ మందుగుండు సామాన్లూ, ఇవన్నీ వుంటాయా? అన్నీ తీసి పారెయ్యమా?" అనే వాళ్ళం. ఇతర పండగలకి లొంగని పిల్లల్ని కూడా దీపావళి పండుగ లొంగదీసేస్తూ వుంటుంది.

ప్ర. 8 : ఇలా 'ప్రశ్నలూ - జవాబులూ' శీర్షిక నిర్వహించడం, పాఠకులకంటే మీకు ఎక్కువ తెలుసుననే దృష్టితోనా? లేదంటే, పాఠకులతో భావాలను పంచుకోవచ్చుననే దృష్టితోనా?

జ : రెండూనూ, రెండూ నిజమే. ప్రశ్న అడిగే వ్యక్తికి ఆ విషయం తెలియకనే కదా ఆ ప్రశ్న అడిగేది? జవాబు చెప్పే మనిషికి ఎక్కువ తెలిస్తేనే కదా జవాబు చెప్పగలిగేది? ఒక జవాబు మీద మళ్ళీ ఎవరో ఏదో ప్రశ్నించడం, మళ్ళీ దానికి జవాబు చెప్పడం అంటే పాఠకులతో భావాలను పంచుకోవడమే కదా? కాబట్టి రెండూ నిజమే.

* * *

సి. రాజేశ్వరి, తణుకు.

ప్ర : ఆత్మగౌరవంతో స్త్రీలు ప్రవర్తించాలని చెపుతారు మీరు. ఆత్మగౌరవం ఉన్నతమైనదే. కాని, అందరికీ అది సాధ్యమా అని సందేహం.

జ : సందేహం అక్కరలేదు. ఇప్పుడు వున్న పరిస్థితుల్లో అందరికీ అది సాధ్యం కాదు. 'ఆత్మ గౌరవం'తో ప్రవర్తించాలనే సూత్రం స్త్రీలకే ప్రత్యేకం కాదు. పురుషులకి కూడా. అవమానాలు పడే పరిస్థితుల్లో ఎవరి

వుండే వాళ్ళకి! అయితే, బతుకు తెరువుకోసం, 'పని' చేసే అవకాశం ఇవ్వవలసిన యజమానుల్ని యాచించక తప్పని పరిస్థితుల్లో వుండే వ్యక్తులు (స్త్రీలు గానీ, పురుషులుగానీ) ఆత్మ గౌరవంతో ప్రవర్తించలేరు. ఆ వ్యక్తులు, యజమానుల ఆజ్ఞలకూ, అహంకారాలకూ లోబడి వుండవలసిందే. అలాగే, తమ బతుకు తెరువు కోసం పురుషుల మీద ఆధారపడ వుండే స్త్రీలు కూడా ఆత్మగౌరవంతో ప్రవర్తించలేరు. ఆ స్త్రీలు పురుషుల పెత్తనాలకీ, తన్నులకీ గుద్దులకీ లోబడి వుండవలసిందే. అందుకే కదా, కొందరు మనుషులు మరి కొందరు మనుషులకు లోబడి వుండే పరిస్థితుల్ని తీసి వెయ్యాలనడం? ఎవరూ ఎవరి మీదా ఆధారపడనక్కరలేనీ, ఎవరూ ఎవరినీ యాచించనక్కరలేనీ పరిస్థితుల్లో మాత్రమే అందరికీ ఆత్మగౌరవం సాధ్యమవుతుంది. అంటే, ఈ సమాజాన్ని మార్చవలసిన "వర్గ పోరాటం" దగ్గరికే వస్తాం. ఏ మంచి అంశాన్ని స్థాపించాలన్నా అది వర్గ పోరాట మార్గంలో జరగవలసిందే. ప్రస్తుత పరిస్థితుల్లో మాత్రం ఆత్మగౌరవం అందరికీ సాధ్యం కాదు. సాధ్యమయ్యే వాళ్ళకి కూడా ప్రతీ చోటా.... పూర్తి స్థాయిలో సాధ్యం కాదు. అదంతా నిజమే.

అయితే, ఇక్కడ ప్రశ్న - ఇప్పుడు 'ఆత్మ గౌరవం'తో జీవించగలిగే పరిస్థితులు లేవు కాబట్టి, ఇప్పుడా మాటే ఎత్తకుండా వుంటామా? ఇప్పుడు కూడా ఎంత వీలైతే అంతవరకైనా ఆ లక్షణం అలవర్చుకోవాలనే దృష్టే లేకుండా వుంటామా? "సమసమాజం వచ్చాక ఆత్మగౌరవంతో ప్రవర్తిస్తాములే" అనుకుంటామా? (సమసమాజం వచ్చాకే వ్యభిచారం మానేస్తాను - అని శ్రీ శ్రీ అన్నట్టు!) విషయాలు ఆ రకంగా 'ఇప్పుడు సాధ్యం కాదు. అప్పుడు చేద్దాం' అనే పద్ధతిలో అర్థంచేసుకోవడం చాలాతప్పు. సమస్య వున్నప్పుడే కదా దానితో పోరాటం జరగవలసింది? ఆత్మగౌరవా

నికి హాని కలిగించే పరిస్థితులు ఇప్పుడే వున్నాయి కాబట్టి, ఆ పరిస్థితుల మీద వ్యతిరేకత ఇప్పుడే వుండాలి. బానిసలు, యజమానుల మీద తిరగబడి 'స్వేచ్ఛ' కోసం పోరాడడంలో 'ఆత్మ గౌరవం' అంశ లేదా ? సమాజంలో ఏ పరిస్థితులు వుంటే ఆ పరిస్థితుల్లోనే, ఎంత సాధ్యమైతే అంత వరకైనా ఆత్మగౌరవం కోసం ప్రయత్నించవలసి వుంటుంది. స్త్రీల విషయం తీసు కుంటే కుటుంబాల్లో తండ్రులూ, అన్నలూ, భర్తలూ, ఇంకా ఆ రకం 'పురుష సిబ్బంది' అంతా ఎప్పుడూ పెత్తందారీ తనంతోనే ప్రవర్తిస్తూ వుంటారు. ఆ అధికారాల్ని ఆడవాళ్ళు ఒక సాంప్రదాయంగా భరిస్తూనే వుంటారు. ఆ భరించడాలతోపాటే ఘర్షణలూ, పోట్లాటలూ కూడా సాగు తూనే వున్నా నిత్యం అనేక సంఘటనలు స్త్రీల లొంగుబాటుతనంతోనే గడిచిపోతూ వుంటాయి. మహా అల్పమైన వుదాహరణ చెప్పాలంటే, అప్పుడే మృగంలా పెత్తందారీతనంతో అరిచిన భర్త మరుక్షణంలోనే 'వరం' ఇచ్చే ధర్మదాతలా "సినిమాకి బైల్దేరు" అంటే, ఆ స్త్రీ రత్నం ముస్తాబు చేసుకొని ఎగురుకుంటూ బయల్దేరితే ఆ మనిషి, మనిషి స్థాయిలో గాక జంతువు స్థాయిలో వున్నదని అర్థం. (ఆ భర్త, అంతకు ముందే జంతువు స్థాయిలో వున్నాడు !) జరిగిన అవమానానికి తిరస్కారంగా ప్రవర్తించడం అనేది, అన్ని పరిస్థితుల్లోనూ ఆ స్త్రీ చేతుల్లో వుండకపో వచ్చు గానీ, ఈ పరిస్థితిలో మాత్రం ఆమె చేతుల్లోనే వుంది. ఆ అవమానం తర్వాత ఆ స్త్రీ భర్త వెంట బయల్దేరకుండా వుండడానికి 'సమసమాజం' రావాలా ఆ స్త్రీకి డిగ్రీలూ, రిసెర్చిలూ వుండాలా ? నిప్పు సెగకి చెయ్యి వెనక్కి లాక్కున్నంత సహజంగా అవమానాలకు స్పందించడానికి విద్యలూ, కళలూ రావాలా? నిజానికి చదువుకోని స్త్రీలలోనే 'సహజ స్పందన' ఎక్కువగా వుంటుంది. చదువుకున్న స్త్రీలలో అది చాలా తక్కువ. ఎందుకంటే, ఈ సమాజంలో చదువులన్నీ హేతు విరుద్ధమైనవి కాబట్టి. అవి లొంగుబాటునే నేర్పుతాయి.

చదువుకున్న స్త్రీలలో కూడా తేడాలు వుంటాయి. నిజంగా జరిగిన 2 ఉదాహరణలు చెపుతాను. తమ సమస్యల్లో ఎవరు ఎలా ఆలోచించారో చూడండి!

ఒకామె వయస్సు 28 సంవత్సరాలు, డాక్టరు. భర్తకూడా డాక్టరు. ఇద్దరికీ గవర్నమెంటు వుద్యోగాలు. పెద్దలు చేసిన పెళ్ళి కట్నాలవీ బాగా ఇచ్చారు. 2 సంవత్సరాల కాలం ఏదో మామూలుగా గడిచింది. (ఇంకా పిల్లలు లేరు) తర్వాత నించీ కట్నం చాలలేదన్న తగువులు ఎక్కువయ్యాయి. ఆ తగువులు అలా వుండగా అతను రాత్రిళ్ళు ఒక 'నర్సు' ఇంట్లో "నిద్రించడం" ప్రారంభించాడు. కొన్నాళ్ళకి అతని నిద్రాస్థలం ఇంకో ఆమె ఇంట్లోకి కూడా మారింది. ఈ భార్య, ఘర్షణ పడితే కొట్టడం కూడా మొదలు పెట్టాడు. అతని గుణగణాలు సరిగా వాకబు చేసుకోకుండా పెళ్ళి చేశామని ఈమె తల్లి దండ్రులు చాలా బాధపడుతున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో ఈ భార్య నన్ను సలహా అడిగింది. "ఇంకా సలహాల దగ్గరే వున్నారా? ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది. ఈ పూటనించే అతన్ని వదిలెయ్యండి. ఇక అతని మొహం చూడకండి" - అని నా సలహా నేను చెప్పాను. ఆమె నవ్వి - "ఈ మాటే చాలామంది చెప్పారు. మా అమ్మ కూడా చాలా రోజుల్నించీ ఇలాగే అంటోంది. 'పెద్దమనుషుల్ని పెట్టుకుని సెటిల్ చేసేసుకుని, నీ బతుకు నువ్వు బతుకు. తర్వాత నీకిష్టమైన మనిషి దొరికితే పెళ్ళి చేసుకో. ఇష్టంలేకపోతేపోనీ అలాగే వుండు' అంటున్నారు మావాళ్ళు" అంది. "అంతకన్నా మంచి సలహా ఏం వుంటుంది ? మీరింకా సలహాలకోసం అడుగుతున్నారెందుకు?" అన్నాను. కానీ, ఆమెకి ఆ సలహాలేవీ నచ్చడంలేదు. ఎందుకంటే ఆమెకోపం 'భర్త' మీద కాదు. అతనితో తిరిగే స్త్రీలమీద మాత్రమే. అతను కట్నం పేచీలు పెడుతోన్నా కోపం లేదు, కొడుతోన్నా కోపం లేదు. వ్యభిచారం చేస్తోన్నా కోపం లేదు.

వాటిల్ని 'వాటరు ప్రూఫ్'గా తయారు చేస్తారే అలాగ ఆమె తలకాయ 'భర్త' విషయంలో 'కోపం ప్రూఫ్'గా తయారైపోయి వుంది. "ఎవరికన్నా లంచం ఇచ్చి ఆ నర్సుని బదిలీ చేయిస్తే?" అని ఆమె తల్లితో అన్నప్పుడు, ఆ తల్లి బాగా తిట్టిందట. "నువ్వింత సిగ్గూ సెగ్గూ లేకుండా తయారయ్యావే" అని ఏడ్చిందట. ఈమె ఆలోచన ఏమిటంటే - ఏదో మంత్రంతోనో, మహత్తులతోనో అతన్ని మార్చెయ్యాలని! మంగళసూత్రాల్లో రెండు తాయెత్తులు కూడా చూపించింది - ఎవరో ఇచ్చారని. కానీ అవి 'సరిగా పని చెయ్యడం లేద'ని నిరుత్సాహం! "ఆయన మారే మార్గం లేదా?" అని పదే పదే అడిగింది.

"మారవలసింది మీరు. అతను కాదు" అన్నాను." అలాంటి వ్యక్తిని భార్య వదిలిపెట్టాలి. మీ పరిస్థితుల్లో అయితే అది సాధ్యమే. ఇంకే ఆడమనిషీ అతన్ని పెళ్ళి చేసుకోకూడదు. బంధువులూ, స్నేహితులూ కూడా అతన్ని చివాట్లు పెట్టి అతనితో సంబంధాలు మానెయ్యాలి. అన్ని వేపులనించీ విమర్శలూ, తిరస్కారాలూ ఎదురైతే ఎంత చెత్త మనిషైనా కళ్ళు తెరుస్తాడు. అదేరకం ఇతర మొగవాళ్ళు కూడా ఒళ్ళుదగ్గిర పెట్టుకుంటారు. అతనిమీద జరగవలసినవన్నీ జరిగితే కదా అతను మారడానికి ? అతనితో ఇతరులు కోపంగా ప్రవర్తిస్తారో లేదో అది మీ చేతుల్లో లేదు. మీ సంగతైతే మీ చేతుల్లోనే వుంది కదా? పోషణకి మీరు అతనిమీద ఆధారపడి లేరు. పిల్లల సమస్య లేదు. తల్లిదండ్రుల సపోర్టు వుంది. సంఘ భయమా అంటే మీ పెద్దవాళ్ళే మీకు అండగా వున్నప్పుడు సంఘ భయమేమిటి? అతని దుర్మార్గం నించి తప్పించుకోవడానికి మీకు ఇన్ని అవకాశాలు వుండగా ఇంకా అతనితో జీవితమేమిటి? అతని ప్రవర్తనతో మీకు అసహ్యం కలగడంలేదూ? అవమానాలు చేస్తూ, తిడుతూ, కొడుతూ బాధిస్తూ వుండే మనిషిని తిరస్కరించడానికి ఇంత ఆలోచనేమిటి? పెద్ద

పెద్ద ఉద్యోగాలు చేసేవాళ్ళే ఈ స్థాయిలో వుంటే, ఈ సమస్యని ఎవరు తీర్చగలుగుతారు? మీకు జరిగే అవమానాలు మీరే గ్రహించుకుని వదిలించు కోవాలి. దానికి ఇతరులు సహాయం చేస్తారు. మీరే కదలకపోతే ఎవరేం చేస్తారు? కాకి దారాలతోటీ, బూడిదతోటీ, తాయెత్తులతోటీ మీ సమస్య పరిష్కారమవుతుందనుకుంటున్నారా? ఆడవాళ్ళు ఆత్మగౌరవాలతో వుండడం మొదలుపెట్టండి. పాత రకం మొగవాళ్ళు మాయమై అద్భుతమైన కొత్త రకం మొగవాళ్ళు తయారవుతారు. మీరు అన్నిటికీ సహిస్తూ వుంటే అతను ఎందుకు మారతాడు? బాధలు పడేవాళ్ళు మారాలి గానీ బాధలు పెట్టేవాళ్ళు మారేదేమిటి? ఇప్పుడు అతను మారినా కూడా అతని మొహం చూడ కూడదు. 'క్షమించడాలు' కూడా అన్ని నేరాలకీ చెయ్యకూడదు" అని నేను చెప్పగలిగిందంతా చెప్పాను. అన్నీ విందీ. అన్నీ కరెక్టేనంది, "తాయెత్తులతో ఏం పనులు జరుగుతాయండీ?" అని నిరుత్సాహపడింది. చెప్పినదంతా విని "ఆ ఆడవాళ్ళిద్దర్నీ వదిలేస్తే మా నాన్నకి చెప్పి ఆయనకి డబ్బు ఇప్పించడానికి కూడా నాకు అభ్యంతరం లేదండీ" అంది. నేనేమీ ఆశ్చర్య పోలేదు. "లోకంలో వున్నది ఆ ఇద్దరు ఆడవాళ్ళేనా?" అన్నాను. అసలు ఆ మాటలన్నీ ఆమె తల్లే అడిగింది. ఈమెకి జవాబు లేదు. రోజూ అతను డబ్బు తెమ్మని పీడిస్తున్నాడు. తల్లిదండ్రులు ఈమెకి ఇవ్వదల్చుకున్న డబ్బేదో వుంది. ఆ డబ్బు తెచ్చి అతనికి ఇచ్చేముందు 'డబ్బు ఇస్తాగానీ, ఆ ఆడవాళ్ళని వదిలెయ్యి' అని షరతు పెట్టాలని ఈమె ఉద్దేశ్యం. తీరా డబ్బు ఇచ్చేస్తే వాళ్ళని వదులుతాడో లేదోనని మళ్ళీ భయం! డబ్బుఇవ్వక ముందే వాళ్ళని వదిలించాలని ప్రయత్నాలు! తల్లిదండ్రులు విసిగెత్తి "నీ ఇష్టం నీ డబ్బు నువ్వేమైనా చేసుకో. నీ విషయంలో మేమిక పట్టించు కునేది లేదు" అని వదిలేశారు. ఈమె 'భర్త' దగ్గిరే వుంటూ 'ఉపాయాల' కోసం తిరుగుతోంది. అది ఆమె పరిస్థితి. ఆమెని 'రోగి'గా భావించి ఎవ

రైనా డాక్టరు ఆమెకి వైద్యం చెయ్యాలంటే "ఆత్మగౌరవం టాబ్లెట్లు వాడండి" అని చెప్పడం తప్ప, ఇంకో మందేకీ చెప్పడానికి లేదు. వాళ్ళ అమ్మ మాటల్లో చెప్పాలంటే ఆమెకి ఏ మాత్రం 'చీమూ నెత్తురూ' వున్నా తన సమస్యనించి 5 నిముషాల్లో బయటపడిపోగలదు. ఆమెకి అన్నీ వున్నాయి. కావలసిందే లేదు!

రెండో ఉదాహరణ: ఒక అమ్మాయికి 18 సంవత్సరాలు. రెండేళ్ళ నించీ ఆ అమ్మాయికి కాలేజీలో ఒక లెక్చరర్ మీద 'ప్రేమ'. అంటే, పదహారో సంవత్సరం నించీ. అతనికి 32 సంవత్సరాలు. భార్యా పిల్లలూ వున్నారు. కానీ ఆ భార్యతో చేసిన పెళ్ళి ఏనాడో పెద్దవాళ్ళుచేసిన పెళ్ళట! అది తెలిసీ తెలియని రోజుల్లో ప్రేమ లేకుండా జరిగిపోయిందట. ఇప్పుడు ఈ 16 సంవత్సరాల అమ్మాయిమీద 'ప్రేమ' ప్రారంభమైంది. "నువ్వంటే నాకు గాఢమైన ప్రేమ" అని ఈ అమ్మాయికి చెపుతున్నాడు. రెండేళ్ళవరకూ అలా గడిచి ఇద్దరూ పెళ్ళి చేసుకోవడానికి సిద్ధమయ్యారు. ఈలోగా అతను మొదటిభార్యని 'ఒప్పించాడు'. ఆమె మొదట 'పిల్లల్తో నేరుగా వెళ్ళిపోతా' నంటే, ఇతను వీల్లేదని ఆపాడు. ఈ అమ్మాయి కూడా మొదటి భార్యతో "అందరం కలిసే వుందాం అక్కా! నీ పిల్లల్ని నా పిల్లల్లా చూసుకుంటాను. నేను పిల్లల్ని కనడం కూడా మానేస్తాను" అని చెప్పింది. అందరూ కలిసే వుండడానికి నిశ్చయించుకున్నారు. పరిస్థితి ఈ స్థాయికి వచ్చేవరకూ ఈ అమ్మాయి తల్లిదండ్రులకు తెలియదు. తెలియగానే వాళ్ళు అమ్మాయిని అడిగారు. నిజమేనని అమ్మాయి ఒప్పుకుంది. "మొదటిభార్య వుండగా నువ్వెలా పెళ్ళి చేసుకుంటావు?" అని తల్లిదండ్రులు అడిగితే, "ఆ భార్యమీద అతనికి ఎప్పుడూ ప్రేమ లేదు. పెద్దవాళ్ళు చేసిన పెళ్ళి ఇన్నాళ్ళూ రొటీన్‌గా కాపరం నడిచింది. నన్ను చూశాకే అతనికి 'ప్రేమ' ప్రారంభమైంది. నేనే అతనికి నిజమైన భార్యని' మీరనుకుంటున్నట్టు మా

ప్రేమ తాత్కాలిక ఆకర్షణ కాదు. మమ్మల్ని దూరం చేయడానికి ప్రయత్నించవద్దు" అని వాదించింది. ఆ తల్లిదండ్రులు చాలా సహనంగా అమ్మాయికి నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. అమ్మాయి మాటలకి వ్యతిరేకంగా తమకు చేతనైన వాదనలన్నీ చేశారు. ఎంత చెప్పినా అమ్మాయి తన అభిప్రాయం మార్చుకోలేదు, తల్లికి కొంచెంగా పత్రికలు చదివే అలవాటు వుంది. తన కూతురి సమస్యను వివరిస్తూ మద్రాసులో వున్న ఒక రచయిత్రికి పుత్తరం రాసింది ఆ రచయిత్రి- "వాళ్ళ ముగ్గురికీ ఇష్టమైతే మీదేం పోయింది మధ్య? మీరెందుకు బాధ పడతారు?" అని జవాబు రాసింది. ఆ జవాబు చదివి తల్లి నిర్ఘాంతపోయి ఆ ఉత్తరం గురించి కూతురికి చెప్పకుండా వూరుకుంది. కూతుర్ని రక్షించాలని తల్లికి తహతహగా వుంది. బలవంతంతోటే, ఆజ్ఞలతోటే పని జరగదని గ్రహించి ఆమె నమ్మకస్తులైన మిత్రులతో తన కూతురి విషయం చెప్పుకుంది. అందులో ఎవరో అన్నారు "ఒకసారి రంగనాయకమ్మతో మాట్లాడరాదా?" అని. వెంటనే ఆ తల్లిదండ్రులు నా దగ్గిరికి వచ్చి సంగతులన్నీ చెప్పారు, "వర్ణాంతరం అని కాదు, వయసులో ఎక్కువ తేడా అని కూడా కాదు. మొదటి భార్య వుండగా మళ్ళీ పెళ్ళేమిటి? ఆ మాటే అడిగితే 'ప్రేమ మీకు అర్థంకాదు' అంటుందేమిటి? చెప్పి చెప్పి విసుగుపుట్టిపోతోంది. చిన్నతనంనించీ ఎంతో చక్కగా ఆలోచించేది. చదువులో తెలివిగా వుంటుంది. పెళ్ళి గురించి ఇంత తెలివితక్కువగా తయారైపోయింది" అని చాలా బాధపడ్డారు.

"ఆ అమ్మాయితోటే మాట్లాడి ఆమె అభిప్రాయాలు వినాలి. మీకు చెప్పినట్టే నాకూ చెపుతుంది. చెప్పినా సరే అసలు మనిషితో మాట్లాడకుండా మనం మాట్లాడుకుని ఏం ప్రయోజనం?" అన్నాను.

తర్వాత కొన్ని రోజులకి తల్లి ఆ అమ్మాయిని తీసుకువచ్చింది. లోపలికి రాగానే ఆ అమ్మాయి నన్ను చూసి- "ఎక్కడికి వచ్చాం?" అన్నట్టు

ఆశ్చర్యపోతోంది. "ఇక్కడికి వస్తున్నట్టు మీ అమ్మాయికి చెప్పారా?" అని నేను తల్లిని ఆ అమ్మాయి ముందే అడిగాను. "చెప్తే రానంటుం దేమోనని చెప్పలేదు" అంది తల్లి. నేను ఆ అమ్మాయితో "మీ అమ్మా నాన్నా ఇంతకుముందే ఒకసారి వచ్చి ఈ విషయం చెప్పారు. నీతో ఒక సారి మాట్లాడితే బాగుంటుందన్నాను. నీకు చెప్పకుండా తీసుకు వచ్చారు. నీకిష్టం లేకపోతే ఇక్కడ వుండొద్దు. నేను వుంచుకోను. నీకిష్టమైతేనే వుండు. లేకపోతే మీ అమ్మతోనే వెళ్ళిపో" అని చెప్పాను. అర్థం చేసు కుంది.

"నాకు ఇష్టమే. వుంటాను. చెప్తే రానంటానని అమ్మ భయపడింది గానీ చెప్పినా వచ్చేదాన్నే. నాకేం భయంలేదు. నా అభిప్రాయాలు నేను చెపుతాను" అంది. తర్వాత తల్లి వెళ్ళిపోయింది.

ఆ అమ్మాయి మా యింట్లో 4 రోజులు వుంది. ఆ 4 రోజులూ రాత్రీ పగలూ వీలైనప్పుడల్లా నాతో మాట్లాడుతూనే వుంది. వాదిస్తూనే వుంది.

నేను చెప్పిందంతా- ఆమె నిర్ణయం సరైంది కాదనే. నేను 'సమా నత్వం', 'ఆత్మగౌరవం' అనే అంశాలమీదే ఆధారపడి మాట్లాడాను. "భార్యతో కాపరం చేస్తూనే నిన్ను ప్రేమిస్తున్నానని చెబుతున్నాడంటే అది భార్యని మోసం చెయ్యడం అవదా? నిన్నుకూడా మోసం చెయ్యడం అవదా? మొగవాడికి అనేకమంది భార్యలు వుండవచ్చు. ఆడవాళ్ళేమో ఒకరు పెద్ద భార్యా, ఒకరు రెండో భార్యా, ఒకరు మూడో భార్యా, అలా వరస భార్యలుగా వుంటారు. నువ్వు రెండో భార్యగా వుండడానికి అంగీక రించడం అంటే, వెనకటి కాలపు ఆడవాళ్ళలాగా మొగవాడి భార్యల్లో ఒక భార్యగా వుండడమే కదా? మొగవాడికి ఎక్కువమంది భార్యలు వున్నట్టు ఆడవాళ్ళకి ఎక్కువమంది భర్తలు వుండడం ఎక్కడైనా చూశావా?

ఎక్కడా చూడలేవు. అది ఎక్కడా వుండదు. మొగాళ్ళకి ఎక్కువమంది భార్యలు వున్నట్టే, ఆడవాళ్ళకి ఎక్కువమంది భర్తలు వుండాలని నేననడం లేదు. అదీ, ఇదీ కూడా సరైంది కాదని అర్థంచేసుకోవాలంటున్నాను. అతను చెప్పినదాని ప్రకారమే చూద్దాం. ప్రేమలన్నీ భర్తలకేగానీ, మొదటి భార్యలకి కలగవా? అతని మొదటి భార్య కూడా రొటీన్ కాపురమే చేస్తోంది కదా? ఆమెకి ఇంకో పురుషుడిమీద 'ప్రేమ' కలిగి, ఆమె ఇతనితో- 'ఇన్నాళ్ళూ మనం ఏదో రొటీన్‌గా బతికాం. ఇప్పుడు నాకు ఫలానా అబ్బాయితో నిజమైన ప్రేమ కలిగింది. నేను అతన్ని రెండో పెళ్ళి చేసుకుంటాను. ముగ్గురం కలిసే వుందాం!' అంటే ఇతను వాళ్ళతో కలిసి వుండడానికి అంగీకరిస్తాడా ? ఆమెకి ఇద్దరు భర్తలు వుండేటట్టూ, ఇతడు పెద్ద భర్తగానూ, ఆ రెండో అబ్బాయి చిన్న భర్తగానూ వుండేటట్టూ ఆ ఇద్దరు మొగవాళ్ళూ ఒప్పుకుంటారా? ఒప్పుకోరు. కానీ. మీ ఇద్దరు ఆడవాళ్ళూ మాత్రం ఒకరు పెద్ద భార్యగా, ఒకరు చిన్న భార్యగా వుండడానికి ఒప్పుకున్నారు! పెద్ద భార్యకి ఇంకో మార్గం లేకపోవచ్చు. ఆమెకి స్వంత సంపాదన లేదు. పిల్లలు వున్నారు. విడిపోవడానికి ధైర్యం చెయ్యలేకపోవచ్చు. మరి నీకేమైంది? నువ్వు రెండో భార్యగా వుండడం అంటే అందులో 'బానిసత్వం' తప్ప సమానత్వం' ఎక్కడుంది?"—ఈ పద్ధతిలో ప్రారంభించాను నేను.

"మరి మా ప్రేమ మాటేమిటి? మాది ప్రేమ కాదా? ప్రేమ కలిగితే ఏం చెయ్యాలి?" అని ఆ అమ్మాయి అనేకసార్లు అడిగింది.

"ప్రేమ కలిగితే ఏం చెయ్యాలేమిటి? అది నీ ఆత్మ గౌరవానికి అనుగుణంగా వుంటేనే దాన్ని నిలబెట్టుకోవాలి. లేకపోతే తప్పు చేశానని గ్రహించి దాన్ని వదిలెయ్యాలి. "ప్రేమ" అంటే అదేమైనా మంచి

చెడ్డలకు అతీతమైన విషయమా? ప్రేమ' కూడా తప్పుగా ఏర్పడకూడదా? అందుకు నువ్వే రుజువు. ఈ ప్రేమ వ్యవహారానికి ముందు నించే నువ్వు 'స్త్రీ పురుషుల సంబంధాల' గురించి తప్పు అభిప్రాయాలతో వున్నావు. అతను కూడా అలాగే వున్నాడు. మీ ఇద్దరి దృష్టి పురుషుడికి ఎక్కువ మంది భార్యలు వుండొచ్చనేదే.

'మాది ప్రేమ కాదా?' అంటున్నావు. మీది ప్రేమే-కాని మీ ప్రేమ-ఆడవాళ్ళు మొగవాళ్ళకి బానిసలుగా వుండాలనే దృష్టితో ఏర్పడిన ప్రేమ. ఆ రకపు పునాది మీద ఏర్పడిన ప్రేమ.

అతనికి భార్యతో జీవితం అయిష్టంగా వుంటే (ఆ 'అయిష్టం' ఏర్పడడానికి కారణాలు న్యాయమైనవా, అన్యాయమైనవా అనేది అలా వుంచుదాం) భార్య నించీ విడిపోవాలి. కనీసం రెండో స్త్రీతో పరిచయం అయిన తర్వాతైనా మొదటి భార్యతో విడిపోవాలి. (మొదటి భార్యతో విడిపోవడంలో అతనికి న్యాయమైన కారణాలు వుంటేనే అతన్ని రెండో స్త్రీ ఇష్టపడాలి. మొదటి భార్యని శంకింపో, డబ్బు తేలేదనో, ఆకర్షణ పోయిందనో-అలాంటి కారణాలతో ఆమెను వదిలి వుంటే, అలాంటి వాడిని రెండో స్త్రీ ఇష్టపడకూడదు. మొదటి భార్యని వదిలేశాడా లేదా అనేదే కాదు, వదిలితే ఏ కారణం వల్ల వదిలాడు అనేది కూడా రెండో స్త్రీ చూడాలి). మీ విషయం చూస్తే, అతను 'ప్రేమ లేని' భార్య నుంచి ఎందుకు విడిపోడు? ప్రేమ వున్న మనిషే నిజమైన భార్య అయితే, ప్రేమ లేని మనిషి నిజమైన భార్య కాదు కదా? నిజమైన భార్యతోటే, నిజం కాని భార్య తోటే కూడా ఎలా వుంటాడు? ప్రేమ వుండడాన్నీ, లేకపోవడాన్నీ కూడా ఒకే రకంగా తీసుకునే మనిషితో నువ్వెలా వుంటావు? ఆమెకు పోషణ సమస్య వుంటే, ఏమీ ఇబ్బంది పెట్టకుండా ఆమెకీ, పిల్లలకీ పోషణ ఇవ్వాలి. ఆ ఏర్పాట్లన్నీ సంఘంలో వుండనే వున్నాయి. భార్యా భర్తల్లో

ఎవరికీ ఇష్టం లేకపోయినా రెండో మనిషి నించీ విడిపోయే హక్కు వుంది. కానీ ఇతను, భార్యతో విడిపోవడాలూ, కేసులూ, విడాకులూ, పోషణ ఇవ్వడాలూ—ఆ గోలలన్నీ పెట్టుకోదల్చుకోలేదు. ఆ గొడవలన్నీ పడే కన్నా మొదటి భార్యని నయానో—భయానో ఒప్పించేసి, ఆమె వుండగానే రెండో భార్యని ఇంటికి తీసుకుపోవడం తేలిక కదా? ఇద్దరూ చెరో గదిలో వుంటారు. ఇద్దరూ తనకి చెరో కాలూ పడుతూ వుంటారు. ఇంకో ఇద్దరు కూడా వుంటే చేతులు కూడా పట్టేవాళ్ళే గానీ అప్పుడు 4 గదులు కేటాయించాలి. అదంతా ఈయనకి కష్టం కాబట్టి, ఎక్కడికక్కడే సంతృప్తి పడాలి కదా? ఇద్దరు భార్యలతో వుండాలని అతనికి ముచ్చట! రెండో భార్యగా వుండాలని నీకు ముచ్చట! భర్తలు, చిన్న భార్యల్ని ముద్దుగా చూస్తారని వెనకటి కథల్లో చెపుతూ వుంటారు. ఆ కథల్ని నమ్మి, ఎన్నో భార్యగా వుండడానికైనా ఆడవాళ్ళు ఇష్టపడుతూ వుంటారు. ఎటొచ్చీ ఈ వ్యవహారం మొదటి భార్యకి ఇష్టం వుండదు. కానీ ఆమె చాలా కేసుల్లో గత్యంతరం లేని పరిస్థితుల్లో వుంటుంది. "ముగ్గురికీ ఇష్టమైతే మీకెందుకు మధ్య?" అని మద్రాసు రచయిత్రి, మీ అమ్మకి పుత్తరం రాసిందిగానీ, ఆ 'ముగ్గురి'లో 'పెద్దభార్య'కి ఎందుకు ఇష్టమవుతుంది? గతిలేక అంగీకరిస్తుందేగానీ ఆమెకి నిజంగా ఇష్టమవుతుందా? నీ సంగతి చూడు.

"నీ భార్యని వదలకుండానే నాతో ప్రేమేమిటి, పెళ్ళేమిటి?" అని నువ్వు అడుగుతావనే అభిప్రాయం గనక అతనికి వుంటే, అతను నీతో ప్రేమ వ్యవహారం పెట్టుకునేవాడే కాదు- ఎందుకంటే, మొదటి భార్యని వదిలే ఉద్దేశం లేదు గనక. మొదటి భార్య వున్నా రెండో భార్యగా వుండడానికి అంగీకరించే స్త్రీ దొరికినప్పుడే అతని ప్రేమ నడిచేది. అలాగే, నీ వేపు నుంచి చూస్తే, అతను మొదటి భార్యతో కలిసి వుండగానే రెండో

భార్యగా వుండడం నీకు అభ్యంతరమైతే నీకు కూడా అతని మీద ప్రేమ ప్రారంభమయ్యేది కాదు. అంటే, మీరిద్దరూ ఏ రకం భావాలతో వుండడం వల్ల మీ ప్రేమ ప్రారంభమైందో ఆలోచించుకో.

ఒక భార్యతో వుండగానే రెండో భార్యని తెచ్చుకునే ఏ పురుషుడైనా రెండో స్త్రీతో 'ప్రేమలో పడే' ఆ పని చేస్తాడు. ఈ రకం ప్రేమలు వెనకటి కాలం నించీ వున్నవే. గుర్రం మీదో, ఏనుగు మీదో, వేటకో, షికారుకో పోయే రాజుగారు పూలతోటలోనో, నీలాటి రేవులోనో, ఒకానొక 'సుందరి'ని చూసి తక్షణం అనురాగమోహితుడై, మరుక్షణంలోనే గుర్రాన్ని (పోనీ ఏనుగుని) వెనక్కి తిప్పి అంతఃపురం జేరి, చింతాక్రాంతుడై పందిరి పట్టెమంచం పడతాడు. అక్కడ ఆ సుందరి కూడా రాజుగారిని మోహించి, రాజుగారి చిన్న భార్య కావడానికి ముచ్చటపడుతూ వుండొచ్చు. రాజుగారి పెద్ద భార్యలందరూ, రాజుగారి మంచం చుట్టూ చేరి "ప్రభువులు మళ్ళీ ఏ సుందరి మీదనైనా మనసు పడుతున్నారేమో అక్కా" అని ఒకరితో ఒకరు గుసగుసలు మొదలు పెడతారు. "ఈ దేశంలో ఇంకా సుందరులు వున్నారా?" అని అప్పటి కడగొట్టు భార్య చాలా విస్తుపోతూ చింతాక్రాంతురాలవుతుంది. భార్యలందరూ మంచం చుట్టూ జేరి సంగతేమిటో చెప్పమని ప్రార్థించగా ప్రార్థించగా రాజుగారు ఆ కొత్త సుందరి సంగతి బయటపెట్టి 'ఆ జవ్వని లేనిదే జీవించజాల'నని నిట్టూరుస్తారు. ఆ రాజుగారు పడే యాతనంతా 'ప్రేమ' కాదా?—ప్రేమే! అది రాజుల రకం ప్రేమ. ఇవ్వాళ ఒక కాలేజీ పేస్టారు, క్లాసులో అమ్మాయిని మోహించి, ఇంటికి పోయి, ఏదో ఒక మంచం ఎక్కి, భార్యని దగ్గరికి పిలిచి, విచార వదనంతో "మనింటికి వొస్తూ పోతూ వుంటుందే ఒకమ్మాయి; సన్నగా, బక్కగా వుండే అమ్మాయి. ఆ అమ్మాయిని ప్రేమిం చాను నువ్వు ఒప్పుకోకపోతే చచ్చిపోతాను" అనడం రాజుగారి రకపు

ప్రేమ కాదూ? రేపు, ఈ పురుషుడే మూడో స్త్రీని ప్రేమించి మళ్ళీ మంచం ఎక్కి రెండో స్త్రీని పిలిచి "ప్రేమ మారుతుందని నీకు తెలుసు కదా? అదే జరిగింది ఇప్పుడు" అనడని నమ్మకమేమిటి?

ప్రేమలో కూడా రకరకాల సిద్ధాంతాలున్నాయి. తప్పునీ, రైటునీ— అన్నీ: 'ప్రేమ' అనగానే దానికిక మంచి చెడ్డలు వుండవనీ, తప్పొప్పులు వుండవనీ అర్థంకాదు. 'ప్రేమ' అంటే 'స్త్రీ పురుషుల' జీవిత సంబంధం' ఆ సంబంధం ఎలాపడితే అలా ఏర్పడకూడదు. ఆ సంబంధం వల్ల స్త్రీ పురుషుల్లో ఎవరి ఆత్మగౌరవానికీ హాని జరగకూడదు. 'ఆత్మ గౌరవం,' 'సమానత్వం' అనే నియమాల మీద ఆధారపడితే, 'ప్రేమ'లో తప్పు జరగదు. స్త్రీ పురుష సంబంధాల మీద మొదటే సరైన అవగాహన వుంటే, 'తప్పు ప్రేమలో'కి పోయే పని మొదటే జరగదు. ఏ విషయంలో నైనా తెలీకో, తెలిసీ తెలీకో తప్పు చేస్తే తెలిశాక దిద్దుకుంటాం కదా? 'ప్రేమ'లోనైనా అంతే.

ఇదంతా నీకు చాలా విచారంగా వుంటుంది. కానీ, ఇప్పుడే నువ్వు సరిగా ఆలోచించుకోకపోతే జీవితంలో చాలా సమస్యల్లో పడిపోతావు. తొందర లేకుండా కొంతకాలం చక్కగా ఆలోచించుకో"—ఇదీ నా మాటల సారాంశం!

అంతకు ముందు ఆ అమ్మాయి నా పుస్తకాలు ఒకటో అరో తప్ప చదవలేదు. నా పుస్తకాల గురించి ఆమె తల్లికి కూడా అంతగా తెలియదు. ఆ నాలుగు రోజులూ ఆ అమ్మాయి చాలా ఆందోళన పడుతూనే, చాలా విచారిస్తూనే, చాలా సందేహాలడుగుతూనే, క్రమంగా తనవాదన వదిలేసింది. చెప్పడం ప్రారంభించింది—"ఇన్నాళ్ళూ నాకు చాలా సంతోషంగా వున్నా కూడా చాలా టెన్షన్ పడ్డాను. మా అమ్మావాళ్ళు అడిగే దానికి నేను గట్టిగానే చెప్తోన్నా ఒక పక్క నాకేదో అసంతృప్తిగా కూడా వుంది. ప్రేమ వుంటే

బాధ వుండకూడదు కదా, ఈ బాధేమిటి అనుకునేదాన్ని చాలాసార్లు. నేను వాళ్ళింటికి వెళ్తూ వుండేదాన్ని కదా? అతని భార్య చాలాసార్లు చాలా విచారంగా కనబడేది. అప్పుడప్పుడూ ఏడుస్తూ కూడా వుండేది. అదంతా ఏదో చాదస్తం అనుకునేదాన్ని. కొన్ని సార్లయితే ఈ గోలంతా నాకు వొద్దనిపించేది. ఇందులో ఎందుకు పడ్డానా అనిపించేది. వాళ్ళింటికి పోకుండా వుండేదాన్ని. అతను కబుర్ల మీద కబుర్లు పంపించేవాడు. ఆమే వచ్చినన్ను పిల్చుకుపోయేది. నేను పోగానే ఏడ్చి నేను లేకపోతే బ్రతకలేననేవాడు. ఈయనకోసం నా సర్వస్వాన్నీ అర్పించలేనా అనుకునేదాన్ని. ఒకసారి నేను వాళ్ళఇంట్లో వుంటగా ఒక బంధువులావిడ నన్నూ ఆమెనీ చూసి 'పెద్దభార్యా, చిన్నభార్యా' అంది. నాకు ఒళ్ళంతా చచ్చినట్టయింది. నేను రెండోభార్యగా వుండాలని మొదటినించీ అనుకుంటున్నదే అయినా ఆ మాటలతో నాకు ఏడుపొచ్చేసింది. అతనితో అన్నాను— 'వెంకటేశ్వరస్వామి భార్యల్లాగ పెద్దభార్యా, చిన్నభార్యా ఏమిటి?' అన్నాను. అతను నవ్వి— 'అంతకన్నా ఏమంటారు?' అన్నాడు. నాకు బాధకలిగించిన మాటలు అతనికి బాధ కలిగించినట్టనిపించలేదు. నాకు బాధగావున్నా 'అంతకన్నా ఏమంటారు?' అని సరిపెట్టుకుని ఊరుకున్నాను. ఒకసారి అతనితండ్రి ఎవరితోటో 'ఆ అమ్మాయేమో వాడిని వల్లో వేసుకుంది' అన్నాడట. ఆ సంగతి అతనికీ నాకు కూడా తెలిసింది. అతను, తండ్రిని చాలా మందలిస్తాడనుకొన్నాను. కానీ, "పెద్దవాళ్ళు అలాగే అనుకుంటారు కదా" అని నాకు రాసాడు. నాకు చాలాబాధేసింది. ఆ అమ్మాయిని నేనుకూడా ఇష్టపడ్డాను కదా ఆ అమ్మాయివల్లే ఇదంతా జరిగినట్లు నువ్వు మాట్లాడడం తప్పు" అని తండ్రితో అనలేదు. ఇంకా చాలా వున్నాయి లెండి"- అని ఆ రెండేళ్ళకాలంలో ఆమెకి బాధగా,కష్టంగా, అవమానంగా అనిపించిన విషయాలన్నీ చెప్పుకొచ్చింది. ఆ ప్రేమలో అన్నీ 'అప

స్వరాలు'వున్న సంగతి ఆమెకి అప్పుడే బాగా అర్థమైంది. "నా కిప్పుడు చాలా తేలిగ్గా వుంది అతను, పెద్దభార్యని పూర్తిగా వదిలేసి నాతోనేవుంటా నన్నా నేనిప్పుడు ఒప్పుకోను. ఇప్పటివాకా జరిగిందే తప్పు. ఇంకా దీన్ని పెంచను" అంది.

తర్వాత ఒకరోజంతా కూర్చుని అతనికి పెద్దవుత్తరం రాసింది. ఆ వుత్తరం నాకుకూడా చదివి వినిపించింది. దాని సారాంశం ఇదీ: "మా అమ్మ నన్నిక్కడికి చెప్పకుండానే తీసుకొచ్చింది. కానీ తెలిశాక నా ఇష్టం తోనేవున్నాను. మీరు నాకు నేర్పిన వాదనంతా రంగనాయకమ్మగారితో చేశాను. మన ప్రేమ తప్పుడు పునాదిమీద ఆధారపడిందనే సంగతి ఇప్పుడు పూర్తిగా గ్రహించాను. ప్రేమ అంటే సర్వస్వం త్యాగం చెయ్యడమే అను కున్నాను. కానీ, 'రెండోభార్య' అని నన్ను ఒకావిడ అంటేనే భరించలేక పోయాను. నాకు అంత క్రోధ కలిగించిన మాట మీకెంతో మామూలుగావుంది. మీ భార్య ఇంకో వ్యక్తిని ప్రేమించానని చెప్తే వాళ్ళతోకలిసి వుండగలుగు తారా మీరు? మీకు మాత్రం ఇద్దరు స్త్రీలు ఇద్దరు భార్యలుగా వుండాలా? ఇంత చిన్న విషయం మీరు అర్థం చేసుకోలేకపోయారా? మీ భార్యల్లో ఒక భార్యగా వుండడం నాకు ఆత్మగౌరవంలేని జీవితమని అర్థమయింది. ఇక ఈ తప్పుని దిద్దుకోదల్చుకున్నాను."

ఆ అమ్మాయి అలా మారడం నాకు కూడా ఆశ్చర్యం కలిగిం చింది. తర్వాత రోజుల్లో ఆలోచించుకుంటుందనీ, తర్వాత కాలంలో ఎప్పు డైనా సమస్యల్లో పడ్డప్పుడు నా మాటలేమైనా వుపయోగపడతాయనీ అవన్నీ మాట్లాడానుగానీ ఇక్కడే ఆ అమ్మాయి అతనికి అలాంటి వుత్తరం తయారుచేస్తుందనుకోలేదు.

ఆ అమ్మాయికి తల్లీ వాళ్ళూ చెప్పిన మాటలకన్నా నా మాటలు ఎక్కువగా నచ్చడానికి కారణం నామీద ప్రత్యేకమైన అభిమానమేమీకాదు.

నా పుస్తకాలు అసలు ఆ అమ్మాయి చదవనేలేదు. తల్లీ వాళ్ళూ ఎంత సేపూ- "నువ్విలాచేస్తే మన పరువుపోదా? నలుగురిలో నవ్వరా? తప్పు కాదా? పాపం ఆ పెద్దభార్య బాధపడదా? ఆ ఇంట్లో నువ్వేం సుఖపడతావు?" అనే పద్ధతిలో మాట్లాడారు. నిజానికి ఆ మాటలన్నీ విలువైన మాటలే. కానీ ఆ మాటలన్నీ చాదస్తపు మాటల్లా కనపడ్డాయి. నేనేమో ఆ అమ్మాయి ఆత్మగౌరవం సమస్యని ప్రశ్నించాను. "ఇది నీకు అవమానం కాదా?" అనే ప్రశ్న ఆ అమ్మాయికి జవాబు దొరకని ప్రశ్నగా అయిపోయింది. అప్పటికే ఆమె, ఈ ప్రేమద్వారా అవమానాలు పడుతూవుంది. అందుకేఆమె నామాటల్ని గురించి గట్టిగా ఆలోచించుకుంది. మొత్తంమీద ఆ అమ్మాయి చాలా తొందరగానే సరైన నిర్ణయానికి వచ్చింది.

అప్పటికి తల్లి వచ్చింది. రాగానే కూతురు రాసి వుంచిన వుత్తరం చూసి నమ్మలేనంత ఆశ్చర్యపోయింది. "ఈ మార్పునిజమేనా?" అని నన్ను ఒంటరిగా అడిగింది.

"మనం చెప్పవలసిందిచెప్పాం. తను మళ్ళీ అతని మాటలకే లొంగిపోతే ఇక ఆమె దారిన ఆమెని వదిలెయ్యండి. ఇక ఇంతకన్నా వెనకబడడం అనవసరం" అన్నాను.

"మళ్ళీ మారిందంటే, ఇక మేము అమ్మాయిని పూర్తిగా వదులుకుంటామండి. కూతురనీ, అల్లుడనీ, వాళ్ళు మా ఇంటికి రావడాలూ పోవడాలూ ఒప్పుకోం" అంది తల్లి. ఇద్దరూ వెళ్ళిపోయారు.

ఆ వుత్తరం అతనికి అందింది. అతను మళ్ళీ పెద్ద వుత్తరం రాసి ఒక వ్యక్తితో ఆమెకి పంపాడు. ఆ వుత్తరం తీసుకోవడానికి కూడా ఆ అమ్మాయి నిరాకరించింది. "అతను ఏం చెప్తాడో నాకు తెలుసు. మనది గొప్ప ప్రేమ అంటాడు. ఆ మాటలు ఇప్పుడు నాకు నచ్చవు. అందుకే ఆ వుత్తరం తీసుకోలేదు" అని నాకు రాసింది తర్వాత.

ఆత్మగౌరవం అందరికీ సాధ్యమా అన్న మీ సందేహానికి నేనీ 2 వుదాహరణలా చూపించాను. ఏ మంచి పనైనా సాధ్యమైన వాళ్ళకే సాధ్యమైనంత వరకే. సాధ్యమైన వాళ్ళు కూడా పాటించకపోతే, అలాంటి వాళ్ళు సమస్యల్లోనే పడి వుంటారు.

* * *

ఎం. మేఘశ్యాం, భీమవరం.

ప్ర : ఎవరి పనులు వారే చేసుకోవాలి అనే సిద్ధాంతం మీద నేను చాకలిని మాన్పించి నా బట్టలు నేనే ఉతుకుకుంటున్నాను. మీ జవాబులు ఇచ్చిన ఇంపాక్ట్‌తో పెట్టుబడిదారీ విధానానికి ప్రత్యక్ష సాక్ష్యమైన 'ఉన్న వాడు రిక్షాలో కూర్చోటం, లేనివాడు లాగటం' అనే విధానాన్ని తిరస్క-రిస్తూ రిక్షా ఎక్కటం మానేసాను. ప్రస్తుతానికి ఇవే నేను చేయగలిగిన పనులు. కానీ, ఈ మధ్య ఒక కొత్త ప్రశ్న వస్తోంది. ఇలా నాలా అందరూ చాకలి వాళ్ళనీ, రిక్షావాళ్ళనీ, ఇంకొన్ని వృత్తుల వాళ్ళనీ త్యజిస్తే ఆయా వృత్తుల వాళ్ళందరూ ఏమయిపోతారు? వాళ్ళు మన దేశంలో కొన్ని లక్షల మంది వుంటారు కదా? వాళ్ళందరూ ఎలా బ్రతుకుతారు?

జ : విషయాలన్నీ మీరు మహా తప్పుతప్పులుగా అర్థం చేసుకున్నారు. 'కాపిటల్' చదవకుండా ఈ విషయాలు అర్థం కావని నేను మొదటి నించీ చెపుతూనే వున్నాను. ఒక మనిషి మీ బట్టలు వుతికి ఇస్తే, దానికి బదులుగా మీరు 'డబ్బు' ఇస్తారు. ఆ డబ్బుతో ఆ వ్యక్తి కొన్ని వస్తువులు కొనుక్కుంటాడు. (ఆ వ్యక్తికి ఇచ్చిన డబ్బుని మీరు మీ 'శ్రమ' ద్వారానే సంపాదించారని అనుకుందాం.) అంటే, మీ 'శ్రమ'ని ఎక్కడో ఇచ్చి (అమ్మి) దానికి బదులుగా డబ్బు తీసుకున్నారు. దానితో బట్టలు వుతికే మనిషి 'శ్రమ'ని కొని అతనికి డబ్బు ఇచ్చారు. అతని వేపునించీ చూస్తే, అతను, తన శ్రమని మీకు అమ్మి, దానికి బదులుగా డబ్బు తీసు

కుని, ఆ డబ్బు ఇచ్చి, ఇతరుల శ్రమలతో తయారై వున్న వస్తువులు కొనుక్కుంటాడు. మీరు, రిక్షా ఎక్కి డబ్బు ఇవ్వడం కూడా ఇలాంటిదే. మీ 'శ్రమ'ని ఎక్కడో అమ్మి సంపాదించిన డబ్బుతో రిక్షా వ్యక్తి శ్రమని కొంటారు. రిక్షా వ్యక్తి, తన శ్రమని మీకు అమ్మి, దానికి బదులుగా డబ్బు తీసుకుని, దాన్ని ఇచ్చి, ఇతరుల శ్రమలతో తయారై వున్న వస్తువులు కొంటాడు. ఇదంతా ఒకరికి ఒకరు 'సరుకుల్ని' అమ్మకాలా, కొనడాలా అన్నమాట! అంటే, 'శ్రమల మారకాలు' అన్నమాట! అయితే, మీరు ఇచ్చే డబ్బు మీ 'శ్రమ' ద్వారా సంపాదించింది కాకపోతే (అది మీకు 'లాభం' ద్వారానో, 'వడ్డీ' ద్వారానో, 'భూమి కౌలు' ద్వారానో వచ్చింది అయితే), ఆ డబ్బుని మీరు రిక్షా మనిషికో, బట్టలు వుతికే మనిషికో ఇచ్చి వాళ్ళ శ్రమల్ని తీసుకుంటే, ఆ మొత్తం సంబంధాల్లో, మీ 'శ్రమ' ఎక్కడా వుండదు. ఆ డబ్బు మీకు ఎక్కడి నించి వచ్చిందో అక్కడ పని చేసిన కార్మికుల 'అదనపు విలువ'లో భాగం అది. దాన్ని తెచ్చి, రిక్షా అతనికి ఇచ్చారంటే, అది ఆ కార్మికుల శ్రమకీ, రిక్షా అతని శ్రమకీ సంబంధం అన్నమాట! అప్పుడు మీ పాత్ర ఏమిటంటే, స్వయంగా శ్రమ చెయ్యకుండా, కార్మికుల 'శ్రమ'ని తెచ్చి ఇచ్చి, మీకు కావలసిన ఇతర శ్రమలన్నీ కొంటున్నారన్నమాట! అప్పుడు, అది మీ స్వంత శ్రమ లేకుండా జీవించడం అవుతుంది. అంటే, మీరు ఖర్చు పెట్టే డబ్బు మీకు ఏ మార్గం ద్వారా వచ్చింది-అనే దాన్ని బట్టి, మీరు శ్రమ చేస్తున్నారా లేదా అనేది వుంటుంది. మీరు ఖర్చుపెట్టే డబ్బు మీ 'స్వంత శ్రమ' ద్వారా ('జీతం' ద్వారా) వచ్చినదా, కాదా అనే సంగతి అలా వుంచుదాం. అది ఎలా వచ్చినది అయినా దాన్ని ఇచ్చి బట్టలు వుతికించుకున్నా, రిక్షా ఎక్కినా తప్పేమీ లేదు. "తప్పేమీలేదు" అనే మాటల్ని ఇక్కడ కేవలం 'ఆర్థిక అర్థం'తో వాడు తున్నాను ఒకరి శ్రమని ఒకరికి మారకం చేసుకోవడంలో తప్పు

వుండదు కదా? కేవలం ఆ అర్థంతో 'తప్పులేదు' అంటున్నాను. రిక్షా ఎక్కి, దానికి బదులుగా డబ్బు ఇచ్చేస్తే ఆ డబ్బుతో ఆ వ్యక్తి, తనకు కావలసిన సరుకులు కొనుక్కుంటాడు. కాబట్టి, రిక్షా మనుషులకూ, బట్టలు వుతికే మనుషులకూ, ఇంకా ఆ రకం శ్రమలు చేసే మనుషులకూ డబ్బు ఇచ్చేటప్పుడు గీసి గీసి బేరాలాడకుండా డబ్బు ఇస్తే, ఆ శ్రమల్ని కొనడంలో నేరమేమీ లేదు. (అలా అని, ఆ మనుషులు రిక్షాలు లాక్కునీ బట్టలు వుతుక్కునీ జీవించే పరిస్థితుల్లోనే వుండవచ్చని చెప్తున్నట్టు అర్థం కాదు). ఆ వ్యక్తుల శ్రమల్ని కొనే వాళ్ళందరూ వారికి చక్కగానే డబ్బులు ఇచ్చినా, ఆ వ్యక్తులు పేదతనంలోనే వుంటారు. ఎందుకంటే ఆ శ్రమలు శారీరకశ్రమలు 'విలువసూత్రం' ప్రకారం, మేధాశ్రమల విలువ కన్నా, శారీరక శ్రమల విలువ చాలా తక్కువ. శారీరక శ్రమలుచేసేవారికి వాళ్ళ 'శ్రమ విలువ' అంతా వాళ్ళకి దక్కినా కూడా వాళ్ళు పేదతనంలోనే వుంటారు. ఇక ఆ శ్రమలు చేసే వాళ్ళు ఏదో ఒక 'యజమాని' దగ్గర జీతానికి వుండి ఆ పని చేస్తూ వుంటే వాళ్లు మరింత పేదలుగా వుంటారు. (వాళ్ళ శ్రమలో భాగమే యజమానికి లాభంగా పోవాలి గనక). ఆ బట్టలు వుతికే మనిషి, ఏ 'లాండ్రీ' లోనైనా యజమాని దగ్గర వర్కర్‌గా పని చేసే మనిషి అయితే, అతని 'శ్రమ విలువ' అంతా అతనికిరాదు. అలాగే ఆ రిక్షా వ్యక్తికి, ఆ రిక్షా అతని స్వంత రిక్షా కాకపోతే, దానికి అద్దెకోసం అతని శ్రమలో చాలా భాగం పోతుంది. ఆ 'అద్దె' రిక్షా అరుగుదల ఖర్చులకు సమానమైన అద్దెగా మాత్రమే వుండదు. రిక్షాని అద్దెకిచ్చిన యజమాని రిక్షా కోసం ఖర్చుపెట్టిన 'పెట్టుబడి'ని మాత్రమే వెనక్కి తీసుకుని వూరుకోడు. ఆ పెట్టుబడికి రావలసిన 'లాభాన్ని' కూడా ఆ 'అద్దె' ద్వారానే తీసుకుంటాడు. అంటే, ఆ యజమాని కుటుంబం ఒక 20 రిక్షాలు పెట్టుకున్నదంటే, ఇక ఆకుటుంబం ఇక్కడ చీపురుపుల్ల తీసి అక్కడ పెట్టకుండా

జీవిస్తూ వుంటుంది. ('కాపిటల్ పరిచయం'లో 'ఫిక్స్‌డ్ కాపిటల్‌ని అద్దె కివ్వడం'గురించిన భాగంలో ఈ విషయాలన్నీ మీకు దొరుకుతాయి. మొత్తం పుస్తకం చదవకుండా ఆ భాగం ఒక్కటే తీసి చదివితే అర్థం కాదు.) శారీరక శ్రమలకు సంబంధించిన ఈ రెండు కేసుల్లోనూ 'దోపిడీ' సమస్యా తరతరాల 'శ్రమ విభజన' సమస్యా వున్నాయి. ఇవన్నీ అర్థం చేసుకోవడానికి కావలసిన సిద్ధాంతం అందుబాటులో వున్నప్పటికీ, విషయాలన్నీ మీ పద్ధతిలో మీరు చాలా అస్పష్టంగా అర్థం చేసుకున్నారు.

నాగపల్లి మహేష్, పాతమంచిర్యాల.

ప్ర : ఉత్తరాల రచయితలంటే చాలామందికి చిన్నచూపే. వాళ్లు కేవలం తమ పేర్లను పత్రికల్లో చూసుకోవడానికి, నేడు పత్రికలు ప్రచురిస్తున్న సాహిత్యం ఎంత చెత్తయినా బాగుంది అంటూ ఆకాశానికెత్తి ఉత్తరాలు రాస్తారు, అనే అభిప్రాయం ఉంది చాలా మందిలో. ఉత్తరాల రచయితల గురించి మీ అభిప్రాయమేమిటి?

జ : నేనూ, ఆ 'చాలా మంది'తోనే కలుస్తాను. ఎంత చెత్త వాటి నైనా బాగుంది అని రాసే వాళ్ళని గురించి 'పేర్లు పత్రికల్లో చూసుకోవడానికే ఇలా రాస్తారు' అనుకోక ఇంకేమనుకోవాలి? అసలు, 'ఉత్తరాల రచయితలు' అనే మాట ఏమిటి? ఉత్తరాలు రాయడం 'రచన' కిందికి వస్తుందా? ఆ వుత్తరం, సాహిత్య విషయాల మీద రాసే వుత్తరమే అయినా అది 'రచన' కాదు. ఆ వుత్తరాలు రాసే వ్యక్తులు, మహా అయితే 'విమర్శకులు' అవుతారుగానీ, రచయితలు అవరు.

ఇక్కడి నించీ వచ్చె ఈ 3 ప్రశ్నలూ 'ఆంధ్రజ్యోతి'లో రాలేదు. ఈ 'పత్రిక'ని ఆపేసే నాటికి నాకు అందిన ప్రశ్నల్లో నించి ఈ ప్రశ్నల్ని ఎంచుకుని వాటిని ఇక్కడ చేరుస్తున్నాను.

పి. రాంనారాయణ, గోషాపేట టౌన్‌షిప్.

ప్ర : కార్మికుడు - 'యజమాని'కి గాని, సంస్థకి గాని లాభాలు సంపాదించి పెట్టినప్పుడు 'అదనపు విలువ'ని సృష్టించినట్లవుతుంది. అలా గాక, ప్రభుత్వ రంగ సంస్థలవలె (ప్రోఫిట్ ఓరియంటెడ్ గాక, ఎంప్లాయిమెంట్ ఓరియంటెడ్‌గా) నష్టాల్లో నడుస్తున్నప్పుడు కూడా శ్రమ దోపిడీ జరుగుతుందా?

జ : తప్పకుండా జరుగుతుంది. మహా ఘోరమైన 'నష్టాలు' వచ్చినట్టు లెక్కల్లో కనపడే ఏ ప్రభుత్వ సంస్థనైనా తీసుకోండి. ఆ సంస్థలో కూడా 'పెట్టుబడి' మీద 'వడ్డీల' పద్దు ఒకటి వుంటుంది. ఆ సంస్థలో కూడా 'అద్దె' కోసం చెల్లించే భాగంలో 'భూమి'కి సంబంధించిన అద్దె వుంటుంది. ఆ సంస్థలో కూడా డైరెక్టర్లకీ, మేనేజర్లకీ అత్యున్నత జీతాలూ ప్రత్యేక సౌకర్యాలూ వుంటాయి. (ఇళ్ళ అద్దెల పేర్లతో మహా భవనాల బిల్లులూ, 'కార్ల' బిల్లులూ, 'ఫోన్ల' బిల్లులూ, ఇంటి పరివారకుల బిల్లులూ, 'విదేశీ వైద్యాల' బిల్లులూ, 'విలాస ప్రయాణాల' బిల్లులూ-వంటి ప్రత్యేక సౌకర్యాలెన్నో వుంటాయి. ఒక డైరెక్టర్‌కి అందేదాన్ని సాధారణ కార్మికుడికి అందే దానితో పోలిస్తే, అది కనీసం 50, 60 రెట్లు ఎక్కువగా వుంటుంది. కొన్ని సంస్థల్లో ఇంకా ఎక్కువగా కూడా వుండ వచ్చు) ఇవేగాక, ఆ సంస్థలో ఇంకా చాలా 'అనుత్పాదక' ఖర్చులు వుంటాయి. ఆ సంస్థలో కూడా, అక్కడ తయారైన సరుకుని అమ్మే వర్తకుల కోసం 'వర్తక కమీషన్లు' ఇవ్వడం వుంటుంది. ఇవన్నీ ఏమిటను

కుంటున్నారు? ఇవన్నీ కార్మికుల 'అదనపు విలువ'లో భాగాలే. అంటే, ఇవన్నీ వున్నాయంటే, 'అదనపు విలువ' వుందనే అర్థం. ఇవి లేని సంస్థ ఏదీ వుండదు. ఒక 'ఫలానా' ప్రభుత్వ సంస్థలో—'లాభం'గా ఏమీ మిగలకపోతే మిగలకపోవచ్చు. దానికి వేరే కారణాలు వుంటాయి. 'వుత్పత్తి సాధనాల' మీద విపరీతమైన దూబరా ఖర్చూ, వాటిని కొనడంలోనూ తయారైన సరుకుని అమ్మడంలోనూ అధికార్ల స్థాయిలో జరిగే విపరీతమైన మోసాలూ, ఫండ్స్‌ని తినెయ్యడాలూ—లాంటి కారణాలేమైనా వుండవచ్చు. లేదా, అక్కడ అలాంటి వేవీ జరగలేదనీ, అన్నీ 'సవ్యంగా' జరిగినా 'లాభం' రాలేదనీ అనుకుంటే, దానికి ఇంకో రకం కారణం వుంటుంది. ఆ సంస్థ అమ్మే రకపు సరుకుకి దేశం మొత్తం మీద సప్లై పెరిగి, 'ధర' తగ్గి, ఆ రకంగా 'లాభం' తగ్గిపోయి వుండవచ్చు. అయితే, అలా జరిగినప్పుడు, ఇక్కడ 'తగ్గిన' ఆ లాభం (లేదా,ఇక్కడ 'రాకుండా పోయిన' ఆ లాభం) ఇతర శాఖల్లోకి పోతుంది. అంటే, ఒకచోట అందవలసిన లాభం, ఇతరచోట్ల అందుతుంది. ఈ రకంగా, ఒక 'సంస్థ'లో లాభం రాలేదంటే, దానికి వేరే కారణాలు వుంటాయిగానీ, ఆ సంస్థలో కార్మికులు 'అదనపు విలువ'ని ఇవ్వలేదని అర్థం కాదు. 'అదనపువిలువ'ని ఇవ్వక పోవడం అంటే, కార్మికులు తమ జీతాలకు సరిపోయినంత పని మాత్రమే చెయ్యడం. జీతాలకు సరిపోయినంత పని' కోసమే అయితే రోజుకి ఒక్క గంటో 2 గంటలో పనిచేస్తే చాలు. 8 గంటలూ చెయ్యనక్కర లేదు. కానీ, ప్రైవేటు సంస్థల్లోలాగే ప్రభుత్వ సంస్థల్లో కూడా కార్మికులు (మేధాశ్రమల, శారీరక శ్రమల కార్మికులు అందరూ) ఒక షిఫ్టు కాలం అంతా పని చేస్తున్నారంటే, దాని అర్థం, జీతాలకు సరిపోయే దాని కన్నా 'అదనంగా' పనిచేస్తున్నారనే. ఒకవేళ — 'ప్రభుత్వ సంస్థల్లో కార్మికులు 8 గంటలూ డ్యూటీలో వుంటారనే మాటేగానీ

ప్రైవేటు సంస్థల్లో జరిగేటంత పని ప్రభుత్వ సంస్థల్లో జరగదు, — అనే దట్టయితే అలాంటప్పుడు ప్రభుత్వ సంస్థల కార్మికులు ఇచ్చే అదనపు విలువ కొంత తగ్గవచ్చు గానీ అది పూర్తిగా లేకుండా వుండదు. కాబట్టి, ఏ సంస్థలోనైనా 'నష్టాలు' కనపడితే, అక్కడ 'అదనపు శ్రమ' జరగ లేదని (శ్రమ దోపిడీ జరగలేదని) అర్థం కాదు. అది, 'అధికార్ల' జేబు ల్లోకో ఇతర శాఖల పెట్టుబడిదార్ల జేబుల్లోకో పోయిందని మాత్రమే అర్థం.

ప్ర : 'ప్రోగ్రెసివ్' ఆలోచన ఉండి, ప్రభుత్వ రంగ సంస్థల్లో ఉన్న తాధికారులుగా పని చేస్తున్న వారు కార్మికుల పట్ల ఎలా వ్యవహరించాలి?

జ: 'ప్రోగ్రెసివ్' ఆలోచన అంటే, 'నిజాన్ని గ్రహించే' ఆలో చన అనేనా మీ అర్థం? అలాంటి ఆలోచన వున్న వాళ్ళ 'కార్మిక పక్షం గానే' వ్యవహరించాలి. సంస్థల్లో పని పరిస్థితుల్ని సౌకర్యంగా ఏర్పరిచే విధంగానూ, కార్మిక సమస్యల్ని తక్షణం పట్టించుకునే విధంగానూ, చట్టాల్లో కార్మికులకు అనుకూలంగా వున్న విషయాల్ని సంస్థల్లో అమలు పరిచే విధంగానూ, కార్మికుల్ని అవమానించకుండా వుండే విధంగానూ— ఈ రకమైన దృష్టితో ప్రవర్తించాలి. మానవ సమాజం అంతా 'శ్రమ' మీదే ఆధారపడి వుందనే 'సత్యం' గ్రహించి, అధికారులు అనేవాళ్ళు 'పెత్తందారులు'గా గాక 'నిర్వహణ ఉద్యోగులు'గా మాత్రమే ప్రవర్తిం చాలి. కానీ, 'శ్రమ దోపిడీ' జరిగే ఏ పునాదిమీదా అధికారులు, పెత్తం దారులుగా గాక ఇంకో రకంగా ప్రవర్తించడం జరగదు.

* * *

కే.......

ప్ర : .... 6 నెలల నుండి నేను, ఆ అమ్మాయి ప్రేమించుకుంటు న్నాము. కట్నకానుకల కంటె కులముల పట్టింపులతో పెద్దలున్నారు.... వారు 'నీసు' తినరు. మాకది బాగా అలవాటు. ఆహార భేదములతో సంసారములో పొసగదని సరిపడదని నా శ్రేయోభిలాషులంటున్నారు.... కులాంతరము వల్ల ఇబ్బందులు లేకుండా జీవించగలమంటారా?

జ : మీ ఆహార భేదాల గురించి మీకు 'మీ శ్రేయోభిలాషులు' చెప్పేదే రాశారు. ఆమెతో ఆమె శ్రేయోభిలాషులేమంటున్నారు? 'నిజమైన ప్రేమ'కి ఇవన్నీ సమస్యలా? 'ప్రేమ' అంటే గాఢమైన ఇష్టం! 'ఆ వ్యక్తి'తో సహజీవనాన్ని తప్ప ఇక ఎవ్వరినీ మనసు కోరదు. అలాంటి ప్రేమ, మిగిలిన సమస్యలన్నిటినీ సునాయాసంగా పరిష్కరించు కోగలుగుతుంది. ఆమెకి అలవాటులేని ఆహారం తినమని మీరు ఆమెని ఒత్తిడి చెయ్యడం గానీ, మీ ఆహారపుటలవాట్లు మార్చుకోవాలని ఆమె మిమ్మల్ని ఒత్తిడి చెయ్యడం గానీ చెయ్యకూడదు. మీ కోసం ఆ రకం కూరలు వండుకోవాలంటే, మీరే వండుకోండి! చేత రాకపోతే నేర్చుకోండి! ఈ నియమం ఒక నెలో, రెండు నెలలో కాదు, జీవితాంతం పాటించాలనే దృష్టి సంస్కారమూ మీకు వుండాలి. కొంత కాలానికి ఆమె కూడా మీ ఆహారానికి అలవాటు పడితే పడవచ్చు. లేదా, కనీసం మీ 'కూరల' పనిలో సహాయంచేసే పరిస్థితికైనా రావచ్చు. కానీ, ఈ మార్పులు ఆమెలో తప్పని సరిగా జరిగి తీరాలని మీరు ఆశించకూడదు. (పిల్లలైతే తల్లి కూరలూ, తండ్రికూరలూ కూడా తింటారు. వాళ్ళ పని ఎంతో బాగుం

టుంది). మీ శ్రేయోభిలాషులూ, ఆమె శ్రేయోభిలాషులూ ఏఅభ్యంతరాలైతే మీ దృష్టికి తెస్తున్నారో వాటన్నిటి గురించీ మీరు స్వయంగా మాట్లాడుకోండి. ఆ అభ్యంతరాల్ని అధిగమించగలమనే నమ్మకం ఇద్దరికీ కలగాలి. ఒకే 'కులం'లో, ఒకే 'మతం'లో, ఒకే ఆహారపుటలవాట్లతో, పెళ్ళిళ్ళు చేసుకునే వాళ్ళంతా సమస్యలు లేకుండా వుండగలుగుతున్నారా? అయితే ఇక్కడ, ఆ సమస్యలకు తోడు, ఇంకా అదనపు సమస్యలు కూడా చేరతాయని భయం కలుగుతుంది. కానీ, ఇక్కడే 'ప్రేమ' అనే దాని శక్తి పని చెయ్యాలి. అసహజమైన కులమత సాంప్రదాయాల వూబిలో కూరుకుని బతకడంకన్నా కొంత 'అస్పష్టత'తో నైనా దాన్ని తిరస్కరించేమార్గంలో నడవడం వెయ్యి రెట్లు వున్నతం. 'పురుషాధిక్యత' అనే దాన్ని మీరూ, 'కులాధిక్యత' అనే దాన్ని ఆమే లేకుండా చేసుకోగలిగితే తప్పని సరిగా 'సామరస్యం' ఏర్పడుతుంది. 'ఆధిక్యతల్ని' వదుల్చుకోకపోతే మాత్రం, చాలా త్వరలోనే 'ప్రేమ' కూడా నశించి, మీ శ్రేయోభిలాషులు చెప్పినట్టే పాతరకం సమస్యలతో పాటు అదనపు సమస్యలు కూడా తయారవుతాయి. కాబట్టి, సమస్యలు రాకుండా చేసుకోవడం మీ చేతుల్లోనే వుంటుంది. మీకు పరస్పరం నమ్మకం కలిగితే, మీ పెద్దవారికి నచ్చచెప్పడానికి ప్రయత్నించండి. ఎంత ప్రయత్నించినా అది సాధ్యం కాకపోతే, ఇక అప్పుడు పెద్దల ఆజ్ఞల్ని తోసి పుచ్చవలసిందే.

మీ విషయం గురించి మీరు మొదట్లో "6 నెలల నించీ నేను, ఆమె ప్రేమించుకుంటున్నాము" అని చెప్పిన పద్ధతి చాలా అసహజంగా వుంది.

"6 నెలల నించీ ఉద్యోగం చేస్తున్నాము అని చెప్పినట్టుగా వుంది. 'ప్రేమ' గానీ, 'స్నేహం' గానీ మనసులకు సంబంధించిన అనుభూతులు. అవి 'పనులు' కావు. ఎవరైనా ఇద్దరు స్నేహితులు "మేమిద్దరం స్నేహం చేస్తున్నాము" అని చెపుతారా? ఆ 'స్నేహం' అనే విషయాన్నే వేరే మాటలతో చెపుతారు. అలాగే ప్రేమ విషయంలో కూడా "మేము ప్రేమించుకుంటున్నాము". "నేను ప్రేమిస్తున్నాను" లాంటి పద్ధతిలో కాకుండా వేరే రకంగా మాట్లాడాలి. కేవలం, సినిమాల్లో 'డైలాగులు' విని, ప్రతీ విషయమూ 'అసహజంగా' మాట్లాడడం అలవాటవుతోన్నట్టే 'ప్రేమ' గురించి కూడా ఎలా బడితే అలా మాట్లాడడం అలవాటవుతోంది.

# రంగనాయకమ్మ రచనలు

| | ధర |
|---|---|
| 1. జానకి విముక్తి (3 భాగాలు) | 57-00 |
| 2. అంధకారంలో... | (కాపీలు లేవు) |
| 3. స్వీట్ హోమ్ (2 భాగాలు) | 20-00 |
| 4. చదువుకున్న కమల | 8-00 |
| 5. ఇదే, నా న్యాయం ! | 15-00 |
| 6. రచయిత్రి | 15-00 |
| 7. స్త్రీ | 15-00 |
| 8. కూలిన గోడలు | 15-00 |
| 9. బలిపీఠం | 25-00 |
| 10. పేకమేడలు | 7-50 |
| 11. స్పార్టకస్ (నవలా పరిచయం) | 5-00 |
| 12. టామ్ మామ ఇల్లు [,,] | 12-00 |
| 13. స్వేచ్ఛాపథం [,,] | 7-50 |
| 14. ఆండాళమ్మగారు, పల్లెటూరు | 8-00 |
| 15. నా డైరీలో ఒక పేజీ | 3-00 |
| 16. చుట్టాలు | (అచ్చులో) |
| 17. పందిట్లో పెళ్ళవుతోంది | 3-50 |
| 18. అమ్మ | 4-00 |
| 19. పెళ్ళానికి ప్రేమలేఖ | 4-00 |
| 20. ప్రేమ ప్రేమను ప్రేమిస్తుంది | 5-00 |
| 21. తెరవెనక | (కాపీలు లేవు) |
| 22. అనితరసాధ్యుడు | 7-00 |

23. రామాయణ విషవృక్షం (3 భాగాలు) 85-00
24. నాస్తికత్వం-ఒక పరిశీలన 3-50
25. నాస్తికవాదం, హేతువాదం, నవ్యమానవవాదం 6-00
26. నీడతో యుద్ధం 3-50
27. శాస్త్రీయ దృక్పథం (కొన్ని ప్రశ్నలూ, జవాబులూ) 10-00
28. చలం సాహిత్యం 7-50
29. యజ్ఞం కథ మీద రెండు వ్యాసాలు 4-00
30. స్త్రీ స్వేచ్ఛ 9-00
31. తులసిదళం కాదు గంజాయిదమ్ము (అచ్చులో)
32. మార్క్స్ "కాపిటల్" పరిచయం(4భాగాలు) 72-00
33. తీగలాగారు, డొంకంతా కదిలింది! 10-00
34. కట్నం హత్యల్ని ఆపలేమా? 8-00
35. జల్లెడకి ఎన్ని చిల్లులో అన్ని చిల్లులు! 6-00
36. 'అనమానత్వం'లోనించీ 'అనమానత్వం'లోకి! 12-00
37. వాడుకభాషే రాస్తున్నామా? 13-00
38. తెలుగు నేర్పడం ఎలా? 22-00


— ఈ పుస్తకాలు దొరికేచోటు —

అరుణా పబ్లిషింగ్ హౌస్

ఏలూరు రోడ్,

విజయవాడ-520 002.